శ్రీ

# భగవత్సన్నిధికి వేయిమెట్లు

—: గ్రంథకర్త :—

శ్రీ బులుసు వేంకటేశ్వర్లు, ఎం. ఏ.

భగవత్సన్నిధికి వేయిమెట్లు

ప్రథమ ముద్రణము
1000 ప్రతులు

 వెల రు. 10-00

నల భాద్రపదము 1976

ప్రతులకు :

బులుసు వేంకటేశ్వర్లు
2/8-10-22, కమలాదేవివీధి
గాంధినగరం, కాకినాడ - 4.

# ఉపోద్ఘాతము

—రచయిత

## 1) మానవజీవిత స్వరూపము

ప్రతి మానవవ్యక్తియు మొట్టమొదట దెలిసికొనవలసినది మానవజీవిత స్వరూపస్వభావములను గూర్చియే. మానవుని జననము, బాల్యయౌవన వార్ధకమరణములు వివిధ ఘట్టములు; ఈవివిధ దశలతో గూడిన కాలపరిమితియించుమించు నూరేండ్లుగలది. అనగా నీలోకములో మానవుని మనుగడ నిత్యముకాదు. ఈదేహమును, లోకమును మానవజీవి విడిచిపెట్టి పోవుటతప్పదు. తాత్కాలికమైన యీజీవితమునకు గల సౌఖ్యావకాశములెట్టివి? దుఃఖహేతువులెట్టివి? బాల్యాది మరణపర్యంతము కాలవ్యవధిని నూరేండ్లుగా నిర్ణయించినను, మృత్యువేసమయమున మానవుని జీవితము నిచట దుదముట్టించునో చెప్పుట కవకాశములేని యంశము. ఇట్టిలక్షణములుగల మానవ జీవితములో మానవుడు మనుగడనెట్లు సాగింపవలెను? గమ్యస్థానమేది? సాధింపవలసిన లక్ష్యమేదైననున్నదా? ఉన్నచో నాలక్ష్యస్వరూప స్వభావములెట్టివి? దానినార్జించుటకు గల సాధనసంపత్తి మనయొద్దనున్నదా? ఉన్నచో దానిరూపబల స్వభావములెట్టివి? ఇట్టి విషయములను నిస్సంశయముగా దెలిసికొనుట పుట్టిన ప్రతిమానవ వ్యక్తికిని ప్రప్రథమ కర్తవ్యమని చెప్పనవసరములేదు.

2) ప్రతిజీవికి సుఖాపేక్ష జీవితముతో ముడిపడి యున్నది. ప్రాణికోటి సుఖాభిలాషకెన్నియో ఆటంకములు పెనవేసికొనియున్నవి. అందుముఖ్యమైనవి జన్మమృత్యు జరా వ్యాధి దుఃఖాదులు. దుఃఖమును గలిగించు నెద్దాని నేప్రాణియు గోరదు, కోరకున్నను దుఃఖకారణము లుండుటచే దుఃఖానుభవము తప్పదు. సర్వప్రాణులు దుంఖమునుండి విమోచనము కొరకే కాకుండ శాశ్వతసౌఖ్యమునకై నిరంతరము తహతహలాడుచున్నవి. కానిసౌఖ్యమున కడ్డువచ్చు దోషములను దొలగించు కొననిదే ప్రాణికోర్కెసిద్ధింపదు. సామాన్యదుఃఖముల నెటులో సహింతురుకాని, సహింపరాని దుఃఖములు జన్మమృత్యువులు. ఇచట స్పష్టముగా దెలిసికొనవలసిన విషయములురెండే; (1) దుఃఖావసరము లేకుండజేసి కొనుట (2) ఎన్నడుచెడని స్థిరశాంతిసౌఖ్యములనార్జించుటయునై యున్నవి. పరిణత బుద్ధిగల మానవులకే యీవిషయముల నాలోచించి. కర్తవ్యము ననుసరించు సామర్థ్యమున్నది. ఇట్టిఅవకాశ సామర్థ్యము లున్నందువలననే మానవుడు ప్రాణిజాతములో నుత్తమస్థితిగలవాడు. మానవత్వము నందుటే భాగ్యమని చెప్పబడెను. ఇట్టిజిజ్ఞాస కలిగి సత్యమెరిగి స్థిరానంద మందుటకు యత్నించు మానవుడు తన మానవ జన్మమును సద్వినియోగ మొనర్చికొను పూజ్యుడు.

3) మానవుని దుఃఖమునుండియే, మతము, తత్వశాస్త్రము నుదయించినవి. మనసౌఖ్యమున కడ్డువచ్చు దుఃఖ

కారణములను దొలగించు మార్గమున్నదని చెప్పునదే తత్త్వశాస్త్రము; మార్గమును వివరించి చెప్పునదే మతము. అనగానున్న దోషములు తొలగించికొని బాగుపడుటే మతము; మతము మాకక్కర లేదనువారు తామేమనుచున్నారో తెలియనివారు. మరియు, మతము ప్రజలను నిర్వీర్యులను జేసినదను వారును దాముపలుకు దానికర్థమెరుగనివారే. మతమును దుర్వినియోగ మొనర్చువారెప్పుడు నుందురు. అది మతదోషముకాదు; మనుజులదోషము. ఏధర్మమునైనను దుర్వినియోగ మొనర్చు వారెల్లప్పుడు నుందురు. వారినిజూచి ధర్మమును నిందింపరాదు. సృష్టిరహస్యమును జీవిత రహస్యము నెఱుగుటకు మనయొద్దనున్న సాధనసంపత్తియెట్టిది? దేహమనోబుద్ధీంద్రియములే సాధనములు. వానికిఁగల శక్తి యెట్టిది? ఇంద్రియము లింద్రియార్థములైన వస్తుభోగములకై చరించును, మనస్సు చాపల్యలక్షణముగలిగి, నిశ్చలమైన వస్తువునెరుగు శక్తిలేనిది; బుద్ధిశక్తిగొప్పదే కాని, దేహేంద్రియ మనోవ్యాపారముల ననుసరించు లక్షణముకల దగుటచే, సత్యమునెరుగు శక్తిలేనిది. అందుకే మనకున్న సాధనసామగ్రి లోపభూయిష్ఠమైనదని ఉపనిషత్తులు చెప్పినవి. అందుచే మన మేసాధనసంపత్తి నుపయోగించి, సత్యదర్శనసంసిద్ధినొంది తరింపఁగలమో తెలిసికొన వలసియున్నది.

4) ఏ పనిలో విజయము సాధింపగోరినను, ముఖ్యముగా నుండవలయున దేకాగ్రచిత్తము. చిత్తైకాగ్రత యెట్లు

లభించును? అనేకముపై (జిత్తము ప్రసరింపకుండ నొకే లక్ష్యముపై (కేంద్రీకృతమై నిలుచుటే మార్గము. అనగా సత్యము నెరుగు జిజ్ఞాస దుర్నివార్యమైనదై, సత్యేతర కాంక్షల నుండి, చిత్తమును దప్పించి సత్యముపై నిలుపవలెను. ఇట్టి యేకాగ్రితవలన సృష్టిరహస్యము దృష్టియెదుట (బ్రకాశిం చునా? పరంజ్యోతి దర్శనమగుగా? ఈప్రశ్నలకు సమా ధానము చెప్పుటకుముందు మనమెరుగవలసిన విషయములు గలవు. ఈసత్యాన్వేషణ మిదివరకెవరైనం(జేసిరా? లేక మనము (క్రొత్తగా నారంభింపవలెనా? ముఖ్యముగా మనదేశములో (జరిత్రలేని కాలమునుండి మహర్షులు సత్యము నన్వేషించి తత్ఫలితముల నుపనిషత్తుల రూపమునం(బ్రకటించియున్నారు. తదితర యోగులయు, జ్ఞానులయు సాక్ష్యములున్నవి. అపౌరు షేయములగు వేదములలోని విజ్ఞానమున్నది. పురాణేతిహాసా దులున్నవి. ఇదివరకే వేసిన చక్కనిబాటలుండగా (బ్రతి వ్యక్తియు (దానునడచుటకై మరలం(గ్రొత్తగా బాటవేసికొన వలెనా? వారిదివరకే మనకవసరమైన సత్యము నన్వేషించి, దర్శించి ధన్యులైన వారుండగా మనము వారిచ్చిన విజ్ఞాన సంపద నుపయోగించికొని, చాలవరకు మన(ప్రయాసనుతగ్గించి కొనవచ్చునుగదా. వంశపారంపర్యముగా వచ్చినదని విలువ గల విత్తము సం(క్రమించుచో వలదందుమా? కా(బట్టి పూర్వులు నిర్మించియుంచిన మార్గములు, వానిపై నడచు తీరు తెన్నులునుండగా మనమేలవాని నుపయోగించికొనరాదు?

అటులే వేదవేదాంత ధర్మశాస్త్రములు-అతీంద్రియ సత్యములను, వాని ననుభవపూర్వకముగాఁదెలియు జ్ఞానకర్మభక్తి యోగాది సాధనలను ప్రవచించియున్నవి. వానిని సులభముగా గ్రహించి యాచరించి తరింపవచ్చును.

5) వేదవేదాంతిములు, మహాజ్ఞానులు, భక్తులు. యోగులు, సత్యస్వరూపమును నిరూపించి దానియనుభవసిద్ధి నందుటకు సాధనములను దెలిపియున్నారు. బుద్ధిశక్తిచేఁబఠించి వానిని దెలిసికొన్నంతమాత్రమున ననుభవసిద్ధి లభింపదు. చిత్తశుద్ధి, ఆత్మనిగ్రహము; మహర్షిప్రోక్తప్రమాణములందచంచల విశ్వాసము; చలింపని శ్రద్ధ, తిరుగులేని జిజ్ఞాస, జపతపోధ్యానాదులు సత్యసందర్శన సాధనములు. సాధనలోపములేకుండఁజూచికొనుకృషి, సత్యమును దర్శించి తీరవలెనను దృఢసంకల్పము; సత్యమునుజేర్చు మార్గముల నడచుచు మధ్యమందడ్డువచ్చు ప్రలోభములను, మోహములను, భోగలాలసత్వమును తృణీకరించి ముందుకుఁబోవు ధీరత్వము మనమల వరచుకొనవలెను. అనగా మనమంధ ప్రాయముగా వర్తించుట వారియుద్దేశముగాదు. వారుచెప్పినవి సనాతనముగా వచ్చిన ధర్మములేయయ్యు, మనము వానిని మన అనుభవములోనికి దెచ్చికొనుటకుఁజేయుకృషిలో మనకు సంపూర్ణ స్వాతంత్ర్యమున్నది. ప్రతిసత్యము నాచరించి, స్వీయానుభవ సిద్ధిచే దాని సత్యత్వమును ప్రత్యక్షముగా దర్శించి, యపుడు మాత్రమే సంతుష్టినందవలెను. వేదవాక్య

ప్రామాణ్యము, మహర్షుల అనుభవసిద్ధవాక్య ప్రామాణ్యమును మన మఖండ వినయ విధేయతలతో స్వీకరించి మన వ్యక్తిగతానుభవముచే వానిని స్థిరీకరించి కొనవలెను. వారు చూపిన సత్యమును మనము మనదిగాఁజేసికొనుటకు వలయు సాధనములన్నిటినిజేయు ధైర్యసాహసములు మనకవసరము.

6) మానవుని దేవునిగాఁ జేయుటయే మహర్షుల తత్త్వము. వేదవేదాంతములు మానవునిలో గర్భితమై పరిపూర్ణదైవత్వమున్నదని ప్రకటించినవి. దీనికై చేయవలసిన సాధనవిధానములు పెక్కువిధములుగాఁజెప్పఁబడెను. సారాంశముగాఁజెప్పినచో వ్యక్తిసంస్కారమనవచ్చును. మానవుని హృదయములోని మాలిన్యములను దొలగించి, దానినినిర్మల మొనర్పవలెను. సర్వత్రవ్యాపించి, నిండియున్న పరమాత్మ, మానవునిలోపల నిగూఢముగానుండి, అజ్ఞానముచే నాచ్ఛాదితుఁడై యుండుటచే, అపరిణతబుద్ధుల కగోచరుఁడై యున్నాఁడు. ఆత్మసంశుద్ధి కార్యక్రమమే వలయునది. దోషములను నిర్మూలించినచో ఁజిత్తశుద్ధి లభించును. శుద్ధచిత్తమున కేకాగ్రత లభించును; ఏకాగ్రదృష్టికి సత్యదర్శనసిద్ధి లభించును. ఇందొక రహస్యమున్నది. ఏకాగ్రదృష్టి యెట్టిదై యుండవలెను? సృష్టికారణమైన పరమసత్యస్వరూపమునెరిగి తరింపవలెననుకోర్కెగలవాని యేకాగ్రదృష్టి ముఖ్యమైనది. అనగా భగవంతునిపైఁ గేంద్రీకరించు దృష్టికలుగునట్లుగా మానవుని సంస్కరింపవలెను. తాత్కాలిక సంతృప్తినిచ్చు

క్షుద్రవస్తువులపైఁగల యేకాగ్రత సత్యమును జూపలేదు. ఇచట ముఖ్యముగా మూఁడువిషయము లవసరము. (1) విశ్వ ప్రపంచమును సృజించినదప్పు డనంతశక్తి నెఱిగి దానితో మనకుఁగల సంబంధమును స్పష్టముగా గ్రహించు లక్ష్య ముత్తమలక్ష్యమని నిస్సంశయముగాఁ దెలియవలెను. (2) పరమసత్యమైన పరమేశ్వరునిఁదెలియు దివ్యలక్ష్యసాధనకుఁ బనికివచ్చు చిత్తసంస్కారమును, వాక్కాయసంస్కారమును మనము పొందవలెను. (3) లక్ష్యము, దానినిజేరు మార్గ ములు దెలిసి, సూటిగా జీవితమును లక్ష్యమువైపుగా నిశ్చిత మార్గములలో నడపించు దీక్ష, ధైర్యము, వివేకములుండ వలెను.

7. సత్యసాక్షాత్కారమంత తేలికపనికాదు. దేనిని సంపాదింపఁగోరినను దానికవసరమగు కాలమును శక్తిని మనము సమర్పింపవలసియున్నదికదా. అనంతబ్రహ్మాండ హేతువైన అఖండావ్యయశక్తి నెఱిగి, అనుభవించుటయను కార్యము సాటిలేని మహాకార్యము. అనగా సత్యసందర్శన కృషితో సమానమైనకృషిగాని, సత్యసందర్శనసిద్ధిచే లభించు జన్మరాహిత్య స్వరూపమగు అవ్యయ ఫలతముగాని సాటి లేనివి. అందుచే వానిని సంపాదించు కృషియుసాటిలేనిది. ఈకృషిని ధర్మశాస్త్రములు నాలుగు ఘట్టములుగా విభజించి నవి; వానికే ధర్మార్థకామమోక్షములని పేరిడిరి. అర్థకామ ములను పూర్తిగా విసర్జించుట సాధ్యపడునదికాదు; ఏలన

దేహపోషణావసరములు కనిష్ఠావసరములు; వానిని విడిచి పెట్టి బ్రతుకఁజాలము. అందుచే, అర్థము, కామము జీవితావసరములే. అయినచో అర్థకామముల ననుభవించుచు జీవితమును గడపుచో. మోక్షము, పరమలక్ష్యముగా ఁబెట్టిరే! మోక్షమనగా సర్వబంధవిముక్తి; అర్థకామములు బంధములు. అందుచే మోక్షమునకు విరుద్ధములు; ఎంతవిరుద్ధములైనను, అవిలేనిదే జీవితమేలేదు. ఈవిరోధ పరిహారమునకై, ధర్మాభిన్నములైన కామార్థముల నంగీకరించిరి. కామార్థసర్పముల కోరఁలలోని విషమును ధర్మమును దగిలించి, పిండివేయుటకు యత్నించిరి. కాని అదియంత సులభకార్యమా?

8) కామార్థముల రహస్యమును మనము తెలిసికొననిదే ధర్మమోక్షముల రహస్యమును మనకుఁ దెలియదు. అర్థకామ రహస్యమేమనగా, వానిననుభవించు టారంభించినచో ధర్మపరిధుల నతిక్రమింపకుండ మానవుని నియమింపవు; పైగా, ధర్మమునతిక్రమించుటకే అవి ప్రోత్సాహమును, ప్రోద్బలమును గలిగించును. అర్థకామముల లక్షణములలో ముఖ్యలక్షణమవి మితినంగీకరింపవు. మితిలేని అర్థకామానుభవము మోక్షమునకు దారుణానర్థహేతువు. అర్థకామములు విడిచి జీవితము, జగన్నాటకము నడువదు; అర్థకామములంగీకరించి, అనుభవించుట మోక్షవినాశకరము. ధర్మమనునతుకు పెట్టి అర్థకామానుభవమునకు స్వేచ్ఛ (Licence) ప్రసాదింపఁబడెను. అందుచే మోక్షసాధకునికృషి దుస్సాధ్యమైనది.

మోక్షమార్గగమనము కత్తివంచపై నడచుట (క్షురస్యధార) వంటిదని ఉపనిషత్తువక్కాణించినది. అందుకే యిరువదియైదేండ్లు అస్ఖలిత బ్రహ్మచర్యము; 25 వత్సరములు కఠోర నియమబద్ధమైన గృహస్థజీవితము; తరువాత వానప్రస్థము (Solitary life) సన్న్యాసము (Total renunciation) నేర్పాటుచేసి. కొన్నియుగములనుండి భారతీయధర్మము నడపినది. భారతవర్షప్రభువులు దాని నములు పరచిరి. నేటికిని దాని చాయలు దేశములోఁబూర్తిగా నశింపలేదు. మోక్షమును చరమ లక్ష్యమని భావించుట తప్పు. అదిపుట్టిన ప్రతి మానవునకు (బరమలక్ష్యము కాని చరమలక్ష్యముకాదు ఆలక్ష్యములేనిదే ధర్మసహితార్థకామానుభవమున కంగీకారమును నిరుపయోగమగును. కావున నిట్టిగడ్డుసమస్యనెరిగి, జీవితమును మానవుఁడు ముక్తిమార్గములో నడపుటత్యంత క్లేశకరము.

9) అర్థకామములను పూర్తిగావిడిచి సన్న్యసించుట లక్షలకొలది మనుజులలో నేయొక్కనికో సాధ్యముకావచ్చును. అందుచే మిగిలిన వారందరు వానిని ధర్మపరిధులలో ననుభవింపక తప్పదు అందుకే దైవభక్తితో ధర్మానురక్తియు నుండవలెను. మోక్షలక్ష్యములేని మానవులకు దురంత జనన మరణాది దుఃఖముతప్పదు; ధర్మమతిక్రమించి వర్తించువానికి జననమరణాదిక దుఃఖమేకాక, ధర్మరక్షకుఁడగు భగవానుని క్రోధమునకు గురియై ప్రబలారిష్టకష్టముల ననుభవింపవలసి

యోగములు పెడత్రోవలఁబట్టించుట కవకాశములు చాలఁ గలవు. కేవలజ్ఞానము బుద్ధిసంబంధమైనదగుటచే తర్కమును నమ్మిచెడును; ఏలన కేవలతర్కమున కతీతమైనది సత్యము. అటులే కేవల కర్మపరాయణత్వమును, అటువివేకముగాని, యిటు దైవభక్తిగాని లేనిదగుటచే, దురహంకారగర్వదర్పాది దోషములలోని కీడ్చి, మానవుని పతనమునకు హేతువగును. అదేవిధముగా, కేవలభక్తిమార్గమును లక్ష్యమును జేర్పఁ జాలదు; ఏలన, భగవంతుని సత్యస్వరూప స్వభావములను, మహిమను వివేకించు జ్ఞానము తోడ్పడనిదే భక్తి తాను నమ్ము దేవుని అనంత పరిపూర్ణ తనెరుగని నీరసభక్తియగును; మరియు నటుకర్మచేయని భక్తి, అశిక్షితము కాని యుద్రేక ములఁబాలొనర్చి మూర్ఖునిఁజేయును. మనదోషములను, మన శక్తిసామర్థ్యములను దేవుని మహిమను దెలుపు వివేకము; దేహేంద్రియ మానసముల సుశిక్షితములనొనర్చి కాలుష్య ముల హరించు సత్కర్మానుష్ఠానపరతయు; దైవమునకుఁ బవిత్రహృదయమర్పించి, ఏకాగ్ర చిత్తముతో నర్పించు ప్రేమతోఁగూడిన భక్తియు సముచిత రీతిని మేళవించి మాన వుని దరింపఁజేయఁగలవు.

11) ఈగ్రంథరచన మతివిచిత్రముగాఁజరిగినది. పర మేశ్వరాజ్ఞ లేనిదే యెట్టిరచనము చేయనని పదేండ్లవెనుక నిర్ణ యించితిని, దైవకృపాసంపాదనమునకు రచనకాదు, జపతప ధ్యానములే ముఖ్యమని తలఁచి, ఉద్యోగవిరమణానంతరము

యథాశక్తి వానితో గతించిన పదేండ్లనుండియుఁ గాలము గడచినది. నాకు దినచర్య పుస్తకము వ్రాయుట చిర కాలమునుండియు నభ్యాసమైనది. దినచర్యలు క్లుప్తముగా రచించిన వెనుక, గ్రంథపుటలలో సగముభాగము మిగులు చుండెడిది. దినదినమునాటికి భగవానుఁడు సూచించిన యొక భావమును దినచర్య పుటలలో వ్రాయుట జరిగినది. వాని సంఖ్య వేయిపుటలు మించినది. అప్పుడప్పుడు వానిని నేనే చదివికొని అవినా కుత్సాహమును, ధైర్యమును, మనశ్శాంతిని సమకూర్చుచుండుటగాంచి, వానినిదీసి విడిగా, రెండు భాషలలోను వ్రాసితిని. నాకు ధైర్యమిచ్చి, అశాంతి పోగొట్టిన యీ వాక్యలుము నావంటి యితరులకును నటులే చేయునని తలఁచి, వీనిని ప్రకటింపుమని లోనుండి పిలుపువచ్చినది. తత్ఫలితమే యీ గ్రంథము.



# ఉపోద్ఘాతము

**శ్రీ యమ్. ఆర్. అప్పారావుగారు**
ఎం. ఏ., యమ్. ఎల్. ఏ.,
ఆంధ్ర విశ్వ విద్యాలయోపాధ్యక్షులు.

గ్రంథము. :- భగవత్సన్నిధికి వేయి మెట్లు.

( కర్త :- శ్రీ బులుసు వేంకటేశ్వర్లుగారు )

## ఆ ము ఖ ము

శ్రీ బులుసు వేంకటేశ్వర్లుగారు ఆంధ్ర సాహిత్య లోకానికి సుపరిచితులు. సాహిత్యకంగాను, ఆధ్యాత్మికం గాను వారు ఎన్నో రచనలను తీర్చిదిద్ది సహృదయ సమాజానికి అందించేరు-అందిస్తున్నారు-అందించగలరుకూడ. ఒక్కొక్క కవికి ఒక్కొక్క విధమైన వ్యక్తిత్వం ఉంటుంది. వస్తువును ఎంచుకోవడంలోను, దాన్ని వింగడించడంలోను, తదనుగుణ మైన శబ్దార్థాలను సమకూర్చడంలోను ఆ వ్యక్తిత్వం ప్రస్ఫుటంగా కనిపిస్తుఉంటుంది. శ్రీ వేంకటేశ్వర్లుగారికి అటువంటి ప్రత్యేక వ్యక్తిత్వంఉంది. ఆర్షధర్మాన్ని, ఆర్య సంప్రదాయాన్ని, పునరుద్ధరించడం, ఆధ్యాత్మికతను ప్రచారం చేయడమున్నూ వారి ప్రత్యేక దీక్షలు.

ఆ దీక్షలలోని ఒక ప్రక్రియే "భగవత్సన్నిధికి వేయి మెట్లు" అన్న ప్రకృతరచన, ఆధారంగా చేసుకొని భగవంతుని చేరడానికి ఉపయోగించే వేయి సోపానాలను ఈగ్రంథంలో వివరించడం జరిగింది సంప్రదాయం, భక్తి, విశ్వాసం-వీని యొక్క పారమ్యాన్ని ఇందులో చూడగలం.

రచన సర్వజన సుబోధంగా ఉంది. అందువల్ల ఆ బాలగోపాలానికీ ఇది అందుబాటులో ఉండగలదు.

హేతు వాదం ముదిరి వెర్రితలలు వేస్తున్న ఈరోజులలో, ఆస్తిక్యబుద్ధిని కొంచెమైనా నిలబెట్టడానికి ఇటువంటి రచనలు అవసరం. ఈగ్రంథం బహుజనాదరాన్ని పొందాలని నా ఆశంస.

—ఎమ్. ఆర్. అప్పారావు.

29-10-1976

# గ్రంథపరిచయము ప్రశంస

ఆచార్య. శ్రీ కొత్త సచ్చిదానందమూర్తిగారు
శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయోపాధ్యక్షులు—తిరుపతి

బహుగ్రంథరచయితలు, విద్వాంసులు నగు శ్రీ బులుసు వేంకటేశ్వర్లుగారు లబ్ధప్రతిష్ఠులు. శ్రీరామకృష్ణ పరమహంస, శ్రీ వివేకానందస్వామి, శ్రీ రామతీర్థస్వామి జీవితచరిత్రలను రచించి ప్రకటించుటేకాక, కీ॥ శే॥ శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణన్‌గారి భారతీయ తత్త్వశాస్త్రము తెలుగులోని కనువదించిరి. వీరి గ్రంథములను దేశములో బహుసంఖ్యాకులు చదివి, విశేషముగా కీర్తించియున్నారు.

1975 వ సంవత్సరములో వీరాంగ్లమున "భగవత్సన్నిధికి వేయిమెట్లు" ను గ్రంథమును ప్రకటించియుండిరి. హైందవమతగ్రంథములనుండియు, ఆయాతత్త్వముల సారాంశములను సంప్రదాయసిద్ధులైన ప్రఖ్యాత భాష్యకారుల వివరణములనుండియు స్వీకరించుటేగాక, అర్వాచీనులగు వివేకానందాదుల భావావిష్కరణములను తాముగ్రహించి, భగవత్సన్నిధిని జేరుట కష్టోత్తరశతసోపానములు గలవని వీరు ప్రకటించిరి. ఈ గ్రంథమొక శాస్త్రీయ దృక్పథము ననుసరింపలేదుగాని, గ్రంథకర్త వేదాంతదృష్టియును తేజః ప్రసారముచేసి గ్రంథమందలి భావములన్నియు నుత్తేజితములైయొక విధమగు నేకత్వమును ఘటించెను. ఇందలి రచన, సారళ్యసౌలభ్యములు గలిగియున్నది.

దానినే వారిపుడు తెలుగులోఁ బ్రకటించిరి. ఇందలి భావములు బహుజనోప యోగములు కాగలవని యాశించు చున్నాను.

—ఆచార్య కొత్త సచ్చిదానందమూర్తి

14-9-1976



---

# అభినందనము

బ్రహ్మశ్రీ వెంపరాల సూర్యనారాయణ శాస్త్రిగారు.

మిత్రులు బ్రహ్మశ్రీ బులుసు వేంకటేశ్వర్లు ఎమ్. ఏ. గారు రచించిన "భగవత్సన్నిధికి వేయిమెట్లు" అను గ్రంథ నామము వినఁగనే శ్రీ శంకర భగవత్పాదులు రచించిన "ఉపదేశసాహస్రి" యను గ్రంథము స్ఫురణకు వచ్చినది. రెండును వేదాంత విషయములే. శాంకరీయము సాధనచతుష్టయ సంపత్తితో నారబ్ధమై మోక్షపురుషార్థముతో సంపూర్తి

గాంచినది. ఇదియో, ముక్తకమలములవలె ననన్య సంబంధ ములై భక్తిజ్ఞాన వైరాగ్యబోధకములైన అష్టోత్తర సహస్ర విజ్ఞాన ఖండములతో రూపొందినది. అపురూపమగు నిట్టి వేదాంత గ్రంథము రచింప శ్రీ వేంకటేశ్వర్లుగారి కెంత ప్రజ్ఞాపాటవ మావశ్యకమో అంతయుఁ గలదని యీ గ్రంథము ఋజువు చేయుచున్నది.

శ్రీ వేంకటేశ్వర్లుగారు జగత్ప్రసిద్ధ వైదిక వంశమగు బులుసువారి వంశమున జన్మించి, వేదవేదాంత రహస్యముల నెరిగి, వేదాంతము నందును, తెలుగుభాషా సాహిత్యము లందును రెండు ఎం. ఏ. పట్టాలనుబొంది, వివిధ కళాశాలలో నాచార్య పీఠ మధిష్టించి, రచయితగా, వక్తగాఁ ప్రఖ్యాతి వహించిరి. శ్రీ రామకృష్ణ పరమహంస, వివేకానంద, రామ తీర్థుల జీవిత చరిత్రములను రచించి ప్రచార మొనర్చుటేకాక, వైదిక నియమ నిష్టలు గలిగి, తపోమయ జీవితమును గడపిన, గడపుచున్న పుణ్యపురుషులు. విశ్వ విఖ్యాతులు, కీ॥ శే॥ శ్రీ డాక్టరు రాధాకృష్ణన్‌గారి వేదాంత గ్రంథముల ననువ దించి 'భారతీయ తత్వశాస్త్రము" గా 2500 పుటలలో నైదు భాగములుగా వెలయించి, 1956 లో కేంద్రసాహిత్య అకా డమీ బహుమాన గ్రహీతలై ఢిల్లీ ఆంధ్ర మహాసభచే సన్మానముపొందిరి. వీరి గ్రంథములు వీరి మహోపన్యాస ప్రవచనములు యావదాంధ్రమునకు, సుపరిచితములు. ఆచరణలేని పాండిత్య ప్రవచనముల నిరర్థకతను గుర్తించి, వైదిక తపోవిధానముచే దేశకళ్యాణమును, లోకశాంతిని

సాధింపవచ్చునని సుదృఢ విశ్వాసముకలిగి, ఉద్యోగ విరమణ కాలమంతయును వీరు నిరంతర బ్రహ్మనిష్ఠతో గడపుచు, తమ దివ్యానుభవములను గ్రంథముల రూపములోఁ బ్రకటించుచున్నారు,

కాకినాడ పౌరులిరువదేండ్లక్రితము వీరిని సన్మానించి 'గద్యకవి సార్వభౌములని" బిరుదునిచ్చియుండిరి. వీరి వచన రచన ప్రత్యేకవ్యక్తిత్వ విలసితమై సులభము, మధురము, పటుత్వముగలిగి,జీవనదివలె బ్రవహించును. బాలురకుఁగూడ సుబోధమై, ఆకర్షణశక్తి గలిగినది వీరి రచనాసంవిధానము. మానవత్వమునుండి దైవత్వసిద్ధిగాంచుటకు వీరు రచించిన సహస్రసోపానములలో నేయొక్కసోపానము నధిగమించినను చాలును. ఇహలోకమున జన్మించి, యేఁఘట్టములోనున్న మానవునకైనను, భయప్రమాదముల బోఁగొట్టి, జన్మజరా మృత్యుబాధలు లేకుండఁజేసికొను సాధనముల నుపదేశించి, యీగ్రంథము సంసార తరణోపాయములను వేయివిధముల బ్రదర్శించును. అభినవ పాశ్చాత్యనాగరకతా వ్యామోహమునఁబడి పరానుకరణమున స్వధర్మమును విడిచి, భోగోన్ముఖమైయున్న ప్రజానీకమున కీగ్రంథము మేలుకొలుపై, మహోపకారము చేయఁగలదు.

కాకినాడ,
రామారావుపేట
6-11-1976.

వెంపరాల సూర్యనారాయణశాస్త్రి.



బులుసు వేంకటేశ్వర్లుగారు ఎం. ఏ.

# భగవత్సన్నిధికి వేయి మెట్లు

1. ఈ దేహ గేహములను, లోకమును ఖాళీచేసి, ఎచటికో పోవలయు మనము; ఇచట స్థిరమని, ఎన్నో అనుభ వింపవలెనని, ఎన్నో సంపాదింపవలెనని, తలచి, రాగద్వేష ములు పెట్టుకొని, అహంకార మమకారము లను ఉరిత్రాళ్లు బిగించుకొని దుర్భరదుస్థితిలో నున్నామని గుర్తింపక, పైగా విలాసములు, షోకులు, కులుకులు చూపుచు బ్రదుకుట ఎంత ప్రమాదకరమో! మేము పండితులమని, వక్తలమని, గడసు వారమని, సమర్థులమని చెప్పికొనుటెంత మూర్ఖతయో! ఛీ! మూర్ఖుడా! భజగోవిందమ్.

2. ప్రతివ్యక్తియునెంత ధనహీనుడైనను, కాలము తెలియుటకై చేతిగడియారమును ధరించును. భూమిపైఁదా నెంతకాలముండునో చూచుకొనఁడే! కాలము మించిపోకుండ నొక్కపనిచేయుము. సర్వశుభములిచ్చు దేవుని పాదయుగు గట్టిగాఁబట్టి భజింపుము; నీకెన్నడునులోటు జరుగదు; దేవుని భజించుటచేఁదక్కిన పనులును చెడవు; పైగా శుభఫలితముల నిచ్చును.

3. ప్రతి ప్రాణిలో ముఖ్యములైన రెండులక్షణము లున్నవి. (1) చావులేకుండ నెల్లప్పుడు నుండవలెననియు (2) నిత్య సుఖమనుభవింప వలెననియు; ఇవి అన్ని జీవులకు

సామాన్యమైనవి. ఇవి ఆత్మ లక్షణములు; ఆత్మ చావులేనిది; దుఃఖములేనిది; శాశ్వతానంద శాంతులాత్మ గుణములు, ఆత్మ ప్రతి ప్రాణిలోనున్నది. అందుచేతనే ప్రతిప్రాణికిఁ దన నిజ స్వరూపము జ్ఞాపకమువచ్చి, యీ రెంటిని కోరుచున్నది. కాని అజ్ఞానమను నావరణము ప్రాణులను గప్పియున్నది. ఈశ్వరారాధనము వలన, అజ్ఞానావరణము తొలగిపోవును. తన సహజాత్మానందము ప్రకాశించును. అనగా నీది నీవు సంపాదించుకొనుటే మోక్షము.

4. లోకమును, లోకములోని సర్వమును భగవానునిచేఁగల్పింపఁబడినవే. వీనిని గల్పించుటకు వస్తుసామగ్రి నాతఁడెక్కడనుండి తెచ్చెను? సాలెపురుగులోనుండి దారమువలె నవి వానిలోనుండి ఆవిష్కృతములైనవి; అనగా నవి దేవుని రూపాంతరములే. అనగా జగమంతా దైవస్వరూపము, రామమయం – 'సర్వం విష్ణుమయం జగత్'.

5. ఎన్నో క్లిష్టపరిస్థితులు సంభవించినపుడు, నీవాతనికి మొరపెట్టుకొనగా వానిని దొలగించి నిన్నాతఁడు కాపాడెనని నీకుఁదెలియును; క్లిష్టపరిస్థితులాభగవానుఁడు కల్పించినవికావా? నిత్యము అతిశయభక్తితో నారాధించినచో భగవానుఁడు మనకు క్లిష్టపరిస్థితులను కల్పింపనే కల్పింపడు; కల్పించినవి తీసివేయును.

6. అందరచేత నన్నిపనులు దేవుఁడే చేయించుచున్నాడు. దేవుఁడే వేదశాస్త్రములందు పుణ్యాపాపకర్మలను

వివరించియున్నాఁడు. మంచిపనులు తద్ద్వారా స్వర్గాది సుఖము లను. క్రమముగా మోక్షమును నిచ్చును; చెడుపనులు పాప మును, తద్ద్వారా నరకాది దుఃఖములను నిచ్చును. మాచేఁ జెడుపనులు చేయింపక, మంచిపనులే చేయించి పుణ్యమిచ్చి రక్షింపుమని మనము నిత్యము దేవుని ప్రార్థించుచుండవలెను. అట్లు ప్రార్థించుచో నాతఁడటులే యనుగ్రహించును. నిరంతర సజ్జనగోష్ఠివలన నీశ్వరారాధన బుద్ధి, తన్మూలమున నీశ్వ రానుగ్రహము లభించును.

7. లోకమెన్నటికి మనకర్థముకాదు; ఏలన దాని యర్థము దానియందు లేదు. దానికి హేతువై, దానిని నడపు దివ్యశక్తిలోనున్నది. అదియే పరమాత్మ. అందుచే లోక మునకర్థము పరమాత్మలో నున్నది. పరమాత్మ లేక పర మార్థము తెలిసినచో లోకార్థము తెలియును. భగవాను నారాధించి తెలిసికొనినచో భగవత్కల్పిత లోకమునకర్థము విశదమగును.

8. ఈశ్వరారాధన పరతంత్రుఁడేమిచేసినను తపస్సే యగును. ఏలన వాని మనస్సును పరమేశ్వరాంకిత మొనర్చు టచే, నీశ్వరాజ్ఞలేనిదే యాతఁడేమియుఁజేయఁడు, ఈశ్వ రాజ్ఞలో దోషముండునా? దేవుఁడు తప్పుచేయించునా? కావున ముఖ్యవిషయ మీశ్వరాంకిత మనస్కుఁడవై జీవించుటే.

9. ఒప్పులు, తప్పులు మనము చేయుటకుఁ గాని మానుటకుఁగాని స్వతంత్రులముగాము. సర్వము దేవుఁడే

చేయించుచున్నాఁడు. దేవుఁడు కర్తయైయుండగాఁగర్తృత్వము మనకైయున్నదని భ్రాంతిపొంది, పుణ్యపాపములనుభవింప నేల? చేయువాఁడు దేవుఁడే, పుణ్యపాపములు దేవునివే; ఇట్లు స్థిరబుద్ధితో నున్నచో మనకు పుణ్యపాపములు లేవు; కర్తలము కాము గనుక; దేవునికి పుణ్యపాపములంటవు. అతడు సర్వాతీతుఁడు గనుక; అందుచే పుణ్యపాపములెచటను లేవు.

10. 'నేను' అను పదార్థము లేదు. అది వట్టి మిథ్య; నేనే మిథ్యయగుచో నేనుచేసిన పనులు - వానివలన పుణ్యపాపములు మిథ్యయే. అన్ని పనులు అందరలోనుండి దేవుఁడే చేయుచున్నాఁడు. అసత్యమైన 'నేను' 'అహం' భావముచే సుఖదుఃఖములనుభవించుచున్నాను. నేను 'అహం' నశింపవలెను. అపుడు దేవుఁడే మిగులును-"నేను" దేవుఁడే! దేవునికి సుఖదుఃఖములుండవు - నిత్యానందమే !

11 దేహాభిమానమున్నంతకాలము, కామక్రోధాదులుండును. అవి తప్పు పనులు చేయించి యేడ్పించును, మన మనస్సును దేహమను 'చిలుక కొయ్య'నుండి లాగివేసి, దేవుని పాదపద్మములకు గట్టివేసినయెడల, దేవుని పాదస్పర్శ బలమువలన, తప్పులు చేయించు కామక్రోధాదులు నశించును. ఈశ్వరార్పిత మనస్కునిచే నన్నిపనులు దేవుఁడే చేయించి యెట్టి దోషములు వానికంటకుండ రక్షించును.

12. మనమందరము, యెండి రాలిన ఆకుల వంటివారము. దేవుఁడనుగాలి యెటువీచిన మనము నెండుటాకు

లటువై పెగురుచుండును. మనకుఁగర్తృత్వమున్నదను భ్రమను దేవుఁడే కల్పించి, తన అనిర్వచనీయలీలను జూపుచున్నాఁడు. ఈ సంగతి నిస్సంశయముగాఁదెలిసి నిత్యము సుఖించువారే మహాయోగులు.

13. ఆత్మజ్ఞానము సంపాదింపక, తిరిగి తిరిగి పుట్టుచు ఁజచ్చుచునుండు బ్రదుకు హేయమైనదని తెలియదు, తెలిసియు దానిని దొలగించుకొనుటకు యత్నింపని వాఁడు శుంత వ్యుఁడుకాఁడు. కాని యది పరమేశ్వర కృపలేనిదే జరుగదు; పరమేశ్వరు నారాధించుట వలన నాయనకృప కలుగును; అదియు దేవునిదయ వలననే జరుగవలెను; సర్వము దైవాధీనమై యున్నది.

14. దేవుఁడిచ్చినఁ గాని గడ్డిపరకయు లభింపదు; సర్వప్రదాత దేవుఁడు. దేవునాశ్రయించి, అన్ని బెంగలు విడిచి పెట్టుము. నీకు వలయునవన్నియు నాయనయుక్తకాలమున నిచ్చును. తొందరపడక, భక్తితో, వేచియుండి ధ్యానింపుము. దేవుఁడు నిన్ను దగాచేయఁడు.

15. దేవుఁడున్నాఁడని నమ్ముము; ఎందుచేత? దేవుని జూచిన మహాపుణ్యపురుషులు, చెప్పిరిగనుక; దేవుడాశ్రితకల్పవృక్షము, కామధేనువు, దయాప్రపూర్ణుఁడనియు నమ్ముము; ఏలన వారే అట్లనుభవించి చెప్పిరిగనుక; సంతతము భక్తితో దేవుని సంకీర్తనము చేయుము. ఎందుకు? దేవునికృప గలుగుట కదియే సాధనమని వారు పలికిరిగనుక; ఇట్లు చేయుట

వలన స్థిరమగు సుఖము; జ్ఞానము; శాంతి, ఆనందము లభించును; నమ్మి పరీక్షించి, ఫలితములను జూచికొనుము.

16. "భ్రామయన్ సర్వభూతానియంత్రా రూఢాని మాయయా" యంత్రముచేఁ ద్రిప్పఁబడు బొమ్మలనువలె, దనమాయచే సర్వజీవులను దేవుఁడు త్రిప్పుచున్నాఁడు. అందరలో దేవ్వఁడుండి అన్నియుఁజేయుచు, మేము చేయుచున్నామను భ్రాంతిని మనకుఁగలుగ చేయుచున్నాఁడు. అదియే ఆయన మాయావిలాసము; దానిని గుర్తించి, తరించుటకాయన అనుగ్రహము కావలెను. దేవుని మాయను దేవుని దయతోడనే అతిక్రమింపఁగలము. దైవారాధనమే నిరంతర కర్తవ్యము.

17. కోరికలతో దేవుని పూజించుట తప్పని కొందరు చెప్పుదురు; కోరికలను పెట్టినదెవరు? దేవుఁడే. ఆయన విలాసమునననుసరించి, కోరికల నిచ్చికాని, కోరికలే లేకుండఁజేసి కాని రక్షింపఁగలఁడు. ముఖ్యమైన విషయము దేవునాశ్రయించుటే.

18. అందమైన వస్తువులు మనలనాకర్షించును; కారణమేమన దేవుని దివ్యకాంతి యా వస్తువులలో నున్నది. అయినచో, అందములేనివానిలో నీశ్వర చైతన్యము లేదా? ఉన్నది; భగవంతుఁడు సర్వత్రగలడని చూడఁగలవారికి సర్వ వస్తువులాతని సౌందర్యమునే చూపును.

19. భగవాన్! నీవే సర్వకర్తవన్నచో, నేనేమగుదునని శంక కలుగును; నేనే సర్వకర్తనన్నచో అసత్యము; నీవు కొంత, నేనుకొంత చేయుచున్నామన్నచో అది నీ పూర్ణత్వమునకు లోపమగును, నీ పూర్ణతకు లోపము రాకుండ నేను కర్తను కాఁజాలను. అందుచే నీవే సర్వమని భజింతును.

20. దేహాభిమానమును పూర్తిగావిసర్జించి 'నేనాత్మస్వరూపు' నని జీవించుట, కోటికొక్కనికైనను సాధ్యము కాదు. అందుచేతనే గీతలో శ్రీకృష్ణ భగవానుఁడు 'క్లేశోధికతరస్తేషా మవ్యక్తాసక్తచేతసామ్' అని యుపదేశించెను. దేవునిపై భారముంచి రక్షింపుమని నిత్య సంకీర్తనాదికము చేయు భక్తిమార్గము దానికంటె సులభము. అనగా భక్తిమార్గము క్లేశకరమేకాని జ్ఞానమార్గమంత క్లేశతరముకాదు

21. దేహమిచ్చి, బాధించుటకు వేధించుటకు అనేక లోపములనందిమిడ్చి, అయినను దానితో సుఖమనుభవింపవలెనను భ్రాంతిపెట్టి, భగవానుఁడు తన విలాసమును జూపుచున్నాఁడు. నిజముగా లభింపని సుఖాపేక్షతో దేహమును దుర్వినియోగమొనర్పక, దేహమును దేవుని కర్పించి పుణ్యధనమార్జించి ధన్యుఁడగుట కర్తవ్యము.

22. ఏరోజున మనము కించిత్తు బాధపడుచున్నామో ఆరోజున మనకు దైవకృప లేదన్నమాట; అందుచేప్రతిదినము అనుక్షణము దైవారాధన పరతంత్రులమై జీవించినచో,

దైవకృపకూడ ప్రతిదినము, ప్రతిక్షణము కాపాడుచుండును గాన, బాధపడవలసి దినము క్షణము లేకుండఁబోవును.

23. సిద్ధపురుషుని వాక్యములే వేదయులు; ఉపనిషత్తులు. ఏలన, సిద్ధపురుషుని మాటలు దేవుని మాటలే; ఉపనిషత్తులు, వేదములు దేవుని మాటలే, జీవిత మీశ్వరాంకితమైనప్పుడట్టివ్యక్తినోట, అసత్యములు రావు. అట్టివ్యక్తి చేయుపనులు సర్వము తప్పులేనివగును; ఏలన భగవాన్నుఁడు చేయించుపనులే యాతఁడు చేయును. దేవునితో నేకమగుటనగా నిదియే.

24. నేను భగవానుని చిత్తశుద్ధితో నమ్మినయెడల నా కనిష్టములెవ్వియు జరుగకుండ భగవంతుఁడు రక్షించునను సత్యమును శంకించుట మహాపాతకము. నమ్మినవానిని, నిస్సంశయముగా, సర్వవిషయములలో నీశ్వరకృప వజ్రాయుధమై సర్వాపదలనుండి కాపాడి, సర్వశుభములిచ్చును.

25. ధర్మశాస్త్రముననుసరించి కొందరు తప్పుపనులు చేయుచుండగాఁగొందరు ధర్మముననుసరించుచున్నారని చెప్పుదుము. వేదాంతశాస్త్రముననుసరించి ఎవరును దప్పుచేయుట లేదు; ఏలన సర్వకర్త, కారణుఁడు పరమాత్మయే; మనుజులు నిమిత్తమాత్రులు, పారమార్థికముగా నందరు నిర్దోషులే, వ్యావహారికముగా సజ్జనులు, దుర్జనులు నుందురు. సన్యాసికిఁబరమార్థ దృష్టి, దానివలన సమదృష్టియుండవలెను. గృహస్థునికి వ్యావహారిక దృష్టి తప్పదు. కాని, పరమార్థమును

దృష్టిలోనుంచుకొని, రాగద్వేష రహితుఁడై, సజ్జన పోష ణము, దుర్జన నిరసనముచేయు చుండకతప్పదు.

26. దేవునికి మనసర్వస్వము అర్పించినచో నాతఁడు మన బాధ్యత వహించి, రక్షించును. మనదని నిజముగా నేదైననున్నప్పుడు కదా మనము దేవుని కర్పించుటకు? సర్వ ప్రపంచము, సకలజీవులు ఎల్లప్పుడాయన అధీనములోనే యున్నవి. మనము దేవునికర్పించు ప్రసక్తి లేదు. అనగా నీశ్వ రాధీనమై సర్వము నడచుచున్నదని గుర్తించుటే మనము చేయగల సర్వసమర్పణము, నీ దేహము, నీ బుద్ధి, యింద్రి యములు, సర్వమాతని సొత్తే, నీదికానిదాని నర్పించుటకు నీకేమి అధికారమున్నది ?

27. ఏమి తటస్థించినను చిత్తశాంతి చెడకుండుటే భక్తుఁడుకోరవలయు లక్షణము. ఏమి జరిగినను; పరమేశ్వ రుఁడు చేసినదే; పరమేశ్వరుఁడేది చేసినను మంచిదే. ఇఁక మనశ్శాంతి చెడుటకు హేతువేమున్నది? నిరంతరము భగ వంతునాశ్రయించిన వారికి; చిత్తప్రసాదము నాతఁడే ప్రసా దించును,

28. ఈలోకములో జన్మించిన ప్రతివ్యక్తికి నిరంతర భయప్రమాదములతోఁజెలగాటమే. అన్నియు దుఃఖకారణ ములే. ఆవగింజంత భౌతికసుఖమును కోరినచో హిమాలయ మంత శ్రమ, దుఃఖము కలుగును. అందుచే మానవజన్మము సుఖమును బొందుటకుద్దేశింపఁబడలేదనిస్పష్టము. దుఃఖమును నిర్మూలించుకొను యత్నమున కవకాశమే మానవజన్మము.

29. ఇచ్చువాఁడు, ఈయఁగల సర్వసమర్థుఁడు, సర్వకామదుఁడు పరమేశ్వరుఁడొక్కఁడే; అంతేకాదు భగవానుఁడాశ్రితపారిజాతము. భక్తుఁడు తానేది కోరినను 'లేద' ను శబ్దము రాకుండ భగవంతుఁడీయగలవాఁడు. ఇఁక దేవునాశ్రయించి సుఖపడక, సంశయమెందులకు ?

30. కొలఁది కాలముండు దేహమిచ్చి, ఆ కొలది కాలములో అనారోగ్యాది బాధలెన్నియోపెట్టి, దానికి సాయము భౌతికభోగకాంక్షలనెన్నియో పుట్టించి, వానివలన మనస్సును కొఱికివేయు కఠినకు సమస్యలు పెట్టి, "ఈ జీవితములో సుఖములేదు. నన్నుఁదెలిసికొని సుఖింపుమ"ని మహోపదేశము చేయుచున్నాఁడు పరమేశ్వరుఁడు. ఇన్ని బాధలు, క్లేశములు, దుఃఖములు పెట్టినను, వైరాగ్యము కలుగని వారినెవరు బాగుచేయఁగలరు ?

31. అప్రమేయ ప్రజ్ఞానిధియగు దేవుని భావమును దెలిసికొనుటకు దైవతుల్యునికేఁగాని సాధ్యపడదు. మనమల్పజ్ఞులమగుటచే దేవునిభావములెట్లు గ్రహింపఁగలము? అందువలన గర్వము విడిచిపెట్టి. ఏది తటస్థించినను దైవవిలాసమే; దానికర్థము మనకుఁదెలియకపోవచ్చునని నమ్మి భగవద్ధ్యానము నోర్పుతోఁ జేయుచుండుటే కర్తవ్యము.

32. ఇది చేయవలె నదిచేయవలెనని యనుకొనుచుందుము; కాలము పరుగిడును; మృత్యువుపైఁబడును — ఇదియే మానవజీవితము. ఏమిచేసినను చేయకున్నను దేవుని మరువకుండుటే రక్షణోపాయము.

33. దేవుఁడుండగా, వానినినీవు నిజముగా నమ్మియుండగా, నమ్మినవానిని దేవుఁడు తప్పక రక్షించునని మహా భక్తులు, జ్ఞానులు ఏక కంఠమున వక్కాణించియుండగా, ఇంకను సంశయము, బెంగ, విచారము పెట్టుకొనుటెంత తప్పు! నమ్మి స్మరించు, అశుభమెన్నఁడు జరుగదు, జరుగదు, జరుగదు.

34. ఒక్కసారియైనను భగవంతుని స్మరించినచో దానికి ఫలితమిచ్చి తీరువాఁడే భగవంతుఁడు; అధిక జపము, స్మరణము చేసినచో నధికఫలము కలుఁగును, జన్మమంతయు జపమైన నింకేమిచెప్పవలెను.

35. సర్వశుభములను, సుఖములనిచ్చు భగవానుని పాదములు పట్టుకొని. వజ్రసంకల్పముతో నెన్నఁడు విడువనని కూర్చుండుటే సాటిలేని మహాఘనకార్యము. అట్టి పనిచేయు వానికెవ్వఁడు సరిరాఁడు.

36. జపతపాదులన్నియు మనస్సు దేవునిపై లగ్నమగుటలో కృతార్థతనందుటకే. దేవునిపై మనస్సు నిక్కముగా లగ్నమయినట్లు సాక్ష్యము దైవకృప లభించుటే; నిజముగా దైవకృప లభించినట్లు సాక్ష్యము నిర్వికారమైన చిత్తప్రసన్నత, శాంతి, ఆనందము వెల్లివిరియుటయే.

37. భగవానుని మఱచిన క్షణముండరాదు. దానికి సాధనము నిరంతరస్మరణమే ఈ స్మరణము తీవ్రమై, మహా నిష్ఠగాఁబరిణమించి, శరీరములోని రక్తము, యెముకలు, కండరములు, చివరకు రోమములు స్మరణలోఁబాల్గొనవలెను.

సర్వకాల సర్వావస్థలలో నిది జరుగుచుండవలెను. అప్పుడా తనికి భయరాహిత్యము, అనగా సర్వదుఃఖవిముక్తి లభించును.

38. ఎన్ని జన్మములెత్తినను, దేవునిదయ సంపాదించి బ్రహ్మజ్ఞానము పొందనిచో, దుఃఖములుపోవు. అందుచే దానినెంత త్వరగా సంపాదించిన నంత త్వరగా సుఖప్రాప్తి యుండును.

39. జపమెంతచేసినను చేయనటులేలెక్క. ఏలన అనంతుఁడగు దేవునిగూర్చి మనముచేయు అల్పజపము ఎంత చేసినను అల్పమే. జీవితముతో జపమేకమై పోవలెను. అప్పుడు దేవునితోనేకత్వము లభించును. జపము నేనే యని గీతలో కృష్ణుడు చెప్పెను. 'తపోబ్రహ్మేతి' యని ఉపనిషత్తు.

40. అన్నిపనులు మనమే చేయుచుంటిమను విషయములో మనకెన్నఁడు సంశయము కలుగకుండునట్లు నడిపించి, నిజముగా సర్వకర్తను దానేయని భగవానుడమోఘ ప్రకటనచేసి, యీ విషయమును నామాయా ప్రభావము వలన మీకు బోధపడకుండఁజేసితినని చెప్పెను. "నాఽహం ప్రకాశస్సర్వస్య యోగమాయాసమావృతః' "మామేవయే ప్రపద్యంతే మాయామేతాం తరంతితే."

41 సర్వేశ్వర సంకీర్తనము సర్వరోగ నివారిణి. పథ్యము, అనుపానము నక్కరలేని దివ్యౌషధరాజము. దానిని చేతఁబెట్టుకొని సర్వదుఃఖములను జయింపవచ్చును. ఇఁక భయము దేనికి ?

42. జన్మజరామృత్యువులే నశించుచుండగా పరమేశ్వరాశ్రయమువలన దేహమాలిన్యములు నశించి ఆరోగ్యము కలుగుటాక లెక్కా?

43. శ్రుతులు, స్మృతులు, పురాణములు, మహాజ్ఞానులు మహర్షులు దేవుఁడున్నాఁడు, నమ్మి భజించినచో రక్షించి సర్వశుభములు మోక్షమునిచ్చునని ఘోషించుచుండగానమ్మి స్మరించినవారి మహాభాగ్యము, నమ్మకచెడిన వారి దౌర్భాగ్యము రెండును వర్ణనాతీతములే

44. మనలో దోషములు లేకుండ బాధలెప్పుడును రావు. అనిష్టములు, కష్టనష్టదుఃఖములు వచ్చినపుడు ఆత్మశోధనచేసికొని, పశ్చాత్తాపమంది, యీశ్వరస్మరణము చేయవలెను. కష్టముఃఖాదులెన్నడు కలుగకుండఁజేసికొనువాఁడు తెలివైనవాఁడు, వాని తెలివెట్టిదనగాసర్వకాల సర్వావస్థలలో దేవునేమరక భజించుచుండును,

45. దృష్టి దేవునివైపు త్రిప్పుటయే శుభారంభము. దైవస్మరణమునకు ఫలితము నిస్సంశయముగా, గలుగును. అందుచే దేవుని స్మరించు నదృష్టము సాటిలేనిది. ఏలన దైవభక్తులు దేవుని బంధువులు. దేవుని బంధువులకు లోపములు, దుఃఖములు కలలోని వార్తలు.

46. సుఖమను వస్తువు వస్తువులలో లేదు. వస్తువులు మారుచుండును. ఎన్నడు మార్పునకులోనుగాని వాఁడీశ్వరుఁడగుట; సుఖమాతనిలోనున్నది. ఈశ్వరారాధన చేసిన

వారి మనస్సులలో నది వర్షకాలములో గంగానదివలెఁ బ్రవహించును.

47. మనమున్నది నిజముగా రామరాజ్యమే. ఈ విశ్వమును నిజముగా నేలుచున్నది రాముఁడే అనగా దేవుఁడే పాలించుచున్నాఁడు. రామరాజ్యములో అధర్మములు, లోపములు, దోషములునుండవు. రామరాజ్యములో శ్రీరామ రక్ష ప్రతిప్రాణికి లభించును. నీ హృదయమును రామునికిచ్చి, రామరాజ్యములోఁ బ్రవేశించి జీవింపుము.

48. ఇహలోకమంతయు మహాప్రమాదముల పుట్ట. దైవభక్తి యీప్రమాదముల నరికట్టును. వేరొక మార్గము లేదు. ఈ మార్గమునుబట్టి సుఖింపక, కంటక మార్గములఁ దిరిగి, దుఃఖింపనేల?

49. దేవునిపై నాధారపడుట అనగా నింకెవ్వరిపై నాధారపడకుండుట. అందరకన్నియు నిచ్చువాఁడు దేవుఁడే. ఈశ్వరాజ్ఞ లేనిదే యేమనుజుఁడేమి చేయఁగలఁడు? దేవునిపై నాధారపడుచున్నానని పలికి యితరుల నాశ్రయించుట దైవద్రోహమేయగును.

50. చావులేనిదానినెఱిఁగి పట్టుకొని, నిర్భయముగా జీవింపవలెను. చావును జయింపని బ్రదుకు చచ్చినవానితో సమమైనదే. ఎంత తెలివి, పదవి, ధనము, కీర్తియున్నను చావు నాపఁగలవా? బ్రహ్మజ్ఞానమొక్కటే, మృత్యువును జయించి అమర్త్యత్వ మిచ్చునది గాన, దానిని సంపాదించి కృతార్థుఁడవు కావలెను.

51. దైవానుగ్రహము తప్ప సుఖమిచ్చునదేదియు లేదు. దుఃఖమిచ్చువానిని బట్టుకొని యేడ్చుట తెలివా? సుఖమిచ్చు దేవునారాధించుట తెలివా? దీనికి పెద్ద శాస్త్రములు తర్కములు ఎందుకు? చిన్నవిషయము. దృఢనిశ్చయముతో నమ్మినచో దైవానుగ్రహముగాంచి సుఖమందు టెంత సులభమో! యత్నించిచూడు.

52. దేవుఁడే మనకందరకుఁదండ్రి. ప్రపంచమే ఆ మనతండ్రిగారి యిల్లు? దేవునియింట మనము నివసించుచున్నాము. ఆయనయే మనయోగక్షేమము లన్నింటిని జూచుచున్నాఁడు. తండ్రిని లోకములో దైవముగాఁబూజింపుమని వేదము చెప్పినది. నిజముగా మనతండ్రి దేవుఁడే అయినచో నిఁకలోటేముండును? పితృసేవ చేసి ధన్యులుకండు.

53. ఎవఁడు సమర్థుఁడు? సంసారములోనుండియు దైవార్పిత జీవిత బలముచే సంసార సాగరమును పిల్లకాలువను వలె దాటగలవాఁడే సమర్థుఁడు,

54. అన్నియు దేవుఁడే చేయుచున్నాఁడని విస్వసించియు, ఁబెక్కుసంఘటనలు, మనకనిష్టములైనవి సంభవించినపుడు దేవుని సంగతి మఱచి, చికాకుపడుచుందుము. ఒక్కటిని విడువకుండ అన్ని సంఘటనలలో దేవుని విలాసమును గమనించు దివ్యాభ్యాసమును దీక్షతోఁజేయవలెను.

55. సంసారజీవికి, కోటి సమస్యలు వచ్చుచుండును. అప్పుడు (1) వెంటనే శ్రీరామప్రభువును స్మరించి ఆ సమ

స్యను బరిష్కరింప వేడుకొనవలెను. (2) శ్రీరామప్రభు వును స్మరించినంతనే, యే సమస్యయైనను మన కనుకూల ముగా బరిష్కరింపఁ బడునని నమ్మి, నిశ్చలులమై యుండ వలెను. ఇది గొప్ప అభ్యాసము. ఇందు జయమందినవారిదే ధన్యజీవితము.

56. లోకములో సర్వమును దైవకార్యములే. ఏలన నీశ్వరాజ్ఞ లేనిదే యేదియు జరుగదు. అందుచే నేదియెట్లె ప్పుడు జరిగినా, అందు భగవానుని దివ్యహస్తమునే తిలకించి నిర్విచారముగానుండు వాఁడే సుఖి.

57. ఇక్కడ నీలోకమందీ యింట మసలుచు నెంత కాలము గడపఁదలచితివి? నీవొక యాత్రికుఁడవని జ్ఞాపక ముంచుకొనుము. యాత్రలో నిహలోక జీవిత మొకఘట్టము; ఇది స్థిరమెట్లగును? ఇటనుండి వేరొక ఘట్టమునకుఁబోవు చుండుటే యాత్రకర్థము. మరలఁబురిటిల్లు; శ్మశానపుట్టిల్లు; ఈ ఘట్టములకంతమున్నదా? దేవదేవుని పాదములాశ్రయించి యాత్రముగించి, నీ శాశ్వత గృహమైన ముక్తి గృహము నకుఁదిరిగి వెళ్లుము.

58 అభయమనగా దేవుఁడే. దేవుఁడుకానివానికన్ని టికి భయమున్నది; అందుచే దేవుఁడవే నీవగుటో, దేవుని భక్తుఁడవై దేవుని అభయహస్తము పొందుటో – గావలెను మూడవ మార్గము లేదు. ముందు దేవుని భక్తుఁడగుట సుల భము; దేవుఁడే యగుట తరువాత సులభమగును.

59. దేవునియెడ మన విశ్వాసము సంపూర్ణమైన దేయని భావింతుము. కాని అది నిజముకాదు. అది నిజమైనచో – మనకు భయము, బెంగ, దైన్యము, దుఃఖము మున్నగునవి కలుగరాదు. అవి కలుగుచున్నవనగా, మన విశ్వాసము బలహీనము, అసమగ్రము, నవిస్పష్టము. అందుచే ఆత్మపరిశోధనము నిత్యము చేసికొని, దృఢవిశ్వాసముతో దైవానుగ్రహమును పొందవలెను.

60, ముఖ్యాంశములలో సకల ప్రాణులాకశే, (1) చావులేకుండ శాశ్వతముగా నుండవలెనను కాంక్ష (2) సుఖాభిలాష – దేహము శాశ్వతముగా నుండదుకాబట్టి అది వ్యర్థకాంక్ష – రెండవది, దేహసంబంధము, విషయసంబంధముచేవచ్చు సుఖము, క్షణికము, దుఃఖవిషపూరితము, ఇకఁ జేయునదేమున్నది? (1) నీవు చావులేని ఆత్మవని తెలిసికొన్నచో, శాశ్వత జీవితము లభించును. (2) సుఖమనగా దేవుఁడు, లేక ఆత్మవస్తువని తెలిసినచో శాశ్వత సుఖలాభమున్నది.

61. జన్మమనగా సృష్టి; మానవ జన్మమునకును విశ్వసృష్టికిని మూలకారణము కామమే. స్త్రీ పురుష రూపములఁగల్పించి. కలియు కోర్కెను తిరుగులేనిదిగాఁజేసి, యీ జగన్నాటక కర్తయైన పరమేశ్వరుఁడు తన కామవిలాసమును ప్రదర్శించుచున్నాఁడు కాని దేవునికిఁగామ మధీనమై యుండును. మనము కామాధీనులము. దేవునికానందము; మనకు దుఃఖము.

62. ధనము కావలెనని కోరుట సంసారికి తప్పు కాదు. కాని ధనమాత్మాభివృద్ధికి శత్రువుగారాదు. ధనము నకై దేవుని ప్రార్థించినపుడాతఁడు మనము నిజముగా భక్తుల మైనచో, మనకెంత ధనమిచ్చినచోఁ జెడకుండనుందుమో అంతియేయిచ్చును. దానిని తృప్తితో దైవప్రసాదముగా స్వీకరించి సంతసింపవలెను.

63. దారిద్ర్యము దుఃఖప్రదమే; ధన సంపన్నత ప్రమాదభరితము; లేకుండి యేడ్చుటా, ఉండియేడ్చుటా యనునది ప్రశ్న. ఉన్నను, లేకున్నను, నేడ్చుట కవసరము లేని స్థితియిమ్మని దేవుని ప్రార్థింపవలెను.

64. సకల విద్యలు నేర్చియు మూర్ఖుఁడగువాఁ డెవఁడు? దేవుని స్మరింపనివాఁడే. ఏ విద్యాలేశమును లేకున్నను విద్వాంసుఁడగు వాఁడెవ్వఁడు? అహంకారము విడిచి, గట్టిగా నమ్మి దేవుని స్మరించు నాతఁడే. మనుజునికి విలువ నీ విధముగా నీయవలెను. నిరహంకారి, భక్తుఁడు లోకమున కలంకారము; ఇతరులు భూభారము.

65. పాపమే రోగకారణము; పాపమునకు మందు భగవదాశ్రయము. భగవదాశ్రయమువలన జన్మజరా మృత్యుభయములే నశించుచుండగా రోగములు నశింపవా ? అనగా దైవభక్తి, బ్రహ్మజ్ఞానము శరీరరోగముల నశింపఁ జేసి, పూర్ణారోగ్యమును గూడ నిచ్చును.

66. ప్రారబ్ధ మనుభవించినఁగాని పోదని చెప్పు చుందురు. అది నిజముకాదు. దేవుని పాదములు గట్టిగా పట్టుకొని ఉగ్రజపము చేసిన యెడల సర్వకర్మఫలములు దగ్ధ ములగును. అట్లుకానిచో దేవుఁడు ప్రారబ్ధ దోషమును మాత్రము బోగొట్టలేని శక్తిహీనుఁడో దాక్షిణ్యహీనుఁ డో కావలెను,

67. వైద్యనాథుఁడనుపేరు దేవునికీయఁబడెను. సర్వ భవరోగహర్తయగుటచే దేవునికీ నామము సమంజసముగా నున్నది.

68. భగవంతుఁడు లోకాధిపతియనగా, కాలమునకు నధిపతియే. కాలమున కధిపతియనగా దేవుఁడు ప్రతిక్షణములో లోకమునందు జరుగవలసిన వానినన్నిటిని తన యిచ్ఛననుస రించి నియమించును. ప్రతిక్షణము, లోకములోని అణువు మొదలు బ్రహ్మ వరకు నీశ్వరాజ్ఞాబద్ధమై నడచును. అందుచే దేవునేక్షణమునందును మఱువక ధ్యానించు వానికేక్షణ మందు నాపద సంభవింపదు.

69, దేవునొడిలోఁ గూర్చుండి, దేవుని మహిమను గుర్తింపలేకపోవుట, తల్లిబడిలో కూర్చుండి స్తన్యము త్రాగుచు. ?దల్లికాపాడుచున్నదని యెఱుఁగని చంటివాని అజ్ఞానము వంటిదే. ఎంత విచిత్రమైన భగవానుని లీల! ఎట్ట యెదుటనున్న దేవునిఁజూచి, మఱొకటి యని భ్రమింపఁ జేయులీల !

70. లోకములోఁ గన్పట్టుచున్నవన్నియు దేవుని బాహ్యరూపములే. కనపడని శక్తిగానుండి కనపడు రూపముల నాతఁడావిష్కరించెను. అన్నియు దేవుని స్వరూపములగుట వలన, దేవుని దర్శించుట కెచటికిఁబోవలెను? ఎచటి కేగిన నీవు దేవుని ద్రొక్కుచుఁ బోవలెను.

71. మన మనస్సును, బుద్ధిని, హృదయమును దేవున కర్పించి ఆయనలోఁగలిపివేసిన యెడల, దైవశక్తి మనలోఁ బనిచేయుట కారంభించును. అపుడు మనమేమి చేసినను దేవుఁడు చేసినదే యగును.

72. దేహము ధరించిన తరువాత దేహసంబంధ క్లేశములు తప్పవు. వీనికి సిద్ధపడియే సంసారి బ్రదుకవలెను. ఇట్టివి లేకుండఁ జేయుమని దేవుని పాదములపైఁబడి యేడ్చుటయే సర్వోత్తమ కార్యక్రమము.

73 ఎన్ని చూచినను, మానవకర్తవ్యమేమియు లేదని తెలిసికొనుటే మన యేకైక కర్తవ్యము. ఆ తెలిసికొనుటయు మన కర్తవ్యమనిపించును గాని నిజముగా నదియు భ్రమయే.

74. భగవంతుని నమ్ముట చాలదు, మన మాయ నను నమ్మినది నిజమని ఆయనయొద్దనుండి జవాబు రూపములో నిస్సంశయ ప్రబల సాక్ష్యములు కనపడి తృప్తి నిచ్చినచో నప్పుడు మనము నిజముగా నమ్మితిమని చెప్పుకొనవచ్చును. అంతవరకు మన నమ్మకము సరియైనది గాదని తెలిసికొనవలెను.

75. నమ్మినచో దగాయెన్నఁడు నుండని వానినే నమ్మవలెను గదా! దగాచేయుటనగా, మోసగించుట, మృతి చెందుట, కామక్రోధాది వశుడగుట. ఈలక్షణములు మానవు లందరిలోనున్నవి, అవిలేని దేవునే నమ్మవలెను.

76. అన్నియు భగవానుఁడు చేయును. ఆతఁడు ప్రాణుల లోపలనుండి, నెవరిచే నెప్పుడేది చేయింపవలెనో, ఆయన ప్రణాళిక ననుసరించి చేయించును. ఇందులో మనము చేయుచుండుట ప్రత్యక్షము; దేవుఁడు చేయించుట పరోక్షము. చూడఁగలవారికి దేవుడు చేయించుటయు ప్రత్యక్షమే. చిత్రమేమన మనుజుడు చేయుట, దేవుడు చేయించుట కలిసిపోయి యుండుటచే మోహావశులమై పరోక్షకర్తయగు దేవుని గుర్తింపలేము. అట్లు గుర్తించుటే జ్ఞానము.

77. సముచిత మర్యాదనెఱిఁగి తదనుగుణముగా ప్రవర్తించుట దైవ లక్షణము. పుణ్యపురుషుల కది లభ్యమగును. అట్టివారి సంఖ్య చాల పరిమితము. మిగిలినవారి కట్టి శక్తి లేదని నిందించుట నిష్ప్రయోజనము.

78. 'ధనమూల మిదంజగత్' అనువాక్యము నిజమే. ధనము, అది కొను వస్తువులు, అవియిచ్చుతృప్తి, యివన్నియు నెవని చేతిలో నున్నవి? దేవుని దివ్య హస్తములో నున్నవి. దైవానుగ్రహము లేనిచో నేవ్యక్తికి నవి లభింపవు; దైవానుగ్రహములేని వస్తువులు, సంపదలు గర్వాహంకారముల వృద్ధి చేసి, దుఃఖములనే యిచ్చి, దేవునికింకను దూరమొనర్చును.

అందువలన, 'ధనమూలమిదంజగత్తు'నగా దైవమూల మిదం జగత్తనియే అర్థము. కావున ధనమనగా దేవుఁడే. ధనారాధన కాదు దైవారాధన చేయవలెను. దైవారాధనవలన ధనమున్నను లేకున్నను సుఖముండును. దైవము నెఱుఁగని ధనము దుఃఖప్రదము.

79. యోగ్యుఁడనగా నెవ్వఁడు ? యోగియే యోగ్యుఁడు. యోగియనగాఁ దన మనస్సును దేవునికిచ్చిన వాఁడు. అందుకే గీతలో "తస్మాద్యోగీభవార్జున" యని శ్రీకృష్ణదేవుఁడుపదేశించెను.

80. మనము లోకములో నేవస్తువును, ఏ ప్రాణిని జూచినను, దేవునే సూచించును. ఏలన, ప్రతి వస్తువును, ప్రతి ప్రాణిని దేవుఁడే కల్పించి, అందు ప్రవేశించెను. లోకములో మానవులు కొన్ని అందమైన వస్తువులను కల్పింతురు గాని అందు ప్రవేశింపలేరు. అన్ని వస్తువులలోను, ప్రాణులలోను దేవుఁడుండుటచే, నన్నియు దేవుని జూపు ధ్వజస్తంభములే;

81. పరమేశ్వరానుగ్రహము వలన దుస్సాధ్యము లన్నియు సుసాధ్యములు, దుఃఖాశ్రువు లన్నియు నానంద బాష్పములై, పరిణమించును. ఆ పరమేశ్వరానుగ్రహమున కొకటే సాధనము. మనదంతయు నాయన పాదములపైఁబెట్టి తిరుగులేని దీక్షతోఁగూర్చుండుటే.

82. ఎన్ని ఆలోచించి, పరిశీలించినను, జగత్ప్రభువు దివ్య లీలలే, అన్ని విషయములలో గోచరించును. ఆశ్చర్య

మేమనగా, దేనిని విడువకుండ, చిన్నపెద్దలైన సకల విషయములలో ఆయన ప్రవేశించి, తన సంకల్పము నమోఘముగా ప్రవర్తిల్లచేయుచున్నాఁడు. ఆయన దివ్యహస్తము స్పృశించి నిర్ణయింపని దేసందర్భముగాని, సంఘటనముగాని లేదు.

83. గ్రంథములు చదువుట ఏమిచేయవలెనో తెలియుట కొరకే. వీనైనంత త్వరలోఁజదివి. సారము నెఱిగి, కర్తవ్యమును గుర్తించి ఫలితమును (ముక్తిని) బొంది సుఖించువాఁడే బుద్ధిమంతుఁడు. చచ్చువరకు చదువుచుఁగూర్చున్నచో నిఁక క్రియ యెప్పుడు?

84 దేవుని దయపొంది సుఖించుట కష్టముగాదు. చేయవలసినదొక టేపని; మినహాయింపులేని ఆత్మార్పణ మొనర్చినచో ఆయనకృప కలిగితీరును. కాని మనముచేయు ఆత్మార్పణములో లోపమురాకుండ సర్వకాలసర్వావస్థలలో మనమాత్మ పరీక్షచేసికొను చుండవలెను. దినదినము బుద్ధిని దిద్దుకొనుచు, నిఁక దిద్దనవసరములేని స్థితికి వచ్చుటయు దైవ కృప లభించుటయు నొకేసారి జరుగును.

85. మరణకాలము వరకు నిరవధికముగా దేవుని ధ్యానించుచుండుట మంచిదేకాని అదిచాలదు. మరణాత్పూర్వమే, అనగా ఁగొన్నేండ్లు ముందుగనే దైవకృప నార్జించి, చేతఁబెట్టుకొన్నచో మరణకాలమున నెట్టి భయప్రమాదములు కలుగవు. అట్లుగాక, మరణకాలమునకు, మన మనేక దోషములచే దేవుని మఱచినచో నంతయు ఁబ్రమాదమే.

86. మనమీ లోకములో నీ రూపములో నొక్క-సారియేఁయుందుము, ఎన్ని కోట్ల రూపములు, అసమాన సౌందర్యముగలవి, మట్టిలోఁగలిసినవో! మనమురూపములను నమ్మవలదనియు, రూపములోపల ఆత్మ అందరిలో నొకటే యనియు దానికి మరణము లేదనియుఁ తెలిసి, బ్రదుకుటవలన ఁబెక్కు- దుఃఖములు లేకుండును.

87. ఈ లోకములో భగవానుఁడు తన యిచ్ఛ ననుసరించి సర్వమును నడపును; జీవరాశులను సృజించి, ఒక్కొక్క జీవిచే నొక్కక్క-పని చేయించును. చిన్నది కావచ్చును; పెద్దది కావచ్చును. ఆజీవి యాపనిచేయుట లోకమున కవసరము. ప్రతిజీవియు నొకపాత్రధారి. అందుచే లోకములో నిరర్థకమైన దేదియును లేదు. ఉన్నచో నది దేవునికి లోపమగును.

88. భగవంతుని భావమేమిటని కొన్ని విషయములలో లోకులు తెలియఁగోరుదురు, దేవుని భావము తెలియజేయుటకొకటే మార్గము; దేవుఁడే దేవుని భావమును జెప్పినచోఁదెలియవచ్చును. దోమ సూర్యకాంతిని కొలువఁగలదా? మనము దోమలము దేవుఁడు రవి.

89. భోగ్య వస్తువులను యోగ్యవస్తువులనుగాఁజేయుటెట్లు? వానిలోనున్న పరమేశ్వర చైతన్యమునుగుర్తించుటయే సాధనము, కాని వానిననుభవించుట కారంభించుచో, భోగదృష్టి,దై వదృష్టినణఁచి వేసి, దుఃఖసాగరమునముంచి వేయును.

90. జీవించుటకు ముఖ్యావసరములు లేకున్నచో వానినార్జించుటకొఱకు మనము కొంత శక్తిని, ఆయువును వ్యయింపవలెను. కాని, ఆ శక్తి, ఆయువు, దేవునారాధింపవలసిన శక్తిలోఁదరిగి పోవును. ఇఁక భోగావసరములను గూడ నపేక్షించినచో, దైవారాధనకుఁగాలమే మిగులదు. అందుచే దేవుని మఱువకుండ నుండఁగలుగునంతమట్టుకే అవసరముల నిచ్చి రక్షింపుమని దేవునే ప్రార్థింపవలెను.

91. జగద్రహస్యమెఱుఁగకుండ నీ జగత్తులో-మనుజులు గ్రుడ్డివారివలె జీవించుచున్నారు. ఈ యంధులందరు తమ అంధత్వమును బోగొట్టుకొను యత్నము చేయక, పెండ్లియాడి పిల్లలనుగని. ధనగృహాది తాపత్రయ వశులై. మృతులగు చున్నారు! ఎవరి నేత్రములు, భక్తులు, జ్ఞానులు నను వైద్యుల చికిత్సచే దెఱువఁబడునో, వారు దేవుని దివ్య కాంతిని దర్శించి, ధన్యులగుదురు. అనగా మహాపురుష సంశ్రయము కలిగినవారి అంధత్వము నశించును.

92. పగటి భాగమును పొట్టకొఱకును, రాత్రి భాగమును, భోగనిద్రల కొఱకును వినియోగించి క్రమముగా రోగజరామరణ వశులై, పునర్జనన మరణములొందుచు జనులు సంసార ప్రవాహములోఁగొట్టుకొని పోవుచున్నారు వేదాంతమెవరికిఁజెప్పుట?

93. నిత్యము శ్మశానమునకుఁబోవు శవముల జూచుచున్నాము; మన శరీరము దహనమునకై పోవుదినము దగ్గర

పడుచున్నది. ఇది తెలిసియుఁదెలియనటులు సంచరించు దౌర్భాగ్యపు బ్రదుకెంత హేయమైనదో!

94. కృశించి, నీరసించిన శరీరము భోగమునకుగాని, యోగమునకుఁగాని పనికిరాదు. యౌవన బలమున్నప్పుడు యోగ మభ్యసింపవలెను. కాని యౌవనబలము భోగోన్ముఖమై, యోగవిముఖమై, భోగలాలసమగుటచే, త్వరలో నిర్వీర్యమగును. ఇది దారుణమైన దురవస్థ; భోగయోగములు కలియవు.

95. స్త్రీపురుష రూపములు పెట్టి, జననేంద్రియములు తీర్చిదిద్ది, యౌవనమదమును గలిగించి, పరస్పరాకర్షణము, సంపర్కము, తాత్కాలిక సుఖమును బెట్టి, సంతతినిచ్చి, ధనాదిక సంపాదనావశ్యకతనుబెట్టి, రోగ, వైమనస్య వైకల్యములెన్నియో పెట్టి,పరమేశ్వరుఁడు జగన్నాటకము నమోఘ ప్రజ్ఞతోఁబ్రదర్శించు చున్నాఁడు. ఈ నాటకము నడ్డగించుట కెవరికి సామర్థ్యమున్నది ?

96, ఈ లోకములోఁ గొందరు తమ కవసరములేని విషయములలో జోక్యము పెట్టుకొనరు; కొందరవసరములేని కొన్ని విషయములలో జోక్యము పెట్టుకొని యితరుల బాధింతురు. లోకములోని సర్వవిషయములలో నెవ్వరు జోక్యము పెట్టుకొనలేరు. సర్వవిషయములలో నొక్కదానిని విడువకుండ, జోక్యము పెట్టుకొని, నిర్విచారముగా ఁదనయిచ్ఛననుసరించి, నడపువాఁడొక్కఁడున్నాఁడు, అతఁడే దేవుఁడు.

97. అన్నిటినిచ్చువాఁడు భగవానుఁడై యుండగా, నారోగ్యముమాత్రము వైద్యుఁడిచ్చునను కొనుట మూర్ఖత. అదియు దేవుఁడే యిచ్చును. శ్రీరామప్రభు స్మరణమే ఆరోగ్యము,

98. మనకు దైవభక్తి, ధర్మానురక్తి, పరిస్థితు లను కూలముగా నున్నపుడు, పైపైననే యుండును. అంతరంగ మున లోలోపల పాతుకొనిపోయి కామాది సంస్కారము లుండును. కొంచెమేమరితిమా – కామాది బీజములు, గారడీ లోవలె నిముసములో మొలకెత్తి, చిగిర్చి, పుష్పించి ఫలించును దేవుని సంగతియే స్మరణమునకు రాదు. తస్మాజ్జాగ్రత!

99. దేవుని నమ్మి చెడినవాఁడు లేఁడు, కారణము దేవుఁడు నమ్మినవారి నెవరినైనను రక్షించు వ్రతముగలవాఁడు. దేవునికి వ్రతభంగమెన్నఁడుండదు.

100. దేవుని సదా జ్ఞాపకముంచికొని స్మరించుచు నున్నచో, మనమేది యెప్పుడెట్లుచేసి తరింప వలెనో అన్ని సంగతులు దేవుఁడే జూచును "రామస్మరణ మానకు; మఱల జన్మింపకు".

101. రైలుబండి ఏడు గంటలకు బయలుదేరునని తెలిసి, ఆరు గంటలకే భుజించి, సామగ్రి సర్దుకొని పోయి టిక్కట్టు పుచ్చుకొని. రైలుబండి నెక్కుటకు సిద్ధముగా నిలు తుము. కాని యీ లోకము విడిచి పోవలయు రైలుబండి, యే రోజున నెన్నిగంటలకు బయలుదేరునో తెలియదు.

అందుచే వీలైనంత తొందరగా ముందే ప్రయాణమునకు సిద్ధమై యుండవలెను. అదియే తపస్సు, ధ్యానము.

102. సకల ప్రాణులు అజ్ఞానమను రోగముచే బాధ పడుచున్నారు. ఈ రోగమును పోగొట్టుకొని సుఖించుట కెవ్వరును యత్నింపరు. దేహానికి రోగము వచ్చినచో మందులు తిందురు. దేహరోగము, సంసారమను పెద్ద రోగములోని చిన్న రోగము. అసలు రోగము పోయినచో, దేహరోగముమ పోవును. సంతత శ్రీరామ సంకీర్తనము సంసార జాడ్య సంపూర్ణాపహారి.

103. పశువును బందెల దొడ్డిలోను, ఎలుకలను ఎలుకలబోనులోను, దొంగను కారాగారమందును వలె, మనల నీలోకమను కారాగృహములోఁబడ వేసినాడు, కారా గృహములో సుఖమెక్కడ? బ్రహ్మజ్ఞానమను తాళము చెవితో తాళము తీసికొని బయటపడినప్పుడే సుఖము.

104. మనమందరము అస్థిర జీవనులము, దుఃఖా ధీనులము అయియున్నాము. దీనికిఁ గారణము మనము దేవు నికి దూరమగుటయే. దేవుని, భక్తి, జ్ఞాన ధ్యానాదులచే సమీా పించిన కొలఁది మన మనిత్యమునుండి నిత్యమునకు, దుఃఖ మునుండి సుఖమునకు, చీకటినుండి వెలుగులోనికి సమీా పింతుము.

105. 'జగమంతా రామమయం' నిజమైనచో, మన మంత రామమయంకాదా? మనము మినహా జగమంత రామ

మయం అన్నచో, మినహాయింపు దేవుని పరిపూర్ణతకు లోపమగును. అనగా మనము పూర్ణ భగవత్స్వరూపులమే. ఇది యెటులోఁ తెలిసికొనుటే జ్ఞానము.

106. పృథివ్యాది పంచభూతములు భగవద్భక్తుని కనుకూలములై వర్తించును. ఏలనఁబంచ భూతములు దేవుని రూపములే. గ్రహనక్షత్రాదులును దేవుని రూపములే 'నక్షత్రాణి రూపమ్' పురుష సూక్తము. భక్తులు దేవుని బంధువులగుట, వారికవి యెన్నడపకృతి చేయవు.

107. పరిపూర్ణత యనగా జ్ఞానసిద్ధిగాంచిన పుణ్య పురుషుని నోటవచ్చువాక్యముల వంటివేయితరవ్యక్తినుండియు లభింపవు. ఇతరులలోఁ బాండిత్యపాటవ ముండవచ్చును గాని జ్ఞానసిద్ధుని వాక్యములలో నమృత మూటలూరును. ఆయమృతము మృతిలేకుండఁజేయును.

108. ఎన్ని విద్యలు, పదవులు, ఐశ్వర్యములు, కీర్తి ప్రతిష్ఠలు సంపాదించినను, అవి చావును దుఃఖమును దప్పింప లేవు. అనగా బ్రహ్మవిద్యలేని సంపదలన్నియు నైదువ తనములేని కాంతల సౌభాగ్యముల వంటివే; అనగా శవాలం కారములు; నష్టేటి కాపురములే!

109. ఈ లోకములో నేడుపులేనినవ్వు, దుఃఖము లేని సుఖము; జరాక్రాంతముకాని యౌవనము; చావులేని బ్రదుకు; రోగములేని భోగము, ఎన్నఁడు నుండవు. పాలు న్నవి; విషము కలిసినది – అవి పాలుకాదు విషమే. దుఃఖ

ముతోఁగలిసిన సుఖము దుఃఖమే. అందుకే రెంటిని విడిచి, కల్తీ లేని సుఖమిచ్చు దేవునాశ్రయింపవలెను.

110. నిరాటంక వేగముతో ఆయువు కరిగిపోవు చున్నది. దేహమును విడిచిపోవు దినము దగ్గరపడుచున్నది. అనవసర కార్యములు, నిరర్థకాలోచనలు విడిచి భగవంతుని దృఢదీక్షతో సేవించుచు, ఆయన కృపాధనము నార్జించి, ఆసాటిలేని పుణ్యపుమూట చంకనిడికొని లోకాంతర ప్రయాణమునకు సంసిద్ధుఁడవు కమ్ము; సర్వము శుభమగును.

111. "భగవంతుని కృప యెట్లుండునో" యని జనులు పలుకుదురు. అట్లు పలుకువారికి సంశయములున్నవి. భగవానుని కృప కలుగునా కలుగదా యని అనుమానము. ఈ శంకకు గారణము దేవునిలో లేదు. మన చిత్తశుద్ధి లోపము సంశయ రూపమున పైకుబుకు చుండును, చలింపని చిత్తశుద్ధి, దైవకృపాలాభము రెండునొకటే; మొదటిదున్నచోట రెండవదుండి తీరును.

112. అన్నోదకములు మనకెచట నున్నవో తెలియదు. అచ్చటికే మనలను దోడ్కొనిపోయి దేవుడు పోషించును. ఈ జన్మములో మనకు గొంతకోటా యిచ్చి, అది అవగానే, లోకమునుండి లోకాంతరమునకు పంపివేయును.

113. ఈ లోకములోఁబుట్టి చనిపోవు వరకు ధనకాంతాది సుఖములకై జీవితమును వ్యర్థమొనర్తువా? నీ కొంపకు నలుపైనకల నీ స్వహస్తములో నిప్పుపెట్టి అందు పరుండుచేటే సుమీ!

114. దృష్టిలో లోపదోషములచే సృష్టి వ్యతిరేక మగును. పంటలధికముగా పండి ధరలధికమగుచున్నవి. కారణము భోగవాంఛలధికమై, అవినీతి దోషముపట్టినది. కోర్కెలు తగ్గినచో సమస్య పరిష్కారమగును.

115. దేవుని మనమేదో కావలెనని అడుగుట; అడుగకయే యిచ్చుట; అడిగినను నీయకుండుట; ఏమడిగిననిచ్చుట, ఇచ్చుట నీయకుండుట సమానమగుట – యివన్నియు భక్తుని భక్తి పరిణామములోని వివిధ ఘట్టములు. మన భక్తి ఉత్తమమైనపుడు, సర్వవాంఛలు సిద్ధించును. "వాసు దేవస్సర్వమితి" యని దృఢముగా నమ్మిన భక్తునికి దేవుని ఆస్తి అంతియుఁ జెందును.

116. విశ్వమంతయు దేవుని సొత్తు. భగవంతుఁడే పాత్రునికెంత చెందవలెనో నిర్ణయించును. ఒకనిసొమ్ము వేరొకఁడు పుచ్చుకొనఁజాలఁడు. మనము నిజముగా దేవుని రాజ్యములోనే యున్నాము. లౌకిక రాజ్యములన్నియు దేవుని చేతిలో నాటవస్తువులు.

117. దేవుని పాదపద్మములకు నీ జీవితమును ముడిపెట్టి గట్టిగా బిగించి కూర్చుండుము. ఇఁక విచారమునకుఁ దావు లేదు. నీ కశుభమెన్నఁడు జరుగదు, నీ కశుభము జరుగకుండ నుండుటకై అవసరమైనచో దేవుఁడు సృష్టిని తారుమారు చేయుటకు జంకనంతటి దయారాశి!

118. శ్రీరామ ప్రభువును నిర్మల చిత్తముతో నమ్మినవారికి "అభయప్రదానము" తప్పక లభించును. సీతాదేవిని, సుగ్రీవుని, హనుమంతుని, శబరిని, జటాయువును, విభీషణుని రక్షించినాఁడు.

119. సర్వత్ర సర్వవ్యాపియై దేవుఁడున్నాఁడనగా నర్థమేమి? మనము దేవునిలో దేవునిపైఁ గూర్చుంటిమి. మనము చేయికదిపినచో దేవునికిఁదగులును. మన కదలిక కాటంకము లేకుండు రీతిగా నాకసము, గాలివలె, అంతట నిండియున్నాఁడు.

120. సర్వేశ్వర పాదారవిందములను, సదమల చిత్తముతో సర్వదా ఆరాధించుచుండు వాని యదృష్టమెంత గొప్పదో! ఏలన, దైవకృప పూర్తిగా నుండుటవలననే అట్టి అవకాశము లభించును. అనగా నీకు దైవానుగ్రహామది వరకే ఉన్నదన్న మాట!

121 భగవత్సంకీర్తనము, ప్రార్థనము, జపపారాయణాదికమును మనము దైన్యముతోఁ జేయరాదు. ఏలన జగత్తులో జరుగుచున్న పనులన్నియుఁ దాత్కాలిక వాంఛలను దీర్చును; దైవప్రార్థనాదికము మన శాశ్వత సమస్యలనగా, జన్మమృత్యుజరాదుఃఖ సమస్యలను బరిష్కరించి, యిహపర సౌఖ్యములను మోక్షమును ప్రసాదించును. అందువలన దైవ ప్రార్థనాదికార్యము లన్నిటికంటె నుత్తమకార్యములు, దైన్యము లేని ధైర్యముతో వానిని జేయవలెను.

122. ఆరా తీసి ప్రతివస్తువునకు మూలము కనుగొన్నచో, "నేనేరా! నేనేరా!" యని దేవుఁడే తలయెత్తి దర్శనమిచ్చి పలుకును. సర్వస్వరూపి సర్వవ్యాపి దేవుఁడనగా నిదియే యర్థము. జ్ఞాని కన్నివస్తువులలోనుండి దేవుఁడు తొంగి చూచుచున్నాఁడు. అజ్ఞాని కవి సామాన్యవస్తువులుగా గోచరించును. జ్ఞానికి జగమంతయు విష్ణుమయము, అజ్ఞానికి జగమంతయు వస్తుమయము.

123. అన్నియు దేవుఁడే చేయుచున్నాఁడని యెరిగి నమ్మియు, మనకుఁ గష్టముకలిగినపు డాసత్యమును మరచి, మన కష్టమునకు నిమిత్తమాత్రులైనవారియెడ రోష ద్వేషములు ప్రదర్శింతుము. అనగా దేవునిమాయ మనల జయించెనన్నమాట!

124. "బుద్ధిః కర్మానుసారిణీ" నిజమైనచో, 'కర్మ' "బ్రహ్మానుసారిణీ" యనుట నిజము. కర్మలకు, బుద్ధులకుఁ బ్రబోధకుఁడు దేవుఁడే. కర్మలను, బుద్ధిని దేవుని కర్పించి ధన్యుఁడవగుము.

125. భగవంతునితో నెట్లు వ్యవహారింపవలెనను సమస్య గడ్డైనదే! భక్తుఁ డడిగినదెల్ల నిచ్చునని చెప్పుదురు. నిజమైన భక్తుఁడు అన్నికోరికలను విడిచి ముక్తినే కోరును. భక్తుఁడుకానివాఁ డడిగినచో నీయవచ్చు, మానవచ్చును. దేవునితో నెట్లు సంచరించుట? దేవునినమ్ము; నీయిచ్చవచ్చిన దడుగుము. ఇచ్చినసరే; యివ్వకున్న నీ మంచికొఱకే యతే

దని నమ్ముము. కాని యెన్నడు దేవుని తప్పుపట్టకు; నమ్ముట, భజించుట మానకు. నీకు శుభమే యగును.

126. మనము స్మరించుట, ధ్యానించుట, స్తుతించుట. పూజించుట మున్నగువానివలన దేవుని కేమిలాభము? ఎట్టి లోపములులేని దేవునికి మనము స్మరింపకుండుటవలన లోపము కలుగునా? దైవసేవ యనగా నిజముగా మనకుమనము చేసికొను సేవయే. గర్వాహంకారములు విడిచి, ఆయన సేవ చేసి తన్మూలమున మనము పవిత్రులమై తరింతుము.

127. తెలిసి తప్పు చేయరాదు; తెలియక తప్పు చేయరాదు; తెలిసికొనకపోవుటే తప్పు. తప్పు చేసితిమని తెలియగానే, లెంపలు వాయించికొని, మన్నించి, రక్షింపుమని దేవుని యెదుట నేడ్వవలెను. తప్పులు చేయకుండు బుద్ధి నిమ్మని ప్రార్థించుటే సంధ్యావందన రహస్యము. తప్పని తెలిసియు దాని నొప్పుగా సమర్థింపఁబూనువానికి దుర్గతి తప్పదు.

128. నీవు కర్మచేయుము, మానుము, సర్వకాల సర్వావస్థలందు భగవానుని మనస్సులో నుంచుకొని సంచరింపుము. నీ వేమిచేయుట మానుట ముఖ్యములుగావు. నీవు దేవుని మఱచుటయే ప్రమాదము. అన్నివేళల దేవుని గుర్తులో నుంచుకొనుటనగా, దేవుఁడు నీతో నెల్లవేళల నుండుటే. సర్వకాలములందు దేవుఁడు నీతో నుండుటకంటె మఱేమి కావలయును?

129. మానవజీవితములో ననుదినము పెక్కురక ముల సమస్యలు వచ్చి దేహమనోబుద్ధులను గలఁచివేయు చుండును. దైవభక్తుఁ డేమిచేయవలెను? వచ్చిన సమస్య లను వెన్వెంటనే దేవుని భుజస్కంధములపై నొప్పగించి, దయతోఁబరిష్కరింపుమనికోరి, దేవుని స్మరించుచునుండుట- సమస్యలన్నియు దేవుఁడే పెట్టెను గావున, నాతడు భక్తజన కృపాలోలుఁడై వానిని భక్తునికెట్టి క్లేశదుఃఖములు లేకుండు రీతిని పరిష్కరించును.

130. దేవుఁడు సృష్టికారకుఁడై, సృష్టిలో నంత ర్యామియై, సర్వవ్యాపియై, సకలప్రాణికోటి సంబంధకార్య కలాపములకు నియంతయై ప్రవర్తించుచుండగా, నిష్టార్థసిద్ధికి, ననిష్టపరిహారమునకు-భగవానునిగాక వేరెవ్వరి నాశ్రయిం తువు ! దీనికింత తర్కము కావలెనా ?

131. ఎన్నిచోట్లఁబుట్టి, ఎన్నిమారులు భార్యా పుత్రాదులు, గృహములు, సంపాదనలు నడచినవో ! ఇపు డింకొక 'మజిలీ' లో నున్నాము; ఇది ఖాళీచేసి మరొక 'మజిలీ'లోనికిఁ దరలుట తప్పదు. గమ్యస్థానము (దేవుఁడు) జేరు టెప్పుడు ? యాత్రపూర్తిచేసికొను యత్నముండవలదా! అదియే మోక్ష యత్నము.

132. "నాసొమ్ము రావలసినది రాలేదు నాకొడుకు లేఖ వ్రాయుఁడు; నాచెట్లు కాయ లేదు' మున్నగు మాటలు వినుచుందుము. కాని నిజముగా, సొమ్ము కొడుకు మున్నగున

నన్నియు దేవునివే. 'నావి' యని దేవుని ద్రవ్యములనుగూర్చి పలుకుటయే దోషము. "నాది నాకిప్పింపుమ"ని కాక 'నీదే నాకిప్పింపుమ'ని కోరవలెను. అప్పుడే మనము నిజముపలికిన వారిమగుటచే, మన కోర్కెలను దేవుఁడు మన్నించును.

133. ఇంటిలోని భార్య, బిడ్డలు, బంధుమిత్రులు. మనకుఁ గష్టముకలిగించు భావములు, మాటలు, చేతలు చూపుదురు, ఇవి మన మనోనిగ్రహమును స్థిరమొనర్చుకొనుటకు దేవుఁ డేర్పాటుచేసిన-స్వశిక్షణావకాశములు. నైపుణ్యము, సహనములతో వాని నుపయోగించుకొని మనోజయము పొంది తరింపవలెను.

134. పరమేశ్వరుని భజించుటేకాని, ప్రశ్నించుట, తర్కించుట తెలివితక్కువపని; ఏలన, నిరక్షరాస్యుఁడు శ్రీశంకరులవారితో శాస్త్రచర్చ చేయుటవంటిదే. అనంత ప్రజ్ఞ, సర్వజ్ఞత్వము గలవాఁడు భగవానుఁడు; మనమో! అజ్ఞులము, కించిజ్ఞులము; దేవుని భావము మనకెట్లు బోధపడును? అందుచేఁ దర్కము విడిచి భజించుటే తెలివి.

135 చాలకాలము బ్రదుకవలెనని అందరు కోరుదురు. పుత్రపౌత్రాభివృద్ధిగా సకలసంపదలతో వర్ధిల్లుమని పెద్ద లాశీర్వదింతురు. నూరేండ్లు, వెయ్యేండ్లు బ్రతికినా సాధింపవలసినది పుత్రపౌత్రాభివృద్ధియేనా? అజ్ఞానదుఃఖములను దొలిగించు, బ్రహ్మజ్ఞానములేని బ్రదుకు నూరేండ్లైనను, నూఱునూరేండ్లైనను భూభారమే.

136. రోగము లెందుకుఁబెట్టెను? రోగములు పెట్టి యెన్నివిధముల బాధించినను దేహముపై మమకారము పోవుటకు బదులు పెరుగుచుండుట జూచుచున్నాము. రోగమే లేని దేహమే మనకిచ్చిననాఁడు మనకు వైరాగ్యముకలుగుట కవకాశమే లేదు. దేహమును నమ్మవలదని తెలుపుటకే రోగాదిదోషములు పెట్టెను. అనగా దేహధారియందు దేవునికిగల దయచేతనే రోగముపెట్టి దేహమమకారము తప్పని బోధించుచున్నాఁడు.

137. నిరంతరము భగవంతు నారాధించిన పుణ్యరాశి తరుగులేకుండనుండినఁగాని, యిహలోకపరిస్థితులు జీవితమును కొరికివేయుచు, ప్రారబ్ధకర్మఫలితములు, ఈతిబాధలు, సాంసారికవైకల్యములు, రోగాదిబాధలు, మున్నగునవి ప్రబలశత్రువులై మీఁదపడి హింసించును. అన్నిదోషములకు విరుగుడుమందు హరిస్మరణమే.

138. మనస్సు దేహముపై నుంచినచో, అనారోగ్యము కలుగును; మనస్సు దేవునిపై నుంచినచో దేవుని ఆరోగ్య బలానందములు దేహములోఁ బ్రవేశించును.

139. శ్రీరామనామమే విష్ణుచక్రము. అది జిహ్వాగ్రమునఁ దిరుగుచున్నంతకాలము, సకలబాధలు తొలఁగి పోవును; మృత్యువు సమీపింపఁజాలదు. ఏబాధలు రాకముందు, వచ్చిన వెన్వెంటనే శ్రీరామనామచక్రము త్రిప్పుటవలన, వచ్చినవి పోవును; రానున్నవి రావు.

140. కామక్రోధాదులు లోన దాగుకొనియుండి, మనము భగవంతుని మఱచిన సమయము కనిపెట్టి, పైఁబడి వశమొనర్చుకొనును. పరబ్రహ్మైక్యము సాధించువరకు నవి నశింపవు. అందుచే వానిబారినుండి తప్పించుకొనుటకు నిరంతర బ్రహ్మానుసంధానమే సాధనము. భగవానుఁడున్న చోట నవి నిలువలేవు.

141. జపము చేయుచుండగా నెవరో వచ్చిరని, మానుట దైవద్రోహమగును; దేవుని విడిచి, వచ్చినవారికి మర్యాదమిాయలేదని తప్పుపట్టుటయు దైవద్రోహము, భక్తద్రోహముకూడ నగును. ఇరువురును తత్ఫలితమగు పాపము ననుభవింపక తప్పదు.

142. ఎట్టయెదుటఁ దాము పలుకుచున్నది తప్పని బాలురకుఁగూడఁ దెలియునంత స్పష్టముగానున్నను పెద్దవారు విద్వాంసులుకూడ తమ తప్పంగీకరింపక, దురభిమానపూరితులై, తమ్ము సమర్థించికొనయత్నించుటలో నర్థమేమి ? శ్రీరామలీల !

143. పాపములు చేయుట కజ్ఞానము కారణము; అజ్ఞానమునకుఁ గారణము పాపము. రెంటికిఁ గారణము తెలియదు, తెలియనక్కరలేదు. ఏలన నవి పోవుట ముఖ్యము. అవనిలో నెంటనే నిమగ్నులము కావలెను. అజ్ఞానము జ్ఞానులైన సత్పురుషుల సహవాసమువలన నశించును; పాపము పరమేశ్వర స్మరణధ్యానాదికముచే నశించును, అనగా సత్పు

రుషసాంగత్యము, ఈశ్వరసేవ - ఇవియే సర్వమానవులు తరించు నుపాయములు,

144. నీవు చేయవలసిన పనులలో ముఖ్యమైన దొకటే. అదియే అవిరళభగవత్సంకీర్తనము. ఇతరము లన్నియు మానుట మంచిది; మానినను పైఁబడిన వానిని దేవుని స్మరించుచుఁ జేయుట; ఇదియే మార్గము; ఇందొక చిత్రమున్నది; ఇట్లు చేయువాని పనులన్నియు దేవుడు స్వయముగాఁ జేయును.

145. ఎవరి నెవ్వడు కలిసికొనవలెనో మనచేతిలోని పనికాదు. దేవుడే కలుపును, విడఁదీయును. అందర కార్య క్రమ మాయన కార్యక్రమమే; అన్నిపనులు దేవునివే! అవి దేవుని లీలలు; మనము చేయుట బూటకము, దేవుడుచేయుట నాటకము!

146. మనుజులందరు నిరంతర తాపత్రయమగ్నులై సుఖముకొఱకు, అది లేనిచోట వెదకుచున్నారు; ఫలితము దుఃఖము. ఏమనుజుని ముఖవైఖరి జూచినను, భయాందోళ నములు అశాంతి ముద్రితములై గోచరించును. ఒకవస్తువు లేనిచోట వెదకిన నింకేమగును? సుఖమున్నచోటికిఁ బోవ లెను. దేవునియొద్దఁతప్ప మఱెచటను సుఖము లేదు.

147. దాత యనగా నెవఁడు? ఇచ్చువాఁడని యర్థము ఎందరు దాతలు? ఒక్కడే విశ్వదాత, భగవా నుఁడు. దేవుఁడే మనుజులలోఁ బ్రవేశించి, దాను స్వయ

ముగా నిచ్చుచున్న సంగతి తెలియకుండఁజేసి, మనుజులే యిచ్చుచున్నారని భ్రాంతి కలిగించుచున్నాఁడు. దేవు నాశ్రయించినచో మనుజు లిత్తురు. మనుజుల నాశ్రయించుచో దేవుఁడే యిచ్చువాఁడు గావున నీయవచ్చు, మానవచ్చును.

148. ఏది జరిగిన, నది జరుగవలసినదే; ఈశ్వరాజ్ఞ లేనిదే యేదియు జరుగదు గనుక. అయినచో లోకమునఁ గొన్ని ఘోరములు, పాపకార్యము లేల జరుగుచున్నవి? అవియు నీశ్వరాజ్ఞవలననే జరుగుచున్నవి. అయినచో దేవునికి దోషముండదా? మనదృష్టిలో నవి దోషములు; దేవుని దృష్టిలోఁ గావు. బిడ్డ దృష్టిలో, నాముదము త్రాగించుట శిక్షయే; తల్లి దృష్టిలో నది బిడ్డ క్షేమమే.

149. "ఆత్మన ఆకాశస్సంభూతః, ఆకాశాద్వాయుః" అని తై. ఉపనిషత్తు.అందువలన ఆత్మ అనగా దేవుఁడు, అందుండి జనించిన ఆకసము, వాయువు దేవుఁడే. ఒక్కనిముసము వాయువు లేకున్నను, విజృంభించినను సమస్తము నశించును. సకలజీవులలోని ప్రాణవాయువు వాయువే! వాయువు నుండి అగ్ని, నీరు, భూమి వచ్చెను. అనగా ఆకసమే గాలి, నిప్పు, నీరు, భూమి, సర్వము. ఇందేది చూచినను దేవుని జూచినట్లుగాదా?

150. తుపాను ఆంధ్రకోస్తాను దాకునని వార్త: మావైపుకు రాకుండ దయచూపుమని భగవానుని ప్రార్థించితిని, అటులే జరిగెను; వర్షము సమృద్ధిగా నిమ్మని కోరితిని,

అటులే జరిగెను. చిత్త శుద్ధితో దేవునర్థించిన సత్య మగునా ?

151. వరుసగా నాల్గుదినములు పూర్తిగా ఆకసము మేఘావృతమై, వర్షించి, మఱునటి దినమున మేఘము లదృశ్యమై, సూర్యభగవానుని దివ్యకాంతి ప్రసరింపగా "అమ్మయ్య ! ఎన్నాళ్ళకు సూర్యభగవానుఁడు దర్శనమిచ్చె"నని సర్వప్రాణులు సంతసించెను. అదేరీతిగా అజ్ఞాన మేఘావృతమైన మానసాకాశము, నిర్మలమై జ్ఞానభాస్కర కిరణ కాంతి వ్యాపింపఁగనే, "ఆహా ! ఎన్ని జన్మముల అంధకారము నశించినద'ని సంతసింతుము. ఇదియే "ఆశ్చర్యవత్పశ్యతి కశ్చిదేన–" మ్మని గీతలోఁ జెప్పఁబడెను.

152. ధనమిచ్చువాఁడు ఖర్చుపెట్టించువాఁడు సర్వైశ్వర్యాధిపతియగు భగవానుఁడు కదా! ఆయన ధనమీయని చో వ్యయముండదు. ఇచ్చియు వ్యయము చేయింపకుండును; చేయించును. దీనికేల విచారము? సొమ్ము వచ్చుటయుఁబోవుటయు దేవుని చేతిలోని పనియని యెఱిఁగి నిర్విచారముగా నుండుట నేర్వవలెను.

153. పరమేశ్వరుఁడు సర్వవ్యాపియై లోపల వెలుపల అంతట నున్నాఁడని ప్రతి క్షణము గుర్తించుట మొదటి ఘట్టము, అది సత్యమా కాదా యని అనుభవపూర్వకముగా గాంచుట ముఖ్యము. జీవితములోని కొన్ని సంఘటనలలో నైనను, ప్రహ్లాదుఁడు దేవుని స్తంభములోవలె, దేవునిదర్శించి

అప్పుడు నీ భావము నిజమని నిర్ణయింపవలెను. జపమనగా నిదియే.

154. రోగము రాగమువలన వచ్చును, రాగమనగా కామము. విరాగివై, నిష్కామివైనచో రోగబాధలుండవు. దైవారాధనమే రోగరాగదుఃఖ వినాశకారి, రోగరాగములు దేవుఁడు పెట్టినవే; పెట్టినవానినే తీసివేయుమని వేడ్చుటే యేకైక సాధనము,

155. బ్రతుకుటనగా మృత్యువుతోఁ బోరాటము; రోగములు, బాధలు, దుఃఖములు మన ప్రబల శత్రువులు, యముని పరివారములు. యముఁడు నిత్యము సన్నిహితుఁడే. కాని అంతకంటె సన్నిహితుఁడై త్రిశూలధారియగు శివుఁడున్నాఁడు. శివునారాధించిన యముఁడు పలాయనము చిత్తగించును.

156. జపము నేను చేయుచుండుటే నిజమైనచో లంకణములలో నేల చేయలేదు? అన్నము నేను తినుచుండుట నిజమైనచోఁబది దినముల జ్వరములో నేలతినలేదు. ఏపనియు 'నేను' చేయుటనిజముకాదు. పరమేశ్వరుఁడే చేయుచున్నాఁడు; చేయించుచున్నాఁడు. దేవుని చేతిలో మనము తోలు బొమ్మలము; కేవల ముపకరణములము.

157. ఈ ప్రపంచమును నేను సృజించినది మీ కొరకే. ప్రపంచము లేక ప్రకృతి యను కంబళీ కప్పుకొని నేను కనపడకుండ లోపలనున్నాను. కంబళీ చూచి అది

వట్టి కంబళీ అనుకొనకుఁడు. లోపల హాయిగా నిత్యానంద పరవశుఁడనై, నన్ను గనుగొన్నవారి కానందామృతము పంచి పెట్టుటకు సిద్ధముగానున్నాను. అందుచే సకల వస్తువు లను 'నన్ను' గుర్తించుటకే కల్పించితిని. వస్తువుల ననుభ వింపఁగోరకుఁడు, అవి నిలకడ లేనివగుటచే మిమ్ము మోస గించి దుఃఖమిచ్చును. వస్తువుల మూలములో నన్ను గుర్తిం తురా, అఖండానంద సిద్ధియగును. ఏలన నాకెన్నఁడు నెట్టి మార్పులేని బ్రహ్మానంద స్వరూపుఁడను. అందువలన, మాన వులు బాహ్యదృష్టిని మరలించి, ఆంతర్య దృష్టినలవడఁజేసి కొని నన్నుఁజూడుఁడు.

158. లోకములో నన్నిరంగములలో జరుగుచున్న క్రియాకలాపమంతయు దేవుని 'లీల'. కొందరిని సార్వభౌ ములఁజేయును; కొందరచే సార్వభౌముల కిరీటములను దన్ని వేయును. కొన్ని దేశముల కౌన్నత్యము, కొన్నిటి కధోగతి; కొందరకు సుఖము, కొందరకు దుఃఖము ఇది దేవుని యాట; క్రీడ లేక లీల, ఇది నాటకమని యెరిగినవారికి బాధలేదు

159. జగత్తులోని సకల వస్తువులలో దేవుఁడొక 'తళుకు' పెట్టినాఁడు. ఈ తళుకే మానవ చిత్తముల నాకర్షించి, చలింపఁజేయును. అందు ముఖ్యముగా కామినీ కాంచనము లందలి 'కాంతి' ఎంతటి దృఢ మనస్సునైనను బంధించు బలము గలది. కాని యీ వస్తువులలోని మెఱుపు, తళుకు, కాంతి లేక చైతన్యము వస్తువుల లోపలనున్న దేవునిదే. వస్తు

164. నిజముగా లోకములో నందరును బిచ్చగాండ్రే! దేవుఁడు లోక, మను తనయింట నందరకు బిచ్చమిచ్చుచున్నాఁడు. వీధిలోని బిచ్చగాండ్రకు మనము వేయు బిచ్చము బిచ్చములోని బిచ్చము! దేవుని వలన, చేయిచాపి బిచ్చము పుచ్చుకొని, నేనైశ్వర్య వంతుఁడనని గర్వాహంకారములు ప్రదర్శించుట మౌఢ్య ప్రదర్శనమే!

165. "ఈకార్యభారము నాతలపైనున్నద"ని ప్రజలు చెప్పుకొనుచుందురు. అదినిజముకాదు. ఎవని తలపై నేకార్యమును లేదు, లేని భారమును మోయుటయు నసత్యమే! సర్వకార్య భారములు దేవుని తలపైననే యున్నవి. లేని భారము మన తలపై నున్నదని భ్రాంతికి వశులమై, మోయనిదే మోయుచున్నామని తలచి బాధపడుచుండుటలో వివేకమేమున్నది? భారము లబద్ధమని గుర్తించి సుఖింపుము.

166. దేవుఁడాపద్బాంధవుఁడని చెప్పుటమామూలు. ఇది పూర్ణసత్యముగాదు. దేవుఁడు నిజముగా సర్వకాల బాంధవుఁడు. ఆపత్తులు లేని కాలమున లేకుండఁజేసి సుఖమిచ్చిన దెవరు? ఏ క్షణములో దేవుఁడు రక్షింపకపోయినను ఆ క్షణమే సర్వప్రమాదములకుఁగారణ మగును. అందుచే నాపత్సమయముల లోనే కాక సకల కాలములలో దేవునాశ్రయింపవలెను.

167. మర్మాంగమని స్త్రీ పురుష గుహ్యావయవములకు వాడుదురు. ఇందు రెండర్థములున్నవి. (1) గుప్తముగా

నుంచవలసినవని బాహ్యార్థము (2) దైవలీలా రహస్య మిం దిమిడి యున్నది. స్త్రీ పురుషులను మర్మాంగములతో సృజించి మోహావశులఁజేసి దేవుఁడు తన సృష్టిక్రమమును నిరాఘాటముగా సాగించుచున్నాఁడు. ఈ మర్మాంగ మర్మ మిదియే !

168. నిన్ను నీవు విమర్శించుకొను నభ్యాసము లేనప్పుడే యితరులను విమర్శించుట నీ కలవడును. ఏ దోష ములకై యితరుల విమర్శింపఁగోరుదువో, అవి కాని, మఱొక రకములైన దోషములుగాని నీలోను గలవని తెలిసికొన్న చో నితరులను విమర్శించుటకు నీకుఁగాలముండదు. ఏలన నీదోష ముల నిర్మూలించికొని ఆత్మశుద్ధి చేకూర్చుకొను పనిలో నీ జన్మమే చాలక పోవచ్చును. ఆత్మపరిశోధన మెంత కష్టమో అపుడు నీకు బోధపడును.

169. వివిధ రాజ్యముల కధినేతలను గద్దెకెక్కించి. వారికి ప్రత్యర్థులను సృజించి పోరాటములు పెట్టి, భూభారము తగ్గించు దేవుని లీల విచిత్రమైనది. ఒకప్పుడు ప్రభువులోను, వేరొకసారి ప్రజలలోనుజేరి పరస్పర, ముద్రేక ద్వేషములను రగుల్కొల్పి, ఒకప్పుడు శాంతిని, మఱొకప్పుడు దారుణ రణ రంగమునుగల్పించి భగవానుఁడు తన 'లీల' నడపుచున్నాఁడు.

170. ఎవరి నాశ్రయింపవలెను? ఎవరి నాశ్రయిం చిన, మనలోపములు, దోషములు, దుఃఖములుపోయి, పరి పూర్ణత, ఆనందము, నిత్యశాంతి లభించునో అట్టివారి నాశ్ర

యింపవలెను. మనయేడ్పులు పోవలెనని, యేడ్చువారి నాశ్రయించి యేమిలాభము? దిక్కు లేని వాడింకొక దిక్కు లేనివాని నాశ్రయించినట్లగును. సర్వాపదలు తొలగించి సర్వశుభము లిచ్చువాఁడు సర్వేశ్వరుఁడొక్కఁడే.

171. అనంత ప్రజ్ఞాస్వరూపి యగు పరమాత్మ, మాయా శక్తి చే జగత్తును గల్పించి, అందలి ప్రాణి జాతముల నెల్ల నాడించుచుండగా, ఆమాయా శక్తి నెదిర్చి జయించుట, కెవరికిని సాధ్యపడదు. ఒక్క టేమార్గము పరమాత్మయే గీతలోఁజెప్పెను. "మామేవయే ప్రపద్యంతే, మాయా మేతాంతరంతి తే." మాయాధిపతి నాశ్రయించి మాయను జయింపఁగలము.

172 'సర్వత్ర సమబుద్ధయః" అని జ్ఞానిలక్షణమును గీతలోఁజెప్పినాడు. సర్వజీవుల యెడ సమదృష్టి యేల యుండవలెను? సర్వప్రాణులలో నీశ్వరుఁడు సమానముగా నివసించి యున్నాఁడు. దేవుఁడు నివసించు చోటు ద్వేషస్థానమెట్లగును? ఇంకొక అడుగుముందుకు వేసినచో, పరమాత్మలు రెండుండవు కావున, ఆపరమాత్మయే 'నేను'. నన్ను నేనేల ద్వేషించుకొందును? "నహినస్త్యాత్మనాత్మానమ్".

173. దేవుని జూచు టెట్లు? ఇది అతి సులభ కార్యము, నీ లోపల వెలుపల చరాచరాత్మక ప్రపంచమంతా నిండి యుండిన దేవుని సర్వత్ర చూడవచ్చును. నీవు నీటిని, గాలిని, ఆకసమును నెన్నడైనఁజూచితివా యని ప్రశ్నించు, టవివే

కము; ఆకాశవాయుజలముల జూడని వాడెవ్వడుండును? అటులే సర్వమునిండి, సర్వస్వరూపియైయున్న దేవుని అందరు నిత్యమును జూచుచునే యున్నారు. ఒకటే లోపము కలుగుచున్నది. తాము చూచుచున్నవన్నియు దేవుడే యైనను, దేవుడని యెరుగక, వేరు నామములతో వానిని ఆకసము; గాలి, నీరు, నిప్పు, చెట్టు, చేమయని పలుకుచున్నారు వీరే చూచియు జూడనివారు,

174. అంతయు దెలిసినదివలె నుండి, మఱుక్షణమున నేమియు దెలియని స్థితి సంభవించును. "అజ్ఞానేనావృతం జ్ఞానం తేనముహ్యంతి జంతవః" అని గీత. అజ్ఞానమను తెర ఒకసారి కొంచెము తొలగి, మరల యథాస్థానము నాక్రమించును. సర్వకాల సర్వావస్థలలోను తెరపడకుండ జూచుకొనుటే బ్రహ్మనిష్ఠ, దీక్ష.

175. విచిత్ర విషయమేమనగా ప్రతివ్యక్తియు దాను తెలివి గలవాడనని నమ్మి, తనలో దాను తన తెలివి చూచికొని సంతసించును. అది నిజమైన తెలివికాదు. తెలివి యనగా జ్ఞానము. జ్ఞానమనగా ఆనందమే. నిజమైన జ్ఞానము కాక, లవగింజంత తెలివి తనకున్నదనే సంతసించుచుండగా, పూర్ణజ్ఞానమున్న వానికెంత సంతుష్టి, ఆనందము కలుగునో! అందుకే జ్ఞాని నిత్య సంతోషి – పూర్ణమైన తెలివి నార్జించి నిత్యసంతోషి యగుట తెలివికాదా?

176. ప్రతి దినమునెక్కువ కాలమును దైవస్మరణ ధ్యానాదికము చేయుచు గడపఁగల వ్యక్తి కిదే తుది జన్మ మగునంతటి పుణ్యరాశి వెనుకనుండవలెను. అట్టివానికి దైవ కృప అదివరకే యున్నది, దైవకృపలేనివాఁడు ఈజన్మములో నిరంతర దైవధ్యానదీక్షాపరుఁడు కాఁజాలఁడు.

177. లోక వస్తువులలో ముఖ్యముగా, కామినీకాంచ నాదికములో, లేశమాత్ర సౌఖ్యమునుఞూపి, ప్రక్కనే, అని త్యత్వము; అసంపూర్ణత్వము, ఆమయ దుఃఖాదులఁబెట్టి, తృణతుల్యసుఖముకోసము. బ్రహ్మాండమంత దుఃఖభారమును దలపైఁబెట్టుకొనకుఁడని దేవుఁడు బోధించుచున్నాఁడు. కల్తీ లేని నిత్యసుఖము నావద్దనున్నది. నన్నాశ్రయించి చూడుఁ డని భగవానుఁడు కామినీకాంచనాదిక వస్తురూపములద్వారా ఆహ్వానించుచున్నాఁడు.

178. ప్రకృతియనునది దేవుఁడు రచించిన గ్రంథము, అదియే వేదము. అందు మూఁడు విషయములు గోచరించును. ప్రకృతి చెప్పుచున్నది:—(1) నాకుఁగల సౌందర్యమంతయు నాప్రభువైన పరమేశ్వరునిది. (2) నాలోని రూపములన్నియుఁ బుట్టి పెరిగి గిట్టుచుండును. వీనిని నమ్మిమోసపడకుఁడు. (3) మీకు సుఖము కావలసివచ్చినచో నాదగ్గర లేదు. అది నిర్వి కారియైన నాప్రభువు వద్దనేయున్నది. ఆయన నాశ్రయింపుఁడు. ఇదియే నా సందేశము.

179. ఈ కన్పించునదంతయు నీశ్వరమయమే యని గ్రహించినవానికి బ్రతిచోటు పుణ్యస్థలమే. ప్రతి వస్తువు

దేవతారూపమే. ప్రతి దృశ్యము దేవుని కళయే. విశ్వ మంతయు విశ్వేశ్వరాలయమే, ఆవిశ్వములోని వన్నియు శివ లింగములే! తీర్థయాత్రలకెచటికిఁబోదువు? దేవునిలోనుండి, దేవునిపైఁగూర్చుండి, దేవుని వలనఁబ్రదుకుచు, దేవునిఁ జూచియుఁజూడవేల? ఎంత చిత్రము!

180. మనముచేయు జపము సఫలమైనదని యెప్పు డనుకొనవలెను? మనకుఁబూర్తిగాఁ బాపక్షయమైనప్పుడు పాపములు పూర్తిగా నశించినట్లు సాక్ష్యము? సంపూర్ణ చిత్త శుద్ధి లభించును. అది లభించినట్లు సాక్ష్యము? అపుడు భగ వానుఁడెల్లవేళల మనతో విహరించును? దానికి సాక్ష్యము? భగవంతుని లక్షణములు మనకు సంక్రమించును. దానికి సాక్ష్యము? సర్వదుఃఖ నివారణము; సర్వసుఖప్రాప్తియు.

181. మోక్షము నతి సులభముగా సంపాదింప వచ్చును. నాకు కర్తృత్వము లేదు; దేవుఁడే సర్వకర్త యని త్రికరణశుద్ధిగానమ్మి నిరహంకారియగుచో వెంటనే ముక్తి కలుగును. నేను కర్తనుగానప్పుడు నాకు గర్మలులేవు; కర్మలే లేనపుడు పుణ్యాపాపములు లేవు. అపుడు సంపూర్ణ నిర్మల చిత్తుఁడ వగుదువు. అట్టి నిర్మలచిత్తముతో భక్తివలనఁగాని, జ్ఞానమువలనఁగాని శీఘ్రముక్తి నొందుదువు.

182. నీవు భక్తుఁడవగుచో, నీ కేదేని కోరికగలిగి అది సిద్ధించుట వలన నీకే కష్టనష్టములు కలుగునని తలఁచి భగ వానుఁడు నీవుకోరిన దానిని జరుగకుండఁజేయవచ్చును. ఆశా

భంగము పొందకుము. భగవానునికి నీపై దయగలదని నెమ్మ దిగాఁ దెలియును.

183. సంపూర్ణ జితేంద్రియుఁడు, అచంచల భక్తి యుక్తుఁడునగు వాని కోర్కె లన్నియు సిద్ధించును. అట్టికోర్కెల సిద్ధివలన నెట్టిభ్రమప్రమాదములు నాతనికిఁగలుగవు. కారణమాతఁడు స్వాధీన మనస్కుఁడు. అన్నిటిని దైవ ప్రసాదముగా స్వీకరించును. తప్పు చేయఁడు. చపలునకుఁ గోర్కెలన్నియు, నిచ్చినచో, లోకమునకు ప్రమాదము; చేయరాని పనులన్నియుఁజేయుట కాతఁడు జంకఁడు.

184. సర్వజ్ఞత, సర్వసమర్థతగల దేవునాశ్రయించిన వారదృష్టవంతులు. ఏలన వారిది సాటిలేనిదియు, నమోఘము నైన ఆశ్రయము గావున వారు నిర్విచారముగా హాయిగాఁ గూర్చుండి ఆనందింపవచ్చును. హీనులనాశ్రయించి దుఃస్థితి నందనేల ?

185. ఇది చాల విచిత్రమైన లోకము. ఏ తల్లికడుపు నందో తొమ్మిదినెలలు నరకమనుభవించి భూమిపైఁబడి, ఈ శరీరపోషణమునకు, దాని భోగములకు, తత్సాధన సంపత్తి కొఱకు కొంతకాలము గింజుకొని, కాలమైపోగా, దేహమును, బంధుమిత్ర గృహాదులను విడిచి పోవలెను. ఎచటికో ? ఈ సంగతి నాలోచింపకుండ బ్రతుకువారెంత మందబుద్ధులో!

186. ఇది నాయిల్లనగా దేవుఁడిచ్చిన ప్రసాదము; ఇది నాభార్య వీరు నాబిడ్డలు అనగా దేవుఁడిచ్చిన ప్రసాద

మన్నమాట, నీకుఁగల సర్వమునకి దేయర్థము. ఈలోక యాత్రలో నీకవసరములగు వస్తువులు దేవుఁడిచ్చినవిగాక మరేవియు నీకు దొరకవు. కావున మన మనుభవించు సర్వము దైవప్రసాదమనియెంచి, దైవస్మరణము చేయుచు ననుభవించినచో దైవకృప లభించును.

187. ఒకపైసకూడ మనము సంపాదించుట వ్యయించుటయుఁబరిపూర్ణమైన అసత్యము, మన చేతికి వచ్చిన ప్రతి పైస దేవుఁడిచ్చినదే; మనము వ్యయించు ప్రతి పైసయు నీశ్వరాజ్ఞచే వ్యయింపఁబడునదే. మూఢులమై, మనముసంపాదించి వ్యయించుచున్నామని సుఖదుఃఖ ద్వంద్వమనుపాశములచే బంధింపఁబడి మితిలేని బాధలొందుచున్నాము.

188. మనకునచ్చిన దేహము, మనకునచ్చిన యిల్లు, యిల్లాలు,ధనము,పదవి,బిడ్డలు, బంధుమిత్రులు మనకున్నవా? లేవు మన పుణ్యమునుసరించి యివన్నియు వచ్చినవి. మనము పుణ్యమెంత చేయవలెను. మనకు లభించు సర్వము మంచివే యగు నంతటి పుణ్యము చేయవలెను. అంతయు మంచిదగు స్థితి పేరే మోక్షము. మోక్షము అనగా సర్వ బంధవిముక్తి; దానికొఱకు మనము సంపాదించు దానధర్మాదికము వలని పుణ్యము చాలదు. మనకున్న సర్వమును దైవ సమర్పితమొనర్చి, నిరంతరము దేవునాశ్రయించు పుణ్యము కావలెను.

189. దేవునికి దూరము దగ్గర సమానము, ఏలన నాతఁడంతట నిండియున్నాఁడు. దేవునికి పైస, కోటి పైకము

సమానము; ఏలన, ఆతఁడు లక్ష్మీశ్వపతి; అంతధనమాయనదే. మిక్కిలి చిన్నపనియు మిక్కిలి పెద్దపనియు నాయనకు సమానమే;ఏలన నన్నిపనులాయన సంకల్పమాత్రముననే జరుగును. అట్టి విశ్వలోకైక ప్రభువునాశ్రయించి చిన్న కోరికలు కోరకుము. ఏదైన నీయఁగలవానినిజేరి, గొప్పవానినే యడుగుము.

190, ఒకఅరటిమొక్కను జూచినచో భగవంతుఁడు ప్రత్యక్షముగా గోచరించును. ఒక్కొక్క ఆకు గొట్టమువలెఁ బైకివచ్చి, క్రమముగా విడిపోయి, పెద్దపత్రమై, అటులే అనేక పత్రములు పుట్టును; ఆవెనుక పువ్వు, పువ్వునుండి కాయలు పండ్లు, వంశాభివృద్ధికి దుంపనుండి పిలకలు—ఈ పరిణామము నందు దేవుఁడు కనపడుటలేదా?

ఒక నారింజపండు చూడుఁడు; పైనదట్టమైన తొక్క, తొక్కక్రింద తెల్లటిపొరలు, పొరలుక్రింద చక్కగా సవరించి యిమిడ్చిన తొనలు, తొనలలో వంశాభివృద్ధికి వలయుగింజలు నుండును. ఇటులే సమస్తమును దేవు నసంత ప్రజ్ఞ వ్యక్తమగుటలేదా? జగమును శ్మశానముగామార్చుచున్న ప్రకృతి శాస్త్రవేత్త ఒక్క అరిటాకును, ఒక్క నారింజ గింజను పుట్టింపఁగలఁడా ?

191. అణువులో బ్రహ్మాండమైన శక్తినిగని, అణ్వాయుధములుచేసి, మానవాళికి భయకారణులగు శాస్త్రవేత్తలు అనంత ప్రపంచము ననంతకోటి యణుసముదాయముచే సృజించిన దివ్యశక్తియైన భగవానునారాధించుటకు మొద

లించుట యుక్తముకాదా? ఇట్లుచేయుటవలన నీప్రకృతి శాస్త్ర వేత్తలు రాక్షసులగుటకు బదులు దేవతలగుదురు. ప్రకృతిని పరిశీలించి పకృతికి మూలమైన దేవునిఁజూడవలెను, ప్రకృతి రహస్యము, లేక సృష్టిరహస్యము దేవుఁడే. దీనిని భారతీయ మహర్షులేనాఁడో కనుఁగొనిరి.

192, జ్ఞానివికాఁగోరుదువా! దేహమనోబుద్ధీంద్రి యాదులు నేనుకాదు. వీని వెనుకనుండి వీనికిఁజైతన్యమిచ్చు ఆత్మను నేనని నమ్మి ఆత్మతాదాత్మ్యమును బొందుము. లేదా భక్తుఁడవై తరింపఁగోరుదువా? సర్వసృష్టికి చైతన్య మిచ్చిన దివ్యశక్తి భగవానుఁడే యని గ్రహించి, మనోవా క్కర్మలచే దేవునాశ్రయించి, అఖండ దీక్షతోఁబరమేశ్వర కృప నార్జింపుము. ఈ రెంటిలో నేదియోయొకటి చేయ కున్నచో మూఁడవది దుర్గతి.

193, ఇతరుల వలన, గ్రంథములవలన నీవు పొందిన జ్ఞానము రెండవ తరగతిలోనిదే. అది సత్యమేకావచ్చును. స్వయముగా దానిని నీయనుభవముచేఁదెలిసికొనుట ప్రథమ శ్రేణి జ్ఞానము, అన్నమునుగూర్చి ఎవరెంత చెప్పినను, చదివి నను, నీవు స్వయముగాఁదిని జీర్ణించుకొని; నీకు బలముచేకూరి నపుడన్నము తినుట బలవర్ధకమని నీవునమ్మి యుండఁగలవు.

194. కనులకుఁగనపడునది, చెవికివినపడునది, అటులే మనస్సు తెలియునది; బుద్ధి నిర్ణయించునది; కన్ను, చెవి; మనస్సు బుద్ధి - మున్నగునవన్నియు దేవుని బాహ్యా రూప

ములే; ఇక 'నేను' 'నీవు' అను వస్తువు 'ఆత్మ' లేక భగవానుఁడే. సర్వము భగవానుని బాహ్యాభ్యంతర రూపమే భేదము భ్రాంతి - భ్రాంతి విసర్జించుటే జ్ఞానము.

195. సర్వ సంపూర్ణమైన జ్ఞానము పరమాత్మయే. పరమాత్మ వేరు, జ్ఞానము వేరు కాదు. రెండునొకటే; జ్ఞానమనఁగా అనంత శక్తి; అనంత శాంతి; అనంతానందము. ఏజ్ఞానము సంకల్పమాత్రమున సర్వ ప్రపంచమును సృజించి నిలుపుచున్నదో, అదియే నిజమైన జ్ఞానము. అదియే పరమాత్మ. పరమాత్మ సృజించిన వస్తువులలో మార్పులు కలిగించుటే జ్ఞానమని ప్రకృతిశాస్త్రవేత్తలు పొరపడుచున్నారు. ప్రాచీన భారతీయ మహర్షులట్టి జ్ఞానులు, వారుకోరినదెల్ల వెంటనే జరిగెను.

196. అరణ్యములోఁ ప్రయాణముచేయు వారచట మనుజులను తిను పులులు మున్నగు క్రూరమృగములున్నవని యెరిగి తమకు ప్రమాదములేకుండుటకై, చేతఁదుపాకులు మున్నగు నాయుధములు ధరించి పోదురు. ఇహలోకమను నడవిలో మృత్యుజరా రోగములను క్రూర మృగములు స్వేచ్ఛావిహారము చేయుచున్నవని నిత్యము చూచుచుండియు బ్రహ్మజ్ఞానమను తుపాకి నార్జించి, చేతఁబెట్టుకొనకుండగనే మనము సంచరించుచున్నాము. మనకేమి తెలివియున్నది?

197. మనలో జాజ్జ్వల్యమానమగు పవిత్ర తేజస్సు, మనోనిగ్రహము నున్నచో మన చుట్టునది ప్రసరించి మన

హృదయంలో నివసించువారి అందరను పవిత్రులనొనర్చును. మన మనస్సుపట్ల. అపవిత్రత, అశ్లీలవర్తనము, గోచరించినచో మనలో దోషమున్నదని గుర్తించి, ముందర మనలను మనము శుద్ధిపరచుకొనవలెను. మన హస్తములలో మురికియున్నచో మనము స్పృశించు వస్తువులు మలినములగును.

198. రావణుఁడనగా కామము. రావణుఁడు రామ బాణముచేఁగాని చావఁడు. కామమునంతే. కావున కామమును స్వశక్తిచే జయింపఁజాలవు, శ్రీరామప్రభువు నాశ్రయించి ఆయన కృపచే కామ రాక్షసుని హతమార్చుట యొకటే మార్గము. క్రోధమోహాదులట్టి రాక్షసులే.

199. ‘కామమయం శరీరం! కామము దేహమును ధరించినది, దంపతుల కామమే మనల సృజించెను, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము కామరూపములే. నేను మనస్సహిత దేహమును సంసారమును, కాదు, నేనాత్మ స్వరూపినని మోక్షమును పొందఁగలము,

200. ప్రపంచమనగా నేమి? ఈశ్వర సంకల్పము, ఈశ్వరుఁడు సృష్టి సంకల్పమాత్రముననే చేసెను. అనగా సృష్టి యీశ్వరరూపమే, నీవు నేను, అందరు, అన్నియు సృష్టిలోనివే అనగా మన మీశ్వరస్వరూపమైయుండి కాదని భ్రమించి, దుఃఖించుచున్నాము. ఈశ్వరస్వరూపులమే యని యెఱిఁగి సుఖింపవచ్చును.

201. దైవభక్తివలన దేహారోగ్యము సిద్ధించునా? ఈ ప్రశ్నయే దోషముగలది. దైవభక్తివలన అసాధ్యమగు ముక్తియే లభించుచుండగా దేహారోగ్యము గలుగుటలో నాశ్చర్యమేమున్నది. దీనికి హేతువుకూడ చెప్పవచ్చును. బలము, జ్ఞానము, పుష్టి, నిరామయత్వము, సౌఖ్యము మున్నగు సర్వ శుభలక్షణములు గలవాఁడే దేవుఁడు. మన దృష్టి దేవునిపైఁబెట్టినపుడు, దేవుని దృష్టి మనపైఁబడును. దేవుని చూపు మనపైఁబడినచో సకల దోషములు హరించును

202. ఆకు కదలినను, చీమ ప్రాకినను, పక్షి యెగిరినను, మానవుఁడు కనురెప్ప విప్పినను, మూసినను, ఏపని నేప్రాణి చేసినను, సర్వము పరమేశ్వరాజ్ఞచే నడచునదే. నీవు చేయవలసినది మానవలసినది యేదియు లేదు. నీవుచేసినది దేవుఁడు చేయించినదే; నీవు మానినది దేవుఁడు మానిపించినదే. నీవుచేయుట, మానుట యను భ్రాంతి దేవుఁడు పెట్టినదే, ఆ భ్రాంతి నాతఁడే తీసివేయఁగలఁడు.

203. అమూల్య రత్నఖచిత కిరీటమును ధరింపవచ్చును; అఖండ శౌర్యప్రతాపము లుండవచ్చును. కుబేరుని మించిన సంపద నార్జింపవచ్చును. కాని చిత్తశాంతి దుర్లభమైనది. చిత్తశాంతి గలవానికి సార్వభౌములు పాదాక్రాంతులు కావలసినదే. అనేక జన్మములనుండి పర్వతరాశివలెఁబెరిగి గడ్డకట్టిన పాపము నశించినఁగాని చిత్తశాంతి లభింపదు. సాత్త్వికమైన మీ దైవారాధనము వలన దేవుఁడే దాని ననుగ్రహించుట తప్ప మార్గాంతరము లేదు.

204. ద్వైతేతర విషయములెవ్వియైనను, వానిపైఁబోయిన మనస్సు సహస్రవిధముల చలించి, పోవునటులే, దేవునిపై లగ్నమైన మనస్సు చలింపదు. ద్వైతేతర వస్తువులన్నియు జలనశీలములు. దేవుఁడు నిర్వికారుఁడు.

205. పరమేశ్వరార్పిత మనస్కుఁడైనవానికిఁదప్ప, ఈ జగత్తంతయు దుఃఖమయ జీవితమునే యిచ్చును. అనుక్షణము, ప్రమాదరోగ విషాద వైకల్య దైన్య దుఃఖములు గుమిగూడి పైఁబడి కాట్లకుక్కలవలె కొఱికి వేయును. దైవకృప లేని బ్రతుకుకంటె మరణమే మేలు.

206. ఇంట అద్దెకుండి యిల్లు నాదే యనుకొనువాఁడెంతటి మూర్ఖుఁడో! ఈలోకమను నింటియజమాని యిల్లు కాళీచేయుమని చెప్పగానే వెడలిపోవలెను; అట్టి తాత్కాలిక నివాస వాసినై "ఈ యిల్లునాది, యీ పొలము నాది, ఈ సొమ్ము నాది, ఈ రాజ్యము నాది" మున్నగు ప్రసంగములు చేయుట దోషము కాదా? వ్యావహారికముగా 'నాది' యని చెప్పి, పారమార్థికముగా 'నాదికాద'ని లోనఁజెప్పికొని, మన స్థిరనివాసమైన దేవునిజేర యత్నింపవలెను.

207. కోరికలు పెట్టుకొని దేవుని ప్రార్థింపరాదందురు. నిజమే! కాని యీకోరికలు పెట్టినదెవరు? దేవునికి మన మనస్తత్వములు దెలియవా? మనకెన్ని కోర్కెలున్నను, వానిని దీర్చుమని భగవాను నాశ్రయించుటలోనే విశేషమున్నది. ఎప్పుడాయన నాశ్రయించు బుద్ధిపుట్టునో, అప్పు

డాయన మన బుద్ధులను తీర్చిదిద్ది, రక్షింపఁగలఁడు. నీ హృదయము దేవునికిచ్చి ఆశ్రయించుట ప్రధానము. నీ బుద్ధిని నీవు శుద్ధిచేసికొనుట యెన్నఁడు జరుగనిపని; నిన్ను శుద్ధు నొనర్చు పని భగవానుఁడే స్వీకరించును. ఆయన నాశ్రయించు పని నీది. తక్కినదంతయు దేవుఁడే చేయును.

208. దేహమున కనారోగ్యము వచ్చినదనగా, దేహములోఁగొంత కుళ్లున్నదన్న మాట; మనస్సులో కుళ్లు లేనిదే దేహము లోనికి రాదు. మనస్సులో కుళ్లనగా పాపము. దానికి మందీశ్వరారాధనమే. మనము మ్రింగు మందులు నిమిత్తమాత్రములు - అసలు మందు దైవస్మరణము. అది నాలుకపైనుండగా నేరోగమును రాదు. ఏలన నపుడు పాపముండదు.

209. సంసారము సుఖముగా నడచుచున్నదా యను మాటయే తప్పు. సంసారమనగా దుఃఖసాగరమే. దుఃఖములో సుఖమెట్లుండును? కాని, దుఃఖములు రెండు రకములు - వచ్చినవి, రానున్నవి. పరమేశ్వరధ్యాన పూజాదికము వలన వచ్చినవి తొలఁగిపోవుట; రానున్నవి రాకుండుటయు జరుగునని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును.

210. శరీరమును శ్మశానమునకిచ్చి వేయుట తప్పదు. శరీరమును సద్వినియోగము చేయుటకు మార్గములు రెండున్నవి. పరోపకారము చేఁ జిత్తశుద్ధియుఁ బరమేశ్వరారాధనముచే ముక్తియు సంపాదింపవచ్చును.

211. స్త్రీపురుష రూపకల్పనచేసి, పరస్పరాకర్ష ణము, మోహము జనింపఁజేసి, దేవుఁడు జగన్నాటక మాడు చున్నాఁడు. ఈ స్త్రీపురుష సంయోగములో సుఖము లేశ మాత్రము; దుఃఖమనంతము. ఈ నాటకములోఁ బాల్గొను పాత్రధారులిది దెలిసికొనుట మంచిది.

212. ఏ యనిష్టము సంభవించి ఖేదమును కలుగఁ జేయునో, అది మనకు దైవకృప లోపించినందున జరిగెనని తెలిసికొనవలెను. దైవకృపనార్జించిన వారి కనిష్ట ఖేదములు తటస్థింపవు. అందుచే నార్జింపవలసినదేదియో తెలిసికొని దానినే త్వరగా సంపాదింపవలెను.

213. "లోకమ్ శోకహత" మ్మని శ్రీ శంకరా చార్యులు చెప్పిరి. నిజమే? దేవుని మఱచినవారికిది 'శోకము'. దేవునినమ్మి చరించు వారికిదియే 'నాకము'

214. దైవభక్తి లేక బ్రహ్మజ్ఞానము వజ్రకవచము; ఈలోక దుఃఖము లను బాణములు మనకు గ్రుచ్చుకొనకుండ నా కవచము రక్షింపఁగలదు.

215. పురుష ప్రయత్నమున్నదనుకొనినను, లేదను కొనినను ఒకటే. సర్వమీశ్వరాజ్ఞచే నడచుచుండగా మన మనుకొను దానివలన నీశ్వరాజ్ఞ మారదు. అజ్ఞాని 'నేను' చేయుచున్నానని కర్తృత్వము తనపైనిడికొని, కర్మల ఫలిత మనుభవించును. జ్ఞాని నిజమెరిగి సుఖించును.

216. మనము పసిపిల్లల వలె ననాలోచితముగా నెన్నియో కావలెనని యడుగుదుము; మనల నెత్తుకొని

యాడించు మన కన్నతల్లి మన కన్నియునిచ్చునా? మనకేది మంచిదో అదియెంచియిచ్చి తక్కిన వానిని తిరస్కరించును. అనంత ప్రజ్ఞానిధి; అఖండ దయామృతమూర్తియగు జగజ్జనని మనలనందర నెత్తికొని యాడించుచున్నది. ఈ లోకములో మనకెన్నో, ధనకాంతా పదవీ సౌఖ్యములు కావలెనని వేడుచున్నాము. మనకు జబ్బును, నష్టమును కలుగఁ జేయునవేవో మనకుఁదెలియదు. అమ్మకు బాగుగాఁదెలి యును. ఆమె మనకిచ్చినవి మన క్షేమము కొఱకే; మన కీయనివి మనము కోరరాదన్న మాట. ఇచ్చినవానిని స్వీక రించి, సంతసించి, తల్లికి కృతజ్ఞులమై యుండుట నేర్చికొనవలెను.

217. చిత్తము చలించు స్వభావముగలది. దానిని స్వస్థ పరచుటనగా చిత్తమును చలింపకుండఁ జూడవలెను. అనగా చిత్తము స్వభావ విరుద్ధమైన పని చేయవలెను. చలిం పని ఆత్మకు జిత్తమును దగిలించినచో నప్పుడు స్వస్థత నందును. ఆత్మజ్ఞానము వలన నది లభించును. అదియెట్లు వచ్చును? గురు కృపవలన. అదియెట్లు సాధ్యపడును. పర మేశ్వరానుగ్రహమువలన; పరమేశ్వరారాధనమే దానికి మార్గమని స్పష్టము.

218. సగుణారాధనము, నిర్గుణారాధనమునని రెండు పద్ధతులు చెప్పుచుందురు. సగుణ నిర్గుణములు పరమాత్మ బాహ్యాభ్యంతర రూపములు. అవి విడిగాలేవు. సృష్టియు, సృష్టి కర్తయుఁగలిసియే యున్నవి. సగుణము నారాధించుట

సులభము; అందు సఫలుఁడైన వానికి రెండవది వెంటనే లభించును. భక్తి మొదట, తరువాత జ్ఞానము.

219. ఈ లోకములోని జీవులకు, పరమేశ్వర కృప నార్జించుటో, పరమపదించుటో తప్ప మూడవ గతిలేదు.

220. జ్ఞానముతో సమానమగు వస్తువింకొకటిలేదు. "నహి జ్ఞానేన సదృశమ్ పవిత్రమిహ విద్యతే" గీత. చిత్త సమత్వమును నిలిపి రక్షించునదే జ్ఞానము. తక్కిన జ్ఞానములన్నియు నల్పములే. జ్ఞానమనగా నీశ్వర హృదయమును దెలియఁజేయునది; జగద్రహస్యము దానితోడనే తెలియును. అది దేవునికిఁ దెలియును. దైవకృపగల జ్ఞానులకు భక్తులకుఁ దెలియును–దేవునికి మనశ్శాంతి యెన్నఁడు చెడదు. అటులే భక్తులకు జ్ఞానులకు నెన్నఁడు చిత్తసమత్వము చెడదు.

221. చక్రవర్తి నాశ్రయించినవారికి రాజభటభీతి కవసరములేదు; సర్వలోకైక చక్రవర్తి యగు భగవాను నాశ్రయించినవారికి యమభట భీతియు నుండదు.

222. మన జీవితకాలమును ప్రాణసమముగా వాడు కొనవలెను. అందుకే యేపనిచేయుచున్నను నది కేవ లైహిక తాత్కాలిక ఫలితములనిచ్చునదే కాకుండఁ బరమార్థము నిచ్చునదికూడనై యుండవలెను, బాహ్యములైన స్నాన భోజనాదికములనన్నిటిని, తుదకు కాంతా సంయోగమును గూడఁబరమార్థ దృష్టితోఁజేయు విధానములు వేదములు ప్రతిపాదించి యిచ్చినవి ఒక్క ముహూర్తమైనను పరమార్థ

రహిత క్రియాకలాపముండరాదను దీక్ష మనలను ధన్యుల నొనర్పఁగలదు.

223. ఇహలోక జీవితమొక ఆత్మోద్ధరణావకాశము. అందుకే భగవానుఁడిచట మనల సృజించెను. అటుగాక, యెవఁడు భోగపరాయణుఁడై, అసలు విషయమును మఱచునో, యీతఁడు తనకుఁగల దివ్యావకాశమును వ్యర్థమొనర్చి ఆత్మ హత్యాదోషమునకుఁ బాల్పడుచున్నాఁడు. అందుకే ఉపనిషత్తువారిని "ఆత్మహనోజనా" యని పలికినది.

224. శరీరము ధర్మసాధనము. అందుచే దానిని నేర్పుతో రక్షించుకొనుట మంచిదే. కాని జరామృతులు రాకుండ నెవ్వఁడును చేయలేఁడు. కావున దాని నీశ్వరున కర్పించి, రోగ జరామృత్యువులఁదరిమి వేయవచ్చును. మన దేహము దేవునికిచ్చినపుడు, దేవుని సొత్తగును. అప్పుడే యముఁడు దానిని సమీపింపలేఁడు.

225. మన శరీరమునకెట్టి జబ్బు వచ్చినను, ముఖ్య కారణము కడుపులో వాతమే. మనోవ్యాధికి వాతమునకు బదులు పాతకము కారణము, దేహవాతము పోవుటకు వేడి చేయుమందు మ్రింగవలెను. మనోరోగమునకు వేడిచేయు మందే కావలెను. అదియే తపించుట లేక తపస్సు. తపస్సు చేయు మనస్సు నిష్పాతకమై నిర్మలమై, దైవానుగ్రహమును బొందును,

226. "అనిత్యమసుఖమ్ లోకమిమమ్ ప్రాప్య భజస్వ మామ్". గీత. ఈ లోకమును, మనలను సృజించిన శ్రీకృష్ణ

భగవానుఁడే, ఈ లోకమెట్టిదో చెప్పినాఁడు. వస్తువునుచేసిన వానికంటె దాని విలువ మఱెవ్వరికిఁదెలియును? (1) అనిత్యము (2) అసుఖము, త్వరితముగానో, కొంచెమాలస్యముగానో మనము లోకమును విడిచిపోవలెను. ఉన్నకొలఁది కాలము సుఖింపరాదా? అసుఖము అని లోకము మీఁద శ్రీ కృష్ణుఁడు ముద్రవేసినాఁడు. అయితే, యేమి చేయుట? శ్రీ కృష్ణుఁడే చెప్పెను: "భజస్వమామ్" పరమాత్మనైన నన్నారాధించుమని, ఇంతకంటె వేదాంత మేమున్నది?

227. ప్రకృతిలో నేయొక్క రహస్యమైనను గని పెట్టిన వానికి సన్మానము చేయుదురు. దేవుని కనిపెట్టిన వానికేమి సన్మానము చేయవచ్చును? అటులే రోగనివారణ మొనర్చిన వైద్యునికి ధనమిత్తుము. అజ్ఞానజాడ్యమును బోగొట్టిన బ్రహ్మవిదునకేమి సత్కారము చేయవచ్చును? బ్రహ్మవిదునిగాంచి దేవుని దర్శించువాని ఋణము లోకమేమియు దీర్పఁజాలదు. అట్టి పుణ్యపురుషుని ఉనికి వలననే భూమండలమంతయుఁబవిత్రమగును.

228. సుఖము కడుపులో దుఃఖము, శాంతి గర్భమం దశాంతి, సంతోష కుక్షిలో ఖేదమునుండి తలయెత్తి చూచుచుండును. నేఁడు సుఖముగాఁగాలము గడపితిమను కొనుచుండగా శ్రమ, దుఃఖము కలిగించునదేదియో వచ్చి మీఁదపడును. ఇదియే మానవ జీవితము. ఎప్పటికప్పుడు సర్దుకొని, మంచి దినములు వచ్చునని బ్రదుకు చుండుట

అతుకుల బొంతపని, దుఃఖములేని సుఖము, అశాంతిలేని శాంతి, విచారములేని సంతోషము - దేహములోఁగాని యింద్రియములలోఁగాని, వస్తువులలోఁగాని లేవు. అవి యెన్నడు చెడని జ్ఞానములో నున్నవి.

229. అన్నిటిలో భగవంతుని రూపము చూడవలెను. ఏ వస్తువెచట నేరూపములో నున్నను, ఈశ్వర శాసనముచే నట్లున్నది, అందీశ్వరుఁడున్నాఁడు. లేకున్న దేనికిని "ఉనికి" కల్పించుటకెవ్వనికిని సాధ్యము కాదు. బాహ్య రూపములలోనున్న పరమాత్మను గుర్తించి, చూచుట కభ్యసించినచో జగ మానంద మయమై గోచరించును.

230. ఓయి వెఱ్ఱిమానవుఁడా! భగవంతుఁడనగా సర్వ సమర్థుఁడని తెలిసికో! ఆతఁడు పోఁగొట్టలేని దుఃఖము, ప్రసాదింపఁజాలని సుఖములేదు. ఉన్నచో భగవానుని శక్తికిఁ బరిమితత్వదోషము పట్టును. సర్వారిష్టములఁద్రుంచి, సర్వశుభముల నీయఁగలవాఁడు పరమేశ్వరుఁడొక్కఁడే. సంశయములన్నిటిని నశింపఁజేసికొని, కృతార్థుఁడవు కమ్ము.

231. జగత్తు భగవానుని సొత్తు అందులోని ప్రతి నలుసు ఆయనదే. 'నాది' యనుటకేమియు లేదు; పైగా, 'నేను' అను పదార్థమాయన సొత్తులోనిదే. 'నాది' 'నీది' యను గింజులాటలు నిజమెరుగని అజ్ఞానుల ప్రసంగములే. తెలిసినవాఁడు 'వాసుదేవస్సర్వమితి' యను గీతా వాక్యము ననుసరించి జీవించును. ఈ లోకమును లోకములోని సర్వము

నాతని విలాసము కొఱకే భగవానుఁడు సృజించెను. "అది బాగున్నది; యిది బాగులేదు" అని తీర్పు చెప్పుటకు నీ వెవఁడవు?

232. గర్వ మేదైనను దోషమే. అందులో నేను భక్తుడను, నేను జ్ఞానినను గర్వము నికృష్టమైనది. నా భక్తి యెంత? నా జ్ఞానమెంత, నా జపమెంత? యని ప్రశ్నించు కొన్నచో మన జ్ఞాన భక్తి జపాదికము తృణప్రాయమైనవని తెలియును. అనగా మనము భక్తికలిగి, జ్ఞానమును పెంపు చేసికొనుచు, జపము నెల్లప్పుడు నిరహంకారులమై చేయు చుండవలెననియు మానవలసిన కాలమెన్నఁడునుండదనియు బోధపడును.

233. ఏ పని జరుగుటకైనను భగవానుఁడు నిర్ణ యించిన కాలము రావలెను. అది వచ్చువరకు ఓర్పుతో వేచి యుండుట నేర్చుకోవలెను. ఊరక వేచియుండుటకాక, భగ వానునారాధించుచుండుట కర్తవ్యము. నీయారాధన మఁగ్రత నొందినచో దేవుని గడియారము చురుకుగాఁదిరుగ గలదు.

234. సూర్యభగవానునిఁజూచి యేమినేర్చికొంటివి? ఆతఁడుదయించి మనలను మేల్కొల్పి చైతన్యమిచ్చి, అస్త మించి నిద్రింపఁజేయుచున్నాఁడు. సూర్యభగవానుని సందేశ మిట్లుండును; "నా ఉదయాస్తమయములతో మీ ఆయువు తరిగి పోవుచున్నది. నన్ను భగవానుఁడని గుర్తించి పూజిం తురా? మీ ఆయువు పెరుగును; అంతే కాదు; "అసా

వాదితో్య బ్రహ్మేతి; బ్రహ్మైవసన్, బ్రహ్మాప్యేతి; యఏవం వేద" అని చెప్పిన రీతిగా బ్రహ్మత్వసిద్ధియు లభించును.

235. మనము దినదినము దేవునికై యెంతకాలము వినియోగించుచున్నాము, మన సాంసారిక వ్యాపారములకెంత కాల మిచ్చుచున్నామని పరిశీలన చేయగా, మనము నిత్యము దైవాపరాధము చేయుచుంటిమని తెలియఁగలదు. మనలను ముంచివేయు సంసారమునకెక్కువ కాలము, రక్షించు భగవంతునికిఁదక్కువకాలము వ్యయించి, మనము భక్తులమను కొనుట దైవద్రోహముకాదా?

236. దేవునిగూర్చి జపము చేయుచుఁగూర్చుండిన చో పనులగునా? మనకృషి అక్కరలేదా? యని బోధించు వారిసంఖ్య అమితముగా నున్నది. ఎవరెట్టి కృషిచేయవలెనో, మానవలెనో, నిర్ణయించినదెవ్వాఁడు భగవానుఁడుకాఁడా? కృషివలదని యెవరును చెప్పనక్కరలేదు. కృషిచేసి, దేవుఁడు చేయించి నాఁడనియు మాని, దేవుఁడు మానిపించినాఁడనియుఁ తెలిసికొని సంచరించుట ముఖ్యము.

237. త్రికరణ శుద్ధితో శ్రీరామ స్మరణముచేయు చున్నవారి సమీపమున ధనుర్బాణములు ధరించి, సీతా లక్ష్మణ సమేతుఁడై శ్రీరామ ప్రభువు, సర్వావస్థలలో సంపూర్ణ సంరక్షకుఁడై, కృపచూపుచుండును. పరీక్షచేసి చూచికొనుము.

238. ఇది నాయిల్లనగా నేనిల్లు కాననునటులే, యిది నా దేహ మనగా నేను దేహముకాదని సులభముగా నెరుగ

వచ్చును. దేహమునుండి వేరైన శక్తి రూపమేనీవు. దానికే 'ఆత్మ' యని పేరు పెట్టిరి. అన్ని దేహములలోని ఆత్మయు నొక్కటే యనియు నది నీవేయనియు, వేదాంతము చెప్పు చున్నది. ఆత్మకుఁ దేజస్సు, బలము, శాంతి, సౌఖ్యము, అనంతముగానున్నవి. సర్వ దివ్యగుణ సంపన్నమైన ఆత్మవు నీవై యుండ, నశించు దేహము నేనని భ్రాంతిచెంది, దుఃఖింపనేల ?

239. నా జీవితమెట్లు నడచునని బెంగపెట్టుకొనుట, దేవునిపై నమ్మకము లేదని చాటించుటే. నమ్మి సుఖించు; నమ్మవా, దుఃఖించు. నమ్మి దుఃఖించుట, నమ్మక సుఖించుట పరస్పర విరుద్ధములు.

240. ఈ లోకములో మనమెరిగిన మనుజులొక్క రొకరే గతించుచున్నారు. మన వంతును వచ్చునా యని వచ్చి పైఁబడినపుడు కంగారుపడి లాభమేమి? రక్షణోపాయ మును త్వరితముగాఁజూచుకొనుట మంచిదికాదా? దేవు నారాధించు పనిలో విసువులేని నిమగ్నతకంటె రక్షణోపాయ మేమున్నది ?

241. మానవులందరకు సమాన లక్షణములుగొన్ని యిచ్చియున్నాఁడు. అవి చాల గలవు. కాని అందులో ముఖ్యమైనదొకటి గలదు. ఎన్నియున్నను నేదోయొక లోపముపెట్టి యేడ్పించి, తన్ను నమ్మి భజించి తీరవలసిన స్థితి అందరకు దేవుఁడు సమానముగాఁబెట్టినాఁడు. ఏదో లోపము గలిగెనని యేడువనివాఁడీ లోకమున నెవఁడున్నాఁడు?

242. పరమేశ్వర కటాక్షముతప్ప, తక్కినదంతయు జెత్త; అనవరత దైవారాధనము తప్ప తక్కిన పనులన్నియు జెత్త; చెత్తకుఁజిత్త మిచ్చెదవా? ఉత్తమోత్తముఁడగు దేవుని కిచ్చెదవా ?

243. దేహము మోసగించుటలో అత్యంత ప్రావీణ్యము కలది. అన్ని అవయములు సరిగాఁబనిచేయుచున్నచో భోగములపై కీడ్చి నిర్వీర్యులఁజేసి బాధించును; ఏ యల్పావయమైనను క్రమము తప్పినచో – అనగా ఒక పంటిపోటో, తల నొప్పో, చర్మము దురదయో, ఆసన జాడ్యమో యేదైనను మతి చెడగొట్టును. ఆరోగ్యము మోసమే, అనారోగ్యమును మోసమే. ఇట్టి దేహమును నమ్మి, మమకారముపెట్టుకొనుటయు మోసమే.

244. భక్తునియెడ దేవుఁడు చూపు కృపనెవరును వర్ణింపఁజాలరు. భక్తుని రక్షించు నిమిత్త మాతఁడు సృష్టి నంతను తారుమారుచేయుటకు సంశయింపఁడు. అదివరకున్న సకల ధర్మ సూత్రములను త్రోసిపుచ్చి, నూతన సూత్రములఁగల్పించును. భక్తుని కొఱకై 'తనెన్నన' నిమ్మనని పోతనగారు వ్రాసినది నిజమే. పురాణములు తిరుగవేయుఁడు. వందలకొలది ఉదాహరణములు గోచరించును.

245. జీవితమొక సమస్యలపుట్ట. ఒక సమస్య పరిష్కారమగుచుండగనే పదిసమస్యలుత్పన్నములై మామాట నేమి చేయుదువని ప్రశ్నించును. అన్ని సమస్యలను భగ

వానుని కొప్పఁజెప్పి హాయిగాఁగూర్చుండుటే ఉత్తమ పరి ష్కార మార్గము. అప్పుడునీ కేసమస్యలును లేనటులే తెక్క. భగవానుఁడన్నిటిని తృణప్రాయముగాఁ బరిష్కరించును.

246. "నేనున్నాను కాదురా! ఉద్యోగము ననుస రించి కొడుకు దూరస్థలమున కేగెనని విచారమేల? అక్కడ నుండి నీ పుత్రుని, యిచటనుండి నిన్ను నేను రక్షించుచుండ లేనా?" అను దేవుని మాట వినఁబడెను.

247. ఎవరెట్లు మాటాడినను, ఏ పనులు చేసినను, మంచి చెడ్డ రెండును, పరమేశ్వర కల్పితములే. అందుచే రాగద్వేషములకుఁదావులేదు. కాని వ్యవహార రంగములో రాగ ద్వేషములున్నట్లు నటింపవచ్చును; నిజముగా నుండ రాదు. కర్తయగు భగవానునిపై రాగద్వేషములేమిటి!

248. ఏమి, యెంత, యెప్పుడు, ఎక్కడ మనము తినవలెనో, త్రాగవలెనో, అనుభవింపవలెనో, అవి మన చేతి లోని విషయములు కావు. ఏదో వచింప శక్యముకాని ఒక అమోఘమైన యీశ్వర సంకల్పమువానిని నిర్ణయించును. మనకు గర్తృత్వమున్నట్లు స్పష్టముగాఁగనపడి, నిజముగా లేకుండుటే పరమ సత్యము.

249. నేను వ్యర్థముగాఁగూర్చుంటినని కాని, తీరిక లేనంతపని చేయుచుంటినని కాని భావించుట సత్యముకాదు. "యథానియుక్తోస్మి తథాకరోమి" భగవానుఁడు కూర్చుండఁ బెట్టినప్పుడు కూర్చుండి, పని చేయించినప్పుడు చేసి, పర్వదా

యీశ్వరాజ్ఞాచోదితుఁడనై ప్రవర్తించుచున్నానని గ్రహించుటే పరమ సత్యము. ఇదిగ్రహించితివా? చిత్తశాంతి సిద్ధే!

250. దేహమునుజూచి యేమి చెప్పవలెను? దేహికి పేరేమున్నది. గుర్తించుటెట్లు? దేహియనగా 'ఆత్మశక్తి'. అది అన్ని దేహములలో నొకటే; "శునిచైవశ్వపాకేచ పండితాస్సమ దర్శినః" అని గీత. ఇక మనకుఁగర్తవ్యమేమున్నది?

251. జరిగినది; జరుగుచున్నది అంతయు నీశ్వరాజ్ఞయే. పురుషులనగా నీశ్వరుని చేతిలోని యంత్రములు, కీలుబొమ్మలు. ఈశ్వరుఁడు వానినెటు త్రిప్పిననటు తిరుగును. కీలు బొమ్మలుగాఁ దిరుగుటే పురుష ప్రయత్నము.

252. భూమి యనగా దేవుఁడు. దేవుని ప్రార్థించినచో భూకంప మాగిపోవును. 'గామావిశ్యచ భూతానిధారయామ్యహ మోజసా" యని గీత; అనగా భూమి నావహించి, ప్రాణులను మోయుచున్నాను".

253. అర్జునుఁడంతటి మహావీరుని 'నీవు నిమిత్తమాత్రుఁడవని శ్రీ కృష్ణ భగవానుఁడు పలుకుచుండగా, మనము స్వతంత్రులమని విర్రవీగుటెంత మూర్ఖత!

254. ఇతరుల మీఁదఁగాని. యితర వస్తువులపైఁగాని మన సుఖమాధారపడుచో నది దుఃఖమేయగును. ఏలన నితర వ్యక్తులు వస్తువులు మనస్వాధీనములో నుండవు; పైగా నస్థిరములు. ఆత్మతంత్రమే సుఖము; పరతంత్రత దుఃఖము.

255. అహంకారము పాపమువలన వచ్చును; దురహంకారము మహాపాపము వలన వచ్చును. ఇవియెట్లు

నశించును? నిరంతర పరమేశ్వరారాధనము వలన! అదియెట్లు లభించును. భగవత్కృపవలన. అదియెట్లు? అది తర్కించు విషయముగాదు; నమ్మి చూడవలసిన విషయము.

256. ఈ లోకములోని సకల వ్యక్తులు, సర్వ వస్తువులు అసంపూర్ణములు. సంపూర్ణ సంతుష్టి నీయలేవు. పరిపూర్ణుఁడు భగవానుఁడు. వాని నాశ్రయించి సంపూర్ణ సంతుష్టి నొందవచ్చును.

257. నేనుద్యోగ విరమణ చేయలేదు. దైవకృపా సంపాదనమను మహోద్యోగము చేయుచున్నాను. విశ్వ యజమానియగు పరమాత్మను శ్రద్ధతో సేవించి మోక్షమను సాటిలేని యుద్యోగమును పొందఁగోరుచున్నాను. అందరు చేయవలయునుద్యోగమిదియే.

258 దైవావేశితమగు మనస్సునకు లేక దేవుని యందు సంపూర్ణముగా నిమగ్నమైన మనస్సునకుఁ గలిగిన భావములు దేవుని భావములు. దేవుని భావములే యగుటచేఁ దప్పక జరిగితీరును, అట్టి పుణ్యపురుషుని సంకల్పములు పూర్తిగా దైవ సంకల్పము లగుటచే సద్యస్సిద్ధి నందును.

259. మన కిష్టానిష్టములేమి జరిగినను, సమచిత్తముతో నుండుట నేర్చుకొనవలెను. మనమనుకొనిన పని జరుగకున్నచో నపుడు మనము ఖిన్నులమగుట కాని, దేవుని సంశయించుట కాని, నిందించుటకాని చేయరాదు; తిరిగి తిరిగి, మరలమరల దేవుని ప్రార్థించుచుండుటే కర్తవ్యము.

260. భగవంతు నాశ్రయించినవానికి లోటు వచ్చినచో నది భగవంతునికే లోటగును. భగవంతునికి లోటు కలుగుననుట మూర్ఖప్రలాపము. కాబట్టి భగవంతుని నిశ్చల బుద్ధితో నాశ్రయించి, సకల సంపత్సమృద్ధితో హాయిగా బ్రతుకుటయే నిజమైన నేర్పు.

261. ఎన్నిలక్షలతరములవారిదేహములు భూమిలో మట్టియైనవో! అనగా దేహమనఁగా మట్టియే! మట్టి నెవరైన ప్రేమింతురా? మట్టికి వేషములా? భోగములా?

262. దేవుఁడే సర్వమును జేయుచు, మీరే చేయుచున్నారనగా గంగిరెద్దులవలె మనము తలలూపుచున్నాము! ఈ తలలూపు భ్రాంతి నాయనయే పెట్టినాఁడు! ఎంత చిత్రము!

263. నీకు సర్వదుఃఖములు పోవలెనా? అంతకంటెఁ గోరవలసిన దేమున్నది? ఇదియే ముఖ్యమైన జీవితకార్యక్రమముగాఁ బెట్టుకొని, సర్వదుఃఖాపహరుఁడగు భగవాను నాశ్రయించి కృతార్థుఁడవుకమ్ము; మార్గాంతరము లేదు.

264. ఏమి విచిత్రమైన జగము? ఏ ప్రాణికిని తీరిక, స్థిమితమును లేదు. ఎవరినోట మాటాడినను, "ఇదిగో! కొంచెము తొందరపనిమీఁద బోవుచున్నాను. మరలఁ గలిసికొందును." అని పలుకును. ఎవరిని "ఏమి మీరట్లుండిరి?" అని ప్రశ్నించుచో "ఏవో కొన్ని సంసారపుచిక్కులు బాధించుచున్నవ'ని బదులు చెప్పుదురు. "ఏమండీ! కుశలమా"యని

అడుగగా, "అయ్యా! చెప్పుటకుఁ జాలబాధలు కలవు. ఏమి చెప్పుదును" అని సమాధానము. అనగా లోకులందరు అశాంతియను పెనుభూతము కోరలలోఁ జిక్కుకొనియున్నారు. అందరకన్నియుఁగలవు; అశాంతియుఁగలదు. అందుకే, ఉపనిషత్తులన్నియు నారంభావసానములలో "ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః" అని శాంతిపాఠమును పలికినవి. బ్రహ్మజ్ఞానము లేక భగవానుఁడు శాంతిదాత. వాని నాశ్రయించి శాంతి పొందవలెను.

265. దేవునిపై మనకుండవలసిన భక్తి సర్వకాల సర్వావస్థలలోను సమానముగా నుండవలెను. దేవుఁడు మనకేమిచ్చినాఁడు; ఈయలేదు అను విషయములతో నిమిత్తము లేని నిష్కారణ స్వచ్ఛభక్తి కావలెను. మనము నిజముగా నమ్మినచో, నెప్పుడైన దేవుఁడు మన కపకారము చేయునని తలచుట దేవుని అనంతమహిమ, అమితౌదార్యములనెఱుగవి మూర్ఖప్రలాపమే యగును. మనకేదైన నిచ్చుటయు నీయకుండుటయు మనక్షేమార్థమే, మనవాంఛిత మేదేనీయలేదని దేవుని శంకించు భక్తి అతి దుర్బలమైనది.

266. సర్వప్రాణులకు ప్రవృత్తిచోదకమగు భావములో నెట్టిభేదమును లేదు. ఆభావమానందానుభవకాంక్షయే. నడువ యత్నించి, తప్పటడుగులు వేసి, పడియేడ్చుచుండు చంటిబిడ్డలవలెఁ బ్రాణులన్నియు నానందమునకు సూటిమార్గ మెరుగక. తప్పుత్రోవలుపట్టి, ప్రమాదముయు

కంటకమార్గములలోఁ దగుల్కొని, యేడ్చుచుందురు. కవులు ప్రబంధనాయకుల యేడ్పులలో నానందమున్నట్లు వర్ణించిరి. అదినిజమే. ఆ యేడ్పులన్నియు నానందము లభింపఁజేదపియే. సుస్థిరానందమునకై యేడ్చువాఁడు యోగి.

267. సవ్యముగాఁ బరిస్థితులు నడచుచున్నప్పుడు మనము దేవునియెడ భక్తికలిగియుందుమన్నమాట నిజమే; కాని క్లిష్టపరిస్థితులు సంభవించినపుడు, "దేవుడు కాపాడునా? తప్పక రక్షించిన బాగుండును, ఏమో యేమిచేయునో" మున్నగు సంశయాత్మకవాక్యములు వెలువడును. అందుకే "సంశయాత్మా వినశ్యతి" యని గీత. తప్పక రక్షించునను నిశ్చయజ్ఞాన ముండవలెను. నన్నాశ్రయించినవారిని రక్షించెదనని మాటయిచ్చిన దేవుఁడు మాటతప్పునా?"

268. "మీకేమండీ! అదృష్టవంతులు. అన్నీ బాగుగ నున్నవి. గృహము, పుత్రులు, సంపద; మీకేమిలోటు?" అని పలుకుచుందురు. మానవులకందరకు ముఖ్యమైన 'లోటు' నెరుగవలెను. జన్మమృత్యుజరాదికము మనమందరము ననుభవింపవలసియుండుట, వానిని తప్పించుకొను యత్నము చేయకుండుటయుఁ బెద్దలోటుకాదా?

269. మహోపన్యాసములు చేయుట మతమగునా? నీవు పండితుఁడవే; చతురవచోనిధివే; మహావక్తవే; కాని "నాయమాత్మాప్రవచనేన లభ్యః నమేధయా, నబహునాశ్రుతేన' యని ఉపనిషత్తు పలుకుచున్నది. మాటలుకావు: చేతలు

కావలెను. ఉపన్యాసముకాదు; వ్యర్థవాంఛాసన్యాసము కావలెను; వేదపఠనముకాదు: వేదసారానుభూతి కావలెను.

270. మనకు నిజమగుబంధువు లెవరు? ఆపత్కాలమందు తోడ్పడువారు. ఆపదలు రాకుండఁజేయు బంధువు లెవరున్నారు. వారికి నాపదలు వచ్చుచునే యుండును. ఎట్టి యాపదలు లేనివాఁడు, ఆశ్రయించినవారి కెట్టియాపదలు రాకుండఁ జూడఁగలవాఁడు, ఆపదలు రాకుండఁ జేయువాఁడే గాక, సర్వశుభముల ననంతముగా నీయగలవాఁడు, నిజమైన బంధువు. అట్టిబంధు వొకఁడేగలఁడు. ఆతఁడే సర్వజగద్బంధువైన భగవానుఁడు. ఆయనతో భక్తి జ్ఞాన వైరాగ్యములచే బంధుత్వము కలుపుకొనుట సుఖప్రదము.

271. హిరణ్యకశిపుఁడు దేవుఁడున్నచోటు చూపుమని యడిగెను. ప్రహ్లాదుఁడు దేవుఁడులేనిచోటు చూపుమని యడిగెను. ఇది అజ్ఞానికి, జ్ఞానికి జరిగిన పోరాటము. అజ్ఞానికి దేవుఁడెచటను గనపడఁడు; జ్ఞానికి సర్వత్ర గోచరించును. స్తంభములో హిరణ్యకశిపునికిఁ దనశత్రువు కనపడి సంహరించెను. ప్రహ్లాదునికిఁ దన జగత్త్రియావనుఁడు గోచరించి రక్షించెను.

272. నాలోనున్న దేవుఁడే సకలప్రాణులలో నుండుటచే, నే నెవ్వరిని ద్వేషముతోఁ జూడవలయునో తెలియుట లేదు. ఇఁక నేను ద్వేషించుట కొక్కటి మిగిలియున్నది; అది ద్వేషమే.

273. అప్పుడప్పుడు దేవుఁ డుగ్రరూపమును దాల్చును. ఆ రూపమును మనము భరింపఁజాలము. దేవుఁడు చూపు ఉగ్రత్వమునకు మన ప్రవర్తనలోని వక్రత్వమే కారణము. దుష్టశిక్షణమునకుగ్రత్వము, శిష్టరక్షణమునకు సౌమ్యత్వము నాతఁడు చూపును. నీవు సాధుపురుషుడవై, దేవుని సౌమ్యరూపమును దర్శించు నదృష్టమును బొందుము.

274. లోకులు, లోకములోని వస్తుజాలము, నీకెల్లప్పుడు శిక్షణమిచ్చుటకే, దేవుని యేర్పాటు. లోకులు, వస్తువులు, తాము నిన్ను బాధించుచుఁ జెప్పునదేమనగా, "మమ్ము కాదు నీవు కోరవలసినది. మమ్ము సంకల్పించి ప్రదర్శించిన పరమాత్మనుకోరి భజింపుము. మే మేమిచేయుదుము. నీకు సంపూర్ణసంతృప్తి, ఆనందము నిచ్చుశక్తి మాకు లేదు."

275. మోక్షము కోరువానికి మిక్కిలి చురుకుఁదనము కావలెను. తీరికగా నెన్నఁడో జన్మాదిరహస్యసమస్యల నర్థముచేసికొని, యీలోగాఁ గొన్ని లౌకికసుఖములనుభవించి, తరువాత నెమ్మదిగా నియమనిష్ఠలతో జ్ఞానమార్జింతునని నీవు కాలమును వ్యర్థముచేయుచో నీ పొరపాటునకు విచారింపవలసివచ్చును. మోక్షమనగా సకలబంధవిచ్ఛేదము; సకల దుఃఖకారణ నిర్మూలనము. అది కఠోరదీక్షను, ఉగ్రజపతపాదులను, నీ సర్వశక్తి వినియోగమును కోరును. ఆపనినైనను అతివేగముగాఁ జేయనిచో, మృత్యుకాల మాసన్నమై, అవకాశమే లేకుండఁజేయును.

276. యుక్తిప్రయుక్తులతోఁ దలలుమార్చు శక్తి గొప్పదని లోకులు భావింతురు. యుక్తిగాదు వలయునది; యుక్తప్రవర్తనము. దేవుఁడు, ధర్మము, నంగీకరించునది యుక్తప్రవర్తనము. యుక్తుఁడనగాఁ గోరికలు లేనివాఁడని గీతా వాక్యము, "యుక్త ఇత్యుచ్యతే యోగీసమలోష్టాశ్మకాంచనః". "నిస్పృహస్సర్వకామేభ్యో యుక్త ఇత్యుచ్యతే." మట్టి, యినుము, కాంచనము సమానముగాఁ జూచునాతఁడు, కామములయెడ నిరాదరణభావము గలవాఁడు యుక్తశబ్ద వాచ్యుఁడు. అట్టివానిదే నిజమైన యుక్తి. కోర్కెలుగలవాని యుక్తి మోసగించునది."

277. లోకములోని పెక్కుమంది మనలను మెచ్చ వలయునను కీర్తికాంక్ష చాలమందికి సంపాదింపదగిన దేయను నభిప్రాయము దృఢమైయున్నది. మనము సంపాదింపవలసినది కీర్తికాదు; ఆర్తిలేని బ్రదుకు. సర్వదుఃఖములను నిర్మూలించి. స్థిరానందశాంతులను సంపాదించినవానిని లోకులు నిజముగాఁ గీర్తింతురు; లోకులేకాదు; దేవుఁడే కీర్తించును. దేవుని కిష్ట మగు జీవితమును మనము జీవించినచో, లోకులేకాదు, పంచ భూతములు, గ్రహనక్షత్రాదులు, సర్వసృష్టియు మనలఁ గీర్తించి, దాస్యమొనర్చును.

278. అనుకూలపరిస్థితి కల్పించి, విశేషబాధలు లేకుండ కాలము గడపుకొనురీతిగా ననుగ్రహింపుమని భగ వంతుని కోరుటలో నొక ప్రబలదోష మున్నది. కారాగార

ములోనుండి, మొదటితరగతివారికి సమకూర్చు సదుపాయములు కోరుటవంటిది. కాని యది కారాగారవిముక్తి యగునా? అది నిర్బంధములో స్వేచ్ఛ; ఏ బంధములులేని స్వేచ్ఛను గోరవలెను. అదియే మోక్షము. ఎంత అనుకూలమై, సుఖముగానున్నను, ఇహలోకజీవిత మెంతకాలముండును? జన్మజరామృత్యుదోషములు నశించునా? అవి యెన్నడును లేని సంపూర్ణవిముక్తిని మనము కోరవలెను.

279. ఇహలోకసుఖములును గావలెను; మోక్షమును గావలెనని కొందరు కోరుచుందురు. చీకటి వెలుతురు నేకకాలమున నుండవు. ఇహసౌఖ్యముల కాసించితివా? అవి, మోక్షమహాసామ్రాజ్యము నార్జించుటకువలయు నీశక్తి సంతను దినివేయుటేకాక, మోక్షమునంగతిని పూర్తిగా మఱచునటులు చేయఁగలవు. కామములన్నియు మోక్షవిరోధులు. అందుచేఁ గోర్కెలన్నిటిని బాగా తగ్గించివేసి, పవిత్రమగు నిరాడంబరజీవితమునే గడపుచు ముక్తిపథమున నడచుటకు వలయు, భగవద్ధ్యాన జపాదికము ననుష్ఠించుట ముఖ్యము.

280. అన్నియు విడిచి, యీశ్వరు నర్చించు నవకాశ మందరకు లభించునదికాదు. అనేక జన్మములలో నిరంతరతపః ప్రాబల్యము నార్జించినవారి కే కొలఁదిమందికో అది సాధ్యమగును. అంతమాత్రముచే నితరులు నిరాశాగ్రస్తులు కానక్కరలేదు. భగవంతు నర్చింపఁగోరు తీవ్రకృషి యెప్పుడో యొకప్పు డారంభింపక తప్పదు. ఎప్పటికైన తప్పనిసరి

ధైనదాని నిప్పుడే, యీ క్షణమందే ఆరంభించుట, వివేకము గాదా ?

281. నీవు దేవునితో నీసంబంధమును సవ్యమైనది గాను, యుక్తమైనదిగాను, సమగ్రమైనదిగాను జేసికొను దృష్టితో నుండుము. అన్యులు నిన్నుగూర్చి యేభావములు ప్రకటించినను గణింపకుము. నీ యోగక్షేమకర్తయై, నీసర్వ బాధ్యతలు వహించువాఁడు భగవానుఁడేయై యుండగా నితరు లేమనుకొనిన నీకేమి ? దేవుఁ డేమనుకొనునో జూచికొనుము.

282. నీ నిజస్వరూపమును నీవు తెలిసికొనువఱకు నీకు శాంతి సౌఖ్యములుండవు. నీవు నీదేహబుద్ధీంద్రియము లని భావించుటవలన జరుగున దేమన, నీ దేహబుద్ధీంద్రియ ముల క్షుద్రప్రవృత్తి నిన్ను మితిలేని అశాంతి వశమొన ర్చును. దేహాభిమానము నవి దృఢమొనర్చుచు, "నీకు దేహా భిమానము పోవువరకు మేము బాధించుచుందుము." అను నదే వాని నదుపదేశము.

283. గర్వ మెవనిలో నున్నను, అజ్ఞానజన్యమే. పామరులలోని గర్వము పండితులలోని గర్వమంత ప్రమాద హేతువుకాదు కారణమేమన, పండితులు తమ మేధశ్శక్తిచేఁ తమ గర్వమును సమర్థించుకొనఁగలరు; పామరుల కాశక్తి లేఁదు.

284. పారమార్థికసత్యమును, వ్యావహారిక ధర్మ మును రెంటి నేకకాలమున నడపుట చాల దుస్తరవిషయము.

పారమార్థిక ధర్మము కలుషితము గాకుండ వ్యావహారిక జగత్తులో జీవించు టంతసాధ్యమైన పనికాదు. వ్యావహారిక ప్రయోజనములు తాత్కాలికములు. పారమార్థిక ధర్మములు నిత్యసత్యములు. పరమార్థ సత్యమునందు దృఢ నిశ్చయ బుద్ధి, నిశ్చల నిష్ఠగలవారు మాత్ర మేకొలఁది మందియో తమ దివ్య దీక్షచే వ్యావహారిక జగత్తును పవిత్ర మొనర్చి, ప్రకాశింపఁ జేయుదురు. అధిక సంఖ్యాకులు తాత్కాలిక లాభములకై, పరమార్థము నమ్మి వేయుదురు.

285. ఒక్కసారియైనను, తన జీవిత సర్వస్వము నఖండ భక్తితో దేవుని కంకిత మిచ్చిన వ్యక్తి, తదుపరి తాత్కాలికముగా నెట్టి దోషములకు గురియైనను, కొమ్మలు నరకిన చెట్టు మరల చిగిర్చి, తిరిగి శాఖలను పెట్టు రీతిగా, మరల సవ్యమార్గమునకు వచ్చి, ధర్మానుష్ఠానతత్పరుఁడై తరించును. ఒక్కమారైనను భగవానుని దివ్యపాదపద్మములను తన హృదయముతో స్పృశించిన వ్యక్తి కెన్నఁడు పతన ముండదు.

286. నీవు నన్నెఱుఁగవు; నిన్ను నేనెఱుఁగను. మన మిరువురము సోదరులమో, భార్యాభర్తలమో, అత్యంత మిత్రులమో కావచ్చును. కాని సరిగా నెరిగినచో నేనే నీవు, నీవే నేను. ఇదియేల - తెలియుట లేదు? కారణము నిన్ను నీవెరుగవు, నన్ను నేనెరుగను. నీలోఁగల "నా" నాలో గల 'నా' ఒకటే. ఆ 'నా' నిజముగా సర్వములో సర్వత్ర నిండి

యున్న పరమాత్మ చైతన్యమే. 'నా' దేవుఁడు – మిగిలిన దంతయు నజ్ఞానము.

287. ఈ లోకములో సుఖము శూన్యమని తెలిసి కొనుటకు సులభమైన ప్రక్రియ యొకటి కలదు. చాల సుఖించుచున్నారని నీవు భావించిన ఒకవేయి కొంపలకేగి ఆయిళ్ళలోగలవారి నందరిని ప్రశ్నించి, పరీక్షింపుము. వారందరును "చాల చికాకులున్నవి–పైకి నవ్వుచు లోపల నేడ్చుచుంటిమ"ని బదులు చెప్పెదరు.

288. దినదినము నీవు దేవునిదగ్గరగాఁ బోవుచున్నావో, దూరముగాఁ బోవుచున్నావో పరీక్షించుకొనుచుండు నభ్యాసము చేసికొనుచుండుట గొప్ప తపస్సగును. దైవారాధనమాని, తప్పుపనులుచేసి, భోగలోలుఁడవగుచుంటివా, నీవు దేవుని కతిదూరస్థుఁడ వగుచున్నావు. అప్పుడు ఘోరప్రమాదములను, దారుణదుఃఖములను నీవనుభవింప వలసియుండును. అటుగాక, నిరంతరదైవారాధన తత్పరుఁడవై, సత్కర్మాచరణశీలివై, యింద్రియముల నదుపులోఁబెట్టి, దేవుని సమీపించుచుంటివా, జన్మజరామృత్యురోగాది బాధలును దూరములై స్వచ్ఛస్థిర శాంతిసౌఖ్యములు నీ సొత్తులై, క్రమముగా దైవత్వము నొందుదువు.

289. నీవు తప్పనిసరిగాఁ జేసితీరవలసిన పని యుండగా దాని నెంతత్వరగాఁ బూర్తిచేసి, కూర్చుండఁ గలిగితే అంత మంచిది. నీకు నిజముగాఁ గొన్ని వేలజన్మముల

నుండి, నీవతి త్వరగాఁ జేయవలసినపని యున్నను, చేయ మానితివి. అదియే చావుపుట్టుకల నంతమొందించుకొను మహాకార్యము అనగా ఆత్మోద్ధరణము. అది మాని, జన్మ జరావ్యాధి మృత్యుదుఃఖముల కలవాటుపడి, తుదిలేని దుస్థితి ననుభవించుచున్నావు. "ఉత్తిష్ఠత, జాగ్రత, ప్రాప్యవరాన్ని బోధత."

290. "దిక్కులేనివారికి దేవుఁడే దిక్కు"ని పలుకు చుండుట మనము వినియుంటిమి. దిక్కనగా రక్షణమన్న మాట–పుత్ర విత్త బంధు మిత్రాదులుగలవాఁడు దిక్కున్న వాఁడు; లేనివాడు దిక్కులేనివాడునని భావము. ఇది సరిగా నాలోచింపవలెను. పుత్రమిత్రాదులు నిజముగా రక్షణ మీయఁగలరా? సర్వజీవుల సదా రక్షించువాఁ డీశ్వరుఁడై యుండగా నాసత్యమును గుర్తింపక, యీశ్వరేతరులు, తమ్మఁ దామే రక్షించుకొను శక్తిలేనివారు రక్షింతురని నమ్ముటెంత అవివేకమో!

291. నీవు రైలెక్కినవానితో పోరాటము పెట్టు కొందువా? నీవలె నాత డెచటనుండియో రైలెక్కినాఁడు–నీవొక చోట నాతఁడొక చోట దిగిపోవుదురు–మరల కలిసికొనక పోవచ్చును. నీకు వానితో వైరమెందుకు? కొలదిగంటలు కలిసియుండుట–వీలైనంతగా నన్యోన్యత గలిగి కాలము గడపివేయుట మంచిదికాదా? ఈ లోకమనే రైలుబండిలోఁ బెక్కురుగలరు, వారివారి కర్మల ననుసరించి వచ్చి పోవు

దురు. వారితో పోరాటమేల ? వీరైనంత సహకార సౌజన్యములు చూపి బ్రదుకుట మంచిదికాదా ? దానివలన నెంత చిత్తశాంతి యుండునో చూడుము.

292. ఆత్మనిగ్రహమనునది అనేకజన్మముల తపస్సుచేఁగాని లభింపదు. అది నిరంతరమగు నీశ్వరారాధనముచే నీశ్వర ప్రసాదముగా లభించును లేదా, బ్రహ్మజ్ఞానముచే లభించును. వాయువును బంధించుటవలె నసాధ్యప్రక్రియ యని అర్జునుడంతవాఁడు పలికెను. "ప్రకృతింయాంతి భూతాని నిగ్రహః కింకరిష్యఁతి" యని శ్రీకృష్ణభగవానుఁడే పలికి, అభ్యాసవైరాగ్యములచే దానిని సాధింపవలెనని బోధించెను.

293. లోకములో నిన్నెవరేమన్నను పట్టించుకొనకుము. వారి స్తుతికిఁగాని, నిందకుఁగాని నీమనస్సులో ప్రవేశమీయకుము. ఏలన నందరచేత నీశ్వరుఁడే పలికించుచున్నాఁడు. సర్వప్రాణుల నోటినుండియు వెలువడు వాణి యీశ్వరవాణియే.

294, నీ మాటకాదు, నీ ప్రవర్తనమే నిజమైన ఉపదేశము. దేనిని నేర్చికొని లోకు లాచరింపవలెనని నీవు కోరుదువో, దానిని నీ ప్రవర్తనలోఁ జూపుము. నీవు మాటలతో వేరుగా నుపదేశింపనక్కరలేదు. శుద్ధప్రవర్తనమే నీ యుపదేశమును వేనోళ్ళ చాటును.

295. సజ్జనగోష్ఠి లభించుట, బహుజన్మసుకృతఫలము. సజ్జనులనగా దైవధర్మముల నాశ్రయించిన పుణ్యా

పురుషులు. సంసారములో బహుజనులకు తీరికయే యుండదు. తీరికగలవారు, వినోదవిలాసములలో కాలమును గడపివేయు దురు. కొందరు వ్యసనలోలురై, దుర్జనపరివేష్టితులై యుందురు. మానవజన్మ మెత్తి వినోదములకు, విలాసము లకు, వ్యసనములకు వ్యయించుటకు మనకుగల బలము, కాలము ఏమంత యెక్కువగా నున్నవనుకొనుట క్షమింప రాని అవివేకము.

296. అహంకారమే మనముచేయు సర్వపాపముల కును, మనమనుభవించు సమస్త దుఃఖములకును ముఖ్యకార ణము. అహంకారకేంద్రమున నివసించువారికి, కామభోగాభి లాషలు, రాగద్వేషములు. తన్మూలమున తీరని దుఃఖములు సంభవించును. అశాంతియను సుడిగుండము అహంకార కేంద్రమే. అందుకే "నిర్మమో నిరహంకారస్సశ్శాంతి మధి గచ్ఛతి" యని గీతావాక్యము.

297. మనకు దేవునిపై నిజమైన భక్తియే యున్నచో మనము చేయు పనులన్నియు నీశ్వరారాధనముగా మారిపో వును. మన ఆలోచనలు, కర్మలు, మాటలు, దేవుని నిరంత రము జ్ఞాపకముచేయున వగును. అనగా మన వ్యక్తిత్వమం తయు నీశ్వర కైంకర్య మగును. అట్టిభక్తుడు పరమేశ్వరేతర విషయములనాలోచింపఁడు; మాటాడఁడు,చేయఁడు. అదియే దైవావేశితజీవితము. అట్టివాని జన్మమే,లోకకల్యాణహేతువు.

298. ఏ క్షణమున నీవు దేవుని మఱచితివో, ఆ క్షణమున నీకు దైవకృప లేదన్నమాట. దైవకృపయే దేవుని

స్మరింపఁజేసి, మరువకుండఁ జేయును. దైవకృప నీకున్నచో నే క్షణములోను నీకెట్టి యాపదలు సంభవింపవు. అది దైవకృపా మహిమ. అగుచో మానవ ప్రయత్నమక్కర లేదా? దైవ కృపయు మానవ ప్రయత్నమును కలిసిపోవును. ప్రయత్నము చేయుటే దైవ కృప.

299. మనమందరము కాలమునకు వశులము; కాలము దేవునికి వశము; దేవుఁడు భక్తులకు వశుఁడు; అందుచేఁ గాలమును జయింప గోరుదువా? దేవునాశ్రయించిన కాలము నీకును వశమగును. అటులే కామక్రోధాదులు; జన్మ మృత్యు జరాదిక దోషములు. ఇవన్నియు దేవునధీనము; వానిని జయింప వలెనన్నచో, దేవునాశ్రయింపుము; అన్యోపాయము లేదు.

300. ప్రతినిత్యము మనమభ్యసింప వలసిన నియమమొకటియున్నది. వస్తువులను విడదీయుట నేర్చుకొనవలెను. ఏది నిత్యము; ఏది అనిత్యము. అనిత్య వస్తువులేవో తెలిసి వానిపైఁ గోర్కె విడిచి పెట్టుట - నిత్య వస్తువేదో తెలిసి దాని నాశ్రయించుట - ఇట్టి విభాగము చేయుట వలన నిజముగా సుఖమిచ్చు వస్తువు నాశ్రయించి దుఃఖకారణములైన వానిని నిసర్జించు శక్తి లభించి తరింతువు.

301. ఆకలి కలిగినప్పుడు, కడుపునొప్పి మున్నగు బాధలు కలిగినప్పుడు, తనకు క్రొత్త బట్టలు, పుస్తకములు, ఫలహారములు కావలసివచ్చినప్పుడు, పిల్లవాఁడు వెంటనే

తల్లిని జేరి చెప్పికొనును. తల్లి వెంటనే, పిల్లవాని బాధలు పోఁగొట్టి, కోర్కెల నుచితరీతి సర్దుబాటుచేసి, సంతోషపెట్టి, ముద్దాడి పంపును. మనమందరము బిడ్డలమే. మన తల్లి జగన్మాత. మన కేబాధలు వచ్చినను, ఏమి కావలసినను, వెంటనే అమ్మతోఁ జెప్పికొని బాధలు పోఁగొట్టుకొని, కావలసిన వామెనుండి పొందు టలవాటు చేసికొనవలెను.

302. మనకుండవలసిన కోర్కెలు రెండే! భుక్తి ముక్తులు. భుక్తి యనగా, నిహలోక జీవయాత్రకవసరము లైన వస్తువులు-ముక్తియనగా, సకల దుఃఖములు, లోపములు, భయబంధములు తొలగిపోవుట. ఈ జగములన్నిటికి కాధిపత్యము వహించిన భగవానుఁడే యీరెండు వస్తువులను మనకు ప్రసాదింపఁగలఁడు. ఇఁక భగవానునాశ్రయింపక, వ్యర్థముగా కాలముగడపుదు వేల ?

303. పెక్కుమంది ప్రతి నిత్యము చాల కాలమును వినోదములకై వ్యయింతురు. కనపడినవారితో కబుర్లు, రేడియోపాటలు, సినీమాలు, ఇవిచాలక ఆటలు (పేకాట మున్నగునవి), నిరర్థక వాగ్వాదములు, అనవసర విషయ చర్చలు – సగము జీవితమునిద్ర మరల కొంత ముఖ్యకాలము స్నానపాన భోజన మలవిసర్జనాదికముతోడను నశించును; మిగిలినది వినోదములు – పసిపిల్లలవంటి వీరి వ్యర్థజీవితములను జూచి కన్నీరు విడువవలెను.

304, భగవాను నేమియు నడుగనవసరము లేదు. మన హృదయనివాసియై, మన మనస్సులోని భావము

లన్నిటి నాతఁడే పుట్టించి, మన జీవితరథముల నాతఁడే త్రోలుచున్నాఁడు. సర్వసాక్షి శబ్ద మాపరమేశ్వరునికే చెల్లును. నీకు వలయున దేదో, నీవు చెప్పఁగోరినదేదో అన్నియు భగవానుని అధీనములై యున్నవి. నీకోర్కె నెఱుగని వానికిఁజెప్పవచ్చును; ఎరిగిన వాని కెందుకు జెప్పుట? ఆ పరమేశ్వరుఁడు బుద్ధిపుట్టించినచో వానినే స్మరింపుము. అట్టి బుద్ధి పుట్టింపకున్నచో నీవేమి చేయఁగలవు?

305. గురువును శిష్యుడడిగినాఁడు: "నన్నేమి చేయుమందురు?" గురువు జవాబు : "నీకేది తోచిన నది చేయుము ఒక పని చేయవలదని తోచినచో మానుము. కాని ఒక నియమమును పాటింపుము; నీవేది చేసినను దేవుఁడే చేయించె ననియు, నీవేది మానినను దేవుఁడే మాన్పించెననియు, దృఢ విశ్వాసముంచుము. మోక్షము నీ హస్తగతము.

306. సర్వజ్ఞుఁడు సర్వ శక్తిమంతుఁడు సర్వ దుఃఖములఁ దొలగించి, సర్వసంపదల ప్రసాదించువాఁడు సర్వజగదధీశుఁడునైన భగవానుని సన్నిధినుండి, భయవిషాద క్లేశములు పొందుదువేల? శ్రీకృష్ణ భగవానుఁ డదే అర్జునునితో ననెను: "కుతస్త్వాకశ్మలమిదమ్?". "నాప్రక్కనుండి (రథములో) నీకీ మనఃకాలుష్యమెందుకు? అని యడిగినాడు. దేవుఁడంతవానియొద్దకూర్చుండి యేడ్చుటా? ఎంతఅవివేకము?

307, అమర్యాదగా దిరస్కరించుటకు నిశ్చయించుకొనిన వారికి హితోపదేశము చేసి, నీ వవమానింప బడితివని విచారింపనేల? దానము, సద్వాక్యదానము (హితోపదేశ

మదియే) పాత్రోచితముగా నుండవలెను. ఆకలి లేని అజీర్ణ రోగికి పిండివంటలతో భోజనము పెట్టుట, పెట్టువాని తప్పగును. పొరపడి అట్టి అపాత్రులకు అన్నదాన, వస్త్రదాన, జ్ఞానదానముల నొకవేళ చేయవలసివచ్చి చేసినను, వారపాత్రులని యెరిగి, కోపమునకు బదులు, దయారస పూరితమగు దరహాసమునే ప్రదర్శింపవలెను.

308. దైవప్రార్థనమనగానేమి? దేవుని ప్రార్థించుట. దేని కొఱకు? ఇహలోకములోఁగొన్ని కోర్కెలు సిద్ధింపజేయుమనియు, మరల పుట్టకుండ ముక్తి నీయుమనియు మనము కోరవలెను – ఈ కోర్కెలకు భగవానుని జవాబు వచ్చినదో లేదో చూచికోవలెను గదా? ప్రార్థించి మాటాడకూరకుండుటేమి లాభము? దేవుఁడు మనకు దర్శనమిచ్చి, నీ కోర్కెల నిచ్చితినని చెప్పుటే ప్రార్థనల ఫలితము.

309. మిత్రులను, బంధువులను మనము పలుకరించి పనులు చేయించుకొనుట లేదా? మిత్రులకంటె, బంధువులకంటె భగవానుఁడు మన కత్యంత సన్నిహితుఁడు. మనలోఁగూడ నున్నాఁడు, బంధుమిత్రులు మనలో లేరు. మనకున్న లోపములు కష్టములు మన బంధుమిత్రులకుఁగలవు; భగవానునికట్టి వెవ్వియును లేవు. బంధుమిత్రుల శక్తి అత్యల్పము; భగవానుని శక్తి అనంతము. అత్యంత సమీపస్థుఁడైన భగవానునాశ్రయించి సకలశుభములు తనివితీరునట్లుగా పొందక, పరిమితశక్తి, సంశయాభిమానముగల బంధుమిత్రాదుల పట్టుకొని ప్రాకులాడుదుమేల?

310. "ఆత్మ వస్తువును అన్వేషించి తెలిసికొనుము; తక్కిన గొడవలు విడిచిపెట్టుము"ని ఉపనిషత్తు చెప్పను. ఆ పని మనము చేయుటకై ఉపనిషత్తు చెప్పినది, చేయక ఉపనిషత్తునుగూర్చి ఉపన్యాసము నిచ్చుటకు సిద్ధపడెదవేల ? ఉపన్యాస ముపనిషద్దూషణము కాదా?

311. నీవు ఏ అవస్థలోనున్నను, ఏ వృత్తిలోనున్నను, ఏఆశ్రమమందున్నను, ఏపదవిలోనున్నను, అన్నిటిలో తప్పని సరిగా నుండవసినది మనస్సును దైవాధీన మొనర్చుటే దైవ భక్తి. ఆత్మజిజ్ఞాస, సత్పురుష సాంగత్యము - సర్వకాల సర్వావస్థలలోను నీవు హృదయములో నుంచుకొనియే జీవింప నేర్వవలెను. ఈ నేర్పునే "యోగఃకర్మ సుకౌశలమ్" అని భగవానుఁడు గీతలోఁ జెప్పినాఁడు.

312. దేవుని పవిత్ర హృదయముతో స్మరింపకుండ, నే పనియుఁజేయరాదు. అనగా సర్వకార్యములు పరుండుట, కూర్చుండుట, నడచుట, భుజించుట, పయనించుట. సంభా షించుట, పెండ్లియాడుట, భార్యతో విహరించుట మున్నగున వన్నిటిపైన భగవానుని స్మరణముద్ర వేయవలెను. బ్రతు కంతయు దైవభక్తిముద్రితము కావలెను - అవసాన దశవచ్చి యముఁడెదుట నిలిచినను, హరిసంకీర్తనము చేయుచునే దేహ త్యాగము చేయవలెను.

313. సర్వత్రవ్యాపించి యున్నవాఁడు పరమేశ్వ రుఁడు అట్టి పరమేశ్వరుని నిరంతరము స్మరించుచు ధ్యానించు

చుంటువానియొద్దకు పరమేశ్వరు ననుజ్ఞపొందకుండ యముఁడు సమీపింప జాలఁడు. అనగా మహాభక్తులకు దేహత్యాగము స్వచ్ఛందమగును. స్వేచ్ఛామరణము వారికరతలామలకమై యుండును.

314. దేవునికి బెదరువ్యక్తి, మరేవ్యక్తికి బెదరనక్కర లేదు. దుష్టగ్రహములు, యమభటులు వానిని సమీపింప జాలరు. సార్వభౌముని సరసనే కూర్చుండి, రాజపరివారము నకు బెదరనవసరమేమున్నదా? అందుకే దైవీ సంపదను గూర్చి గీత 16-వ అధ్యాయములో చెప్పుచు, మొదటి లక్షణమును "అభయమ్" అని శ్రీకృష్ణ పరమాత్మ పలికెను. "నన్ను నమ్మితే నీకింక భయమెందుకురా?" అని అర్థము.

315. ఎవరి ముఖమువైపు చూచినను, నాకొకటే స్పష్టముగా గోచరించుచున్నది; "మేమెందుకో యిటులుండ వలసి వచ్చినది. ఎప్పుడో సుఖముకలుగునని హృదయములో నే మూలనో పిసరంత నమ్మకమున్నది. అది అన్ని భారములను మోయించుచున్నది." ఆ పిసరంత సుఖలాభ భ్రాంతి లేకున్నచో నీలోకములో నేప్రాణియు జీవింపలేదు-అందుకే ఉపనిషత్తులోఁ జెప్పఁబడెను, "కోహ్యేవాన్యాత్కః ప్రాణ్యాత్ యదేష ఆకాశ ఆనందోనస్యాత్."

416. దేవునాశ్రయించినంత మాత్రమున వెంటనే నీ కోర్కెలన్నియు సిద్ధింపవు, భగవానుఁడు దయామృతమూర్తియో, నీ కోర్కెలు నీవు చెప్పితివి - నీకోర్కెల సిద్ధింపఁ

జేయుటలో భగవానుఁడెన్ని ఆలోచింపవలసియుండునో? ఎందు కెట్లా భగవానుఁడాలోచించునో మనకు గ్రహించు శక్తిలేని వారమగుటచే 'ఓర్పు' నేర్చికొని, భగవానునికె మొరపెట్టు కొనుచు, ఆయన కృప కెదురుచూచుచుండవలెను.

317. భగవానుఁడు తన్నాశ్రయించినవారి నెట్టివారి నైనను, తప్పక కాపాడి తీరునని భగవానుఁడే చెప్పుటయే కాక, అటులేచేసి యుండిన చరిత్రలు మనము స్మరింపవలెను. ఆయన కృప త్వరగా లభింపక పోవుటకు మనలోనింకను మిగిలియున్న మాలిన్యములు కారణములై యుండవచ్చును. భగవత్కృప నీవు కోరిన వెంటనే లభింపలేదని, దేవుఁడు నిర్దయాత్ముఁడనికాని, నీవు దేవునిభజించు టనవసరమని కాని పొరపడ వలదు, సకల పాపముల నాయన దహించివేసి క్షణములో నిన్నాతఁడు రక్షింపఁగలఁడు.

318. మనతోడి మానవులనెంతటివారి నాశ్రయించి నను, మనకు గలిగిన కష్టములు, దుఃఖములు తొలగవచ్చును తొలగక పోవచ్చును. సర్వసమర్థుఁడైన పరమేశ్వరు నాశ్ర యించిన తరువాతఁగూడ మనబాధలు దుఃఖములు తొలఁగ కున్నచో, అది మనము నమ్మిన దేవుని శక్తిని మానవ మాత్రుల శక్తితో సమానమైనదను భావము ప్రకటిత మగును. దేవునికంటె నధికుఁడున్నచో వానినే ఆశ్రయింప వచ్చునుగాని, దేవునితోసమానుఁడే లేనపుడధికుఁడెంట్లుండును?

319. రామబాణమునకు తిరుగు లేనటులే, నమ్మి భజించు వానికి రామ కటాక్షమును తిరుగులేనిదే. సుగ్రీవుని,

విభీషణుని స్మరింపుము - దుష్టులగువారి అన్నలిద్దరను రాముఁడు వధించి వారిని రక్షించెను.

320. నీవు నిజముగా నమ్మి చరించినచో, భగవానుఁడు నిన్నెన్నఁడును విడిచిపెట్టఁడు; దగాచేయఁడు, నీకవమానము, హాని, ప్రమాదము, నష్టము, కష్టము నెన్నఁడుఁ గలుగనివ్వఁడు. నమ్మిచూడు - ఆయన దయామృతపానము చేసిన వానికెట్టి శంకలు కలుగవు.

321. నీ యోగక్షేమములను దేవుఁడే సంపూర్ణముగా వహించి, నీకవసరములైన వన్నిటి నాతఁడే చూచుట యనగా నెంతగొప్ప విషయమో ఊహింపుము. అత్యల్పుఁడైన ఉద్యోగియైనను, మన పని చేయుటకై, మనలను త్రిప్పి త్రిప్పి చంపును. సర్వప్రపంచాధిపతి, పనికట్టుకొని, మనపనికిఁ బూనుకొనుటయనగా, నమ్మినంతమాత్రమున ఆయనచూపు అపారకృప సాటిలేనిదని గ్రహింపవలెను.

322. తుచ్ఛమైన యీ దేహమును ధరించుటను దుర్భరావమానముగా భావించి, యెంతటి హీనకార్యము నకుఁ బాల్పడితిమని సిగ్గుపడుటకు బదులు, సకలదోష నిలయమైన యీ దేహముతో భోగము లనుభవించి సుఖమందఁ గోరుట, బొచ్చుగుంటలోదిగి, దేహమును శుభ్రమొనర్చుకొనుటకు జ్ఞానమను మంచినీటినిగాక, బొచ్చునే ఉపయోగింపఁబూనుట వంటిది. అంటుకొనిన కొంపను, మంటలను, మంటలతో చల్లార్చుటకు యత్నించుట వంటిది.

323. ప్రేమ, అనురాగము, మోహము మున్నగు నవి మంచివే. వానినెన్నఁడు చెడని వస్తువుల పైనుంచవలెను. ఎన్నడు చెడని ఆత్మపై ప్రేమాదికముంచవలెను. బూడిద యగు దేహము మున్నగు వానిపైఁగాదు.

324. సర్వము తెలిసిన ప్రభువు భగవానుఁడు. ఏమియు తెలియని వాఁడవునీవు. నిజముగా నీవెవరో, నీ కేమి కావలెనో నీవెరుఁగవు; నీవెవరో, నీ కేమి నిజముగా కావలెనో ఆయనకుఁదెలియును. అందుచే దేవుని భజించుచుండుటే నీపని, ఆయన కృప చూపినప్పుడు సంతసించు; ఒకప్పుడు కొంచెమాలస్యమైనచో భజించుట మానకు; పైగా తీవ్రముగా భజించి, ఆయన తప్పక కరుణించునని యెరుగుము. రావణుని చెఱనుండి సీతాదేవిని కాపాడుటకు, వర్షాకాలము నాలుగు నెలలాలస్యముచేయక తప్పని సరియైనది. వర్షములు తగ్గిన తరువాత వానర సైన్యము బయలుదేరిన సంగతి జగద్విదితము; కాని యీ నాలుగు నెలలు శ్రీరామప్రభువు సీతకై పరితపించి పలువరించి, పలవించినాఁడు.

325. పరమేశ్వరుని దివ్యలీలయే ప్రపంచము; అనగా నర్థమేమి? లోకమందన్ని వ్యవహారములలో నాతనిముద్ర (Stamp) యుండును; చిన్న, పెద్దపను లన్నిటిలో దేవుని హస్తము గోచరించును. దేవుని హస్తమును, ముద్రనుజూచిన వాని కేపనియునుండదు. అన్నిటిలో దేవునిక్రియాహస్తమును జూడఁగల వాని యానంద మనిర్వచనీయము.

326. ప్రమాదముల గుట్టయే ప్రపంచము. సర్వ ప్రమాదములకు దేవుడే కర్త; దేవుని నమ్మినవారికి ప్రమాదములు తప్పించి ప్రమోదములనిచ్చును. దేవునిపై నిశ్చల భక్తి లేకుండుటే ప్రమాదము.

327. "జగమంతా కామమయము" – "జగమంతా రామమయము." రెండును నిజమే. కామములేనిదే జగత్తు లేదు. కామము దుఃఖకారణము, దానిని నిగ్రహించినఁగాని, రామమయమైనదిగా జగత్తు కనపడదు. కామము రాముని స్మరింపనీయదు–రామస్మరణము వలనఁగాని కామముపోదు. ఈ సమస్య పరిష్కారమెట్లు ? గురు కటాక్షము వలన పరిష్కారమార్గము బోధపడును – కామమును జయించుట, రాముని దర్శించుట ఏకకాలముననే జరుగును.

328. ఇహలోక జీవితదుఃఖములలో వియోగ మొకటి కఠినమైనది. జీవుల పుట్టించి, ప్రేమలు కల్పించి, విడఁదీయుట వలని దుఃఖమును కలిగించుట – ఇది సంసార దుఃఖములలో ప్రబలమైనది – భార్య, పుత్రులు మున్నగు వారి వియోగము. వియోగమెన్నఁడు నుండని దేవుని ప్రేమింపుఁడని యే దీని సారము కాబోలు!

329. మన అభిప్రాయములెంతమంచివి, పూజ్యములైనవి, పరిశుద్ధములైనవి నైనను, వానిని వ్యర్థములైనవని త్రోసిపుచ్చువారు కొందరెల్లప్పుడుందురు. నిష్కల్మషహృదయములకది ఘోరముగా కన్పించును. కాని అట్టి వారిని

మనము ద్వేషింపరాదు. ఔదాసీన్యము మాత్రమే ఉత్తమ పద్ధతి.

330. ఏమి జరిగినను దేవుఁడెరుగకుండ జరుగునని తలంచుట దేవుని యెరుకకు లోపమాపాదించుటే యగును. దేవుఁడెరుగుటనగా, నెవరోచేసిన దానిఁడెరుగుననియు భ్రమింపరాదు. ఎవరేమి చేసినను, వారు చేయకముందే దేవుఁడెరుఁగును. కాకున్న ఆయన త్రికాలజత, సర్వజ్ఞతలకు లోపమగును. దేవుని సృష్టిలో దేవుని కిష్టములేని దేదైన జరిగినచో దేవుని పూర్ణశక్తి సామర్థ్యములకు లోపమగును. అనగా దేవుని సంకల్పముచేతనే సర్వముజరుగునని యర్థము.

331. నామము, రూపము కలిసి, బ్రహ్మాండమైన మోహమును సృజించి నిలుపుచున్నవి. ఒక మానవునకు, పేరు, రూపములేకుండ ఊహించి చూడుము. కంటికి కనపడని శక్తి; సర్వప్రాణు లాశక్తియే; వృక్షలతాదులు, భూమ్యాకాశ నక్షత్ర నర్వతాదులు అన్నియు ఆ శక్తియే. అదియే పరమాత్మ శక్తి. అది ఒకటే - అద్వితీయము - ఇక రాగద్వేషమోహాదులకుఁదావెక్కడ ?

332. దేశభక్తి మంచిదే కాని దైవభక్తిలేని దేశభక్తి, ప్రాణములు పోయిన దేహము వంటిది. 'నా దేహ' మని భావించుటే భ్రాంతియగుచో, 'నాదేశ' మని భావించుట పెద్ద తప్పుకాదా? పరమేశ్వర సేవగా దేశమునకు సేవచేయుట వలన అహంకారాది దోషములు నశించును.

అందుకే "మయి సర్వాణి కర్మాణి సన్న్యస్యాధ్యాత్మచేతసా, నిరాశీర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగతజ్వరః" యని గీత పలికినది వేద ప్రమాణము.

333. కామక్రోధాదులతోఁ బోరాటము మోక్షసిద్ధి యగు వరకు సాగుచునే యుండును. అది కొలదికాలములో ముగియునదికాదు. కామాదులు వచ్చి ముక్తికై ముందడుగు వేయు మనలనడ్డగించి, పైఁబడి బాధించుచున్నవని మనము కంగారు పడనవసరములేదు. వాని పని అవిచేయుచున్నవి. శ్రీరామ నామమను దివ్యాస్త్రము చేతనిడికొని మనము వానినెదిరించుచునే యుండవలెను.

334. మూఁడేండ్లచంటివాఁడు "అమ్మానాకు బిస్కట్లు" అనికోరగా తల్లి వెంటనే వచ్చి, కోర్కె తీర్చును. భక్తుఁడట్టి చంటివాఁడై పోవలెను. వెంటనే జగన్మాత మన కోర్కె నిచ్చును. మనకు నిజముగా నేమియుఁదెలియదని యెఱిగి, అమాయికత్వముతో నిండిన పవిత్రహృదయముగల చంటి బిడ్డలమై, ప్రార్థింపవలెను.

335. లోక వ్యవహారముల వైపు దృష్టిత్రిప్పితిమా మొదటి ప్రమాదము దేవుని మఱచుట. దేహమున్నంత కాలము కొన్నిలోక వ్యాపారములు తప్పవు. దేవుని మఱువకుండ లోక వ్యవహారములు జూచికొనుటకు గొప్ప అభ్యాస బలము కావలెను. ఈ అభ్యాసమెప్పుడో ఆరంభింతమని ఉపేక్ష చేసినచో, ఆయువు హరించి పోవును. వెంటనే ఉపక్రమించు.

336. అన్నిటికిఁ గారణము దేవుఁడే! ఏది తటస్థించి నను వెంటనే దేవునే స్మరించి రక్షణకోరవలెను. మన మల్పుల మగుటచే మనకు తటస్థించిన వానికన్నిటికిఁ గారణములకై, దేవుని వైపు చూచుటకు బదులు, లోకమువైపు చూతుము. చాటునుండి దేవుఁడు మనలఁజూచి చిరునవ్వు నవ్వుచుండును!

337. దురదచే గోకికొనుట, మలమూత్ర విసర్జనాదికము, మున్నగు నల్పకార్యములుకూడ మనము చేయుట లేదు. కర్త, యేకైక కర్త దేవుఁడై యుండగా. మనకుఁ గర్తృత్వము లేకపోగా, నెంతచిన్న పనులను మనమెట్లు చేయుదుము? కూర్చుండుట, పరుండుట, నడచుట, ఎచట, ఎంతసేపు ఇవన్నియు దేవుఁడే చేయించుచున్నాఁడు. నలుసంత కర్తవ్యము లేని మనము, కర్తలమని తలఁచి, కొఱవి పెట్టి తలగోకికొన్ని, కర్మఫలమనుభవించుచున్నారము, "పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్" గీతా శ్లోకమును చూడుము.

338. "మనస్సును ఇంద్రియములను, నిగ్రహింపు" మని అన్ని శాస్త్రములు చెప్పుచున్నవి; ఏకైక కర్తయై సర్వము ఈశ్వరుని సంకల్పముచే నడచుచున్నదనియు అన్ని శాస్త్రములు చెప్పుచున్నవి. విరోధమున్నదా? లేదు. ఉపాధి భేదముల ననుసరించి, మానవులు నడచుకొందురు. అజ్ఞాన వశుఁడైన అహంకారి తాను కర్తనని నమ్మును. అతఁడు కర్మ చేయవలెను. భక్తుఁడో! నిరహంకారియై, దేవుఁడేకైక కర్త

యని నమ్మి, మనో నిగ్రహమును ప్రసాదింపు మని దేవుని ప్రార్థించును. జ్ఞానియో, సర్వమును వాసుదేవునిగాఁజూడ గలఁడు; అతని కేనిగ్రహముండవలెనో అది పూర్ణసిద్ధినంది నందుననే జ్ఞానియయ్యెను. అందుచే విరోధ మందులేదు.

339. జీవితము దినదిన గండము. నిత్య మనిష్టము లేవో వచ్చిపడి యేడ్పించును. ఇట్టి జీవితము బెట్టికొని, "అంతా క్షేమమా?" యని ప్రశ్నించు వారికేమి జవాబు చెప్పవలెను? అశాంతి యను పాడు నూతిలో పడియుండుటే జీవితము. క్షేమము సుఖము నెక్కడ ? శాంతిదాత పరమేశ్వరుఁడే. ఆయన నాశ్రయించి శాంతి పొందవలెను.

340. రెండు మూడు సమస్యలు నన్ను బాధించు చున్నవి. అవి పరిష్కారమైనచో నాకేగొడవయు నుండదని మనము సాధారణముగా చెప్పికొనుచుందుము. అలలులేని సాగరము, సమస్యలులేని సంసార జీవితము నుండదని యెఱుఁగని వారట్లు చెప్పుకొనుచుందురు.

341. చెడి నశించు దేహమును ధరించితివనగా నీలో నెన్నియో భోగకాంక్షలు – అనగా నెంతయో అజ్ఞానము మిగిలి యున్నదన్నమాట, వానిని పూర్తిగా నిర్మూలించి నపుడే కాని సుఖావ్యాప్తత నీకులేదు. కోర్కెలు సిద్ధించుటవలన గాక, కోర్కెల నిర్మూలించుట వలననే సుఖము లభింప గలదు. అదియేసంపూర్ణజ్ఞానావస్థ–"ప్రజహాతియదాకామాన్" శ్లోకార్థమిదియే.

342. దేహామే సర్వదుఃఖములకుఁగారణమని చెప్పు చుండగా, దేహాముపై ధరించు చీనిచీనాంబరములు, రత్న హారములు సుగంధద్రవ్యములు, సుఖ మిచ్చుచున్నవనుకొను వారెంత మతిహీనులో!

343. లోకములోని సకల ప్రాణులకు సుఖాపేక్ష పెట్టి లోకమును, లోకవస్తువులను, సుఖము మినహాయించి కల్పించినాఁడు భగవానుఁడు. సుఖమను దానిని తనయొద్దనే దాచికొనినాఁడు. సుఖాపేక్షగలవారందరు, సుఖరాశినైన నన్ను జేరుఁడని బోధించుచున్నట్లు స్పష్టము. కాని సుఖలేశ మును లేని లోకముపైనను, వస్తువుల పైనను ప్రాణులకు వ్యామోహా మెందుకు పెట్టినాఁడని ప్రశ్నింపవచ్చును. సుఖ మంచు లేదని, తనయొద్దనే యున్నదనియు దెలుపుట కొఱకే యని యాతని సమాధానము. అందుకే "అనిత్యమసుఖం లోకమమం ప్రాప్య భజస్వమామ్" అని గీతావాక్యము.

344. ఈ లోకము దేవుని పెద్దయింటిలో నొక భాగము: ఇతర లోకములన్నియు దేవునింటిలోని గదులే! విశ్వమనునింటిలో దేవుఁడు సంపూర్ణముగా నిండియున్నాఁడు, మన మీ లోకములో నొకచోటినుండి మరొకచోటునకు గాని, మఱొక లోకములోనికిఁగాని, పోవలసి వచ్చుచో భయ పడనక్కర లేదు. దేవునింట నెచటనున్న నేమి? ఆయన పాద పద్మములాశ్రయించిన వానిపై దేవుని కృపామృత వృష్టి కురియుచునే యుండును. వడ్డించువాఁడు మనవాఁడైన పంక్తి చివర గూర్చుండిననేమి?

345. నీకు భయమా? ఎందుకు భయము? అభయ స్వరూపునాశ్రయించి, నిర్భయుడవై జీవింపుము. అభయ స్వరూపియే భగవానుఁడు. భయమును తొలగించు దేవుఁడుండగా వాని నాశ్రయింపక, భయపడి, చెడెదవేల? "అభయంవై బ్రహ్మ" అని ఉపనిషత్తు ఘోషించుట లేదా?

346. ఱేపెట్లు గడచునని చాలమంది ఆందోళన మందుచుందురు! ప్రతి నిమేషములో దేవుఁడు, ప్రతి రేణువులో వలె నున్నాఁడు. కాలము దేవునిచే కల్పితము; అనగా అన్నిదినము లాయన కల్పించినవే. అన్ని కాలములలో దేవునాశ్రయించిన వాని కన్ని దినములు శుభప్రదములే! నేటికి మనల రక్షించిన దేవుఁడు, ఱేపు శలవు పెట్టునా? నిద్రించునా? ఎంత వెఱ్ఱి!

347. దేవుఁడు నమ్మినవాని నిరంతరము రక్షించునని నీవెఱుగుదువు. ఎఱిగియు నప్పుడప్పుడు దేవుఁడు రక్షించునా యని సందేహములు కలుగుచుండును; ఈసందేహములకుఁగారణములు పూర్వ సంస్కార దోషములని జ్ఞాపకముంచికొని, ఎక్కువ శ్రద్ధాభక్తులతో దేవుని ధ్యానించుచుండుట వలన, భక్తి సంస్కారము, బలమైనదై, దుష్ట సంస్కారములనణఁచివేసి, సంశయములఁబోగొట్టి, ధైర్య విజయములను సమకూర్చును.

348. వేయి నియమములనేర్చి, పారాయణచేయుట కంటె, ఒకటిరెండు నియమములను దెలిసికొని, సమగ్రముగా

నాచరించుటెక్కువ ప్రయోజనకారి. ఒక్క నియమమును సంపూర్ణముగా నాచరించుచో, నితరములన్నిటి నాచరించుట మిక్కిలి సులభ సాధ్యమై అన్నిటి నాచరించిన ఫలితము లిచ్చును.

349. ఏ పని చేయుటకు నీకుఁగర్తృత్వము లేదు; జపతపాదికము చేయు నిరహంకారినికూడ "నేనింత జపము చేసితి" నను సాత్త్వికాహంకారము వశ మొనర్చుకొని భ్రష్టు నొనర్చును. దైవ భక్తితో హృదయము పూర్తిగా నిండి పోయినచో, నహంకారమున కచట తావు లేకుండఁజేయఁగలదు. అహంకారము పూర్తిగా నశించుటయు జ్ఞానసిద్ధి యగుటయు నొకటే; ఏక కాలముననే జరుగును.

350. మనము యమునకు భయపడుట పోయి, యముఁడే మనకు భయపడిపారిపోవు నంతటి తపస్సు మనము చేయవలెను. భయరాహిత్యమనగా భగవానుఁడే. నీవు సంపూర్ణముగా భగవదావేశిత మనస్కుఁడవై అభయ సంసిద్ధిని సాధింపఁగలవు.

351. వస్తువుల బాహ్యరూపములు, భ్రాంతిజనకములు-వానిని మనము పొందవలెనను కోర్కెల నుదయింపఁజేసి, పొందుట కారంభించుటతో దుఃఖసాగరమున ముంచి వేయును. ఏలన బాహ్య రూపములకు మార్పులు, వికారములు, నాశనము తప్పవు. మనము లోఁజూపు నభ్యసింపవలెను. సకల ప్రాణులు, వస్తువులలోపల నేమున్నది. అది

కంటికగుపడని శక్తి; ఆత్మ చైతన్యము, వికారములు లేనిది; అవినాశము. దానిని పొందినచో నిశ్చలనిర్వికార, నిరామయ నిత్యానందము సిద్ధించును. కావున బాహ్యదృష్టినరికట్టి అంత ర్దృష్టి నభ్యసింపవలెను.

352. ముక్తిని సాధించుట మానవజన్మమెత్తిన ప్రతి వ్యక్తికి అతి ముఖ్య కర్తవ్యము; భుక్తిమాటో! భుక్తిని సంపాదింపవలెను గాని దానికి ద్వితీయ స్థానమీయవలెను. దేనికే స్థాన మీయవలెనో తెలియని మానవుఁడు పశు తుల్యుఁడు. తెలిసియు భుక్తి కగ్రస్థానమిచ్చు మానవుఁడు పశువుకంటె హీనుఁడు, ముక్తికగ్రస్థానమిచ్చునదే భారతీయ నాగరికత. అది మరచిన భారతీయ నాయకుల మనఃబడు వారు దేశద్రోహులు. భుక్తికే ముక్తిస్థానమిచ్చు మానవుఁ డాత్మద్రోహి.

353. కత్తిపుచ్చుకొని దుర్మార్గుఁడెవఁడైన మనలను తరుముకొని వచ్చుచున్నచో, మనమన్ని కోర్కెలను విడిచి, ప్రాణరక్షణోపాయమునుజూచి కొందుము. యముఁడు కృపా ణహస్తుఁడై, సకల ప్రాణులను నిత్యమును వెన్నాడి తరుము చున్నాఁడు. ఆత్మ రక్షణోపాయమును జూచికొనక, మన మేప్రమాదమును లేనట్లుగా, నిహలోకభోగభాగ్యముల సంపా దనకై సకలశక్తులు వినియోగించుచున్నాము. మనము చాల తెలివైన వారమని మనమనుకొనుటేగాక, మనవంటి యిత రులు మనల స్తుతింతురు!

354. ఆత్మవిశ్వాసము (Self-Confidence)గలవ్యక్తి సర్వకార్యములను జయప్రదముగా నెరవేర్పఁగలఁడందురు. నిజమే. ఆత్మ విశ్వాసమనగా ఆత్మయందు విశ్వాసము. ఆత్మ శక్తి చైతన్యమే జగత్తునంతను నడపుచున్నది. ఆత్మ జరామరణాదిదోషములు లేనిది. అనంత శక్తిమహిమాన్విత మైనది. ఆత్మయనగా పరమాత్మయే. పరమేశ్వరుఁడే. ఆత్మ యందు అనగా పరమేశ్వరునం దఖండాచంచల విశ్వాస మున్న వ్యక్తి కసాధ్య మేముండును?

355. సామాన్య మానవుల దయసంపాదించుటే చాల శ్రమతోఁగూడినపని. అట్లు శ్రమకోర్చి సంపాదించిన దయవలన స్వల్పలాభములు కలుగ వచ్చును. పరమేశ్వరుని దయతో సమానమైన దేదియును లభింపదు. సకల లోప దోష దుఃఖ విముక్తి నిచ్చి, శాశ్వతానంత సౌఖ్య శాంతు లను భగవంతుఁడీయఁగలఁడు. అందుచే మానవుల నాశ్ర యించు శ్రమను దేవునివైపు త్రిప్పి, దేవునాశ్రయించుట కర్తవ్యమని స్పష్టమగుచుండగా, భగవాను నాశ్రయించుటకు వెంటనే పూనుకొనవలెను.

356. కాల మనగా దైవ స్వరూపమే. మనము పుణ్యముచేయు చున్నను, పాపముచేయుచున్నను, కాలము సమానముగానే గతించి పోవుచుండును. దైవ స్మరణా ధ్యానాదులచే పుణ్యమధిక మగుచుండును, పుణ్యముచేయు జనులకు దైవమే కాలరూపమున జీవితమును పొడిగించి,

ఆయుర్భాగ్యమునుపెంచి, వారి కార్యక్రమమునకు దోడ్పడి, కృతకృత్యుల జేయును.



357. ఏడ్పించుటే శరీరమున కుద్యోగము; ఏ మాత్ర మనారోగ్యము కలిగినను మన మేడవక తప్పదు; ఆరోగ్య బలము లున్నప్పుడవి కామమోహాదులను ప్రకోపింపజేసి యేడ్పించును. దేహమును దేవుని కర్పించుటే యేడ్పుపోవు మార్గము.



358. రామస్మరణము, కామస్మరణము నేక కాలమునందే జరుగుచున్నచో నేమి చేయవలెను? ఏమియు కంగారు పడనవసరము లేదు. కంగారు పడినచో కామ సర్పము కాట్లు వేయును. కామబలముకంటె రామబల మెక్కువదని గుర్తించి రామస్మరణ మాపకుండచేయు టభ్యాసము చేయుచో కామాదులు క్రమముగా నోటమినంది నశించును. కామకర్త రాముడేగనుక, తన్నాశ్రయించిన వారికి కామాది శత్రువర్గము బాధింపకుండ నివారించును.

359. మనమేపని చేసినను ఫలింపవచ్చును, వ్యర్థము కావచ్చును. కాని దేవుని ప్రార్థించుపని యెంత అల్పమైనను, ఎన్నడును వ్యర్థముకాదు. చేసిన కొలది అధికఫలమిచ్చు పనియిది. భక్తిశ్రద్ధలతో జేసిన అనంతఫలిత మిచ్చును. మరియు భుక్తిని ముక్తిని, సకల వాంఛితార్థముల నిచ్చును. జీవితములో నీ పనికి ప్రాధాన్య మిచ్చుట బుద్ధిమంతుని పని.

360. భగవంతుని మహిమ మనస్సునకు, వాక్కునకు అతీతమైనది. అది తెలిసికొను మార్గము, భక్తి, జ్ఞానము,

ధ్యానము వలననే, తపోధ్యానాదులచే ననుభవము వలన దానిని గ్రహించుటే మార్గము. గ్రంథములు, తర్కములు, వాదములు నిరుపయోగములు.

361. భగవంతుని మహిమ నెచట చూడవచ్చును? జవాబేమనగా, భగవంతుఁడు సర్వత్రనిండియుండి, సకలమును నడపుచుండగా, నెచట చూడలేము? ఎక్కడికో పోనేల? ఈ దేహమను రథము నాయన నడపుటలేదా? జఠరాగ్ని రూపమున, మనము తిన్నవానిని జీర్ణముచేసి రక్షించుచున్న శక్తి; నిద్రయిచ్చి నవ్యచైతన్య మిచ్చుచున్న శక్తి, సదసద్వివేకమునిచ్చి, తన్నెరుగు శక్తి; దేవుడిచ్చినదే. దేహమను రథము నడచు తీరే, దేవుని తెలియు దారి.

362. "సత్యం వద, ధర్మంచర" మున్నగు వేద వాక్యములు దేవుని వాణియే. మనము వాని ననుసరించుటకు యత్నింపవలెను. తెలిసి, తెలియక వాని నుల్లంఘించి, తెలిసి నపుడు వెంటనే దేవుని క్షమాభిక్ష వేడికొని, ముందెన్నడు నట్టి తప్పును చేయకుండఁ జేయుమని దేవుని ప్రార్థింపవలెను. నీవు చేసిన తప్పు నెన్నడును సమర్థించుటకుఁ బూనుకొన కున్నచో ముందెన్నడును నీవు తప్పుచేయకుండ దేవుఁడు నిన్ను రక్షించును.

363. భగవాను నస్తిత్వము, అనంత మహిమలను గూర్చి అణుమాత్ర సంశయములేని విశ్వాసముండి, మన జీవిత భారమాయన దివ్య హస్తములందుంచినచో, నెట్టి

కామక్రోధాది దోషములును మనల నెదిర్చి జయింపఁజాలవు. కారణమిప్పుడు పోరాటము మనకును కామక్రోధాదులకుఁ గాదు; దేవునికిఁ, గామక్రోధాదులకు నగును. మనమైన నోడి పోవుటనిజము; దేవున కోటమిలేదు.

364. గురువు వేరు, దేవుఁడు వేరు కాదు. భగవంతునితో నేకత్వమందిన యాతఁడే గురువు. అందుచే దేవుని వలెనే గురువును ప్రవర్తించును. భక్తుని భక్తిజ్ఞాన వైరాగ్యముల నభివృద్ధి చేయు నిమిత్తము మన జీవితముల ననేక రీతులలో వారు నడపుదురు. హాని యెన్నఁడును చేయరు. భయము కలుగఁజేసి భక్తి నినుమడింపఁజేయుదురు.

365. అన్నిటికి నేకైక కారణము భగవానుఁడను టలో సందేహము లేదు. నిమిత్తమాత్ర కారణములెన్ని యైన నుండవచ్చును. ఎవడైన నొక కర్రతో మనలఁగొట్టి నచో కర్ర నిమిత్త మాత్ర కారణము; కర్రపై మనము కోపగింతుమా? కర్రనుపయోగించిన కర్త నెఱిఁగి వానితో మంచి చెడ్డలు చూచికొందుము. అటులే, మనకేమి జరిగి నను, నిజకారకుఁడైన భగవానుని వలననేజరిగెనని తెలిసికొని భగవదారాధనముచేసి, తరింపవలెను.

366. విషయములను (స్త్రీ ధనగృహాదులను) విడఁదీసి విమర్శించినచో. పైకి మేడిపండు వలె చిత్తాకర్షణీయములై, లోపల పురుగు లుండుటనుజూపును. క్షణమాత్రము ననే కృశించి నశించుచు, క్షణిక తృప్తినిచ్చి, అక్షయ దుఃఖ

బంధముల కల్పించు నింద్రియ సుఖము లాసించుట వర్ణింప రాని బుద్ధి నైచ్యమును సూచించును.

367. పరమార్థము, అర్థము రెండు వస్తువులుగా గోచరించును. పరమార్థమనగా భగవానుఁడు. అర్థమనగా దేవుఁడు సృజించి నడపుచున్న లోకము అందలి వస్తువులు. లోకము, అందలి వస్తువులు దేవునిపై నాధారపడియున్నవి. దేవుఁడు వినా అర్థము లేనేలేదు. దేవుని త్రోసిపుచ్చి అర్థము నాశ్రయింపబూను వారి కర్థమున కర్థము తెలియదన్న మాట. పరమార్థమైన భగవంతునాశ్రయించినచో నన్ని యర్థములు దేవునిలో నున్నవి కావున, పరమార్థార్థములు రెండును నేక కాలముననే లభించును.

368. తనకు నిజముగా భక్తుఁడైన వానికన్ని విష యములలో అత్యద్భుతానుకూల్యతను గలిగించుటలో దేవు నికి దేవుఁడేసాటి. తన భక్తుఁడెన్న డూహించుట కవకాశము లేనిరీతులలో భగవానుఁడు వివిధ సంఘటనలను విచిత్రముగా సమకూర్చి తాను ప్రదర్శించిన అమేయమగు దయచే భక్తు నాశ్చర్యచకితు నొనర్చును. భక్తుఁడది కనిపెట్టి తన భక్తి నచంచల మొనర్చికొని తరింపవలెను.

369. సర్వతోముఖసమ్యక్ జ్ఞానమనగా బ్రహ్మ జ్ఞానము అదియే కలిగిన వాని శాంతి సౌఖ్యములెన్నడును చెడనివై యుండును. బ్రహ్మజ్ఞాన మనగా మనకుఁ దెలియని దుండదు. మనకు తెలియనిది మిగిలినచో అశాంతి, అసౌ ఖ్యము తప్పదు.

370. భక్తునకు భగవానుఁడు సేవకుఁడగు రీతి చాల అద్భుతమైనది. . సర్వత్ర నిండియున్న దేవునిగుర్తించి అర్చించును గావున భగవానుఁడు తన భక్తునితో నెల్లప్పుడుండును, భక్తునికి వలయు సర్వ విషయములలో భగవానుఁడు తన దివ్య హస్తముంచి, సర్వదా ఆనుకూల్యము ఘటించి రక్షించును. భక్తులు భగవత్సేవకులు; భగవంతుఁడు భక్తజన సేవకుఁడు. ఇది విచిత్రమైన సంబధము. భక్తుని నిత్య జీవితములో నిది గోచరించును.

371. జగమును ధరించి నిలుపునదే ధర్మము. అనగా ధర్మ మీశ్వరశక్తియే. ఈశ్వరహృదయ మెరిగిన మహర్షులు ధర్మశాస్త్రములు రచించిరి. దైవము, ధర్మము విడదీయరానివి. దైవమును విడిచి, ధర్మమును ప్రచార మొనర్చిన బుద్ధుని బౌద్ధమతము దేశమునుండి తుడిచివేయ బడినది.

372. దుఃఖము లేకుండుటే సుఖముకాదు. దుఃఖము కెన్నడవకాశము లేకుండుటయే సుఖము. కాని దీని నపార్థము చేయవచ్చును. సుఖమనగా నెట్టి పరిమితియు లేని ఆనంద పారవశ్యము, అట్టి సుఖము దేవునిదై యున్నది. దేవు నెరిగిన సుఖమే నిజమైనది. అదియెన్నడును చెడదు; "ఆనందో బ్రహ్మ" యను నుపనిషద్వాక్యమున కిదియే అర్థము.

373. "కుతస్త్వాకశ్మలమిదమ్" వాక్యము భగవానుఁడర్జునునకు చెప్పినది. అది అందరకును వర్తించును.

శ్రీకృష్ణుఁడే దేవుఁడు. అర్జునుని రథములో ప్రక్కనే యున్నాఁడు. నేను నిన్నే కోరుదును; నీ సైన్యము నాకక్కర లేదని అర్జునుఁడే చెప్పి యుద్ధరంగమునకు వచ్చెను. దేవుని ప్రక్కనుండి, దేవుఁడాదేశించిన యుద్ధముచేయ నిరాకరించెను. భగవానుఁడైన శ్రీకృష్ణదేవుఁడర్జునుని ప్రక్కనే కాదు, మన అందర ప్రక్కనుండ లేదా? దేవుఁడు లేనిచోటున్నదా? మన యెదుటనుండి, మనకాదేశము లిచ్చుచున్నాఁడు. అర్జునుని వలెనే మనము పెడచెవినిబెట్టి, దేవుఁడు లేఁడనునట్లు ప్రవర్తించుచున్నాము.

374. నీవు నిన్ను రక్షించుకొనవా? నీపై నీకభిమానము లేదా? ఉన్నచో నీకాత్మరక్షణోపాయ మేది? సమగ్ర సర్వకాల రక్షణ శక్తిగల వాని శరణుపొందుము. అట్టివాఁడు భగవానుఁడేకదా! భగవంతుని మనోవాక్కాయములతో నిక్కముగా నాశ్రయించి, నిన్నునీవు రక్షించుకొనుటకు-పెక్కు గ్రంథములు, చదువనేల?

375. శరీరధారణమే మనకు దైవకృప లేదని సూచించును. కాని తుచ్ఛదేహములు కాక, మనుష్యదేహధారణావకాశము వలన మనయందు దేవునికింగొంత దయగలదని స్పష్టము. దీనితో దేవుని ధ్యానించి, దేహ (జన్మ) రాహిత్యము నార్జించుటకు నిశ్చయింపవలెను.

376. నీవు కోరిన సమయమందే, పరమేశ్వరుఁడు కృపచూపలేదని కంగారు పడెదవేల? దైవకృప కాలస్వ

మగుట కనేక కారణములుండవచ్చును. ఆ కారణము లన్నిటిని తెలిసికోఁగల సామర్థ్యము మనకు లేదు. దేవునికి ఁగాలము విలువ తెలియదా?

377. పరమేశ్వరకృప కోరినపుడేకాక, సర్వకాలము లందు లభించును. అనన్య చిత్తముతో భగవాను నర్థింప వలెను. 'అనన్య' శబ్దము ముఖ్యమైనది. పరిపూర్ణమగు నేకాగ్రత, పరిపూర్ణమగు విశ్వాసము, పరిపూర్ణాత్మార్పణము అనన్యభక్తిలో నిమిడియున్నవి.

378. భగవంతుని నిజముగా, పూర్తిగా, నిస్సంశయముగానమ్మితివా? ఇకదైన్యమెందులకు? భగవంతుఁడనగా సరిగా ఁదెలిసికొంటివా? ఆశ్రితకల్పకము; భక్తరక్షణమునకై మితిమీరిన వేగముతో కృపామృతమును వర్షించు దివ్యమూర్తి; అంతియేకాదు; మన మసాధ్యములనుకొన్నవాని నాతఁడత్యంత సులభ సాధ్యములొనర్చు వర్ణనాతీత దయాసాగరుడు.

379. శరీరములను నమ్మిక్షణిక భోగములకై అమ్ముకొనుట-పశుసంప్రదాయము. పశువులకు దేహముతో తాదాత్మ్యము నూటికి నూరువంతులుండును. మానవునకు వివేకమిచ్చినకారణమున నొకప్పుడైన 'దేహము నేను కాద' ను జ్ఞానముండును. దేహములోని లోటుపాట్లు, దోషములు విమర్శించి, యెప్పటికైన నేను 'దేహిని కాని దేహమును గానని తెలిసికొనక తప్పదు. భగవదారాధనమువలన నది సులభముగా దెలియఁగలదు.

380. సర్వకాల సర్వావస్థలలో దేవుని మహిమను గుర్తించి ప్రవర్తించునాతఁడే మహాపురుషుఁడు. మిగిలినవారు వాని మహోన్నత మనస్తత్వము నర్థము చేసికొనలేనివారై యందువలన వాని యెడ మూర్ఖముగా వర్తింతురు. మహా పురుషుఁడు మూర్ఖులమూర్ఖతను సహనముతోఁజూచుట నేర్చి కొని చలింపఁడు. సామాన్యులు చపలబుద్ధు లగుటచే మహా త్ముల ఉన్నత స్థాయికెగుర లేరు. వీరిలో మహా పురుషులకే శ్రమాధిక్యమున్నది కాని దానిని వారు చిరునగవుతో భరించి ఔదార్యము చూపుదురు.

381. ఎవరికొఱకు మనమత్యంత మమకారము అభి మానముచూపుదుమో, వారిచేతనే మనల నవమానముల పాలొనర్చి, భగవానుఁడు విచిత్ర నాటకమాడుచున్నాఁడు. మన మమకారము, అభిమానము తప్పని తెలియజేయుటకే భగవానుఁడట్లు చేయుచున్నాఁడని స్పష్టము. 'అసక్తిరన భిష్వంగః పుత్రదార గృహాదిషు, నిత్యంచ సమచిత్తత్వమిష్టా నిష్టోపపత్తిషు" గీత.

382. దేనిని కోరియైనను సరే, భగవానునే అడుగు టకు నిశ్చయించుకొన్నచో, నింకెవ్వరి నడుగనని వ్రతము పూనినచో, భగవానుఁడు తప్పక నీకోర్కె నిచ్చును. ఏదైన నాతఁడీయఁగలఁడు; తన్నే నమ్మిన వారి కెన్నఁడేదియు లేదనక యిచ్చు అనంతౌదార్యమాయన మహిమ. అట్టి వ్రతమాచ రించువాడు ధన్యుడు.

383. దైవానుగ్రహ మెప్పుఁడెవ్వరిద్వారా, యే రూపమున సంభవించునను ప్రశ్న మనకవసరము లేదు. దేవుని కనంతకోటి మార్గములున్నవి. అవి మన బుద్ధి శక్తి కతీతములు—దైవానుగ్రహము లభించుటే మనకు ముఖ్యము.

384, ఈశ్వర సంకల్పము వలన సర్వము తటస్థించును. ఏది యెందుకుఁ దటస్థించునో మనకుఁ దెలియదు. భక్తుని విషయములో నేది తటస్థించినను, ఆ తటస్థించినది తాత్కాలికముగా నశుభముగా గోచరించినను, అది నిక్కముగా శుభమునే చేకూర్చును. దేవునికి, దైవభక్తునికి అశుభము లెవ్వడును జరుగవు. దేవుని కశుభ మెన్నడును లేదు. భక్తుని కశుభ మాదేవుని రక్షణలోనుండగా నెట్లు సాధ్యమగును?

385. దేవుఁడు దగా చేయునని తలచుట స్వప్నమందైనను మహా పాతకమే. మనుజులెంతటి వారైనను, తెలిసియో, తెలియకయో, పొరపాటు చేయవచ్చును. ఒక వేళ మనయొద్ద పొరపాటులున్నను మనము భక్తులమైనచో మనకు పొరపాటులను సర్దుకొను బుద్ధినిచ్చి బాగుచేయునే కాని మనకు నష్టము కలుగనీయఁడు. దేవునిది నిర్వక్రమైన ఔదార్యము.

386. ఈశ్వరు నెల్లవేళల స్మరించి సేవించుచు నెట్టి శంకలు లేని విశ్వాసముతో మన మున్నచో, మనకెట్టి సంకటములఁగలుగ జేయు తాటస్థ్యము లుదయింపకుండ భగవానుఁడు కాపాడును. భగవానుని సేవకు నెవరు బాధింపఁ

గలరు? ప్రకృతి శక్తులెంత అప్రతిహతములైనను, పరమే శ్వరపాదపద్మముల కంకితజీవనుఁడైన భక్తుని కనుకూలములై వర్తించి, మైత్రినే ప్రకటించును.

387. మనము మంచియుద్దేశముతో చేసినను కొన్ని పనులు చెడు ఫలితములిచ్చును. కొన్ని దురుద్దేశములతోఁ జేసినను మంచిఫలితము లిచ్చును. దీని యర్థమేమి? మన కుద్దేశములు కలుగజేయువాఁడు, మనచేఁబనులు చేయించు వాఁడు, వానికి ఫలితము లిచ్చువాఁడు భగవానుఁడని స్పష్టము. అందరలోని అన్ని భావములకు, పనులకు, ఫలితము లకు నేకైక కారణుఁడైన భగవానుని నమ్మి భజించుటే కర్తవ్యము.

388. భగవద్భక్తునికి, రోగములు, కష్టములు, అరిష్ట ములు ఏలసంభవించును? దేవుఁడు భక్తపాలన పరతంత్రుఁడు కదా? దీనికి జవాబు సులభము. లోపములులేని భక్తునికి దేవుఁడధీనుఁడే. అట్టి భక్తునికెట్టి యనిష్టములు జరుగవు. కాని భక్తునిలోఁగొన్ని లోపములు దోషములు నున్నప్పుడు వానిని తొలగించుకొను నవకాశమిచ్చుటకు, భక్తున కనారోగ్య దారిద్ర్యాది బాధలు కలుగఁజేసి, రక్షించును.

389. శరీర మనారోగ్యగ్రస్తమై, కృశించినపు డధ్యాత్మ చింతనము లభించి, నికృష్టవాంఛలు దూరములై, సత్యవిషయములు నవ్యకాంతిమయములై గోచరించును. కాని, ఆరోగ్యము కలిగి, యించుకంత బలము చేకూరెనా,

ఆత్మచింతనము సడలి విషయచింతనము, కోర్కెలు చిగిరించుటయు.సత్యవిషయములాచ్ఛాదింపఁబడుటయు జరుగును.

390. వేదాంతము నెఱిఁగి ఆచరించుటనగా, వజ్రాయుధము చేఁబూని, ఐరావతము నెక్కి యుద్ధరంగమున దుముకుట వంటిది. తెలిసీతెలియని వేదాంతమనగా పిచ్చిగుఱ్ఱము నెక్కి త్రోవతప్పి, ఆ గుఱ్ఱపుడెక్కలక్రిందపడి నలిగిపోవుట వంటిది. వేదాంతమనగా నేమియు నెఱుఁగని వానిగతి, పాదరక్షలు లేకుండ, చీకటిలో, ముళ్లపొదలపై నడక వంటిది. వేదాంతమునెరిగి, జీవితమందుజూపుఁటత్యంత కష్టమైనదేకాని విజయము సాధించినచో. అవ్యయానంద ప్రదమగును.

391. సర్వ ప్రాణికోటియు భగవంతు ననుగ్రహముపై నాధారపడియే బ్రతుకుచున్నది. ఆ సంగతి నెఱిఁగి, దైవారాధనచేయువారి సంఖ్య స్వల్పము. ఆ సంగతి నెరుగని వారిని భగవానుఁడే కాపాడుచున్నాఁడు. ఎఱిగి ఆరాధించువారి కితరులకంటె ప్రత్యేక సదుపాయములు ముక్తియు సమకూరును.

392. దుఃఖమంతా అజ్ఞాన జన్యము; జ్ఞానికి దుఃఖముండదు; ఏలన జ్ఞానమానందస్వరూపము. అందుచే బ్రహ్మజ్ఞానములేని యెన్నియున్నను దుఃఖము తప్పదు. దుఃఖము తొలఁగి, ఆనందము కావలెనా? బ్రహ్మజ్ఞాన మార్జించు; ఎంత త్వరగా ఆర్జించిన అంతమంచిది కాదా! వేరుమార్గము లేదు.

393. ప్రాణికోటికిఁగలుగు సమస్యలు భగవానుని జూపును. ఎట్లు? జన్మమృత్యుజరావ్యాధి దోషాది సహస్ర

[illegible] వచ్చి మనల త్రిలోకమున బుట్టించినవాఁడీశ్వరుఁడే. [illegible]ంతకాలము సుఖశాంతులు సున్న. వానిని [illegible] పరిష్కరింపఁగలమా? ఒక సమస్య నెదుర్కొని [illegible]ంచుటలో పది వేలసమస్యలు కుప్పలుగా పైఁబడును. దేవునాశ్రయించినఁగాని అవి మనలను విడువవని తెలియుట [illegible]జ్ఞము. దేవునాశ్రయించి వానిని నిర్మూలించుట [illegible]క్తి.

394. భగవానుని పాదపద్మములాశ్రయించుకోర్కె [illegible]లిగి, వాని నిత్యజీవితానుష్ఠానమునఁజూపు పుణ్యాత్ములతో సమానులెవ్వరును లేరు. దేవునాశ్రయించుకోర్కె జనించి [illegible] మాత్రమునఁగాని, యితర కార్యములతోఁబాటు [illegible]నామకముచేసినంత మాత్రమునఁగాని, విశేష ఫలితము [illegible]. దేవునాశ్రయించుట, నిరవధికాభ్యాస బలముచే [illegible] నైజమైనచో నాతని పుణ్యమమోఘ సంకల్ప శక్తి [illegible]ను.

395. భక్తుఁడైనవాఁడేదేని కావలెనని దేవునడుగు [illegible] వానిని దేవుఁడీయకుండుటయు జరుగదు. కాని భక్తుఁ [illegible] అచంచలమైన స్థిరభక్తిగలవాఁడు. సకల దాత, [illegible] దాత భగవానుఁడని అవంత సంశయమును లేకుండ [illegible]చిత్తముతో నమ్మినవాఁడు. భక్తిలోని దృఢత్వతరతమ [illegible]ములనుబట్టి, దైవానుగ్రహము తరతమభేదములతోడనే [illegible].

396. భగవద్భక్తుఁడు కాఁగోరువానికి, దారిద్ర్యము, కఠినమైనదికాదు - భోగముల కవకాశములు తక్కువైన దారిద్ర్యము అనగా ధనలోపము - సకల విధముల నుపకారి యగును. భోగకాంక్షయు ధనలోపముచే, నీరు లేని మొక్కల వలె నెండి నశించును. భోగలోపముచేఁ బుణ్యరాశి పెరిగి, పాపరాశి నశించి, భక్తుని మహాభక్తునొనర్చి ముక్తినిచ్చును.

397. మనము ప్రయత్నము చేయుటయు, మానుటయు రెండును దోషములే. మనలను నిమిత్తమాత్రులుగా నొనర్చి దేవుఁడు మన ప్రవృత్తి నివృత్తులను నడపును. 'నేను' ప్రయత్నము చేసితిని నేను మానితిని అనుకొనుట లేని కర్తృత్వము నారోపించికొనుటే. దానివలన సుఖ దుఃఖ ద్వంద్వముల మధ్య మనము నలిగిపోవుట తప్పదు, లేని కర్తృత్వము లేదని యెరిగి సుఖింపవచ్చును.

398. దైవానుగ్రహము సంపాదించి, చేతఁబెట్టికొని సుఖింపని బ్రదుకు, చావలేని నీచమైన బ్రదుకు, అట్టి నీచ జీవిత కూపమునఁబడికొట్టుకొనుచు "నేను పండితుఁడను, వక్తను, పూజ్యుడను, నాకు పేరు ప్రతిష్ఠలు గలవు" అని చెప్పికొని సంతసించుట, తన దుఃస్థితి నెఱుగని మూర్ఖుని ప్రలాపమే.

399. కామము-కాంచనము, అనగా కాంతా సంగమ సౌఖ్యము ధనాధిక్యముచేఁగలుగు భోగములవలని మధురాహార, చీనాంబర, రమ్యభవన వాహనాదికములిచ్చు

సౌఖ్యము. ఈ రెంటిని సూక్ష్మముగా (బరిశీలించిన వారికి వీనియెడ గోర్కెలు నశించును. వీనిని స్థూలదృష్టితో (దిలకించి భోగించువారికి స్వల్ప తృప్తినిచ్చుచునే కోటి విడని సమస్యలు పుట్టించి దుఃఖమునిచ్చును. సూక్ష్మముగా (బరీక్షించి విసర్జింపవలెను.

400. కామినీకాంచనములు–ఏల దుఃఖహేతువులు? (1) లైంగిక సౌఖ్యము – ఇది యిర్వుర, స్త్రీ పురుష సంపర్కముపై నాధారపడును. దీనికి యౌవనము, బలము, ఆరోగ్యము నిర్వురకుండవలెను. కలియువేళ కిర్వుర కేకకాంక్ష యుండవలెను. అట్టివేళ లరుదుగా నుండును; ఫలితము సంతతి–పోషణము చికాకు–ధనముకావలెను. సంభోగము మరియు క్షణిక తృప్తినిచ్చునేకాని, దేహపాటవమును, ఓజశ్శక్తిని నశింపఁజేయును. వ్యామోహమును పెంచును. వివేకమునణఁచివేయును. ఎంతమంది దంపతులైనను లాభనష్టములను, ఇచ్చిపుచ్చుకొనుటలోఁ గలహములుదయించి, మతులను గలుషితములొనర్చును. మరియు భోగానుభవము అనుభవించుటచేఁదీరదు. నెయ్యిపోసిన జ్వాలవలె విశేషముగా వ్యాపించును. (2) కాంచనము – సంపాదించుట కష్టము; వ్యయించుట దుఃఖమిచ్చును–వ్యయములేని ధనము సుఖమివ్వదు–దాచుట కష్టము; బంధుమిత్రుల బాధ–అందుచే ధనము నిలువచేసినను, వ్యయించినను దుఃఖమే–మరియు ధన వ్యామోహము, ధర్మమును నీతిని, లజ్జను, మర్యాదలను దిగ

ద్రొక్కివేయును-ఈవిధముగా కామినీ కాంచనములు-తాము సుఖమీయవు, సుఖమిచ్చు పరమార్ధమునకై యత్నింప నీయవు-అనగా సర్వ విధభ్రష్టత ఫలము.

401. భోగములు-యౌవనము-దేహదార్ఢ్యము పోయినను-అనుభవింపలేకుంటిమేయని యేడ్పించును - వార్ధక్యము-నీరసము, కార్శ్యము-భోగములనుభవించు బలము లేదేయని దుఃఖింపఁజేయును. భోగవాసనలు సూక్ష్మముగ దేహముల నావరించి, ఎన్ని జన్మములెత్తినను విడువవు-తమ్ము ద్రుంచివేయు జ్ఞానభక్తి వైరాగ్యముల నుదయింపనీయవు - భోగములు సుఖమిచ్చు వానివలె నటించి దుఃఖము లిచ్చును; సుఖమెచ్చటనున్నదో తెలిసికొననీవు-ఈదురవస్థకంతములేదు.

402. దేవుఁడు దేహమును భోగములకొఱకు సృజించెనా? ఇది దారుణమగు నసత్యము. కోటి విధములగు దేహరోగములు-లైంగిక జాడ్యములు-రక్తదోషములు-పరదేహాధారభూతము భోగము-సంయోగము-తత్సుఖము క్షణికమైనను - అవరోధములు కోటి - అంతఃకలహము-పరస్పర శంకలు - అవమానములు - అనారోగ్యములు - వర్ణనాతీత లోపము - ఛీ - దేహమును పై చర్మమును దొలగించి చూచినచో - రక్తమాంసముల ముద్ద - దుర్వాసనతోఁగూడిన స్రావములు - మూత్రపురీషాదికపూరితములు - దేహము భోగమునకుఁగాదు; కాదని తెలిసి. దేహిని (అనగా ఆత్మను) తెలిసికొని - జ్ఞానమునార్జించుటకు ఁగల్పితము.

403. ఏ వస్తువును బరిశీలించినను, ఆ వస్తుమూలము దానికాధారము దేవుఁడని తెలియును. దేహమునట్టి వస్తువే. దేహమును బాగుగాఁబరిశీలించినచో లోపల దేవుఁడగపడును. దైవశక్తిలేక ఆత్మచైతన్యము సర్వదేహములను నడపుచున్నది. అందుచే దేహము, లోనున్న దేవునిజూచుటకై మనకీయఁబడెను.

404. నిజముగా నమ్మియున్నయెడల నే సమయమున నే రీతిగా దేవుఁడడ్డుపడి ఆపదలఁదొలగించి మనల రక్షించునో చెప్పలేము. ఏ సమయమున మనల నాతఁడు కాపాడవలెనో దేవునికంటె నెరిగినవారెవరు? కాని ఒకటి నిశ్చయము. నమ్ము, ధ్యానించు, ఏమరకు, నిదానించు — రక్షణ వచ్చితీరును.

405. మనకింట, బయట సకల విషయములలో సంభవించు ప్రతిఘటనలు, అవమానములు, చికాకులు, నష్టకష్టములు — మనకుఁజిత్తశుద్ధినిచ్చి రక్షించు నిమిత్తము భగవానుఁడు కల్పించినవేయని తెలిసికొని — రాగద్వేషములు, ఉద్రేకావేశములు విడిచి—చిత్తసమత్వమునార్జించుకొనవలెను. అట్టి చిత్తముతో నారాధించిన దైవకృపకలుగును.

406. మనము సాధింపఁజాలని శత్రువులెదిరించినపుడు మన మిత్రులబలము నర్థించి, అధికశక్తితో వారిని జయింతుము. కామక్రోధాదులు మనకు ప్రబల శత్రువులు — ఈ శత్రువుల వశముకాని మిత్రులులేరు. అవి అందరకు శత్రు

వులే. మనుష్యశక్తి వానిని జయింపఁజాలదు. భగవానుఁ డొక్కఁడే వాని నణఁచివేయు శక్తిగలవాఁడు. భగవాను నాశ్రయించితిమా, వానినిక మనమెదిరింప నక్కరలేదు— అవియే పలాయనము చేయును.

407. చేయరాని పనులు — అనగా నిషిద్ధకర్మలు మనము చేయకుండుటకు శక్తివంచన లేకుండ పాటుపడి, అప్పటికి మానలేక చేసితిమేని, మానగల శక్తినిచ్చి రక్షింపుమని దేవునర్థింపవలెనేగాని, నిషిద్ధకర్మలనుచేసి, మనము చేసితిమి కదా యని యెన్నడును సమర్థింపరాదు. నిషిద్ధకర్మాచరణ మధోగతి కీడ్చును — వానిని సమర్థించినచో నింకను నీచమగు నధోగతి పట్టును. మానలేక తప్పుచేసి. తప్పుని యెరిగి, తప్పుచేయకుండు శక్తినిమ్మని దేవునాశ్రయించినచో నిషిద్ధకర్మాచరణ దోషము నశించును. అందుచే నుత్తముఁ డగువాఁడు తనలోని తప్పులనే వెదకి వెదకి పైకిలాగి, శుద్ధుఁ డగుచుండును.

408. దేవుని మహిమ, చిన్న పెద్దవగు సర్వ విషయములలో గోచరించును. "మత్తఃపరతరం నాన్యత్ కించి దస్తి ధనంజయ." నీవు దేవుని మహిమను దెలిసికొనవలె నన్నచో — విడువకుండ అన్నివిషయములను — దైవదృష్టితో — తదేక దృష్టితో బరికింపవలెను. అట్లు పరికించు టభ్యాస మైనచో, మొదట దేవుని హస్తము — క్రమముగా పరిపూర్ణ దైవసాక్షాత్కారమును సిద్ధించును.

409. దైవభక్తునికి - లభించు శుభములన్నియు భగవత్ప్రసాదములు; తటస్థించు కష్టములన్నియు శిక్షా రూపముఁదాల్చిన భగవత్ప్రసాదములే. ఇది సాధన కాలమున భక్తుఁడు శుభాశుభములను గ్రహింప వలసిన పద్ధతి - పూర్ణభక్తుఁడైన నాడన్నియు శుభములే!

410. భగవంతుని విలాస మనంత రూపములుగలది దానిని ఁదెలిసికొనుట, సాధ్యముకానిపని యనుటలో నెట్టి వింతయు లేదు. కాని అధైర్యపడనవసరము లేదు. దేవుఁ డెంతవర కనుగ్రహించునో అంతవరకు ఁదెలిసిన చాలును. దానివలననే మన కనంతమైన ఆనందము లభించును. అప్పా డింకను ఁదెలియవలెనను కోర్కెయే యుండదు. కడుపునిండిన వెనుక నింకను దినవలెనను కోర్కెయుండునా?

411. "భయము లేదు, నీ సమస్యలన్నియు నాకు విడిచి పెట్టుము, నేనే వాని నన్నిటిని సవరణ చేయుదును. మనుజులెంతవారైన నీపని చేయలేరు. నీ లోపములు తొలగించుటకుఁగొన్ని చికాకులు కలిగించినను, "బాబోయ్! యింక భరింపలేన"ని యేడ్చినచో రక్షింతును. బిడ్డలు గట్టిగానేడ్చినచో మనమే చూచి ఊరకుండఁజాలము; మనము దేవుని బిడ్డలము; మనమేడ్చిన నాతఁడసలే చూడలేఁడు.

412. దైవధ్యానాదికము మనము చేయుచున్నామనుకొనుటకంటె దారుణమైన అసత్యమింకొకటి లేదు. మనకొక మనస్సునిచ్చి, ఆయావేళల నాయాభావములఁబుట్టించి,

మన దేహేంద్రియములచే ఁగర్మలు చేయించుచున్న దెవరు? భగవానుఁడే. ఆయన యిచ్చిన మనస్సుతో, పుట్టించిన భావములతో, కలిగించిన దేహేంద్రియాదులతో ఆయనను ధ్యానించుచుండగా నర్థమేమి? దైవప్రార్థనము నిజముగా దేవుఁడే చేయుచున్నాఁడు.

413. రవ్యాదిగ్రహములిచ్చు ఫలితములు మన పూర్వకర్మలచే మనము చేసికొనినవే. ఈ కర్మఫల బంధ విచ్ఛేదమునకు రెండేమార్గములున్నవి. (1) స్వహస్త కృత కర్మఫలితములను వచ్చినట్లనుభవించినచోఁ బోవును. (2) లేదా, నిరంతర భగవద్ధ్యానాగ్ని జ్వాలలచే వానిని దగ్ధము చేయవలెను "జ్ఞానాగ్నిదగ్ధ కర్మాణంతమాహుః పండితమ్ బుధాః"

414. సూక్ష్మముగాఁ బరిశీలించినచో నేదోయొక విషాద సంఘటనములేని దినమొకటియు నీ జీవితములో నుండదు. సూక్ష్మముగాఁ బరిశీలింపని వారికెఁబెక్కు దినములు సుఖముగా గడచినట్లు తోఁచును ప్రతి దినమును అన్నియు మనకిష్టములైనవే జరుగుచుండెనా? వచ్చిన అనిష్టములను గణింపని వారికట్లు దోఁచును. వచ్చిన అనిష్టములు క్లిష్టములై బాధించునపుడే బోధపడును. ఇష్టములు కొన్ని తటస్థింపలేదా? లేదనము; కాని అనిష్టములతోఁగూడిన యిష్టములరిష్టములే.. విషమిశ్రిత క్షీరముల వంటివి.

415. మనమాచరింప నిచ్ఛగింపని సత్యములను సూక్తులను, వినుచుండుట కధికముగా కోర్కె కలుగును.

వినుట చేయుట యగునా యను ప్రశ్న వారి కుదయింపదు. భక్తినిఁగూర్చి వినుట భజించుటగునా? దేవునిఁగూర్చి వినుట, దేవునారాధించి, ఆయన అనుగ్రహమును సంపాదించుటగునా? పెక్కు సత్యములను వేయిమారులు వినుట కంటె, నొకేయొక సత్యము నొకసారి విని దాని నాచరణలోఁ బెట్టుటయే నిజమైన తత్త్వము.

416. నేను భక్తుఁడనని, జ్ఞానినని, సదాచార సంపత్తి గలవానినని, దానధర్మనిరతుఁడనని యితరులు నన్నుస్తవ మొనర్చు చుండవలెనను గోర్కెను విడిచి పెట్టుట కష్టముల లోనికెల్ల కష్టమైనది. నేను భక్తుఁడను, జ్ఞానిని, యోగిని అగుట ముఖ్యము గాదా? నేను భక్తుఁడను జ్ఞానినగుట వలన, నాకు దుఃఖము దొలగుట, శాంతియు నిత్యానందమును కలుగుటయు నిజముగా గావలసినది. ఇతరులు నన్నుమెచ్చి కొనుటవలన నాదుఃఖముపోయి, శాంతి లభింపదు సరికదా, నేను గొప్ప స్తుతిపాత్రుడనని గర్వ ముదయించి ఉన్నకొలది భక్తిజ్ఞానములను నశింపఁజేసి, భ్రష్టునిఁజేయును.

417. నేను దైవ భక్తుఁడనగుటచే, ధనసంపాదనమునకు నా కవకాశము లేదు గావున, యితరులు నన్ను ధనమిచ్చి పోషింపవలెనని తలచుటవలన నేను దైవభక్తుఁడను కానని ఋజువుచేసికొనుటే యగును. నేను నిజముగా దైవభక్తుఁడ నగుచో, నా యిహలోక యాత్ర కవసరము లగు ధన గృహ వస్త్రాదులను భగవానుఁడే నాకు సమ

కూర్చునని నమ్మవలదా? దేవుని నమ్ముటయు, నితరులపై నాధారపడుటయు నన్యోన్య విరుద్ధములగు విషయములు. నమ్మితవా! అన్నిటికి దేవునే నమ్ముము; నమ్మవా, యితరులనే నమ్మి చరింపుము. ఆత్మవంచనమునకుఁబాల్పడకుము.

418. దేవుఁడందరలో నుండి అన్ని పనులును చేయుచున్నాఁడు, దేవుఁడేకైక కర్త; ప్రాణులందరు నిమిత్త మాత్రులు; కేవల ముపకరణములు – కలముతో కావ్యము వ్రాసినచో కావ్యకర్త కలమగునా? రచయిత యే కావ్యకర్తయైన కవి యగునుగదా అట్టులే, పుత్రులు, మిత్రులు, మున్నగు వారు మనకొఱకుఁజేయు సేవలన్నియు, నిజముగా పుత్రమిత్రాదులు చేసిరని నమ్మరాదు. వారిలోనుండి భగవానుఁడే చేయించుచున్నాఁడని నమ్మవలెను. మన కృతజ్ఞత దేవునికే చూపవలెనుగాని పుత్రమిత్రాదులకుఁగాదు.

419. ఏదిజరిగినా జరుగనిమ్ము; భగవానుని మఱచిపోవుటజరుగరాదు. నీవు దేవుని మఱువకున్నచో నిన్ను దేవుఁడు మఱువఁడు. భగవానుని దృష్టిలో నీవెల్లప్పుడున్నచో నీకేది జరిగినను దుఃఖవినాశమై సుఖప్రాప్తి నేయిచ్చునదై యుండును. దేవుని మరచి, మరువలేదని తలపకుము; ఎన్నడు దేవుని మరువకు; ఎన్నడు నీకు దోషమంటదు.

420. మహర్షులు చేసిన జపతపాదులతోఁ బోల్చినచో మనము చేయుచున్న, చేయగల జపతపాదులు లేశమాత్రములే. ఈ లేశమాత్ర జపతపాదులనుగూర్చి ఘన

ముగా భావించి విజృంభించుదుము; భగవంతుని కందరును గావలెను. అందరలోనుండి అనేక రీతులలో వారికిని భక్తి జ్ఞానాదులను గలిగించుచుండును. అందుచే మన మాధ్యాత్మికముగా నితరులకంటె నధికులమని తలచి పతితుల మగుదుము.

421. 'అజ్ఞశ్చాశ్రద్ధధానశ్చ సంశయాత్మావినశ్యతి' గీత. అజ్ఞాని-జ్ఞానహీనుఁడగుటచే చెడియున్నవాఁడే. శ్రద్ధలేని వానికి శ్రద్ధగలవాని ఫలితమెట్లు వచ్చును? ఇఁక సంశయాత్ముఁడు, ఇతఁడు దేవుని నమ్మఁడు; నమ్మి శంకించును; ఇది వినాశమునకు దారి. నిస్సంశయమైన విశ్వాసము నెల్లప్పుడుంచుకోగల వానికెన్నడును పతనముండదు.

422. మానవుఁడు నిజముగా దుఃఖమును గోరుచున్నాఁడు. కాని సుఖమునుగాదు. ఏలన గర్భనరకాదు లెన్నిమారు లనుభవించి, జరామరణ, రోగాది బాధలెన్నిమారులు తిటస్థించినను, విసుగు విరామము లేకుండ మరల నేకాంత గర్భమందో జేరుట కువ్విళ్లూరుచున్న మన మేమి కోరుచున్నామని చెప్పవలెను? దుఃఖమును పోగొట్టుకొను కృషి యేలచేయుటలేదు? గుడ్లగూబ చీకటినే కోరును; వెలుగు చూడఁగోరదు. మనమునంతే.

423. ఈ లోకములో నొకచోటిచ్చి, దేహేంద్రియాదులిచ్చి, "నీ విచట నుండుము; ఇది తినుము, ఇది కట్టుము. ఈపని చేయుము; ఆ పని చేయకుమ"ని లోపల నుండి భగవానుఁడు నడపుచున్నాఁడు. ఇక 'నేను' చేయుట,

అనుభవించుట, మానుట యెచటనున్నది? దేహము, ప్రాణము, కదలిక కోరిక, తలపు, మరపు, అన్నియు దేవుఁ డిచ్చినవే 'నేనె' క్కడ? ఇది తెలిసిన వాని నేకర్మయు బాధింపదు.

421. "ఏకం సాఖ్యంచ యోగంచయఃపశ్యతి, సప శ్యతి." గీత. దీని కర్థమును సరిగా నిర్ణయింపవలెను. జ్ఞాన యోగము, కర్మయోగము నొకటేయని. అవి రెండు పద్ధ తులుగావు. ఒకే పద్ధతికి రెండు నామములని అర్థము, ఎట్లు? కర్మయోగమనగా కర్మరహస్యము; జ్ఞానమే. 'యోగఃకర్మ సుకౌశలమ్.' అని చెప్పబడెను-ఆకౌశలమేది? (1) కర్మ స్వధ ర్మము కావలెను. (2) నిస్సంగ బుద్ధివలయును. (3) ఫలా సక్తి లేకుండవలెను. (4) దైవ సమర్పిత చిత్తము కావలెను. ఈ నాలుగును గలిగినచో 'కర్మలన్నియు నీశ్వరుఁడే చేయు చున్నాఁడని తెలియును. దేవుఁడేదైన మనచేఁజేయించినచో దేవుఁడు చేసినదగునుగాని మనము చేసిన దెట్లగును? దేవుని మహిమను గుర్తించుటే కర్మరహస్యము. అదియే జ్ఞానము. రెండు నొకటి కాలేదా? ఈ జ్ఞాన కర్మల రహస్యము చూచిన వాఁడే చూచినవాఁడు.

425. ప్రస్తుతనాగరికతలో 'సమానత్వము' బోధింప ఁబడుచున్నది. మానవులందరు సమానులని బోధ. దాని కపార్థము కల్పించి, లైంగిక సమానత్వమును బోధించు చున్నారు. సమానత్వమున కర్థమేమి? దేహములు సమా

నమా? మనస్సులు సమానమా, బుద్ధిశక్తులు సమానములా, సంస్కారములు సమానమా? అన్నిటిలో తారతమ్యము లున్నవి. స్త్రీ పురుషులు సమానులా? భేదములున్నవి. సమానత్వమనగా భేదములు తుడిచిపెట్టుటకాదు. అది సాధ్యముకానిపని. సామాన్యులు భేదములు చూచుట తప్పదు; మహాత్ములు సమదృష్టితో నందర లోపలనున్న ఆత్మైకత్వమును దర్శింపఁగలరు. వారి సంఖ్య అత్యల్పము. సామాన్యులు సమానత్వమును బోధించుట, రాగద్వేష వశులగుటచేతనే. అందుకే వారు బోధించినకొలది, అస మానత లెక్కువగుచున్నవి.

426. ప్రపంచములోని మనుజులందరు పిచ్చివారే! ఒక పిచ్చివానిని పిలిచి నీవెవరని యడిగినచో 'నేను కలక్ట రును, గాడిదను; శుద్ధశుంఠను, మహాపండితుడను" అని నోటికి వచ్చినట్లు పలుకును. ప్రజ లదేరీతిగా, తమ యింటి పేరు, నామము. గ్రామము, ఉద్యోగము, ఆర్జించిన ధనగృహ కీర్తులను చెప్పుకొందరు, నిజముగా నివన్నియు వారు కారు. మనమెవరము. మన నిజస్వరూపములను దెలిసికొనకుండ, మనము కాని వానిని గూర్చి మనమని చెప్పికొనుట పిచ్చి తనముగాదా? 'మనము' నిజముగా పరమాత్మయే యని ఉపనిషత్తులు చెప్పుచున్నవి. 'తత్త్వమసి'. అదియెరుగని మన వచనము లన్నియు అజ్ఞాన జనితోన్మాద ప్రలాపములే!

427. నీకేది కావలసినను నీవడిగినయెడల భగ వానుఁడు తప్పక యిచ్చును. కాని యింకెవరి నడుగకుము;

భగవాను నడిగినప్పుడు పరమ విశ్వాసముతో నడుగుము. దృష్టి మరెవ్వరిపైన ప్రవేశింపకుండ, జూచుకొనుము. తప్పొప్పులతో నిమిత్తము లేకుండ నీ వడిగినది యిచ్చు అనంత శక్తి, అనుగ్రహము భగవానునికే కలదు. చిత్త శుద్ధితో నమ్మి, అటులడిగి, ఫలితము చూచికొనుము. ఈ ధర్మము నభ్యసించి, ఫలితముల జూచి, దేవుని మహిమను గుర్తించి ధన్యుడవగుము.

428. సకల చేతనా చేతనములలో నిండియున్న పరమాత్మ శక్తియే 'నా' నిజ స్వరూపమైనచో అదియెంత అద్భుతవిషయమో కదా! అందరి సుఖములు, దుఃఖములు, అనుభవములు 'నావే' యగును. అన్నియు 'నేనే' అన్నియు 'నావే'. సూర్యచంద్ర నక్షత్రములు, మహాసాగరములు, పర్వతములు, ఆకాశాది పంచభూతములు, నాశక్తి యగు పరమాత్మ శక్తిచేతనే నడచుచున్నది. ఇక నే నల్పుడను, దిక్కులేని వాడను, మూర్ఖుడను, అని అజ్ఞానముచే విల పించుట తగదు.

429. దేవుని సమ్ముటవంటి అత్యద్భుత వినోదముతో సమానమైన వినోద మింకొకటిలేదు. లోకములోగొన్నియే వినోదములు, అన్నియుగావు. కాని లోకములో నేమి జరిగి నను దేవుని వినోదములే. అయినచో విషాద దుఃఖ ప్రమాద ములును వినోదము లెట్లగునని ప్రశ్నింపవచ్చును. నీవు నిజ ముగా దేవుని నమ్మినచో, విషాద దుఃఖ ప్రమాదాదికము

లన్నిటిలో వినోదమే గోచరించి, ఆనందమే వెల్లివిరియును. నీవు నమ్మి, దేవుని లీలలను దిలకించి, పులకించి, తన్మయుఁడవై, ఆనందింపఁగలవు. 'ఆనందో బ్రహ్మేతి'.

430. నీ వేపనిచేసినను, దాని వలన నీకు దోషము కాని పాపము కాని అంటకుండ జేసికొను నత్యంత సులభ సాధన మొకటి యున్నది. నీకు దెలిసినంతలో ధర్మాధర్మముల పరిశీలించి, ధర్మమైన దానినే చేయుము; ఒక వేళ అధర్మమని తెలిసియు, మానలేక చేసినను చేయుము; కాని ధర్మమో, అధర్మమో యేదిచేసినను – సర్వ కార్యకర్తయు దేవుఁడే యని స్పష్టముగా నెరిగి, 'నేను' కర్తను గానని త్రికరణ శుద్ధిగా నమ్ముము. అప్పు డేకర్మఫలమును నీ కంటదు.

431. నీవు లోకుల నుద్ధరింపవలెనను కోర్కెను బెట్టుకొనకుము. నిన్ను నీవుద్ధరించుకొను పని చూచికొనుము. నీ కడుపునిండు నన్నము నీకే లేనపుడు లోకుల కన్నదానము చేయఁగోరి యేమి లాభము? కామక్రోధాదులను జయించితివా? సకల దుఃఖముల బోగొట్టు బ్రహ్మజ్ఞానము దొరికినదా? లేకున్న నితరుల కుపదేశించు కాంక్ష నెన్నఁడును బెట్టుకొని నగుబాటుచెందకుము.

432. భయమును జయించు నుపాయమున్నది. మనల బాధించున దేది యైనను భయ కారణమే. మనకు దేనివలన బాధ కలుగకుండు శక్తి లేదని భయము. మనము దేనికి లొంగకుండు, అనంతమైన శక్తిని సంపాదించినచో, నే యితర శక్తులైనను మన శక్తికంటె అల్పశక్తులే

అగును. అప్పుడు భయముండదు. అట్టి అనంత శక్తినే, ఆత్మయని, పరమాత్మయని, పరమేశ్వరుఁడని ఉపనిషత్తులు పలికినవి. అంతియకాదు. మన నిజస్వరూపమూ అనంత శక్తియే యనియుఁజెప్పినవి. ఈ సత్యమును నమ్మి అనుభవపూర్వకముగాఁదెలియుటే అభయమ్. "అభయమ్ వై బ్రహ్మ" ఉపనిషత్తు.

433. అద్వైతవాదము నతి సులభముగా గ్రహింపవచ్చును. పరమాత్మ లేక బ్రహ్మ లేక భగవానుఁడు సర్వత్ర బాహ్యాభ్యంతరములలో వ్యాపించి యున్నాఁడు కదా! 'నేను' 'నీవు' జగత్తు ఎచటనున్నవి. మనము మినహా దేవుఁడు సర్వవ్యాపియైనచో సర్వవ్యాప్తిశబ్దమసంగత మగును అందుచే సర్వము బ్రహ్మమయమే. వికార వస్తుజాతమంతయు భ్రాంతి లేక మాయా కల్పితము. అదియు బ్రహ్మమయమే. కావున 'నేను' 'మీరు' సర్వము బ్రహ్మమే, ఇది అనుభవ సిద్ధమైనచో మోక్షము.

434. "నాకేమి లోటు? అనంతశక్తి సామర్థ్య మహిమలు, అఖండ కృపారస పరిపూర్ణతగల మాతండ్రిగారున్నారు, ఉండుటయేకాదు అత్యంతసమీపస్థులై యున్నారు. అనంత బ్రహ్మాండకోటిని సంకల్పమాత్రమున సృజించి, అనంత ప్రజ్ఞతో నడుపగల సమర్థులు. దైన్యవిషాద భయాదులు నాకేల?" అని దైవభక్తుఁడు మీసము మెలివెట్టి చెప్పికొని చక్రవర్తులకైన లేని దర్పముతో జీవింపవచ్చును,

దేవుఁడుండుటయు, నమ్ముటయు, స్మరించుటయు – భయాందోళనలు పొందుటయు విరుద్ధములు. ఈ సంగతి గుర్తించి, నిత్య దరహాసవదనుఁడవై హాయిగాజీవించి ధన్యుఁడవుకమ్మ!

435. నీవు జితేంద్రియుఁడవుకాఁగోరుదువా? స్వయం కృషివలన నది సాధ్యపడదు. ఏలన నింద్రియములు ప్రకృతి చపలములు – దేవుని మాయాశక్తి కల్పితములు. దైవ కల్పితమగు మాయాశక్తి దైవాధీనమై యున్నది. మనుజులు తమ అల్ప శక్తిచే దానిని జయింపలేరు. దేవునాశ్రయించుటే మార్గము. అందుచే నీవు జితేంద్రియుఁడవుకాఁగోరుచో భగవానునాశ్రయించుటే యేకైకమార్గము. "మామేవయే ప్రపద్యంతే మాయామేతాం తరంతితే" గీతలో దేవుఁడే చెప్పినాఁడు.

436. బ్రదికియున్న ప్రతి క్షణము మరణకాలమే. "నిత్యం సన్నిహితో మృత్యుః" మృత్యువును జయింపవచ్చును. ఎట్లు? పరిశుద్ధ చిత్తముతో దేవుని స్మరించుట వలన. పరిశుద్ధ చిత్తమెట్లువచ్చును? చిత్తములో కామములన్నిటినిఁదొలగించి, దేవునికేస్థానమిచ్చుట వలన. కామములను ఁదొలగించుటెట్లు ? నిరంతర దైవ స్మరణముచే నవి తొలగిపోవును. చిత్తములో నేకోర్కెయున్న నట్టి జన్మమెత్త వలసి వచ్చును. 'ఆ వచ్చు జన్మ మెట్లుండునో! అది తుదిలేని గొలుసు. జన్మరాహిత్యము గొలుసును త్రెంపి వేయుటే. అదియే ముక్తి. దేవునాశ్రయించుటే ముక్తికి యుక్తి.

437. శ్రీమద్భగవద్గీతాసార మేమనగా, శ్రీ కృష్ణు నుపదేశమిట్లు చెప్పవచ్చును: "నేను లేనిచోటు నేనుకాని వస్తువు లేదు. నన్ను నమ్ము; నీ దోషము లన్నియు నశించి, మోక్షము లభించును" మనము కదలుచున్నాము; దేవునిలో దేవునిపై. దేవుఁడు తన్నాశ్రయించిన వారి నుద్ధరించి, రక్షించు పరమకృపాసాగరుఁడు. అందుచే, నీకున్న దేహ మనో బుద్ధీంద్రియ ప్రాణసర్వస్వము మినహాయింపు లేకుండ శ్రీ కృష్ణప్రభు పాదారవిందములపై సమర్పించి, నీయిచ్ఛ వచ్చిన రీతి జీవించుము; నీకు ముక్తి యీ జన్మములోనే లభించుట తప్పదు.

438. తెలిసికాని, తెలియకగాని తప్పులు, నిషిద్ధ కర్మలు చేసితినని విచారించుట నిరుపయోగము. మానవ జన్మమే పుణ్యాపాప సమ్మిశ్రితము. పాప కర్మలు చేసితి వేని, వానిని గుర్తించి, అట్టి కర్మలు చేయకుండు బుద్ధి నిమ్మని పరమేశ్వరునే ధ్యానించుము. అన్ని పాపములకు మందు పరమేశ్వరాశ్రయమే. నీవు పరమేశ్వరు నాశ్రయించుట మొదలిడినచోఁ బాపములు చేయు బుద్ధి క్షాళితమై తప్పుచేయుటయే ఆపైని జరుగదు.

439. భగవానుఁడు తన్నునమ్మిన భక్తులఁబరీక్షించునని చెప్పుదురు. భగవానుఁడే మనలను స్వయముగాఁబరీక్ష చేయునంతటి అదృష్ట భాగ్యము కలుగుట ధన్యతకు హేతువు కాదా? భక్తుని పరీక్షించుట, పరీక్షింపకుండ భక్తుని మనస్తు

త్వమును భగవానుఁడు తెలిసికొనగలఁడు. కాని పరీక్ష భక్తుని కొఱకు మాత్రమే, భగవానుని కొఱకు గాదు. భక్తుని భక్తిని సుస్థిరమొనర్చుటకే. క్లిష్ట పరిస్థితులు సంభవించునపుడు, మనము భగవానుని, మరచుట, విమర్శించుట. నిందించుట జరుగకుండ, నిశ్చలభక్తిని నిలుపుకొను నభ్యాసము కొఱకే దేవుఁడుచేయు పరీక్ష.

440. భక్తుఁడు భగవానుని బరీక్షించుట కర్హత కలవాఁడు. భక్తుని బరీక్షించుటకు భగవానుని కర్హతగలదా? లేదా యను ప్రశ్నయే లేదు. భగవానుని బరీక్షించుటకు భక్తునికిగల అర్హతను భగవానుఁడిచ్చినదే. భక్తుఁడు తన సాధనకాలములో, భగవానుఁడు తనజీవయాత్ర నేవిధముగా నేయే సందర్భములలో నడపి రక్షించుచున్నాఁడో, పరీక్షించి తెలిసికొను చుండు టవసరము. సర్వకాల సర్వావస్థలలో దన్ను గంటిని ఱెప్పవలెఁగాపాడుచున్న భగవానుని దివ్య కృప నర్థముచేసికొని. తన భక్తిని పరిపూర్ణమొనర్చుకొను టయుఁదరించుటయు జరుగవలెను. భక్తుఁడు తదేక ధ్యాన చిత్తుఁడై దేవుని జాడలఁ బరికించు నభ్యాస మఖండానంద ప్రదమై ముక్తి హేతువై, సిద్ధభక్తుఁడగుటకు తోడ్పడును.

441. ఎక్కడికి బోవుటో తెలియకుండ ప్రయాణము చేయు మందబుద్ధులుందురా? మనమందర మట్టివారమే! మరణ కాలము వరకు, తరువాత మరణానంతరమున నెచటికిఁ బోవుటయో మనము విస్పష్టముగా నిర్ణయించుకొని జీవ

యాత్ర జరుపుచుంటిమా? గ్రుడ్డి యెద్దు జొన్నచేనులో వలె మనము పయనించుచున్నాము. పుణ్య ధన మార్జించుచు, దేహము పడిపోయిన వెనుక, మెట్టిశ్రమయు లేని పుణ్య లోకములకుఁదిరిగి యీ ప్రయాణపుబెడద లేకుండ శాశ్వత బ్రహ్మలోక నివాససిద్ధికి, మనము పోవు కార్యక్రమము ననుసరించి మన యాత్రనడపు చున్నామా? సర్వజ్ఞులైన మహర్షుల వాక్యముల నమ్మి యీశ్వరారాధనచేసి, యీశ్వ రానుగ్రహము సంపాదించుచున్నామా? కన్నులు మూసి కొని నడచి పాడుగుంటలలోఁబడి పోవు వ్యర్థ జీవితములను గడపు మన దురవస్థ వర్ణనాతీతము.

442. ప్రచండ ప్రకృతి శక్తులగు భూకంప, మహా మారుతాగ్ని భయాదులు నీవున్నచోట నుండవు. గ్రహ నక్షత్ర దోషములు నిన్నంటఁజాలవు. రోగ దారిద్ర్యపీడలు నీకెన్నఁడు తటస్థింపవు కామక్రోధ విద్వేష శతృత్వములు నిన్ను సమీపింపనేరవు. కారణము తెలియదా? పైదోష ములకన్నిటికి విరుగుడున్నది. భగవంతుని శక్తియే అన్ని టికి విరుగుడు మందు. దేవునాశ్రయించు – అది సర్వదోష పరిహారము !

443, మనము నిజముగా భగవద్రాజ్యములో నున్నాము, సర్వ ప్రపంచము నెల్లప్పుఁ డేలుచున్నవాఁడు భగవానుఁడే. సర్వత్ర, సర్వవిషయములలో నీశ్వర శాస నమే అమలు జరుగుచున్నది. సర్వకర్తృత్వ మీశ్వరునిదే.

లోకములోని ప్రభువులు, వారి శాసనములు నిజముగా భగవానుని సంకల్పములే. ఎవఁడు భగవానుని చిత్తశుద్ధితో నమ్మి, సర్వమీశ్వరార్పణ బుద్ధితో జీవించునో, వాని కుపకారముగనే సర్వలౌకిక శాసనములు జరుగును. దైవ విరోధులకు దుశ్శాసనములు వర్తించి బాధించును. దేవుని నమ్మి చరించి దైవరాజ్యమందు సర్వసుఖములతోఁజీవింపుము.

444. మనఃప్రసాదము కలిగియుండుట ముఖ్యము. ప్రసన్న చిత్తుఁడే విషయమును బరిశీలించినను, సులభముగా వస్తు సత్యము ప్రత్యక్షమగును. కోర్కెలు, మదగజముల వలె మనస్సను కాసారమును కలచివేయును. కలిగిన కాసారములో సూర్యుఁడు ప్రతి ఫలింపనటులే, కోర్కెలచేఁ గలత చెందిన మనస్సులో సత్యము ప్రతిబింబింపదు. భగవానుని కర్పించిన మనస్సు భగవన్మయమై సుస్థిర శాంతిమయమగును. మనః ప్రసాదము, సత్యసందర్శనము, మోక్షము నిత్యసంబంధముగలవి.

435. ఎప్పుడేమి యెవరివలన నేరీతిగా జరిగినను, - ఇది యెల్లప్పుడు జ్ఞాపకముంచికొనుము – ఆ జరిగినది భగవానుని సంకల్పము వలననే జరిగినదని నిస్సంశయముగాఁ దెలిసికొని–భగవానుని కీర్తింపుము. సర్వకర్తయైన భగవంతుఁడట్లు కీర్తించు నీకేది జరుగుట సుఖకరమో, శాంతిప్రదమో, జ్ఞాన హేతువో, మోక్షకారణమో అదియే జరిగించును–ఇట్లు చేసిచూడుము. భగవానుని మహిమ గాంచి ఆనందపారవశ్యమునందెదవు.

446. నిన్ను నీవెన్నడు హీనపరచుకొనకుము. నే నెందుకును పనికిరానివాడనని భావించితివా, నీకు దురవస్థ తప్పదు. మహాకార్యములొనర్చు మహాశక్తిబీజము లందరిలో నున్నవి. ఆత్మవిశ్వాసముచే నాబీజములు మొలకెత్తి మహా వృక్షము లగును. పరమేశ్వర సాక్షాత్కారముకంటె మహా కార్య మెద్దియును లేదు. దైవానుగ్రహముపొందుట నా జన్మ హక్కని నమ్ముము. దానికి వలయు సాధన మత్యంత శ్రద్ధా భక్తులతోఁ జేసి కృతార్థుఁడవు కమ్ము. కృతార్థుఁడవు కాక పూర్వమే కృతార్థుఁడనని భ్రమించి గర్వింపకుము. ఆత్మవిశ్వా సము వినయముతో మైత్రి గలది. దైన్యగర్వములన్నిటిని నాశ మొనర్చును.

447. మతగ్రంథములన్నిటిలో భక్తిజ్ఞానమోక్షము లను సంపాదించు నుపాయములు విరివిగాఁ జెప్పఁబడియున్నవి. వానిలో వైదుష్య మార్జించి సంతసించుట నిష్ప్రయో జనము. వాని సారాంశమును కొలది మాటలలోఁ దెలిసికొని ఆచరించి, ఫలితములను సాధించుటయే వివేకవంతుని లక్ష ణము. ఈ సారాంశ మేవ్యక్తికావ్యక్తి తన ఉపాధి స్వభావ శక్తుల ననుసరించి, తానే రూపొందించుకొనవలెను. భగవ త్కటాక్షమను ఫల మందరకొకటే. కాని దాని నందుకొను కృషి యేవ్యక్తి కావ్యక్తియే నిర్ణయించికొని పనిచేయవలెను. అందుకే "ఉద్ధరే దాత్మనాత్మానమ్" అని గీతలో దేవుఁడే పలికెను.

448. నీవు కామక్రోధాదుల నరికట్టితివా? ఇంద్రియ సుఖాభిలాషలను నిర్మూలించితివా? జపతపోవాసాదిక మేమైన చేసితివా? ఇవి అవసరములే యైనను. ప్రధానాంశములు గావు. కాముని జయించిన వాఁడొక్కఁడే గలఁడు, ఆతఁడే శివుఁడు. అందుకే శివుడొక్కఁడే జితకాముఁడు; మన మందరము కామజితులమే. శివునాశ్రయించితివా, నీవును జితకాముఁడవగుదువు. నీ జీవిత సర్వస్వమును శివుని పాదముల కర్పించి శివానుగ్రహముచే జితకాముఁడవై, ముక్తి కాంతా పాణిగ్రహణ వైభవము ననుభవింపుము.

449. మర్మాంగమునుండి రక్తాది స్రావములతోఁ గలిసి బయలుపడుట, భూమిపైఁ బడినది మొదలు మరల భూమిపాలగు వరకు భుక్తి భోగకాంక్షలు, వాని నార్జించు మితిలేని శ్రమ, రోగరాగ బాధలు, తుదకు దేహమున కంత్యక్రియలు, – అంతయు క్లిష్టకష్ట దుఃఖమయమే – ఇట్టి దేహమిచ్చినందుకు దుఃఖించుటకుబదులు దానిపై వ్యామోహము పెట్టుకొనుట; ఇట్టి లక్షణములే గల ప్రాణులతో జీవించుట– అంతయు దుస్థితి కాదా? ఈ దుస్థితి నుండి బయటపడు నుపాయము, కృషి చేఁదొందరగా ఁజేయవలదా?

450. చిన్న మేకపిల్లను, కోరలు సాచి, అన్ని వైపుల ండి మొరుగుచు మీఁదబడనూహించు క్రూర శునకముల పె, రోగములు, లేమి, కోటి విధములైన అనిష్టములు, ఃఖములు, మనపైఁబడి పీడించుచుండగా ఁజలింపని చిత్త

ముతో, ధైర్యముతో వానినెదుర్కొని, సముచితోపాయ కృషితో బయట పడిన వాఁడే ధన్యుఁడు. సముచితోపాయము దైవారాధనమే; కృషిదైవము నాశ్రయించి విడువకుండుటే. ఇట్టి ఉపాయము, కృషి లేని వారికేఁబట్టు దుస్థితి నెవఁడును వర్ణింపఁజాలఁడు.

451. ఆశ్రితరక్షణమునకై బద్ధకంకణుఁడైన పరమేశ్వరుని నీవాశ్రయించి, సేవించుచుండగా, నా పరమదయానిధి నీవిషయములోఁ దన ఆశ్రితరక్షణవ్రతమును విడిచిపెట్టి, వేరొకరీతిగా ప్రవర్తించునా ? త్రికరణశుద్ధిగా దేవుని నీవాశ్రయించితివో లేదో చూచుకో, అంతే. అంతకంటె నీవు చేయవలసినది లేదు. కోటివిధముల భగవానుఁడు నిన్ను రక్షించి సర్వశుభముల నొసగుటలో నెట్టి సంశయమును వలదు, వలదు, వలదు, కోటిసార్లు వలదు.

452. భగవానుఁడు భక్తులకుఁగష్టములిచ్చి, వారిలోని పాపములను, దోషములను పోఁగొట్టి వివేకవైరాగ్యములను గలిగించి రక్షించునని చెప్పుదురు. తనభక్తులకు గష్టములీయకుండ వారి పాపములను దొలగించి కాపాడలేఁడా ? అట్లు చేయుఁడా ? ఎందుకు చేయఁడు ? నన్ను బాధలుపెట్టకుండ వైరాగ్యవివేకములిచ్చి రక్షింపుమని త్రికరణశుద్ధిగా గోరిన వారి కటులే చేయును. భగవానుఁడు చేయరానిది, చేయలేనిది లేదు. నీ వేమి యెట్లుకావలెనని కోరిన నదేరీతిగా వాని నిచ్చి రక్షించుటలో భగవానునికి సాటిలేదు. సర్వదా నిశ్చల భక్తుని కాతఁడెల్లప్పుడు వశుఁడే.

453. భగవంతుని మాయాకల్పిత శక్తిమహిమ పరమాద్భుతమైనది. మనము భగవానుఁడేకైక కర్త యనియు సర్వము నాతఁడే చేయుటయుఁ జేయించుచుండుటయు జరుగుచున్నదని, నిస్సంశయముగా నెరిగియు మన కనిష్టములు సంభవించునపు డాయనిష్టకారకులు, మన బంధుమిత్ర శత్రువర్గములో నెవరో అయియుందురని వారిని దూషింపనారంభించి, మనసులో వారిని ద్వేషించుట కారంభింతుము! దీనియర్థమేమనగా, ప్రత్యక్షముగా మనుష్యులను, పరోక్షముగా భగవానుని దూషించుట ద్వేషించుట యగును. భగవానుఁడేకైక కర్తయై యుండగా నీవు కర్తవుగావని పరోక్షముగా దేవుని దూషించుటే యగును. ఇట్టి భ్రాంతికి వశులై ప్రవర్తించువారు సామాన్యులుగారు; విద్వాంసులు, మేధావులు, తత్త్వజ్ఞులును! వా రేమిచేయుదురు? అప్రతిహతమైన భగవానుని మాయాశక్తిని ఋజువు చేయుచున్నారని స్పష్టము.

454. ధనము చాలదని దుఃఖించుచుంటివా? దుఃఖించుట మాని దేవునితోఁ జెప్పికొనుము; ఆరోగ్యము లేదని మూల్గుచుంటివా, దేవునియెదుట నిల్చి ఆరోగ్యమిమ్మని కోరుము; నిన్నేది బాధించినను, వెన్వెంటనే భగవానునితో ముచ్చటించుము. అటులే జన్మజరామృత్యుభీతిచే వణకుచుంటివా? వణకుట మాని భగవానుని పాదములపైఁ దలమోపి మొర వెట్టి తెలుపుము. అందుచే నెన్నఁడు దుఃఖింపకుము భయపడకుము, దైన్యమందకుము; చలింపకుము. ఏలన సర్వ

లోపదోషములను నిర్మూలించి సర్వశుభములిచ్చు సర్వ లోక ప్రభువు నీ కత్యంత సన్నిహితుఁడై యుండగా నీ కేమి లోటగును ?

455. లోకమంతయు నీకు సుఖప్రదమై, అత్యంత మధురశాంతి నిచ్చునదై యుండవలెనని నీవు కోరుదువు. దానికి సూక్ష్మమైన ఉపాయమున్నది. నీవొకపనిలో నిమ గ్నుఁడవై యెల్లప్పు డేమరకయుండవలెను. ఆపని యేదం దువా ? వినుము. నిరంతరము నీమనస్సును తోమి తోమి కడిగి పరిశుద్ధము చేయుచు, సర్వభూతహితరతుడవగుచుం డుట నేర్చికొనుము. ఇందు రెండంశములున్నవి. (1) అన్ని పనులు మాని, యేదోషములు మనస్సునందు ప్రవేశింపకుండు నొకగోడను మనస్సునకు చుట్టు కట్టవలెను. (2) ఆగోడయేది? నిరంతరపరమేశ్వరాశ్రయ స్మరణసంకీర్తన ధ్యానాదికమే. ఈ చిన్నపనిచేసి సుఖింపలేవా ?

456. మన మింకొకపట్టణమో, గ్రామమో జేరినపు డచటి బంధుమిత్రులు, మనలఁగలిసి, ఉచితమర్యాదచూపి, "తామింక నిచట నెన్నిరోజులుందుర"ని యడుగుదురు. "నాల్గుదినములుండి వెడలిపోదుమ"ని చెప్పుదుము. అటులే, "యీ లోకములో దమరెన్నాళ్లుందుర 'ని ప్రశ్నించినచో, సరిగా చెప్పలేము కాని, యీలోకములోఁ బోరుగువారి వలెనే కొన్నాళ్లే ఉండుట జరుగునని మనమెరుగుదుము; ముందు ప్రయాణము సుఖముగా జరిగి, మనము పోవలయు

చోటు సర్వశాంత్యానందప్రదమగుట కేమికృషి చేయు చున్నామని ప్రశ్నించుకొనవలదా ?"

457. నిజముగా భగవానుడు మనకు దర్శన మిచ్చుచో మనమాయన దివ్యతేజస్సునెదుట నిలువలేము; ఆయన కోటిసూర్యప్రభనెదుట మన దేహము నిలువదు. భగవానుఁడందుకే మానవదేహము ధరించి. అవతారరూప ములుగను, తదితరభక్తుల ననుగ్రహించు సౌమ్యరూపముల లోను దర్శనమిచ్చును. అర్జునుఁడంతవాఁడాయన సౌమ్యరూప మునే కోరెను. భగవానుని ఘోరరూప మాయనకు భీతి కలిగించెను.

458. మనము హృదయమిచ్చి మాట్లాడుట కర్హులు లోకమున లేరనియే చెప్పవచ్చును. ఏ కొలదిమందియో మహనీయులున్నను, వారు మనకు మిత్రులుగా లభించు టయు నరుదుగా (దటస్థించును లోకులందరును రెండునాల్క లతో మాటాడువారే; స్వార్థపరులే, అందుచే మనము వారి నేమనియు నిష్ప్రయోజనము. వారితో మితముగాను యుక్తి తోడను, సత్యమును విడువకుండగను మాటాడి కాలము గడుపవలెను. కొంతకాలమైనవెనుక వారిదోషములు ప్రతి ఫలమొసగి బోధించునపుడు వారు తెలిసికొందురు. మన హృదయము విప్పి యిచ్చునపుడు, తదనుగుణముగా హృద యము విప్పి అనుగ్రహించునాతఁడు భగవానుఁడొక్కఁడే. ఈ రహస్యమెరిగి మనహృదయ మీశ్వరాయత్తమొనర్పవలెను.

459. బట్టలు కప్పనియెడల, చీముకారుచున్న పుండు వలె, స్త్రీ పురుష మర్మాంగములు, నిరంతర దుర్గంధములైన స్రావములతో బయల్పడి బుద్ధిగలవారి కందరకు తీవ్ర జుగుప్సను కలుగఁజేయును. అందుచే వస్త్రులు, ఆభరణములు శరీరమందలి దుష్టభాగములను కప్పిపుచ్చి, జుగుప్సలేకుండ జీవించుకొనుటకే, ఈసంగతి మరచి, ప్రజలు, ముఖ్యముగా నేటి ప్రజలు, పెక్కువన్నెల విచిత్రవస్త్రములు, ఆభరణములు ధరించి. అది విలాసమని, శృంగారమని, నాగరకతయని భ్రమించి కులుకుచుండుట జూచినచో వ్రణమునకుఁగట్టినకట్టు నొక యలంకారమనుకొనుటే యగును. దుర్గంధస్రావములతో గూడిన దేహమును ధరింపవలసివచ్చినదని దుఃఖింపక పైగా నది విలాసమునకు దగినదని భ్రాంతితోఁ జరించు మౌఢ్యము సకలదుఃఖహేతువగుచున్నది.

460. అజ్ఞానము దుఃఖము; దేహ మజ్ఞానజన్యము; జ్ఞానమానందము; ఆత్మజ్ఞానస్వరూపము; దేహసంబంధమగు సకలము దుఃఖహేతువే; 'నేను' దేహమనునదజ్ఞానము; నేనాత్మస్వరూపమేయనునది జ్ఞానము; సర్వకారణమై, సర్వ స్వరూపమగు పరమాత్మయే నా ఆత్మస్వరూపము అనగా నా నిజలక్షణమని తెలిసికొనుటే జ్ఞానము. అది తెలిసి దుఃఖమును నిర్మూలించి, సుఖమందుటకు త్వరపడుటే వివేకము.

461. అగ్రస్థానమిచ్చి చేయవలసిన పనులేవి? ద్వితీయస్థానము, అధమస్థానము, అస్థానమున కర్హములైన

వేవి ? ఏపనులు చేయుటకైనను నీకు గాలమెంతయున్నది ? సాంసారిక కార్యక్రమములన్నియు నెడతెగని దుఃఖమిచ్చును; అవి ధర్మకర్మలైనచో వానికి ద్వితీయస్థాన మీయనగును; అధర్మకర్మలు, పాపకర్మలు నైనచో నధమస్థానము, త్యాజ్యములైనవే. నిత్యసుఖశాంతులనిచ్చు దైవాశ్రయ జపతపాదులు అగ్రస్థానము నీయవలసినవి. మనకుఁగల కాల మత్యల్పము; అధ్రువము; అందుచే జపతపాదులకే అగ్ర స్థానమిచ్చి అంతకాలము వినియోగింపవలెను. ఇట్టి విచక్ష ణతో జీవితము గడపు దీక్షగలయాతఁడే వివేకి; మిగిలినవారు మూర్ఖులని చెప్పనక్కరలేదు.

462. పరీక్షలో నియమితకాల మయిపోయినను, తమవ్రాత ముగింపలేక నింకను వ్రాయుచు, పరీక్షాధికారి వచ్చి పేపరిమ్మన్న నీయక గింజులాడు విద్యార్థులవలె, నిహ లోక యాత్రాకాలమును నిర్ణీతమని యెఱుగక, యమధర్మ రాజను పరీక్షాధికారివచ్చి లాగుకొనిపోవుచుండగా, తాప త్రయాధీనమనస్కులై, తమపను లింకను పెక్కుగలవని పలవించు లోకులు మూఢ విద్యార్థులవంటివారే, దేశకాల కర్మల విలువనెరుగని మానవులకు దుఃఖముకాక మరేమి మిగులును ? సరిగాఁ జదివి పరీక్షవ్రాయుని విద్యార్థుల కప జయము కాకుండుటెట్లు ?

463. ఒక్కపనిచేసి స్థిమితముగాఁ గూర్చుండి, సుఖింపవేమి ? "నీమనస్సు నాపైనుంచుము; నీపనులన్నియు

నేను స్వయముగా జూతును" అని చెప్పిన సాక్షాత్తు భగవం తుని వాక్యములు వినలేదా ? ఆందోళనపడు టెంతవెఱ్ఱి !

464. ఏ వ్యక్తియైనను, నీ బంధుమిత్రులలో నెవరైనను నీ కిదివర కుపకృతి యొనర్చి, నేడు మానిరని తలంచుట దేవుని దూషించుటే యగును. ఎప్పుడేవ్యక్తి నీ యెడ నెట్లు ప్రవర్తించినను ఆవ్యక్తి నీకు లాభనష్టములు కలుగజేసినాఁడని నమ్మితివా, నీకు దైవభక్తి లేదని నిశ్చయముగాఁ దెలిసికొమ్ము. నీకేమిచ్చినను, ఈయకున్నను బాధ్యత అంతా భగవానునిదే! వ్యక్తుల నెవ్వరిని నమ్మకుము.

465. తానుజేసిన తప్పుపనిని సమర్థించుకొను కుతూహలము ప్రతి మానవునికి మిక్కిలి సహజమైనది. ఎదుటివాని శిరముపై దండప్రహారము చేయుటలో జంకనివ్యక్తి, తన శిరముపై దండము నుపయోగింపఁగలఁడా ? కాని ఆధ్యాత్మికాభివృద్ధి వలయు సాధకులు, తమయెడ నిర్దాక్షిణ్యముగాఁ బ్రవర్తించు టవసరము. ఎదుటివారి లోపములను దోషములను జూపి చాటు నుత్సాహముకంటె వేయిరెట్లధికమగు నుత్సాహదీక్షలను, తన స్వంతదోషములను తన కన్నుల యెదుట బెట్టుకొని ఆత్మసంస్కారము చేసికొనుట నేర్చికొనవలెను. అప్పుడే సాధకుల సాధనకు బటుత్వమబ్బి, దుస్సాధ్యమగు దైవానుగ్రహసిద్ధిని సాధ్యమొనర్చును.

466 భగవదనుగ్రహము సంపాదించుటేమి కూరగాయులు కొనితెచ్చుటవంటిదా ? సర్వప్రపంచమును సంకల్ప

మాత్రముచే సృజించి తన అనంత అమోఘ విజ్ఞాన బల ముచేఁ దృణప్రాయముగా నడపుచున్న అట్టి అనంతమహి మాన్వితుఁడైన భగవానునెదుట నిల్చుటకు మనము కొంచె మైన అర్హత చేకూర్చుకొనవలదా? దేవునెదుట నిల్చు నర్హత నార్జించుపని పెక్కుజన్మముల కృషిని గోరును. సం సారకృత్యములకు సర్వశక్తులును వినియోగించి ఎప్పుడో తోచినపుడొకమారు దేవుని స్మరించి, అనుగ్రహమింకను గలుగలేదేమని యెదురుచూచుట మన అవివేకమును ప్రద ర్శించును.

467. భగవంతునిదయ మనకుండునా ఉండదా యను సందేహముగలవాఁడు భక్తుఁడుగాఁడు. ఒకటి నిజము ఏరూప మున భగవంతుఁడు దయచూపునో తెలియుట కష్టము; కాని అదియొక ముఖ్యవిషయముగాదు. ఏరూపమున భగవానుఁడు కటాక్షించిననేమి? కటాక్షించుటే ముఖ్యము. తన్నాశ్ర యించినవారి నెన్నడు విడువకుండ రక్షించు నియమముగల వాఁడే భగవానుఁడు. మనపని భగవాను నాశ్రయించుటే. తక్కినదంతయు మనము భగవానునికే విడిచి అఖండధైర్య ముతో హాయిగానుండుట నేర్చుకొనవలెను.

468. ప్రాణికోటిని సృజించి, దానితోఁబాటే, వాని కర్మలను, అనుభవించుఫలితములను, జీవనసమస్యలను పరి ష్కారములనుకూడ సృజించెను. భగవానుఁడెందుకీ కర్మాది సమస్యల నేర్పాటుచేసెను? సర్వసమస్యల కేకైకపరిష్కా

రము (దన్ను దెలిసికొనుటే యనియే భగవదుద్దేశము. సమస్య లనుపెట్టి, విప్పువాఁడు తానేయని మనమెఱుగవలెననియు, ఆ యెరుకవలననే, ఆనందము లభించుననియు వానిభావము : దేవుని మహిమనెరుగుటే శాశ్వతానందము; ఎఱుగమియే నిత్యదుఃఖము.

469. యతిగణప్రాసల నేర్చుకొని పద్యములల్లు టలవడినంతమాత్రమున నెవ్వఁడును కవి గానేరఁడు. శబ్దార్థ ప్రయోగశక్తి, అలంకారశయ్యారీతుల లక్షణము, సహజ ప్రకృతిసౌందర్యావలోకనాభిరుచి, సర్వమునకు చైతన్య మిచ్చు నాత్మతత్త్వవిజ్ఞానము, అనింద్యరసపిపాస మున్నగునవి కలిగి, అత్యంత మాధుర్యసౌందర్యానందమయకావ్యసృష్టి నొనరింపఁగలవానినే కవి యందురు. అటులే భగవానుని స్మరించి, అభ్యాసవశమునవచ్చు పూజామంత్ర శ్లోకముల (జదివినంతమాత్రమున భక్తుఁడు కాఁజాలఁడు. కళలన్నిటిలో భగవంతు నాశ్రయించుకళ కేదియు సాటిగాదు. సకలదుఃఖ ముల (ద్రుంచి, సుస్థిరశాంతి సమృద్ధమగు నవ్యయానందభిక్ష పెట్టు పరమేశ్వరు నాశ్రయించుటకు మనమెన్ని ఉత్తమలక్ష ణములను గలిగి, ఎంతసమంచిత నైపుణ్యమును, దీక్షను, తప స్సును సమకూర్చుకొనవలెనో నిర్ణయించికొని వానిని సాధిం చిన ఉత్తమసాధనతో భక్తిని మేళవించినప్పుడా భగవదను గ్రహ మత్యంత సన్నిహితమై సిద్ధించును. అదియే భక్తుని భక్తికి సాక్ష్యము,

470. భగవదారాధనవలన మన కేమేమి లభించును? ఈ ప్రశ్నకు జవాబు సులభమే. ఈ ప్రశ్నకు ప్రశ్నయే జవాబు. భగవదారాధనమువలన లభింపనిదని యేదైన నుండునా? మానవుఁడు దైవారాధన జేయుటకు, జీవయాత్ర అనుకూలముగా, నిర్విఘ్నముగాసాగు టవసరము కావున, దేహారోగ్యము, దేహపోషణమునకు వలయు వివిధసౌకర్య ములు, ధనవస్తువాహనమందిరాదికము లోటులేకుండఁజేసి, తుదకు జన్మజరామృత్యురహితమగు అవ్యయశాంత్యానంద సమృద్ధమగు మోక్షమును, లభింపఁజేయును. ఇంతకంటె కావలసిన దేమున్నది? అందుచే భగవదారాధన సర్వశుభ ప్రదాత. అది సాటిలేనిది.

471. ఉప్పెనవచ్చి ఊరు కొట్టుకొనిపోవనుండగా నాయూరి వారేమని చెప్పికొందురు? "ఒరే! దగ్గరకు వచ్చి నది. అదిగో చూడుఁడు ఎంత వేగముతో (గెరటములమీద (గెరటములు ముందుకు వచ్చుచున్నవో, ఇకనొకగంటలోనో అరగంటలోనో, జలము గ్రామములో ప్రవేశించి ముంచి వేయును, త్వరగాలేచి, పిల్లలను, ముఖ్యవస్తువులను నెత్తిపై నిడికొని, మెరకప్రదేశములకు (బరుగులెత్తండి, నిద్రలోనున్న వారిని లేపండి. ఏమీలేనట్లుగా అలాచూస్తారేమి? ఉప్పెన లోబడి కొట్టుకుపోవుదురా?" యని గ్రామస్థు లొండొరుల (బిలిచి, ముందు క్షేమముగానుండుమార్గము జూచుకొందురు. సంసారమనుసాగరము పొంగుచున్నది; ముదుసలితనము,

వ్యాధి మున్నగు తరంగములు పైపైకి లేచుచున్నవి. మృత్యువను ఉప్పెన యేక్షణములోనైనను మనమీఁదఁబడి మనల నీడ్చుకొనిపోవును. ఇట్టి ప్రమాద మెదురైయుండగా, చీమ కుట్టనట్లు మనుజులు ప్రవర్తించు టెంతచిత్రమో!

472. మూఁడులోకములు జయించిన బలిచక్రవర్తి, దైవకృపలేమి, బద్ధుడయ్యెను. మనపదవినిబట్టి, మనసాహస శౌర్యములనుబట్టి దైవకృపరాదు. ఆ బలి యే సత్యమునకు కట్టుబడెను; అందుచే అతనిబంధములూడ్చి, భగవానుఁడు రక్షించెను. అందుచే మన మేమిచేయవలెను? దైవకృపయే సంపాదింపఁదగిన ప్రధానవస్తువని తెలిసికొని, చిత్తశుద్ధిగా నోర్పుతో, దైవారాధనపరతంత్రులమై యుండవలెను? ఎంతకాలము? దైవకృప కలుగువఱకునని చెప్పవలెనా?

473. ఏమయ్యా! ఎక్కడికి బయలుదేరితివి? లోకోపకారార్థమా? లోకులను బాగుచేయుటకొరకా? నిన్నునీవు బాగుచేసికొంటివా? నీపాదములు బురదలోనుండగా నితరుల పాదముల తోచ్చు నెట్లు కడుగఁగలవు? బురదతో బురద పోవునా? మొదట నీవు శుద్ధుడవైన దరువాత నితరుల మాట చూడవచ్చు. ఏకాంతమునఁగూర్చుండి నీలో దోషము లెన్నియున్నవో పద్దు వ్రాసికొని వానిని తొలగించుకొనుము.

474. మనము దృష్టి ననేకవిషయములపై కేంద్రీకరింతుము గాని, మనదృష్టిని మనమీఁద కేంద్రీకరింపము. మనము చేయవలసిన మొదటిపని మన మెవరో మనసంగతిని

మనము పరిశీలించి, తేల్చుకోవలెను. మనలఁగూర్చి మనము క్షుణ్ణముగా ఁదెలిసికొనవలెను. దీనియందు దృష్టి కేంద్రీకరించినచో, దేహము, మనస్సు, బుద్ధి, యింద్రియములు—ఎట్లు పనిచేయుచున్నవో 'మన'మునకు స్వస్వరూపమెట్టిదో, దేహాదులు మనముపయోగించుకొను ఉపకరణములెట్లు 'మనలను' భ్రాంతివశులను జేయుచున్నవో, అన్నియు ఁదెలియును. ఈ పరిశ్రమ చేసినచో సంపూర్ణాత్మజ్ఞానము సిద్ధించును.

475. వేదాంతమనగా ఉద్యోగవిరమణ చేసినతరువాత వార్ధకదశలో ఁగాలముగడపుట కేర్పాటుచేయఁబడినదని చాలమంది అభిప్రాయము. ఇది వేదాంతమననేమో యెరుగని అజ్ఞుల అభిప్రాయము. వేదాంతము మనోబుద్ధివాగతీతమగు పరబ్రహ్మతత్త్వమునుగూర్చిచెప్పు బ్రహ్మవిద్య. ఇతర విద్యలు నేర్చుటయు, ప్రావీణ్యమును గడించుటయు కష్టమే; దానికైనను సునిశితబుద్ధి కావలెను. బ్రహ్మజ్ఞానమునకు కేంద్రీకృతమగు నేకాగ్ర దృఢబుద్ధి కావలసియున్నది. అట్టి పటుతరబుద్ధి జీర్ణించిన వార్ధకదశలో నెవ్వరికుండదు. సకలబలములు గలనిండు యౌవనమే। వేదాంతవిద్యాభ్యాసమునకు సముచితకాలము.

476. సాధకుని జీవితములో నిరంతరము కఠినసమస్యలెదురగుచుండును. మానవజీవితమే సకలసమస్యలకు, మనఃక్లేశములకు నిలయము. అజ్ఞానమువలన పాపములు, పాపములవలన బాధలు గలుగును. కాని భక్తుఁడైన సాధకునకవి

నిజముగా మేలు చేయును; ఇతరులకు దుఃఖమిచ్చును. ఓర్పుతో వాని ననుభవించుటచే పాపక్షయమగును; రెండవది బాధలు పోవుటకు భగవానుని సేవించుటే మార్గమని యెరిగిన భక్తుఁడు, తనభక్తి నతిశయముగాఁ జేసికొని తరించును. అందుచేఁ గష్టములు పాపనాశకములు, భక్తివర్ధకములు, ముక్తిదాయకములు.

477. భక్తుఁడు భగవానునేమియు నడుగవలసిన ప్రశ్నయే లేదు. అడుగనిదే అమ్మైనన పెట్టదను సామెతకలదు. మనమడుగకున్న చో, లోకములోనివారు, తల్లి, తండ్రి, సోదరులు, బంధువులు, మిత్రులు, దాతలు మన కేమికోర్కెలున్నవో యెరుగఁజాలరు. భగవానుఁడన్నియుఁ జూచుట, వినుట, జరుగుచున్నది. మనమనస్సులలోను, హృదయములలోను నేమున్నదో భగవానుఁ డెరుగును. సర్వప్రాణులకు భగవానుఁడు వారి అవసరముల సృజించి, పోషించుచునే యున్నాఁడు. క్రిమికీటకాదులు, పశుపక్ష్యాదులు భగవత్సేవకులు గాకున్నను, వానికి జీవనావసరములన్నియు నిరంతరము నిచ్చుచున్నాఁడు. ఇక భక్తుఁడైన మానవుని విషయములో లోటెందుకుఁ జేయును. అనాశ్రితులనుకాపాడు భగవానుఁడాశ్రితజనమును వేయిరెట్లు దయతోఁజూచు కృపాపరిపూర్ణుఁడే భగవానుఁడు.

478. ఈ లోకమందేధర్మములు నీశ్వరధర్మమునకు సాటిరావు. అటులే, యేపనియు భగవంతుని స్మరించుపనికి

సాటిగావు. దైవారాధనమే అత్యంతము శ్రేష్ఠమైన కర్మ. ఈ కర్మవలన, అనాదిగా మనలఁబట్టి పీడించుచున్న అజ్ఞానాంధ కారము తొలగిపోవును. మిగిలిన సాంసారిక దైవేతరకర్మ లన్నియు మన అజ్ఞానమునే పెంపొందించి, జన్మమృత్యువు లను గొలుసులచే బంధించి, పీడించును. దైవారాధనకర్మ యొక్కటే సర్వదుఃఖములను నశింపఁజేసి, అనంతచిత్తశాంతిని, అఖండానందమును ప్రసాదించును. అందుకే "సర్వ ధర్మాన్ పరిత్యజ్య, మామేకం శరణం వ్రజ" యని భగవానుఁ డుపదేశించినాఁడు.

479. అహంకారమే అనగా 'నేను' 'నాది' యను భావమే సకలదుఃఖములకు మూలము. ఏలన అహంకార మీశ్వరద్రోహముపై నాధారపడియున్నది; అనగా అసత్యముపై నిలుచునదే అహంకారము. భగవానుఁడే సర్వ కర్తయై, యేకైకక్రియాశక్తియై యుండగా, నేను కర్తను 'నాకు' శక్తిగలదని భావించుట దేవుని కర్తృత్వమును మన మారోపించుకొనుటే. అటులే సర్వజగము నీశ్వర సంపదయై యుండగా, 'ఇదినాది; అదినాది' అనుకొనుటయు దైవ ద్రోహమే. అహంకారమును విడిచి, సత్యమును గ్రహించి తరింపవచ్చును.

480. ఈ ప్రపంచములో సర్వక్రియలకు ఈశ్వర సంకల్పమేకైక కారణము. కాని ఆ యీశ్వరసంకల్పము ప్రాణుల సంకల్పములద్వారా పనిచేయుచు, అది ప్రాణుల

సంకల్పమే యనుభ్రాంతిని కలిగించును. ఇచట నొకవిచిత్ర మున్నది. ఈశ్వరసంకల్పమే ప్రాణుల సంకల్పముగా (బని చేయునుగాని ప్రాణులసంకల్ప మీశ్వరసంకల్పము గాఁజా లదు. ఏలన ప్రాణులసంకల్పమనునది వేరేయేమీ లేనే లేదు. అయితే కొన్ని ప్రాణుల సంకల్పములు జరుగవు; బాధలు కలిగించును; వ్యతిరేక ఫలితములిచ్చును. కారణము ? అదియు నట్లు జరుగుటే యీశ్వరసంకల్పమే.

481. వేదాంతమును టూకీగా మూఁడుమాటలలో చెప్పవచ్చును. దేవుఁడు - మాయ - మానవుఁడు. దేవునికి మానవునకుమధ్య మాయ అడ్డుగానుండుటచే మానవుఁడు దేవునెఱుగ లేకున్నాఁడు, మాయావశములై, సర్వవస్తువులు, దేవునిస్వరూప మేమైనను, వేరువస్తువులుగా భాసించి, మానవ మానసముల నాకర్షించి, వాని ననుభవింపవలెనను కోర్కె లను జనింపజేసి, బాధించుచున్నవి. ఎవఁడు నిరంతరతపోధ్యా నాదులచే భగవంతుని విశ్వసించి, పూజించునో, వానికి దైవానుగ్రహము కలిగి, మాయావరణము తొలగిపోయి ప్రతివస్తు వీశ్వరస్వరూపముగానే గోచరించును. అట్టివాఁడు సర్వ మీశ్వరమయముగా (జూచి తరించును.

482. దేనికైనను ఎవరినడుగవలెను ? ఇచ్చువా రెవరు ? ఇది విమర్శింపగా అఖండసత్యమొకటి బయలుప డును. సకల ప్రాణులకు, సర్వప్రాణులను కల్పించిన భగవా నుఁడే సర్వమిచ్చు నేకైకదాత, రెండవదాత వేఱొకఁడు లేఁడు.

పరమేశ్వరుండే, యెవరికెవరిద్వారా యేమిజరిగించినను, ఒక్కండే యిచ్చుచున్నసంగతి సత్యము. అందుచే నెవరినడుగవలెనను ప్రశ్నయు, నెవ్వరిత్తురను ప్రశ్నయు నవకాశములేని ప్రశ్నలు. దాత ఒక్కండే, వానినే అడుగవలెను.

483. మన వయస్సెంతయో, ఎంతకాలము బ్రదికితిమో నిర్ణయించు నిజమైనసూత్ర మొకటియున్నది. భగవంతుని స్మరించినకాలమే మనము బ్రదికిన కాలము. తదితర కృత్యములకై మనము జీవించినకాలము వ్యర్థమైనది. మన వయస్సులోనుండి, భగవాను నర్చించిన కాలమునే లెక్కకట్టి, అదియే మనవయస్సని చెప్పవలెను. ఇట్లు చూచినచో, చాలమంది, 70, 80 యేండ్లకు బ్రదికినయేండ్లు, 5, 6, 7, 8 గా రావచ్చును.

484. భగవంతునివిషయములో దర్కము పనికిరాదని చెప్పుటకే తర్కము పనికివచ్చును. భగవానుడతర్క్యవిషయము. ఈ విషయమున తర్కము నిరుపయోగముగా నుపయోగించును. ఇది గుర్తించి, భగవంతుని నమ్ముటే మన కైక కర్తవ్యము; బుద్ధితో దర్కించి, అది నిరర్థకమని గ్రహించి, హృదయమిచ్చి, వినయ, భయభక్తులతో భగవంతుని భజించుటే, మహామేధావులకైనను కర్తవ్యము. అందుకే శ్రీ శంకరులు "భజగోవిందమ్" అని యుపదేశించిరి.

485. భగవానుని కృపకై నిశ్చలవిశ్వాసముతో నోర్పు వహించియుండుట కాటంకములలో ముఖ్యమైనది

సంశయము. అసలు భగవానుఁడు కృపజూపునా చూపఁడా? అను సంశయము కలిగినచో మన 'ఓర్పు' చలించును. భగవానుఁడు స్వయముగా దన్నాశ్రయించినవారిని రక్షింతునని వేనోళ్ల ప్రకటించియున్నాఁడు. ఇక సంశయమెందుకు?

486. ఈశ్వరసంకల్పమనగా నీశ్వరుఁడే; ఈశ్వర స్వరూపనిర్ణయ మెట్లు సాధ్యముకాదో, అటులే యీశ్వర సంకల్పమును నిర్వచించుట కసాధ్యము. అది మారదా? భక్తజనరక్షణార్థము మారును. ఆ మార్పు అసలు సంకల్పములోనిదే; నిర్గుణము, సగుణముగా నెట్లు చెప్పుదుమో, కర్త అకర్తయని యేరీతిగా జెప్పబడెనో, అదేవిధముగా భగవానుని సంకల్పక్రియలు మారును, మారవు; అనగా అనిర్వచనీయములు. అనగా మనబుద్ధి కందనివని యర్థము; నమ్మి, భజించి, తరించుటే మార్గము.

487. నీవు దేహమును విడిచిపెట్టునపుడది నిర్జీవమగు శవమగును; దానిని బంధువులు దహనమొనర్తురు. అది బూడిదయగును. నీవు దానిని విడిచి మరల నింకొక దేహమును ధరింతువు. ఈ దేహము నీతోరాదు; కాని దేహము కొఱకు, దేహముతోఁజేయు, పనులఫలితములు నీతోవచ్చును. అందుచే దేహధారియగు ప్రతి మానవుఁడును, తనదేహము నెట్లుపయోగింపవలెనో వీలైనంత బాల్యముననే తెలిసికొని, ఆవిధముగా నుపయోగించుకోవలెను. సుఖము కోరుదువా సత్కర్మలుచేయుట; ముక్తికోరుదువా, భక్తిజ్ఞానముచే భగవత్కృప నార్జింప వలెను; లేదా దుఃఖము తప్పదు.

488. లోకమంతయు కామక్రోధాదుల విహార భూమి; అట్టి భూమిలో నెంతటి జితేంద్రియులనైన మోస పుచ్చి, మూర్ఖులఁజేసి దుఃఖపాశబద్ధులఁజేయు వాతావరణము నిండియుండును. దైవకృపలేనిదే యీ వాతావరణములో నీ చిత్తప్రసన్నతను నిలుపుకొనలేవు; కావున లోకవాతావరణముచే నీవు కలుషితుఁడవు గాకుండనుండఁగోరుచో వెంటనే దైవకృప నార్జించుకో.

489. నీకు నిజముగా దైవభక్తియున్నదని నీవు నమ్ముచున్నావా ? నమ్మినచో, నీకు దైవభక్తిఫలితములు లభించినవా ? ఆఫలితము లేవియందువా ? విను ! మానసిక, వాచిక, కాయిక వక్రతలన్నియు ఁబోవలెను ? ఇష్టానిష్టముల వలన ఁగలుగు మానసికవ్యధ తొలగెనా ? రాగద్వేషవశము గాకుండ, నీచిత్తము నిశ్చలప్రసన్నత నందినదా ? సత్యధర్మ నిష్ఠితమై, మధురమై, మృదుహితార్థయుక్తిచే అమోఘశక్తి కలదైనదా ? నీకాయమున సర్వమాలిన్యరోగాదులు తొలగి బలము, ఆరోగ్యము; కలిగి తేజోమయమై ప్రకాశించు చున్నదా ? భక్తుఁడవగు నీవున్నచోట, పరిసరదేశములన్నిట, రజస్తమోగుణము లణగి, సత్త్వగుణము హెచ్చి సర్వశుభ సంపన్నముగా నున్నదా ? వీనిని పరిశీలించి, లేనిభక్తి ఉన్న దని నమ్మకుము,

490. భక్తి-అనగా దైవభక్తి-కామక్రోధాదివిషము లకు విరుగుడు; రోగము, పుట్టుక, ముదుసలితనము, మృత్యువు

మున్నగు దుఃఖముల హరింపజేయు దివ్యౌషధము; సాంసారిక తాపముల దహించు దావాగ్నిజ్వాల; భక్తిధనములేని ధనవంతుఁడే దరిద్రుఁడు; దైవభక్తిహీనుఁడే వైధవ్యముగల నికృష్టుఁడు; భక్తి సర్వమునుజయించు దివ్యశక్తి; దానిని సంపాదించి, తరువాత విశ్రమించు.

491. నీవు నిత్యము స్మరించి. స్తుతించి, పూజించుట వలన భగవానునికి లభించున దేమియున్నది ? నీవు మాని నచో దేవునికి నష్టమున్నదా ? నీవు దేవుని నమ్ముటల. స్మరించుట, పూజించుట నీకొఱకే. పరమపవిత్రుఁడైన దేవునినమ్మి నీవు పవిత్రుఁడవగుదువు. పరమజ్ఞాననిధియగు దేవు నెఱిగి నీవు జ్ఞానివగుదువు, పరమనిత్యానందమూర్తిని కీర్తించి, నీవు దివ్యానందము నందెదవు; జన్మజరామృత్యువులులేని దేవుని స్తుతించి, నీవు జన్మజరామృత్యురహితుఁడ వగుదువు. దేవుని పూజించుట నీకొఱకే,

492. టర్కీ విమానమొకటి మొన్న ప్యారిస్ సమీపమున కూలిపోయి అందున్న 315 మంది ఘోరమరణమందిరి. వారి దేహములు తుత్తినియలై సహస్రఖండములైనవి. ఇది పరమేశ్వరేచ్ఛలేనిదే యెట్లు జరుగును ? ఇందే యొకవ్యక్తియైనను భగవానుని భక్తుఁడుండిన యెడల, వాని నిమిత్త మీ విపత్తు జరుగకుండ నుండెడిది. భగవానుని ధర్మచక్రము, అదియే విష్ణుచక్రము 315 మంది నేకకాలమున నిర్దాక్షిణ్యముగా శిక్షించినది. అందుకే మనకు భగవంతు

నెడే భక్తి, భయము రెండునుకూడ నుండవలెను. భగవానుఁడు భయాభయస్వరూపి; దుష్టుల కుగ్రభయమూర్తి, సత్పురుషులకు సర్వాభయదివ్యమూర్తి.

493. కావలసినది సుఖము, పోవలసినది దుఃఖము. పోవలసినదానిని పోనాడి, కావలసినదాని ననుగ్రహించు సమర్థుఁడొక్క భగవానుఁడే. మరియు సుఖమే దైవస్వరూపము, "ఆనందో బ్రహ్మేతి". ఇది తెలిసి దేవుని భజించుటే చేయువలసినపని. ఆనందస్వరూపియగు భగవాను నారాధించుటచే, ఆనందము లభించుటే కాదు; ఆరాధనమే ఆనందము. "తపో బ్రహ్మేతి".

494. భగవానుని 'గుండె' భక్తులయెడ మితిలేని 'జాలి' లేక 'కృప'తో నిండినది. "బాబోయి! యీ బాధ నేను సహింపలేను; దీనిని తొలగించి రక్షించు"మని మొర పెట్టినచో దేవుని జాలిగుండె ద్రవించి, మనబాధ తొలగును. చిత్తశుద్ధి, నిశ్చలవిశ్వాసము; మొర ఈ మూడు నున్న దైవకృపామృతము వర్షించును. భక్తులైన వారెవరికివారే దీనిని పరీక్షించికొనవలెను.

495. ఎన్నిపాపములుఁజేసినను దానికి నివృత్తిలేదని భయపడనవసరములేదు. దేవుఁడు అజ్ఞానములోనుంచి, పాపములు చేయించి, జ్ఞానమిచ్చి వానిని నశింపఁజేయును. జ్ఞానాజ్ఞానములు–పాపపుణ్యములు రెండును దేవుని క్రీడలే, దాగుడుమూతలే! చేసిన పాపకర్మలఫలిత మనుభవింపక తప్పదు;

దానిని దేవుఁడైన తీసివేయలేఁడనియో, తీసివేయుఁడనియో చెప్పుచుందురు. ఇది దేవుని మహిమ నెరుగనివారి భావమే. ప్రాణుల కర్మఫలములను దేవుఁడు తీసివేయలేడనుట దేవుని నసమర్థత నంటగట్టి నిందించుటే; తీసివేయుఁడనుట దేవుని అమృతహృదయదాక్షిణ్యము నెఱుగకుండుటే; ఈ నిందల వలన నిజముగా పాపము సంక్రమించును.

496 మన కెవరుపకారాపకారములు చేసినారని సమీక్షించి—బంధువులైన కొడుకులు, అల్లుళ్లు బావమరదులు మిత్రులు—వీరిలో కొందరుపకారము, కొందరపకారము చేసిరని స్తుతియు నిందయుఁ జేయుచుందుము సకలప్రాణులచే సకలము చేయించుచున్నవాఁడు నిజముగా భగవానుఁడే. ఈ సంగతి నెఱుగక భ్రాంతివశులమై శత్రుత్వ మిత్రత్వ బంధుత్వాదికములు నిర్ణయించుచున్నారము. భగవాను నాశ్రయించి, భ్రాంతి విడుచుటే ముక్తి.

497. మనము కోరిన ప్రతి విషయము జరుగక పోయినంతమాత్రమున, మనకు దైవకృప లేదని వెంటనే నిశ్చయించి నిరుత్సాహపడరాదు, మనమనుకొన్నది జరిగి నచో మనకది అపకారముగా బరిణమింపవచ్చును. మన మనుకోనిది జరిగి యెంతో శుభము గలుగవచ్చును. మన మనుకున్నది జరిగి అశుభమైనచో, ఇది జరుగకుండిన బాగుండెడిదనియు, మనమనుకోనిది జరిగి శుభమైనచో, దీనిని కోరకుండుట పొరపాటు చేసితిమనియు దలపమా? అందుచే నన్నిం

టని దేవుని అనంతప్రజ్ఞకే విడిచి, దేవు నెల్లప్పుడును భజింపుము.

498. దైవకృపాలాభము కోటి దేవేంద్రపదవుకంటె గొప్పది. దేవేంద్రునకు పతనమున్నది. దైవకృపారక్షితునకు పతనముండదు. అంతకంటె సంపాదింపవలసినది వేరొకటిలేదు. అందుచే సర్వప్రయత్నములు దైవకృపాసిద్ధికొఱకై చేయవలెను.

499. దైవభక్తి నీకున్నదా? ఉన్నదని తలచితివా? దైవభక్తి ఫలితములు నీకు లభించెనా? ఏవి యాఫలితములందువా? మానసిక, కాయిక, వాచిక వక్రతలన్నియుఁ బోవలెను. నిర్వక్రమై, ఇష్టానిష్టముల కెన్నడు చలింపని ప్రసన్నత నీమనస్సునకు లభించెనా? సత్యధర్మనిష్ఠితమై, సర్వప్రాణులకు మాధుర్యముగూర్చు వాక్శుద్ధి నీకుఁగలిగెనా? రోగములన్నియు దొలగి, బ్రహ్మతేజోమయమై నీదేహము ప్రకాశించుచున్నదా? నీవు నివసించు గృహము, పురము, దేశము రాగద్వేషరహితమై పునీతమైనదా? నిన్ను దర్శించినంతమాత్రమున నితరులకు పాపములు హతమగుచు పుణ్యముదయించుచున్నదా? నీవున్నచోట పంచభూతము లనుకూలత చూపుచున్నవా? నిజమైన దైవభక్తుఁడున్నచోట నివన్నియు జరుగవలెను.

500. "వడ్డించువాఁడు మనవాఁడైనచో కడపంక్తినికూర్చుండవచ్చు" నను సామెత కలదు. కడపంక్తిలో నున్న

వానికిని వడ్డనలు సరిగా అందవు. వడ్డించునాతఁడు మన వాఁడయినచోఁగడపంక్తిలో మనవాఁడున్నాఁడని గుర్తించుకొని, మనవద్దకు నిండు పళ్లెము తెచ్చి సమృద్ధిగా వడ్డించును. విశ్వప్రాణికోటికి విందుచేయునాతఁడనగా వడ్డించువాఁడు భగవానుఁడు. వీఁడునావాఁడని యెవని భగవంతుఁడు నిశ్చయించునో, అట్టి భక్తుఁడెచట నున్నను, వానికి లోపమురాకుండఁజూచి వాని క్షేమమున కవసరములగు సర్వము, అనగా ధర్మార్థకామమోక్షములను పిండివంటలు సమృద్ధిగా వడ్డించి రక్షించును. దేవుఁడే మనకు సర్వదాత యని గుర్తించి, భజించుచో నాతఁడు మనవాఁడని గుర్తించి రక్షించును, "యే భజంతుమాంభక్త్యామయితే, తేషుచాప్యహమ్" గీత.

501. తీర్థయాత్రలకై కోట్లకొలది జనులు, మితిలేని వ్యయప్రయాసలకోర్చి, తిరుగుదురు. తీర్థములనగా పుణ్యామిచ్చు ప్రదేశములు – పుణ్యనదులు, క్షేత్రములు, ఆలయములు – సర్వత్ర దేవుఁడు నిండియుండి దేవుఁడు లేనిచోటు లేదని వేదవేదాంతములు ముక్త కంఠముతో ఘోషించుచున్నవి, ఇది నిజమైన, మనము దేవునిలోనుండి. దేవుని మీఁదుగా నడచి యాత్రచేయవలెను. హాయిగాఁగూర్చుండి, నీవుచూచునది, వినునది, – సర్వము దేవుఁడే యని గుర్తించి సుఖింపరాదా? దేవుఁడొక చోటగలఁడు మఱొక చోట లేఁడని తలచుట దైవనిందకాదా ?

502. భయమునకుఁగారణము దేవుని సృష్టిలో నేదైన మనకు ప్రమాదమును, ఆపదను, దుఃఖమును గలిగించు

ననియే కదా. సర్వలోకాధిపతి నాశ్రయించుచో లోక
ములో నేదియు నిన్ను బాధింపదు. ఏలన సృష్టిలోని ప్రత్య
ణువు ఈశ్వరాజ్ఞకులోఁబడి వర్తించుచున్నది. దైవభక్తుని
కేవస్తువును వ్యతిరేకముగాఁ బ్రవర్తింపదు, ప్రవర్తింపఁజాలదు;
భక్తరక్షణైక వ్రతుఁడగుట భగవానుని బంటు, నేలోక
ములు గాని అందలి వ్యక్తులుగాని వస్తువులుగాని బాధింపవు
సరికదా, మిక్కిలి అనుకూలములై వర్తించును.

503. మన కేవిధమైన బాధలు వచ్చినను మనకు
భక్తిలేదనియో, చాలదనియో చెప్పుటకే అవివచ్చును.
మనము దేవుని కాత్మార్పణము సమగ్రముగాఁజేసినచో,
మనము దేవుని ద్రవ్యమగుదుము. దేవుని ద్రవ్యము నేది
బాధింపఁగలదు? అందుచే మనమత్యంత శ్రద్ధతోఁజేయుటకుఁ
బూనుకొనవలసిన పనులు రెండు (1) ఏమియు మిగుల్చు
కొనకుండ భగవానునికి మన మాత్మార్పణము చేసికొన
వలెను. (2) అజ్ఞానవశులమై, అహంకారదోషము పట్టి,
మనమిచ్చినది మరల పుచ్చుకొనకుండఁ జూచుకొనుచుండు
నిరంతరనిష్ఠను సాధించుచుండవలెను.

504. అన్నమయదేహము కాబట్టి అన్నము తిననిదే
బ్రదుక లేవు. ఇది దేహసంబంధ సత్యము. అటులే సకల
ప్రాణులు 'ఆత్మమయ' జీవులు గావున ఆత్మాహారమైన
బ్రహ్మజ్ఞానమునుగాంచి అనుభవింపనిదే నిజమైన సంతుష్టి
నందలేవు. అందువలననే, భౌతికాహారము లెన్నియున్నను

ఆత్మజ్ఞానము లభింపనంతవరకు, ఏ ప్రాణికిని నిజమైన తుష్టి, పుష్టి, ఆనందము, శాంతియు లభింపవు.

505. నీయోగక్షేమములను నీవు జూచికొనుటకే విషయమును నీ చేతిలోలేదు. ఇతర మానవులు నీవంటివారే కావున వారిచేతులలోను లేదు. సర్వవిషయములు ఒక్క భగవానుని హస్తమందే యున్నవి. నీకు సర్వేశ్వరుఁడు సుముఖుఁడైనచో నీయోగక్షేమములకెట్టిలోటురాదు. కావున వృధాప్రయత్నములన్నియుమాని భగవానుని సుముఖుని జేసికొనుము. నీ ముఖము భగవానుని పాదములవైపు త్రిప్పినచో, భగవానుఁడు నీకు సుముఖుఁడై రక్షించును. అనగా సంతత శ్రీరామ సంకీర్తనమే సకలార్థసాధనము.

506. జరిగినది కలిసిరాదు. దానినిగూర్చి విచారించుట నిష్ప్రయోజనము; జరుగుచున్నదానినిగూర్చియు విచారింప నవసరములేదు; ఏలన జరుగుచున్నది త్వరలో జరిగిన దానిలోఁగలిసి పోవును. ఇక జరుగనున్నదానిని గూర్చియు విచారింపఁబనిలేదు. ఏలన జరుగనున్నది జరిగిన, జరుగుచున్నదానితో లంకెపడి జరుగును, ఈ మూడింటిలో నేదియు మన చేతిలోలేదు. ఈశ్వర సంకల్పము ననుసరించి కాలత్రయము నడచును. చేయవలసినదేమి? కాల స్వరూపియగు భగవానుని భజించి, కాలకర్మ దోషములను నివారించు కొనుటే.

507. కలిసియుండుట, విడిపోవుట సుఖదుఃఖ హేతువులు. ఈ రెంటిని, సంయోగవియోగములను జంటచేసి భగ

వానుఁడు నిర్మించినాఁడు. అటులే జన్మమరణములు, నిందా స్తుతులు, శీతోష్ణములు, సుఖదుఃఖములు – ద్వంద్వములు – అనగా విడదీయరానివి. కావలెనా? రెంటినిదీసికొనక తప్పదు. లేదా రెంటినతిక్రమించి ముక్తుఁడవగుము. జ్ఞానము ద్వంద్వాతీతము.

508. పతన దుఃఖములు లేకుండఁజేసికొనుటకొక తెగని త్రాడును సంపాదింపవలెను. అదియే సుదృఢమైన భక్తిరజ్జువు; దానితో నీ హృదయమును దేవుని పాదపద్మములకు గట్టిగాఁగట్టవలెను. త్రాడు తెగనిది; ముడియూడనిది కావలెను. అట్టిముడి వేసికొని, నీవు లోకములో నెట్లు సంచలించినను, సంసారసాగరమున మునిగిపోకుండ త్రాఁడు పైకి అనగా దేవుని వైపులాగి రక్షించుచుండును.

508. "ససర్వవిద్భజతిమామ్ సర్వభావేన భారత." గీత. సర్వమెరిగినవాఁడు సర్వవిధముల భగవానుని భజించును. భగవానుని సర్వవిధముల చేత భజించుటనగా నేమి? మన కన్ను దేనిని జూచినను, మన చెవి దేనిని విన్నను, – అటులే సకలేంద్రియములు దేనిని స్పృసించినను, మనస్సు, బుద్ధి, హృదయము దేనిని గ్రహించినను, సర్వము భగవానుని దివ్యరూపముగా భావించి భజింపవలెను. ఒక్కమాటలో భక్తునికి ద్వైతేతర విషయముండదు.

510. ప్రతి విషయమునకు పరిణామక్రమ సూత్రమన్వయించును. చంటి బిడ్డ క్రమముగా కూర్చుండుట, డేకుట, ప్రాకుట, నడచుట – శైశవ కౌమారయౌవన వార్థ

కములవలెనే - పరిణామసూత్రము ననుసరించును-జ్ఞానభక్తి ధ్యానాదులట్టివే. జపమో, ధ్యానమో, సంకీర్తనమో ఒక నాటితోఁబరిణతినంది ఫలింపవు. క్రమాభ్యాసబలముచే జప మజపమగును; ధ్యానము సమాధినిచ్చును; సంకీర్తనము పారవశ్యమును సమకూర్చును. వినయము, ఓర్పు, శ్రద్ధ గలిగి,వాని నుత్కృష్టస్థితికి వచ్చువరకుమానక అభ్యసింపవలెను.

511. నీకేది లభించినను, - భార్యాపుత్రమిత్రాది కము, ఉద్యోగ గృహాన్న వస్త్ర ధనాధికము, సర్వమును దైవ ప్రసాదముగా స్వీకరించుట నేర్చుకొనుము. ఆ లభించిన వానిలో, లోపములు, దోషములు, బాధలు నున్నచో, - గజి బిజిపడక, ప్రసన్నచిత్తముతోఁ బతివ్రతయగు భార్యవలె నేకాంతముగా మీతండ్రిగారైన జగత్ప్రభువుతోఁ జెప్పి కొనుము. ఆతఁడు వాత్సల్యముచూపి, నీకోర్కెలను సఫల మొనర్చును - ఏదైనను వేరొకఁడిచ్చువాఁడుగాని, ఇచ్చిన వానిలోనిలోపములు సవరించువాఁడుగాని లేఁడు. దేవుఁ డొక్కఁడే సర్వదాత.

512. భక్తుల విషయములో భగవానుఁడెట్లు ప్రవ ర్తించును? అన్నిటిలోవలెనే, భక్తిలో, భక్తులలో తరతమ భేదములుండును. "ఆర్తోజిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీచ" "తేషాంజ్ఞానీ నిత్యయుక్తా ఏకభక్తిర్విశిష్యతే" యని - గీత. ఉత్తీర్ణుఁడైన భక్తుఁడు జ్ఞాని. 'జ్ఞానీత్వాత్మైవమే మతమ్." అనియుఁ జెప్ప బడెను. - సిద్ధ భక్తుఁడు భగవత్తుల్యుఁడు. వాని కన్నియు నిచ్చును. ఇతరుల కుత్తీర్ణులగుట కడ్డురాని వన్నియునిచ్చును.

513. దేవునికిఁ దెలియని దుండుననుట దేవు నెఱుగని వాని ప్రసంగము. దేవుఁడెవనికేది యెప్పుడెంత యిచ్చునో, మానునో, యెందువలననో దేవునికొక్కనికే తెలియును. మన బుద్ధికి గ్రాహ్యముకాదు; మనకేది యిచ్చినను మంచిదే యివ్వకున్నను మంచిదే. దేవుఁడు తప్పుచేయునా ? అందుచే దర్కము విడిచి, భజించుట పని; తక్కినవాయన చూచును.

514. దేవుఁడు చేయునది మనము చేయునదియు నొకటే. ఏలన, దైవచోదితులమై, నిమిత్తమాత్రులమై, మనమన్నియుఁజేయుచున్నాము. మనముచేయు పాపకర్మలు దేవుఁడే చేసినట్లగునా? నిస్సంశయముగా! దేవునికిఁబుణ్య పాపములు లేవు – అనగా విశ్వమంతయునాతని మాయా శక్తిచే వినోదార్థము కల్పితము. అందుచే దేవుఁడు చేసియు చేయనివాఁడు. మనమహంకారము పెట్టుకొని పుణ్యపాపముల ఫలితము లనుభవించు నజ్ఞానులము. కర్తృత్వము విడిచి, అహంకారము వర్జించినచో, మనకును దోషములంటవు. కర్తృత్వము దేవునిదని తెలియుటే.

515. తద్దిన కర్మలో, ద్వైతాద్వైతములు, కర్మ జ్ఞానభక్తియోగములు – గాయత్రీ ప్రభావము– మంత్రప్రభావము – తీర్థ దైవస్మరణమంత్ర ప్రభావము సమన్వయసిద్ధి గాంచెను. ఒక్క ఆబ్దికము సరిగాఁజేసినచో కర్త ధన్యుఁడగును – తద్దినం ముక్తిసాధనమ్" అని చెప్పవచ్చును.

516. జిహ్వాదిచాపల్యముల నరికట్టి జయి చుట దుస్సాధ్యము. స్త్రీ ధనభోగాది కాంక్షలట్టివే. ఈ చాపల్య

మీా వేళ పుట్టినదికాదు. అగణిత జన్మములనుండి, యీాసంస్కారములు దేహత్రయమందుఁజెరుపరానిరీతిగా ముద్రితములై యున్నవి. వీని సామర్థ్యమమోఘము. అప్రతిహతము - దానిని నిగ్రహింప యత్నించులోపున నవి మనల నిగ్రహించి తమ జయపతాకల నెగురవేయును. దేవునాశ్రయించి, దైవ బలముతో వానిని జయింపవచ్చును, మరొక త్రోవలేదు.

517. మనము చేయు కర్మలు, పుణ్యాపుణ్య ఫలితములు పునర్జన్మ హేతువులై మనలబాధించుటకుఁగారణములరసి, వానిని నిర్మూలించుకొనవలెను. దీనికిఁగర్మ రహస్యము తెలియవలెను - కర్మరహస్యమేమనగా దేవుఁడధ్యక్షుఁడుగా ప్రకృతి చేయుచున్నది. మూఢులమై మనము కర్తల మనుకొనుచున్నాము. "ప్రకృత్త్యైవచ కర్మాణి క్రియమాణాని సర్వశః, అహంకార విమూఢాత్మా కర్తాహిమితి మన్యతే." గీత. "నేను దేనికిని కర్త నెంత మాత్రమును గాను - దేవుఁడో వానిచేఁ గల్పిత ప్రకృతియో కర్త; నేనెంత మాత్రముకాను; నేనుగాను, నేనుగాను బాబోయి" అని నిశ్చయముగా నెఱిగిన వానికి - కర్మబంధముండఁజాలదు.

518. సంసార జీవుని దుస్థితి వర్ణనాతీతము. పదిమంది దుష్టులొక సాధుపురుషు నన్నివైపుల నెదుర్కొని కొట్టుట; వేట కుక్కల తండు, చిన్న మేకపిల్లపైఁబడుట వంటిది; ఎంత తెలివియున్నను తప్పించుకొనుట కష్టము. కాని ఉపాయమున దాటజాలని అపాయముండదు. హిరణ్యకశిపు

నాజ్ఞచే ప్రహ్లాద బాలు నక్లే రాక్షస భటులు సకల హింసల కను గురిచేసిరి. కాని ప్రహ్లాదుని రోమముకూడ చెడలేదు. అతనికి భయముపడ లేదు, చిరునగవు విడువలేదు; విష్ణుస్మరణ మాచరించి విష్ణుచక్రమై రక్షించినది. మనకు నదియేమార్గము.

519. చిత్తముచెక్కుచెదరకుండ చేసికొను నుపాయ రాద మొకటియున్నది, వచ్చిన, రాఁగల దనుకొనిన బాధలు, యిబ్బందులు అవమానములు, అపజయములు, అనిష్టములు చిత్తమును జలింపఁజేసి, శోకార్ణవమున కీడ్చును. వచ్చినవి వచ్చిన త్రోవనే పోవుటకు, రాగలవనుకున్నవి రాకుండ నుండుటకు - భక్తునకు చేయవలసినపని, నిరంతర భగవద్ధ్యా నమే. భగవంతుని పనులలో భక్తుని కాపాడుపని మొట్ట మొదటిది. ఇట్లనుకొనుము; "ఆయనకు మనమున్న స్థితి తెలి యదా? తెలిసి, భక్తరక్షణ కర్తవ్యమును విడనాడునా? వెఱ్ఱి వాఁడా! నిశ్చల భక్తితో నుండుము; అన్నియు నీ కనుకూల ముగా జరుగును."

521. జీవితము మహాఘోరయుద్ధము. ఈ యుద్ధము వేలకొలది జన్మములనుండి జరుగుచున్నది - దైవ కృప కలి గిన నాఁడది అంతమై విజయము కలుగును. అంతఃకరణములో భక్తి బీజములు - కామక్రోధాది అజ్ఞానబీజములు - వీనికి విరోధముచే పోట్లాట జరుగుచున్నది. భోగకాంక్షలచే విషయానుభవయత్న మొకవైపు, రక్షణకాంక్షతో దైవా రాధన మొకప్రక్క ఆధిపత్యమునకై పెనగులాడును.

"విషయావినివర్తంతే నిరాహారస్యదేహినః రసవర్జం రసో
ప్యస్యపరం దృష్ట్వావర్తతే."

521. మలమూత్రముల దుర్వాసనతో నిండియున్న పాకీ దొడ్డిలో, ఇసుక, పెంట కలిపిన మట్టిమూకుడులో పాయసముంచి, తిని సుఖపడుమనుపెట్టినచో, కామినీ కాంచన సౌఖ్యమందగోరువారి దుస్థితియు నట్టిదే. మనము మోహ వశులమైనపుడు వివేకము నశింపజేసి, ప్రాణులను దుర్దమ భ్రాంతిలోఁబడవేసి, భగవానుఁడు చిరునగవుతో విశ్వక్రీడలో వినోదించుచున్నాఁడు! ఎందుకో! మనము భగవానుని లీల లోని భావమెఱుగు కోర్కె కలుగుటయు శుభమే!

522. మానవుని మనస్సు కలతచెంది, బాధనొందు టకు ముఖ్యకారణములెవ్వి? (1) ధర్మ విరుద్ధకామములను పెట్టుకొనుట (2) అవి మనము కోరినరీతిగా జరుగమి. (3) పాప భావములకు, పాపకర్మలకు లోనగుట (4) మనకు గలిగిన దుష్టభావములను, చేసిన దుష్కర్మలను విమర్శించి, మనము తప్పుచేసితిమని యెరిగి, సవరించుకొను యత్నము చేయకుండుట – చిత్తప్రసన్నత, శాంతి యెట్లు వచ్చును? (1) ధర్మవిరుద్ధకాంక్షలను దహన మొనర్చుట (2) అట్టి ప్రయత్నములో విఫలులమైనచో, సఫలతకై భగవాను నర్థించుట (3) మన తప్పులను స్పష్టముగా దెలిసికొనుట (4) చేసిన తప్పులను సవరించు కొనుటకు ముందు మరల చేయు కుండుటకును త్రికరణ శుద్ధిగాఁగోరుట (5) మనము నిర్దోషుల మగువరకు – కఠోరదీక్షతో దైవధ్యానము సలుపుచుండుట.

523. కామక్రోధములను సులభముగా జయించు మార్గములున్నవి. (1) కామవిజయము - స్త్రీలోకమంతయు జగన్మాతృ స్వరూపమేయని నమ్మి, బాల యువతీ వృద్ధులలో నేకాంత కనులకు గోచరించినను, అంతరంగమున, "తల్లీ! విశ్వమాతా!" యని నమస్కరించుటే దివ్య మార్గము. (2) క్రోధ విజయము - నిన్నెవరు దూషించినను, అవమానించినను - నీ చిత్తప్రసాదమును, శాంతిని నిలుపుకొను శక్తి నీకిచ్చుటకై దయతో భగవానుఁడు నీ కవమాన దూషణములు కల్పించెనని నిశ్చయముగా నమ్మి, చిరునగవుతో వానిని స్వీకరింపుము.

524. భక్తిజ్ఞాన వైరాగ్యములు పూజ్యలక్షణములు గావని యెవరు చెప్పరు? కాని విచిత్రమేమనగా, వాని నాచరణలోఁ జూపవలసి వచ్చినపుడు వానిని ద్వేషించువారివలె వర్తింతురు. అరుదుగా నెవఁడైన వాని నాచరణలోఁ జూప యత్నించుచో, వానికి లోకజ్ఞానము లేదని నిందింతురు. లోకజ్ఞానముండుట భక్తి జ్ఞానాదులకు విరుద్ధము కాదని మన మెంత చెప్పినను వారువినరు. విషయవాంఛలకు వైరాగ్యము భక్తి జ్ఞానము వ్యతిరేకముగాకుండుటెట్లు? ఇది విచిత్రమైన తత్త్వము!

525. లోకములోఁ బెక్కురు, అనగా అధిక సంఖ్యాకులు తెలియనివారేకాక, తమకుఁ దెలియదని తెలియనివారే! వారికి సదుపదేశము చేయఁబూనినవారే నిజముగా మూర్ఖులని

వారు పలుకుదురు.—కర్తవ్యమేమి? చెక్కు చెదరని గాంభీర్యము గల మౌనమే. దైన్యముతోఁడి మౌనముకాదు. అట్టి వారి నుపదేశించు బాధ్యత భగవానునికే విడిచి, మనమిచ్చు సదుపదేశమును మనము యుక్తముగా నాచరించు నిష్ఠను తీవ్రతర మొనర్చుకొనుటే మన కర్తవ్యము.

526. ఈశ్వరసంకల్పమును గుర్తింపఁగల అదృష్టము మనకులేదు. అందుచే మనముచేయు ప్రయత్నములన్నియు చీఁకటిలోఁదడవులాటలే! ఎట్లనగా, నాటకములో హరిశ్చంద్రాదుల పాత్రధారులఁజూచి, వారునిజముగా హరిశ్చంద్రాదులే యని నమ్ము అల్పమతులము. లోకమందేది జరిగినను, దైవసంకల్పము లేకుండ జరుగదని యెరిగినచో మన పనులన్నియుఁగ్రీడారంగ మందలి యాటలే యగును. అప్పుడు మనకు మనస్తాపమునకు బదులు మనశ్శాంతియు నానందమును గలుగును.

527. మనమెంత యోగ్యులమని మన మనుకొనుచున్నను మనలోఁగొన్ని దోషములుండి తీరును. వానినెరిఁగి ఆత్మవిమర్శ చేసికొని, మనము చేసిన తప్పులకు మనలను మనము తిట్టుకొనలేము. అందుచే మన దోషములు వేరూని సుస్థిరములగును. ఇతరులు మనల మన దోషములకై దూషించినచో నది మహాభాగ్యముగాఁదలపవలెను. మనలోనున్న కుళ్ళును వెంటనే కడిగివేసికొని శుద్ధులము కావలెను. కాని ఒకప్పుడితరులు మనకులేని దోషముల నారోపించి,

ద్వేషముచే దూషింతురు. అదియు మహాభాగ్యముగనే తలపవలెను. మనకులేని దోషములు ముందు ముందు మనకు సంక్రమింపకుండ జాగరూకతతో వర్తించుటకువా రుపకృతి యొనర్చిన వారగుదురు. అందువలన మనల దూషించువారే నిజమగు బంధువులు.

528. భగవద్భక్తిని, బ్రహ్మజ్ఞానమును నీ వితరులకు బోధింపగోరెదవా? ఆ కోర్కె ఉత్తమమైనదే, సందేహము లేదు. బోధించు పద్ధతులలో నుత్తమపద్ధతి ననుసరింపవలెను. నీవు నీభక్తిచే భగవత్సాక్షాత్కారమును, బ్రహ్మజ్ఞానమును పొందిచూపుటే ఉత్తమ బోధన విధానము. భగవద్దర్శనము, బ్రహ్మజ్ఞానమును నీవు సాధించి సిద్ధిగాంచిన ప్రబల తమ సాక్ష్యములు నీకుఁగలవో లేవో అణుసూక్ష్మ దృష్టితోఁ బరిశీలించి చూచికొని – అవి నీకు లభించినచో – నీ జీవితమే ఉత్తమ బోధనమగును. నీ సిద్ధి వాసన, దశదిశలు వ్యాపించి, లోకులు నిన్ను వెదకి కొనుచువచ్చి, నీకు దాస్యమొనర్తురు.

529. మానవ జన్మ మత్యంత భయంకరమైనది. ఉత్తరక్షణములో నేమి జరుగునో, ఎట్టి ప్రమాదములు, దుఃఖములు సంభవించునోఁ దెలియదు. ఇట్టి స్థితిలో నుండి, గర్వము అహంకారము – పరదూషణము, పరధన పర కాంతాకాంక్ష మున్నగు వానిని మనోమందిరములోఁ జేర నిచ్చువాఁడెంత మందబుద్ధియో! సర్వప్రమాదములను దుఃఖములను నిర్మూలించి, సుస్థిర శాంతియు ఆనందమును, అభ

యమును సమకూర్చు దై వారాధనామృతము నార్జింప సర్వ శక్తులు కేంద్రీకరించి వినియోగించుట తెలివికాదా?

530. భగవానుఁడు సర్వత్ర నున్నాఁడు గావున, నీ యెట్టయెదుట గూడనున్నాఁడు. నీవెచట నున్నను, సర్వ వేళల నీ యెదుటనున్న భగవానుఁడెట్టి వాఁడు? సర్వజ్ఞుఁడు, సర్వదాత, ఇహపరసర్వ శ్రేయస్సమృద్ధి నీయగల ఆశ్రిత పారిజాతము; – ఆయనవంటి మిత్రుఁడు దొరుకునా? వానితో నేల మైత్రి పెట్టికొని, నీ మంచిచెడ్డల నెల్లప్పుడు చెప్పికొను నభ్యాసమేల చేసికొనవు? ఆయన యెట్టయెదుట నున్నను, కనపడఁడు, పలుకఁడు – నిజమే – మహాభక్తులైన కొందరికి గనపడి, మాటాడిన విషయము మరచితివా? ఆతఁడు కనపడ వలెను, మాటాడవలెను అని దృఢనిశ్చయము గలిగి–ఆయన నీకేవిధముగా జవాబులిచ్చునో – ప్రత్యక్షపరోక్ష రూపము లలో నీతో భగవానుఁడెట్లాడు కొనునో – విసుగు, విరతి – లేకుండ చూచుచుండుము – మాటలలో జెప్పలేనంతటి అద్భుతకృప నాతఁడనేక విధముల నీకు బ్రదర్శించును – అఖండనిష్ఠ నేర్చికో.

531. నీ అవసరములగూర్చి నీవు భగవానునితో జెప్పికొనుట కధికారమున్నది, నీవు భగవాను నెల్లప్పుడు భక్తితో స్మరించుచున్నచో, నీ అవసరములగూర్చి, నీవు చెప్పకున్నను భగవానునికిఁదెలియును. నీ అవసరములు నిజ మైన అవసరములని, ధర్మవిరుద్ధములుగానివనియు నీవను

కొనుట గాక భగవానుఁడనుకొన్నచో నీవువానికై భగవాను నడిగినను, అడుగకున్నను, నీవనుకొన్న సమయమునఁగాని, ఆయనకు యుక్తమని తోఁచిన సమయమునఁగాని, తప్పక ప్రసాదించును. భగవానుఁడనుగ్రహించునా. అనుగ్రహింపఁడా యను ప్రశ్నకేమాత్రమును తావులేదు. సంశయము దుర్బల భక్తికి దారుణము. 'సంశయాత్మా వినశ్యతి.'

532. నీవొకసారి త్రికరణ శుద్ధిగా దేవుని నమ్మితివా? అట్లు నమ్మినచో నిన్ను భగవానుఁడు విడిచిపెట్టునని స్వప్నమందుఁగూడ భావించుట, ప్రబల దోషమగును. ఆ వెనుక రెండు పనుల నేకకాలమున నీ విషయములో నెల్లప్పుడు చేయుచుండును. (1) నీనమ్మకము చెడకుండఁజూచు టే గాక, దానిని దృఢతర మొనర్చుకొనునవకాశము లన్నియు సమకూర్చును. (2) నీ యోగక్షేమముల నేమరక చూచుచు, నీ జీవితమందు క్లిష్టతలు, భారములు, కష్టములు, దుఃఖములు రాకుండ నడపును.

533. ఎందరో తోడిమానవులను, ధనవస్తువుంది రాదికమును నీవునమ్మి, పలుమార్లు మోసగింపఁబడితివి. ఎన్నఁడును మోసముచేయని భగవాను నొక్కసారినమ్మి నీ హృదయమిచ్చి, చూచితివా? ఏమియు దాచికొనకుండ నీ హృదయము విప్పి, దేవుని పాదయులపై బెట్టి, నీ కష్టనష్టములు, నీ కోర్కెలు నాతనితోఁజెప్పికొనుము. నీ పరిశుద్ధ విశ్వాస

మున కాతఁడు కోటి గుణిత ఫలితములిచ్చి, నిత్యము రక్షిం చును. దేవుఁడొక్కఁడే యెన్నఁడు మోసగింపని వాఁడని నీకు సర్వ విషయములలో ఋజువగును. నమ్మిచూడుము.

534. మానవజీవిత మను బండి, ఆగకుండ నడచుట కెన్నియో పను లవసరము. కొన్ని పనులను నెమ్మదిగాను, కొన్నిటిని వేగముగాను జేయవలసియుండును. కాని ఒక్క పని అత్యంత వేగముగా ఁజేయవలసియున్నది. మన జీవిత కాల పరిమితి – అతి స్వల్పము – అందలి క్షణములు మహా వేగముతోఁగడచి పోవుచున్నవి. అధమము మనమా ప్రతి క్షణ వేగముతో సమమైన వేగముతో నైనను, చావును, దుఃఖమును శాశ్వతముగా జయింపఁగల దైవకృపను, లేక బ్రహ్మజ్ఞానమును సంపాదించు కృషిని చేయవలెను.

535. రామరాజ్యములో నుండుటెంత సుఖమో వర్ణించుటకు శక్తిచాలదు. రామప్రభుని రాజ్యమందే ప్రాణి కిని దుఃఖముండదు. ధర్మార్థకామమోక్షములు సమృద్ధిగా లభించును. రామప్రభువు విశ్వపరిపాలకుఁడేగాక, విశ్వమున లోపల వెలుపల సర్వత్ర ఏకకాలమున నున్నాఁడు. ఇతర ప్రభువు లెవ్వరట్లుండలేరు. అందుచే రామునికి సర్వమర్పించి, రామరాజ్యములోఁజేరి సుఖింపుము.

536. సంసారమనగా మనస్సు నశాంతి దుఃఖసాగర మున ముంచివేయు సంఘటనల మొత్తమే. మన మల్ప లము; అసమర్థులము గావున, మనమనస్సు నన్ని సంఘటనలు

సులభముగా బాధించును. కాని యీదుస్సంఘటనల ఆటలు దేవునియొద్ద సాగవు. అందుచే దేవునియొద్ద నీ మనస్సునుంచి వేయుము. దొంగలపాలు గాకుండ నగలు, బంగారము బ్యాంకులో నుంచి దాచికొనినరీతి,

537. పరమేశ్వరానుగ్రహమును సంపాదించి, మన మెచ్చట నెట్లు సంచరించినను, మనకెట్టి యిబ్బందులు గలుగవు. భూలోకమున రాజముద్రగల ఆజ్ఞాపత్రిక మనచేత నున్నచో, మనము రాజ్యమందెచటికేగి, యెవ్వరిని గలిసికొన్నను, మనలనందరు గౌరవింతురు. అటులే, దైవానుగ్రహము బొందిన వ్యక్తి, దేవుని అనగా జగత్ప్రభువాజ్ఞాపత్రిక హస్తమందుగల వాఁడన్నమాట. అందుచే మన జగత్ప్రభుని విశ్వములో నేచోటికేగి, యెవరిని గలిసినను, అందరు మనలను గౌరవింతురు. ప్రకృతి యంతయు ననుకూలముగా వర్తించును.

538. మనస్సు దేవుని కర్పించి జీవించుటనగా అది యెంత అద్భుత మహోన్నత దివ్యజీవితమో, తెలిసికొనువారరుదుగా నుందురు. ఏ పిసరంతయు మిగుల్చుకొనకుండ, సంపూర్ణముగా నీ మనస్సు నంతను దేవుని పాదపద్మముల యందు నిలిపినచో నీ విషయములో దేవుఁడు రెండు పద్ధతులలోఁబని చేయును. (1) నీకు (బాపములు సంభవించు నెట్టి పనులను నీచే నాతఁడు చేయింపఁడు. నీ మనస్సు దేవుని పాత్రైనది కావున నందు దోషములకుఁబ్రవేశము లేకుండ

(జేయును. (2) ఒకవేళ నెన్నడైన, కామక్రోధాదులు కలిగినచో, దేవునను మతితోడనే (ప్రవేశించును గావున, వాని వలన లోకహితమే జరుగును.

539. "తుల్యనిందాస్తుతిర్మౌనీ" "మానావమానయోస్తుల్యః" గీతావాక్యములు – వీనిని పారాయణచేసి యూరకుండుట లాభములేదు. మన శత్రువుల వలన స్తుతి, మన కాప్తులవలన నింద – సంభవించునపుడెంత వానికైన నుల్లాసము, క్రోధము తప్పక కలిగించును. భక్తుడుకాఁగోరు నాతఁడు తన చిత్తసమత్వము కోఱకు వీనిని దేవుఁడేర్పాటు చేసిన 'లీల' లనిగ్రహించి మౌనముతో సహించి, చిత్త విక్షేపములను జయింపవలెను.

540. దేవునిధ్యానించు భక్తులు, తమకుఁగల కొన్ని యవసరముల దీర్పుమని ప్రార్థించుటలోఁ దప్పులేదు. తమ కోర్కెలఁదీర్చు నుపాయములు, మార్గములు దేవునికి సూచించు పద్ధతి బాల్య చాపల్యమునే ప్రదర్శించును. భగవానుఁడు తన భక్తుల కోర్కెలదీర్పఁదలచినపుడాయనకు మార్గములు, ఉపాయములు తోఁచక బాధపడునా? దేవుఁడు సర్వజ్ఞుఁడనగా నేమి?

541. ఇహలోకమందలి బాంధవ్యములు, ప్రేమలు మమకారములు – భార్యాభర్తలమధ్య; తల్లిదండ్రులకు బిడ్డలకు మధ్య; బంధువులు, మిత్రుల మధ్యగల ప్రేమలన్నియు– సుఖాపేక్షచే జనించి, సుఖము లభింపని క్షణమందే అదృశ్య

మైపోవునవి – పైవారి మధ్య నుదయించు అభిప్రాయ భేదములు, కలహములు, తత్ఫలితముగావచ్చు నేడుపులు, ద్వేషములు–వానికిఁగారణమేమి? సుఖమాత్మ సంబంధము; ఆత్మేతరములందు సుఖమన్వేషించి – విఫలులై యేడ్చుట సహజమే. వస్తువు లేనిచోట వెదకి లభింపలేదను నజ్ఞానమును 'ప్రేమ' యని పొరపాటు పడుచుందురు.

542. "మయిచానన్యయోగేన భక్తిరవ్యభిచారిణీ" గీత. దేవునియం దచంచల మగు నేకాగ్ర చిత్తముతో సేవింపవలెను. ఉదాహరణము పతివ్రత – తన పతియే దైవమని నమ్మి సేవించుట–భర్త అనుకూలుఁడైనను, గాకున్నను, నితర దోషములు, లోపములున్నను వానిని గణింపక సేవ చేయునదే పతివ్రత. అట్టిపతివ్రత ముల్లోకములను జయించును. భక్తుఁడు నేకాగ్ర చిత్తముతో, ఫలితములతో నిమిత్తము లేకుండ, భగవంతుని సేవించినచో – ముల్లోకముల జయించు టాశ్చర్యము కాదు; ఏలన, పతివ్రత తన పతిని దైవముగా భావింపవలెను; భక్తుఁడు భగవానునే స్వయముగా, భగవానునిగా సేవించుట – సుఖతరము – దేవుఁడేమి తనకుఁజేసెను, చేయలేదను ప్రశ్నలతో నిమిత్తములేకుండ సేవించినచో, దైవకృపామృతము వరదలై ప్రవహించును.

543. అనేక కోట్ల జీవరాశిలో, మానవుఁడై జన్మించుటయే అదృష్టము. సర్వకారణుఁడైన పరమేశ్వరుని భజించుటచే సర్వసుఖములు లభించునను నమ్మక ముదయించి

అట్లు భజించు భక్తుని యదృష్ట మఖండమైనది – ఈ భావ మును మానవుని బుద్ధిలో నుదయింపఁజేసినవాఁడు భగవా నుఁడే? అనగా వానిని రక్షింపఁదలచియే అట్టి భావముద్భ వింపఁజేసెను. ఆ భావముదయించుటతో సుదినము లారం భమై అనంతానందప్రాప్తి అనగా మోక్షప్రాప్తితో నంత మొందును.

544. దృష్టి యే వస్తువుపైని కేంద్రీకరింతుమో, ఆ వస్తులక్షణములు మనకు సంక్రమించును. కామినీకాంచ నములు–నిలకడలేనివి, నశించునవి, దుఃఖమిచ్చునవి –వానిపై దృష్టినుంచి, మనము దుఃఖమును, వినాశమును పొందుదుము. మనము పరబ్రహ్మమునుండి వచ్చితిమి. అనంత శాంతిసౌఖ్య ములు, అవ్యయబల జ్ఞానక్రియాశక్తులు పరమేశ్వర లక్షణ ములు – అందుచే మనస్సును భగవానునిపై లగ్నముచేసి, భగవత్తుల్య లక్షణములను పొందఁగలము.

545. పలుదోముపుల్ల మొదలు బ్రహ్మత్వసిద్ధి వరకు సకల వస్తువులు – పరమేశ్వర సంకల్పప్రభావముచే జీవులకు (బంచిపెట్టఁబడుచున్నవి. చీపురుపుల్ల మొదలు చిదానందము వరకు మనకేది లభించినను. దేవుఁడు మనలనుద్దేశించి, గుర్తు పెట్టినదే యని యెరుగవలెను. మనకేవి లభింపవో అవి దేవుని సంకల్పము మనపేర ముద్రపడనివేయని తెలియవలెను. మన ప్రయత్నాప్రయత్నములు నీశ్వరసంకల్ప చోదితములే. మనము చేయుట మానుట – పూర్ణమైన అసత్యము.

546. మనకుఁగల సర్వవిషయములు, హృదయము విప్పి, పిసరంతైనా దాచికొనకుండ, నెవరితోఁ జెప్పికొనవలెను? భార్యాపుత్ర బంధుమిత్రులతో మనము కొన్ని విషయములు చెప్పఁజాలము. చెప్పినవికూడ వారు సవ్యముగా గ్రహింపరు. చెప్పినను, చెప్పకున్నను, భగవానుని కన్నియుఁదెలియు శక్తిగలదు. మన మితరులయొద్ద మన హృదయమును మూసివేయ వచ్చునుగాని, భగవానుఁడు హృదయవాసియైనందున, దేవునికి మన హృదయమును మూసివేయుట పొసగదు. అందుచే మన మంచిచెడ్డలన్నీ భగవానునితోఁజెప్పికొనుటకు మనకు హక్కుగలదు. బిడ్డ తన సంగతులను తల్లిదండ్రులతోఁజెప్పికొను హక్కు. మన తండ్రియగు భగవానుఁడు మన హక్కును మన్నించి కటాక్షించుట జరుగును.

547. మనస్సును మనస్సుచేతనే జయించు కార్యము విచిత్రమైనది. ఏదేని పారాయణ చేయునపుడో, గుణించునపుడో, మనస్సు మనచేఁదప్పు చేయించును. తప్పు వచ్చుట కనిపెట్టి సవ్యమార్గము లోనికివచ్చుచుందుము. మనస్సుచేసిన తప్పు మనస్సే సవరించుకొనును. తప్పుదిద్దు మనస్సు ఉన్నత మనస్సు (Super Mind). అదియే ఆత్మశక్తి. దానినే అంతఃకరణ మందురు. ఆత్మచోదనము విని, మనస్సును దిద్దుకొను నభ్యాసముచే మనోజయము పొంది, జ్ఞాని కాఁగలఁడు.

548. నీ చిత్తము వచ్చినట్లు పనులు చేయుదువు. నీకు చిత్తము వశమై యుండదు కనుక, మంచిపనులు చెడ్డ

పనులుకూడ జేయుచుందువు. కాని, నీ చిత్తము నొకనాఁటి యీశ్వరునికిచ్చి వేసితి వేని, అప్పుడది యీశ్వరాయత్తమై వర్తించును. అప్పుడు నీవుచేయు పనులన్నియు నీశ్వరుఁడు చేయుపనులే యగును. నీ పనులప్పుడు నిన్ను బంధింపవు; నీ చిత్తమిక తప్పుపనులు చేయదు; పైగా జ్ఞానసిద్ధియు, మోక్షమును లభించును.

549. జగత్తంతయు నఖండ పరబ్రహ్మ శక్తితో నిండియున్నది. మన కనులకు గోచరించు వృక్షలతాదులు, పశుపక్ష్యాదులు, నదులు సాగరములు, నక్షత్రగ్రహరాశులు నన్నియు నాపరబ్రహ్మ రూపములే. ఇవి కనపడు పరబ్రహ్మ రూపములు; వీనిలోనను, పైనను అవకాశమంతయు గనపడకుండ నాపరబ్రహ్మ శక్తితో నిండియున్నది - అందుచే గన్ను తెరచినను, మూసినను అంతాబ్రహ్మమయముగా జూచుటభ్యసించి, అనంత శాంతిసౌఖ్యముల నొందవలెను.

550. భగవంతుఁడున్నాఁడు. కొన్ని యుగముల నుండి మహాభక్తులు, జ్ఞానులు, యోగులు - దేవుని దర్శనము గాంచి, సకల బంధ దుఃఖనివృత్తి నొంది మోక్షము పొందిరి. అట్టివారి సాక్ష్యములు మనయెదుట గ్రంథరూపమునన్నవి. ఈ సాక్షులెట్టివారు; పరమ సత్యవ్రతులు, జితేంద్రియులు లోక కళ్యాణతత్పరులు - వారి మాటలు నమ్మి, దేవుని ధ్యానించి, నీవును దర్శించుటకు, ముక్తి గాంచుటకు నెట్టి యాటంకము, సంశయమును లేదు. నమ్మి తరించు; నమ్మ జాలవా? నీ దుర్దశపోవు మార్గాంతరము లేదు.

501. ఎన్నో జన్మముల పుణ్యరాశి వెనుకనున్నగాని భగవంతు నర్చించు భాగ్యము పట్టదు. అట్టి మహాద్భాగ్యముపట్టినవెనుక, దానిని చెక్కుచెదరకుండ సుస్థిరమొనర్చుకొనుటేగాక, అఖండానంద శాంతియుతమైన మోక్షసిద్ధి లభించువరకు వృద్ధి చేసికొనవలెను. ఏకారణముచేతను మనము నమ్మిన భగవానుని విస్మరించు దౌర్భాగ్యమునకు పాల్పడకుండ జూచికొనవలెను.

552. భగవంతుని సేవించు కార్యములో నిమగ్నుడవై, తన్మయుడవై నీ వుండగలిగినచో, నీకు జరుగ వలసిన యితర కార్యములన్నిటిని భగవానుడు స్వయముగా జరిగించును. మనము చేసికొనకుండ మనపనులెట్లు జరుగునని సందేహింపనవసరము లేదు. అదియే విచిత్ర విషయము; భగవన్మహిమ అనగా నదియే. మనము దేవుని పనిలో నుండినచో, దేవుడు మన పనిలోనుండును. దేవుని మరచి, పనులలో నిమగ్నులమైనచో రెండును చెడును.

553. ఈ లోకములో బుట్టుట, దైవకృప నార్జించుట కొరకే, ఆ పనిలో గృతార్థులము కాలేకున్నచో దిరిగి తిరిగి జనన మరణములందుచుండవలసి వచ్చును. కొన్ని వేల జన్మములిట్లు మనము వ్యర్థమొనర్చితిమి. ఇప్పటికైన బుద్ధి తెచ్చికొని దైవకృపా సంపాదన దీక్షవహింపవలదా? జనన మరణములు – వానివలని దుఃఖములు అలవాటై, విడిచిపెట్ట లేకుంటివా ?

554. మన దేహము శ్మశానమున దహనమైపోవుట తప్పదు. కోట్లకొలది దేహములు నిత్యమీవిధముగా బూడిద యగుచున్నవి. ఇది చూచుచు గూడనివారివలె గ్రుడ్డివారమై వర్తించుచున్నాము. దీనికి దైవమాయయే కారణము. మాయనతిక్రమించి, మనదేహమునకు గలుగు శ్మశాన ప్రయాణము, దహనము నిత్యము జ్ఞాపకముంచుకొనవలెను.

555. ఈశ్వరప్రజ్ఞ అనంతకోటి భావపరిపూర్ణము. మనయెడ నాతడే భావము నెప్పుడు ప్రదర్శించి యెట్లు వర్తించునో గమనించుట మన కసాధ్యము. మన బాలుడొకడు కొలదిమందిగల గుంపులో నున్నచో వెదకి పట్టుకొనవచ్చును. లక్షలుగల గుంపులోబడి తప్పిపోయినచో బాలుని వెదకుటలో మనము త్రోవతప్పుట కవకాశమున్నది. ఈశ్వరునాశ్రయించి పూజించుటే మనముచేయగల పని; వాని ప్రజ్ఞావైభవమును కొలతవేయుటకు యత్నింపరాదు.

556. "హే భగవాన్! ఒక క్షణమైన మరువకుండ నిన్నెల్లప్పుడాశ్రయించు దృష్టిని, శక్తినిచ్చి కాపాడుము, ఇంతకంటె వేరుకోర్కెలు లేకుండజేయుము." ఇదియే మనము చేయవలయు నిత్యప్రార్థన. పరమేశ్వరానుగ్రహము కలిగినచో, అవ్యాజానందానంద సిద్ధియగును. మనము దేవునేది కోరినను, దాని వలన సుఖము లభించుననియే. దైవకృపచే లభ్యమగు నానందములో సర్వవాంఛాసిద్ధి వలని యానంద మిమిడి యుండును. మనము కోరుకోర్కెల ఫలితమంతయు

భగవాను ననుగ్రహములో సంపూర్ణముగా నుండుటచే, వేరు కోర్కెలు కోరనవసరము లేదు.

557. "సోఽశ్నుతే సర్వాన్ కామాన్ సహ." ఉపనిషత్తు పలికినది. మన హృదయాకాశములో వెల్గొందుచున్న బ్రహ్మమునెరిగినచో, బ్రహ్మముతో సహా సర్వకామములు సిద్ధించునని భావము. ఇహలోక సంబంధమైన మనకోరికలన్నిటికి మన మాసించు ఫలితము సౌఖ్యానుభవమే. పరబ్రహ్మజ్ఞానము లేక యీశ్వరసాక్షాత్కార సిద్ధి సర్వ సంపూర్ణానందము నిచ్చును. సర్వకామ ఫలితమగు సౌఖ్యమందిమిడి యుండును. దేవుఁడు కల్పవృక్షము - అన్ని కోరికలిచ్చును - సంపూర్ణమృష్టాన్న భోజనముచేసి, యెంగిలి మెతుకులు యాచించుటెందులకు ?

558. భగవానుని విషయములో మన అదృష్టము మాటలకందనిది. మనలోపల, బయట, సర్వత్రనిలిచియుండి మనము మన మనస్సులలో మౌనముగా స్మరించినను గమనించు సామర్థ్యముగల వాఁడగుటచే, దేవునాశ్రయించుటకెక్కడకునుబో, నక్కర లేదు, మన ప్రార్థనల నెరుగునా, వినెనాయను సంశయము లవసరము లేదు. ఇంతకంటె ఆశ్రయసులభుఁడెవఁడుండును? భూలోక ప్రభువులైనను, వారి దర్శనము వలయునన్న, వ్యయప్రయాస లెన్నియున్నను నొకప్పుడు దుర్లభము. కావున మహీపతులకంటె మహేశ్వరుఁడే అత్యంతసులభారాధ్యుఁడేకాక, అనంతఫల ప్రదాతయు నగుటచే నీశ్వరారాధకుల భాగ్య మనన్యము.

559. జీవిత మత్యంతముగా నస్థిరము; మృత్యువు వచ్చియే చెప్పును; ఇహభోగములు క్షణికసుఖలేశము నిచ్చుటకు, మితిలేని 'బలి' కోరును. నీటి బొట్టంత సుఖము; మహాసాగరమంత దుఃఖము. ఏమిచేయుట? భగవానుఁడున్నాఁడు. ఆశ్రిత కల్పకము. పరిశుద్ధ పూర్ణచిత్తము నాతని పాదములకు సమర్పించుట వలన, సకల దుఃఖనివారణము; సర్వ సౌఖ్యప్రదానము నాతఁడుచేయును. లోకములో ధనాదికము నార్జించుటకంటె దేవుని కృపనార్జించుట మిక్కిలి సులభతరము; భగవంతునే ఆశ్రయించి. యింకెవరిని, దేనిని ఆశ్రయింపవలయు నవసరములేకుండఁ జేసికొని ధన్యుఁడవుకమ్ము.

560. "భీషాస్మాద్వాతఃపవతే." ఉపనిషద్వాక్యము. జగత్ప్రభు శాసన మమోఘము; అవిలంఘ్యము, అప్రతిహతము. సూర్యాదిగ్రహములు, వాయ్వాది పంచభూతములు, ఇంద్రాది దేవతలు, ఈశ్వర శాసనమునకు వణకుచు దమవిధుల నిర్వహించుచున్నారు. అల్పజీవులగు మనుజులెంత? అహంకారగర్వములను పూర్తిగా ఁబాతిపెట్టి, భగవానుని వినమ్రభక్తిశ్రద్ధలతో ఁబూజింపవలెను. దేవునుగ్రమూర్తిని వినయభక్తులతో ధ్యానించినచో దేవుఁడు సౌమ్యరూపిమై దర్శనమిచ్చి రక్షణమిచ్చును,

561, భగవానుఁడనంతుఁడు; భగవానుని కార్యకలాప నైపుణ్య మనంతమైనది. అత్యంత సూక్ష్మజీవి మొదలు బ్రహ్మవరకు లెక్కింపరాని అనంతజీవకోటిని

సృజించి, వానిని విచిత్రరీతులనడపు భగవానుని నైపుణ్యము, అనంతప్రజ్ఞా వైభవము దురవగాహములు. మానవునకు బరిశీలించు కొంతబుద్ధి శక్తి గలదు; తన జీవితములోని వివిధ దశలలో నెట్టియద్భుత తాటస్థ్యములనాతఁడు కలుగ జేసెనో సూక్ష్మముగా బరికించి, దేవుని దివ్యహస్తమును మనము దర్శించుట కలవాటు చేసికొనవలెను. క్రమాభ్యాసముచే దేవుని హస్తమునన్నిటిలోఁజూచి, తరించుటయే మార్గము. గర్వాహంకారరహితమైన పవిత్రబుద్ధిదీనికవసరము.

562. దేవుఁడేకైక సర్వస్వతంత్ర కర్త. జడ ప్రకృతియు, ప్రాణికోటియు దేవుని ఉపకరణములు. జడపదార్థములు "మేముపనులు చేయుచున్నాము"ని తలచుశక్తి లేనివి, జీవులు, ముఖ్యముగా మానవులు మేముపనులు చేయుచున్నామను భ్రాంతికి వశులైయున్నారు. భగవానుఁడు మానవులను (సకల జీవులను) జడపదార్థములను వలె నుపయోగించుచున్నాఁడు. దేవుని చేతిలో జడాజడములకు భేదము లేదని యెరిగి, మనము 'నిమిత్త' మాత్రులమైన ఉపకరణములమని గ్రహించుటే మోక్షము.

563. పుణ్యధనము వలన నిహపరలోక సుఖములును, అగణ్య పుణ్యధనము వలన, మోక్షమును లభించును. భగవంతునారాధించుట వలనను, భగవంతుఁడు సంతసించు సత్కర్మలవలనను – పుణ్యము సిద్ధించును. ఇహపర సౌఖ్యములు తాత్కాలికములు – తిరిగి జన్మించుట తప్పదు;

అందుచే పుణ్యాధనమఖండముగా నిలువఁజేసి తిరిగి జన్మింప నవసరము లేని మోక్షసిద్ధి నార్జించుట, వివేకము.

564. కీర్తి కాంక్షకూడ బంధనమే. పువ్వులోని పరిమళమువలె నప్రయత్నగా దానంతటది వచ్చినచో దోషము లేదు. అందుచే మనదృష్టి కీర్తిపైఁ గేంద్రీకృతమైనచోఁ బతనము తప్పదు. ఈర్ష్యాసూయా ద్వేషములు కీర్తి కాంక్షకు జనించు సంతానము, భగవద్భక్తుఁడు కీర్తి విముఖుఁడు గావలెను.

566. ఎవని నాశ్రయించినచో, మనకు సకల భయములు, దుఃఖములు తొలగునో, సకల శుభములు సౌఖ్యములు లభించునో, వాని నాశ్రయింప వలెనని తెలియుటకు, వేదశాస్త్ర పాండిత్యము కుశాగ్రబుద్ధియు నవసరము లేదు. సామాన్యులైన వారందరంగీకరించు విషయమిది. పరమేశ్వరాధీనమస్కు నకుఁ బరమేశ్వరుఁడధీనుఁడగును. ఇది కవిత్వము కాదు; కోట్లకొలది జ్ఞానులు, భక్తులు, యోగులు, తపస్వులు దీనికి నిత్యసాక్షులు. నీకుఁ దెలివియున్నదా, దేవునాశ్రయించి సుఖింపుము.

566. ఏమి జరిగినను చలింపని మనస్సు, దిగులు చెందని హృదయము, కలతచెందని బుద్ధిగలవాని కేలోకమున నెవఁడును సాటిగాఁడు. కాని యిందొక రహస్యమున్నది. అన్నియు ననుకూలములై యున్నప్పుడందరును శాంత చిత్తులే! చిత్త శాంతిని చెడగొట్టు పరిస్థితులు సంభవించినపుడు

చెడని చిత్తశాంతి యుండవలెను. అందుచే మనకు చిత్త శాంతి కలదని ఋజువగుటకు మనకుఁజికాకులు, కష్టములు, అనిష్టములు, క్లేశములు అవసరములు. అవి రాకున్న మనకు ఁజిత్తశాంతి యననేమో తెలియుట కవకాశము లేదు.

567. నిన్ను భగవానుఁడు ఁబరీక్షచేయుచున్నాఁడా? అయినచో నేమిచేయవలెను. ఎదురైనీవు భగవానుని పరీక్షింపవలెను. ఇందు రెండు విషయములున్నవి. (1) సర్వ లోకైక నాథుఁడైన భగవానుఁడంతవాఁడు, పరీక్షించుటకు పెక్కుమందిలో నిన్నెన్నుకొనుటచే నీ దెనలేని అదృష్టము. (2) పరీక్షింపకుండ నీ సంగతినెఱిగియు, నేల పరీక్షించును; భగవానుఁడు నీకిచ్చిన సమస్యల ఁబరీక్షింపుటలో దేవుని హృదయము నీకు సువిదితమై, దేవునిమహిమ నెరిగి తరింతువు.

568. దేవుఁడు మనలను, చంటి బిడ్డలుగాఁజూచును. తల్లి, తన బిడ్డకొకసారి పాలిచ్చి ముద్దిడు కొనును; బుగ్గలు గిల్లి ఆముదము మ్రింగించును. అన్నియు బిడ్డ క్షేముకొరకే చేయును. మనకుఁదల్లియు, ఁదండ్రియునగు భగవానుఁడటులే, మనలను పెంచును, బిడ్డ తల్లిదండ్రులను తప్పుపట్టునా? మనమును మన దేవుఁడను నాన్నగారి నెన్నఁడు తప్పుపట్టక, మనక్షేమదాతయే దేవుఁడని యెరుగవలెను.

559. నాలుగైదేండ్ల బాలుఁడాడుచు వీథిలోనికిఁ బోయి దారితప్పెను. కొందరు వానిని ఁజేరి, "మీాయిల్లెక్కడ? మీాతండ్రి పేరేమి?" యని అడుగగా ఁదండ్రిపేరు 'నాన్న'

యని యిల్లు చూపుమన, నేదోయొకటి చూపును. ఈ లోక ములో మనమందరమట్టి స్థితిలో నున్నాము. మన యిల్లు దేవుఁడే. అటనుండి యెన్నఁడో దారితప్పితిమి. మనయిల్లు దేవుఁడని, మన 'నాన్న' దేవుఁడని గుర్తింపలేని దుస్థితిలో ఁదిరుగాడుచు దుఃఖము లనుభవించుచున్నాము.

570. భగవంతుని భజించుటెందులకు? ఎట్లు భజింప వలెను? (1) సర్వవిధరక్షణమిచ్చి సర్వకాలసర్వావస్థలలో మన యోగక్షేమ కర్త గావున భగవద్భజన చేయవలెను. (2) మనల నెల్లవేళలఁగాపాడు భగవానుని స్మరింపకుండ నొక్కక్షణమైన నుండఁజాలము కావున స్మరించి, తరింప వలెను.

582. "మయాధ్యక్షేణ ప్రకృతిస్సూయతే సచరా చరమ్, హేతునానేన కౌంతేయ జగద్వి పరివర్తతే", నేను ప్రకృతి కధ్యక్షుఁడనై, చరాచరాత్మకమైన జగత్తునుసృజించి చినడపుచున్నాను. ప్రకృతిని దేవుఁడే సంకల్పమాత్రముచే గల్పించి, తద్ద్వారా సర్వమును వర్తింపఁజేయుచున్నాఁడు. అనగా ప్రకృతి కార్యములనగా దేవుని పనులే. ప్రకృతిలోని వారే జీవులు – అందుచే జీవకార్యములు ప్రకృతి కార్య ములే; ప్రకృతి కార్యములు దైవకార్యములే. అందుచే నన్నియు దైవకార్యములే.

572. దైవకృప లేనిదే, దైవారాధనము జరుగదు. దైవము నారాధింపనిచే దైవకృపకలుగదు. ఇది విచిత్ర

సమస్య. పరిష్కారమేది? మనమజ్ఞానులుగా నున్నంత కాలము కర్తృత్వము మనకున్నదని పనిచేయుదుము. అందుచే సద్గ్రంథపఠనము, సజ్జనగోష్ఠి, ఆత్మవిచారణ, జపతపాదికము చేయవలెను. దైవారాధన దృష్టి పెంపొంది, చిత్తము శుద్ధమై అజ్ఞానము దొలగి అహంకారము నశించును; అప్పుడు దైవ కృపకలుగును. అందరకు దైవకృపకర్హతగలదు; తన అనిర్వచనీయవిలాసమునననుసరించి దైవారాధన చేయవలెనను బుద్ధి జనింపజేసి ప్రతిప్రాణిని దరింపజేయును. కాలభేదముండును. అది దైవసంకల్పము,

573. విప్రునకుఁదన్నితరులుస్తవ మొనర్చిన దినము దుర్దినము; నిందించిన దినము సుదినమని మనువు వ్రాసెను. స్తవమాయుర్దాయక్షీణమును, నింద ఆయుర్దాయ వృద్ధిని గలుగఁజేయును. కాని సామాన్యముగా, మనమనస్సు, నింద్రియములు, నరములు స్తవమునుగోరి, నిందను ద్వేషించును. అందు ముఖ్యముగా, సమర్థులు, బంధువులు, అత్యంత సన్నిహితులు మనల నకారణముగా నిందించినపుడు మనకు నిగ్రహము దుస్సహమగును. స్తవము మన కహంకార ద్వేషాదులను బెంచి, ఆయువును, తేజస్సును నశింపజేయును. నిందించువారిపై మనకుదయించు ద్వేషభావమును నిగ్రహించి నిగ్రహము వలన మనకు లభించు ఆయుస్తేజోవృద్ధికి వారియెడ కృతజ్ఞులమైయుండు సాధనముచేయుట గొప్పసాధనమై మనలఁదరింపఁజేయఁగలదు. సమదృష్టియే విప్రత్వము.

574. జగములో జరుగునదంతయు భగవంతుని లీలావిన్యాసమే! దేవుని గారడీ! అదియెంత నిజమని తోపించుననగా, గారడి యను భావము మనకు కలుగనే కలుగదు! అంతనైపుణ్య మందుండుటచే నసత్యమును సత్యముగా భ్రమింపఁజేసి, సుఖదుఃఖహేతువగుచున్నది. అంతయు దైవలేలావిలాసమని గుర్తించి చిరునగవుతో సకలము స్వీకరించి ఆనందించువాఁడెంత మహాత్ముఁడో!

575. భగవానుఁడందరలో నున్నాఁడు. సత్త్వరజస్తమో భేదముల ననుసరించి, వారికిదైవభక్తిని గలిగించును. ఏదో రూపమున నందరకు దుఃఖములున్నవి. దుఃఖ నివారణ్కై భగవంతునాశ్రయింతురు. జన్మజరామృత్యువులకు హేతువైన దేహధారణమే మహాదుఃఖమనియెరిగి మరణించులోపున జన్మరాహిత్యమునిచ్చు పదవి నార్జించు దీక్షఁబూని కృతార్థుఁడగువాఁడే ధన్యుఁడు. అట్టివారిసంఖ్య అత్యల్పము.

578. ప్రపత్తిమార్గము (సంపూర్ణాత్మ సమర్పణము) భగవత్సాక్షాత్కారమిచ్చు సులభమార్గమని చెప్పుదురు. నిజమే కాని ప్రపత్తిలో విపత్తుగూడఁగలిసియున్నది. మనము పూర్తిగా నిరహంకారులమైనఁగాని ప్రపత్తి రాదు. ఏ యొక క్షణములోనైన నది జరిగినను, నిలువదు. అహంకార మెల్లప్పుడు తిరిగితిరిగి తలెత్తి, దేవునే మరపింపఁజేయు ప్రమాదమున్నది. అదియే విపత్తు కావున కఠోరమగు నాత్మ శిక్షణము, ఆత్మశుద్ధి ప్రపత్తికి ముఖ్యములు.

577. కోరికలు చిత్తవిక్షేపకారణములు; అవి ఫలించునా, ఫలించినచో మనమనుకొన్నంతగా ఫలించునా, ఫలింపకున్న దుఃఖము; ఫలము తక్కువైన దుఃఖము, పూర్తిగా ఫలించిన వెంటనే, వేరుకోర్కెలు తలలెత్తును – జీవితము కోర్కెల పుట్ట; కోరికలు చిత్తశాంతి భంగకరములు. తుదిలేని దుఃఖహేతువులు – కోరికల రూపమే దేహము. కోరికలలో సర్పశిరమందువలె విషమున్నది. విషమును పిండివేయవలెను; మన బ్రతుకంతయు విషసర్పములతో చెలగాటము; దేవుడిచ్చిన దానితో సంతుష్టిచెంది, దైవారాధనలో నిమగ్నులై, వాంఛాతీత స్థితియగు ముక్తిని సాధించువారేధన్యులు.

578. కామినీ కాంచనాదులు, మనము వాని ననుభవించు వయోబలావకాశములు లేకున్నను వ్యామోహ పాశములచే బంధించి, దుఃఖహేతువులై పరిణమించును. వీనిని జయించుటకు రెండే మార్గములు (1) క్షణిక సౌఖ్యమిచ్చి స్థిర వ్యామోహమును గలిగించు ద్రోహ లక్షణములను గ్రహించి వానియెడ వైముఖ్యము నభ్యసింపవలెను. (2) ఈ వ్యామోహపాశములను కల్పించినది భగవంతుని మాయాశక్తి. భగవానునాశ్రయించి, వానినుండి బంధవిముక్తి నొందవలెను.

580. నీవుచాల గొప్పవ్యక్తివే, విద్వాంసుడవే, ధనికుడవే, విదేశవిఖ్యాతిగలవాడవే, ఉన్నతపదవుల నాక్రమించినవాడవే; విధేయతగల భార్య. పుత్రులు, భృత్యులు

గలిగి, ఆకసమంటు హర్మ్యములు గలవాఁడవే - కాని ఏమి లాభము! నీవు మరలఁబుట్టి, ఏకాంతగర్భనరకమో అనుభవించి, మరలఁగోర్కెలతోఁ బెరిగి, తిరిగిమృతినంది, తిరిగి గర్భనరకములోఁ బ్రవేశింపవలెను. జనన మరణాతీత పదవినార్జించి స్థిరసౌఖ్యమనుభవించుటకై యత్నించుట తెలివైనపనికాదా!

580. చలించుట, కంగారుపడుట, భయభ్రాంతులకు వశుడగుట - ఇవి నీకున్నచో శాంతియెక్కడ? ఇది విను;-

నీకన్ని వైపుల, లోపల దేవుఁడున్నాఁడు. ఆయన చెవులన్నియు వినును; ఆయన కన్నులన్నిటిని జూచును. ఆయన అవిచ్ఛిన్న జ్ఞానానందమయుఁడు. నీ మనస్సునాయనపై లగ్నమొనర్చుము; నీ వెరుగకున్నను, నీకు సర్వదా రక్షకుఁడాయనయే. ఎరిగి, దేవుని కృపామృతరసమనుభవించి శాశ్వత శాంతి నందుము.

581. సృష్టి రహస్యమెరుగుదువా? కామమే! స్త్రీ పురుష రూపముల సృజించి, పరస్పరాకర్షణము కలిగించి, తనసృష్టి నవ్యాహతముగానిలిపి. ముందుకు నడపుచున్నాఁడు. కామ సంతృప్తిలో నానందలేశమును జవిచూపి, సకలప్రాణికోటియు సంసారమునఁబడి కొట్టుకొనునట్లు భగవంతుఁడు చేసినాఁడు. జన్మజరామృత్యు దుఃఖములన్నియు గామ సంతానమే. కామము, లేశ సుఖభ్రాంతిని, దురంత దుఃఖమును కలుగఁజేయును. కామము దేవుని అప్రతిహత శక్తి, రామునాశ్రయించి, కామము నరికట్టి దుఃఖ విముక్తిని, అనంత శాంతి సౌఖ్యములను పొందవచ్చును.

582, భగవంతునన్నిటిలోఁజూచుట సులభకార్యము కాదు. అనంతనామ రూపములుగల జీవులు, వస్తువులు కనఁబడుచుండగా అవి దైవస్వరూపములేయను నిశ్చయజ్ఞానము అనేక జన్మములలో సాటిలేని తపస్సు చేసిన అఖండదీక్ష, అభ్యాసము లేనిదే రాదు. మరణించులోపున దైవానుగ్రహము సంపాదించి, దేహావసాన పర్యంతము సుఖశాంతులతోఁగడపి, దేహపతనానంతరము మోక్షపదవి నార్జించు కృషి వెంటనే ఆరంభించి, మరణములోపున ముగింపవలెను.

583. అవసానదశలో నీదేహమును విడిచిపెట్టుపని అత్యంతాయాసక్లేశకరమైనదని పెద్దలు చెప్పిరి, పెక్కుమంది అవసానదశఅట్టిదని మనమును జూచితిమి. అనాయాస మరణము నందరు కోరుదురు. అది అఖండ పుణ్యఫలము. కావున మరణకాలము శ్రమలేనిదగుటకిప్పటినుండియు నుత్కృష్ట దీక్షతో దైవారాధనమొనర్చి దైవకృప నార్జింపవలెను.
అమితమైన దేహమమకారముగలిగి, భక్తిజ్ఞాన వైరాగ్యముల నభ్యసింపని వారిమరణబాధ నరకతుల్యమగు నని చెప్పనవసరము లేదు.

584. ప్రతిక్షణరోగభయ ప్రమాదములకు నిలయమగు రక్తమాంసాస్థి కల్పిత దేహము మనకీయఁబడినది. సాధ్యమైనంతగా దీనినుపయోగించి, భగవదనుగ్రహమార్జింపలేక బడులు, దానితో సుఖమాసించి, దుఃఖమును కొని తెచ్చుకొనువారి సంగతి నేమి చెప్పవలెను?

585. "అపిచేత్సు దురాచారో...శశ్వచ్ఛాంతింనిగచ్ఛతి." గీత పలికినది. నేను పాపములు చేసితినని భయపడనవసరము లేదు, భగవదాశ్రయము సర్వపాపహరము. దేవునాశ్రయించినను నశింపని పాపములున్నచో దేవుని బలముకంటె పాపముల బలమధికమైన దగును. అట్లగుట దైవదూషణమగును. ఏక్షణమున దైవోన్ముఖుఁడవై దైవధ్యానపరుఁడవగుదువో, ఆ క్షణమునుండి గతపాపములు నశించుటయు గదిరిగ, పాపములు చేయకుండుటయు జరుగును. తన్నాశ్రయించిన వారినిఁకనాపై పాపములు చేయనీయఁడు. అందుచే, నిహపర సుస్థిరశాంతి లభించును.

587. నీవు ఖిన్నుఁడవైతి వేల? తెగని సమస్యయేదైన నిన్ను పీడించుచున్నదా? భయపడకు. నిరాశకులోనుగాకుము. అసాధ్యములనఁబడువాని నత్యంత సులభసాధ్యములోనర్చుకొను మార్గమెరుగవా? భగవానునాశ్రయించినచో సర్వక్లిష్టసమస్యలు సులువుగాఁబరిష్కారములగును. భక్తజనాధీనుఁడు, ఆశ్రిత కల్పకమునైన భగవానుఁడుండగా వానినాశ్రయింపక, ఖిన్నతపొందనవసరము లేదు.

587. మానవుఁడు కోరునవన్నియు జరుగవు; కొన్ని జరుగకుండుటేకాక, వ్యతిరేకముగా జరుగును. జరుగకుండుట, వ్యతిరేకముగా జరుగుట దుఃఖహేతువులు. మనమనుకొన్నవి అనుకూలముగా జరిగినప్పటి చిత్తశాంతి, జరుగనప్పుడు వ్యతిరేకముగా జరుగునప్పుడు, చెడకుండనుండు నుపాయముకావ

లసియున్నది. ఆయుపాయమొక్కటే యున్నది. జరిగినవి జరుగనివి, వ్యతిరేకముగా జరుగునవి, అన్నిటి కేకైక కర్త ఆగవానుఁడు. దేవుని నమ్ముదువా? ఆయన చేసినవన్నియు నిర్దిష్టములే. అప్పుడు జరిగినవి, జరుగనివి, వ్యతిరేకముగా జరిగినవి సమానములగును. నీచిత్త శాంతియు సమత్వ మందును.

588. భగవంతుఁడున్నాఁడని నమ్ముదువా? నమ్మలేకున్నచో విషపానముచేసి, మృతినొందుట మంచిది. దేవుని నమ్మనిబ్రదుకు, విషముకంటె ఘోరమగును, నమ్ముదువా? దేవుఁడార్త త్రాణపరాయణుఁడని కూడనమ్ము. నమ్మి పరిశుద్ధ చిత్తముతో ధ్యానించు. ఏలన, వ్యాసవాల్మీకాదులు, వేద వేదాంతములు. శంకరాదులు, శ్రీరామకృష్ణ వివేకానందాదులు, మున్నగు మహాత్ములు, దేవుని నమ్మి, భజించి, సర్వార్థములు సాధించి, అనుభవపూర్వకముగా, లోకహితార్థము వారు చెప్పినమాటలు నమ్మక, యింకెవరి మాటలు నమ్ముదువు ?

నమ్ముటయు, భజించుటయు జరిగినచో వారి అనుభవము నీకును గలుగును, దేవుఁడున్నాఁడని, ఆశ్రిత రక్షకుఁడని నీకును ప్రత్యక్షసాక్ష్యములు లభించును.

589. దేవుఁడేరీతిగా నీవాంఛితముల సిద్ధింపఁజేయునో పరిశీలింపఁదలచితివా? పరిశీలించు. అది తప్పుకాదు. భక్తితో వినయముతో నిశ్చల విశ్వాసముతోఁబరిశీలించి, దేవుని

మహిమ నెరిగి ఆనందింపవలెను. కాని దేవునిమహిమ నెరుగుటకు నీ వెంతవాఁడవు. బ్రహ్మాదులు విఫలులైరి – కాని పరిశీలన అంత ముఖ్యముగాదు, ఫలితము ముఖ్యము, భక్తితోడ నమ్మి జపించినచో నిన్నాతఁడు రక్షించునా లేదా ప్రతి విషయములోఁ జూచికొనుము. తన్నాశ్రయించినవారినాతఁడెన్నఁడును దగా చేయఁడు.

590. జీవిత మొడిదుడుకులు లేకుండ నిదానముగా సాగినచో, నీలోని భక్తిజ్ఞానవైరాగ్యములు మందగతిలోఁబడి, చెడుట కవకాశములు తటస్థించును.

కాని ఒడిదుడుకులు, కష్టములు, దుఃఖములు, దారిద్ర్యము, రోగములు మున్నగునవి, ధైర్యవివేకములను నీరసింపఁజేసి, నిరాశను కలిగించును. కష్టములు మహాత్ముని చేయనగును. నీచుని చేయనగును. మహాత్ములు దారిద్ర్యమనుభవించిరి. కాని దరిద్రులందరు మహాత్ములా? శ్రమపెట్టకుండ రక్షింపుమని దేవుని ధ్యానింపవలెను. ఉపాధిభేదములననుసరించియే భగవానుఁడు తనకృపను జూపును. అందరకొకటే సూత్రముండదు.

591. "ప్రజ్ఞానం బ్రహ్మ" ఉపనిషన్మహావాక్యము. అనంత ప్రజ్ఞాస్వరూపి యనగా అనంత జ్ఞాన మూర్తి భగవానుఁడు. పరిపూర్ణజ్ఞానమనగా బరిపూర్ణముగా నిర్దుష్టమైనది. అట్టివాఁడేమి చేసినను కల్యాణప్రదమైనదే. అందుచే నట్టి అనంత జ్ఞానమూర్తి నాశ్రయించి. యేశంకయు లేకుండ సుఖముగా నుండవచ్చును. ప్రజ్ఞాలోపమున్నవారి నాశ్ర

యించినచో శంకల కవకాశముండును. దేవునాశ్రయించి, శంకింపఁబనిలేదు.

592. హే భగవాన్! నీ కొరకేడ్చువారే నీకు లోకువా? వారికే పరీక్షలు, బాధలు, లేమి, అవమానము, తీర్పరాని సమస్యలు పెట్టి శాసింతువు. వారి నుత్తమ భక్తులుగా దీర్చిదిద్దుటే నీ ఆశయమేమో! బాధపెట్టకుండ జ్ఞానదానము చేయలేవా! ఏమికానీ! నిన్నెన్నఁడును విడువలేను!

593. "శతాయుషః పురుషః" నూరేడ్లాయువు వేదము చెప్పినది. ఈ నూరేండ్లెట్లు గడచుచున్నవి? ఏబదేండ్లు నిద్ర; ఐదేండ్లు శైశవము, కౌమారము పదేండ్లు; పదేండ్లు చదువు; భుక్తికై సేవ యిరువదేండ్లు; ఇరువదేండ్లు వార్ధకము; మొత్తము మీాదనైదేండ్లు రోగము గణింపగా 120 సం॥ లైనది. ఇది యోగ్యుల విషయము. వీరికి నూటికి నూట యిరువదేండ్లు కావలెను - ఇక నాత్మజ్ఞాన ప్రయత్నము, దైవారాధనము, జపతపాదికము నెప్పుడు? మరి అయోగ్యులకో! నిద్ర 60, శైశవకౌమారములు 15, చదువు 10, భుక్తి సేవ 20, వార్ధకము 20, రోగాదులు 5, విలాసభోగములకు 10, వ్యర్థకాలక్షేపములకు 10 మొత్తము 150 సం॥ములు కావలెను. యోగ్యులె దైవారాధనకై వెచ్చించినవి మొత్తము 5 సం॥లకంటె నధికముండవు. అయోగ్యులు తలచినచో దేవుని తలచిన కాలము 2 సం॥లుండునేమో? వీరికి పునర్జన్మ మరణదుఃఖములెట్లు తప్పును? అందుకే గీతలో "మనుష్యాణాంసహస్రేషు...తత్త్వతః" యని చెప్పినాఁడు.

594. చేతనాచేతనము లన్నిటిలో భగవంతుఁ డున్నాఁడని వేదఘోష, నామరూపాత్మకమైన ప్రకృతికి జైతన్యమాతఁడే యిచ్చుచున్నాఁడు. సకలజీవ ప్రవృత్తు లాయన సంకల్పములే. ఈశ్వర సంకల్పములేనిదే యేప్రాణి యుఁగదలలేదు. అందుచే నేప్రాణి యేమి పలికి, ఆలోచించి, చేసినను, అది భగవానుని శక్తిచేతనే. ఎవఁడు సర్వప్రాణు లకుఁజైతన్యమిచ్చి నడపుచున్న భగవానుని జూచునో వాఁడే చూచువాఁడు, అనగా, తన అవ్యక్త విలాసార్థమై, భగ వానుఁడనేకమై, సర్వరూపముల ధరించినాఁడు. అనగా నొకఁడై, అనేకముగానున్న దేవుఁడు తప్పమరొకటి లేదు.

595. భగవంతునేకైక కర్తృత్వమును గూర్చియు మనకేవలోపకరణత్వమును గూర్చియు చర్చించుచుండగనే, చర్చలో మనభావముల నుదయింపఁజేయుచున్నాఁడు. ఇది చాల విచిత్రము! ఇక మన కర్తవ్యమేమి? మనకర్తవ్యమిది, తెలియవలెనని కోర్కెపుట్టుచోఁదెలిసికొనుటే. జగమంతయు నీశ్వరమయమై, యీశ్వర సంకల్పరూపమై, యీశ్వర కర్తృ కమై యున్నదని తెలిసి, 'నేను' 'అహం' అనునది కేవల మిథ్యయని తెలియుటే.

596. ఏ యిరువురు కలియుట వారిచేతిలోనిదికాదు. ఈశ్వరాజ్ఞ అయినఁగాని కలియలేరు. ఏ వధూవరులు భార్యా భర్తలు కావలెనో అది మానవుని శక్తిలోలేదు. అయితే అధర్మసాంగత్యములు, వ్యభిచారాదులుకూడ నీశ్వర సంక

ల్పము చేతనే జరుగుచున్నవా? నిస్సంశయముగా! సీతనెత్తి కొనిపోయిన రావణుని, పాండవుల జంప నుంకించిన దుర్యోధనుని, ప్రహ్లాదుని హింసింపఁబూనిన హిరణ్యాకశిపుని, తన్నే చంపబూనిన కంసుని దేవుఁడేసృజించెను. అదియేయీశ్వరలీల!

597. ఈ లోకమున సకల వస్తువులు నున్నవి. ఎవరికెంత యెప్పుడు చెందవలెనో భగవానుఁడు నిర్ణయించును. గృహస్థులు తమ పుత్రికలకు వరాన్వేషణము చేయుదురు. తమ కన్యక ఎవనికిఁజెందవలెనో తెలియదు. వారు వివిధ గృహస్థుల యిండ్లకేగి, మాకన్యక మీ అబ్బాయికిఁజెందునేమో చూడుఁడని ఆహ్వానించుచుందురు. ఎచటనో దొరికిన వస్తువును ఇది తమదేమో చూడుఁడని యోగ్యుఁడైన వ్యక్తి దానిని జూపి అడిగినట్లు! వివాహముతో 'ఆస్తి' యెవరిదో నిశ్చితమగును, వలుదోముపుల్ల మొదలు సర్వవస్తువులు నంతే!

598. గుండెకాయ ఇంజను, శరీరము వాగబండి ఇంజను బండిని ముందుకు నడపుచున్నది. దేహమను బండి ఆగిపోవు స్టేషను గలదు. అదియే శ్మశానవాటిక. ఇంజనాగిపోవును. ఈ బండి నడపుటకింక పనికిరాదు. మనము మంచి చెడ్డపనులేమి చేయుచున్నను మనము శ్మశానమునకే జరుగుచున్నాము.

599. భగవత్కటాక్షము నెంతకాలములో సంపాదింపవచ్చును? అనుప్రశ్న దేవునిదగ్గరకుఁబోవుట కెంతకాలము

పట్టునను ప్రశ్న వంటిదే. దేవుఁడు లేనిచోటు లేదని శ్రుతులు చెప్పుచున్నవి. దేవునిలో దేవునితో దేవునిపై నున్నాము. "బహిరంతశ్చ భూతానామచరం చరమేవచ, సూక్ష్మత్వాత్తద విజ్ఞేయందూరస్థంచాంతి కేచతత్." సూక్ష్మ దర్శికిఁ దనలోనే క్షణములో దేవుఁడు కన్పట్టును. వివేక హీనునకు దూరస్థుఁడగును. హిరణ్యకశిపుఁడు లోకము లన్నియు నహంకార మూఢుఁడై వెదకి చూడలేకపోయెను. ప్రహ్లాదుఁడు దేవునంతటఁజూచి చూపెను. పరీక్షిత్తు ఏడు దినములలో ముక్తుఁడయ్యెను. శ్రుతివాక్యములు నమ్మి, సత్త్వగుణ సంపన్నులై చూచువారికి దైవకృప క్షణములో లభించును. కొందరు కొన్ని జన్మముల కృషితోఁగాంతురు. కొందరు ప్రయత్నమే చేయరు.

600. "తానొకటి తలచిన దైవమొకటి తలచు"నను సామెతగలదు. మనము తలచుదానికి వ్యతిరేకముగా దలచుట దేవుని పనియా? మనము తలచునదే, దేవుఁడు తలపవలెనా? లేక దేవుఁడు తలచునదే మనము తలపవలెనా? దేవుఁడేదితలచునో మనకుఁదెలియదు గావున, మనము దేవుని తలంపు ననుసరించి తలపఁజాలము. మనము తలచినదే దేవుఁడు తలచుట పొసగదు. ఏలన దేవుఁడు మన తలపులకు బానిస కావలసివచ్చును. అయినచో నీ సమస్యనెట్లు పరిష్కరింపవలెను? మార్గమున్నది. (1) మనమే దేవుఁడగుటకు సాధనచేయవలెను. (2) లేదా, మనము మహాభక్తులము

కావలెను - అప్పుడు దేవుఁడు మన తలంపులకు వ్యతిరేకిగాఁ జాలడు. ఉత్తమ భక్త, జనాధీనుఁడై దేవుఁడు వ్యవహరించును.

601. మతమనగా నేవోకొన్ని పవిత్రగ్రంథములను నమ్ముట; వానిని వినుట; పఠించుట; బాహ్యములగు నాచారముల ననుసరించుట మాత్రమేకాదు. మతమందు నమ్మకమున్నవానికి సాక్ష్యమాతని దుఃఖములన్నియు, లోపములు, దోషములన్నియు నశించి. శాశ్వత సుఖశాంతులు కలుగవలెను. దేవునర్చింపుమని అన్ని మతములు చెప్పును. దేవునర్చించుట చాలదు, దానికి సాక్ష్యము కావలెను. దేవుని గుణములైన సచ్చిదానందములు నీకు వచ్చుటయే నిజమగు సాక్ష్యము. అనగా మతమనగా మానవుఁడు దేవుఁడగుటయే.

602. దేవుఁడొక్కఁడు; ప్రపంచమున్నది. జగన్మాతని బాహ్యరూపము. జగమనగా దేవుని సంకల్ప స్వరూపము. నేననేకముగావలెనని యాతఁడు గోరెను. సృష్టి సంకల్పమాత్రమున సృజించి అందు ప్రవేశించినాఁడు- అనగా రెండే వస్తువులు - దేవుఁడు - కాముఁడు లేక రాముఁడు - కాముఁడు. కాముఁడిచ్చు సుఖము క్షణికము - జన్మజరారోగమృత్యుహేతువు. రాముఁడిచ్చు సుఖము అవ్యయానంద శాంతినిలయము - సకల దోషరహితము. లోకకీలకము కామకల్పిత కాంతాసౌఖ్యమే. అందుకే సర్వప్రాణులు - తత్సౌఖ్యాపేక్షతో వ్యవహరించి, లోకమును

నడపుచున్నవి. జగన్నాటకమున కదియే సూత్రము. కాని అది ఆద్యంతవంతమైనది; దుఃఖహేతువు; నిర్వికారమైన దేవు నేకత్వము నాశ్రయించి, జన్మజరామృత్యురహితమగు శాశ్వతానందము లేక మోక్షమును పొందవచ్చును.

603. ప్రతిప్రాణి ప్రతి చర్యయు నీశ్వరసంకల్పచోదితమై జరుగుచున్నదని చూడఁగలవాఁడే చూపుగలవాఁడు. తక్కిన వారందరు కనులుండియు నంధులు. పరమేశ్వరుఁడు సర్వవ్యాపియై సర్వస్వరూపియై సర్వకర్తయై యున్నాఁడని చూచువాఁడు ధన్యుఁడగును. ఇక నాతనికి జన్మముండదు. ముక్తుఁడగును.

604. అన్నిట మితియెరిగి వర్తించువాఁడే సుమతి; మిగిలిన వారందరు మతిహీనులో, కుమతులో అగుదురు. సర్వకాల సర్వావస్థలలో మితియెరిగి వర్తించు సుమతి – ధర్మార్థకామమోక్షములను అతిసులభముగా సాధించును. ఆహార విహారములన్నిటిలో మితివలయును. భజన సంకీర్తన జపతపాదులును మితిమీరి చేయుట తప్పే! ఏలన మన శక్తులన్నియు మితిగలవే! అందుకే గీతలో, "యుక్తాహార విహారస్యయుక్తచేష్టస్యకర్మసు, యుక్తస్వప్నావబోధస్యయోగో భవతి దుఃఖహా" యని ఉపదేశము.

605. భగవంతుని నే క్షణములోను మరువకుండ నుండుటకే, సకల మతబోధలు నుదయించినవి, ఎన్నడును జెడని అట్టి దీక్షగలవానికి సకల దుఃఖములు నశించును. కాని

యీపని సులభమైనదిగాదు. సంసార సంఘట లన్నియు దేవుని మరపించును. ఒకేమార్గమున్నది; అన్నిటిని త్రోసి పుచ్చి భగవంతునే జ్ఞాపకముంచికొను అఖండాభ్యాసము చేయుము లేదా, సకల సంఘటనములలో దేవుని దివ్యహస్త మును జూడుము.

606. సకలవిధ జీవరాశులలో, మానవుఁడే ఉత్త ముఁడనుటకుఁగారణము, "నేను దేహమునా? నానిజ స్వరూ పమేది" యను జిజ్ఞాస మానవున కొక్కనికే గలదు, ఈ జిజ్ఞాసనుత్రృణీకరించి, జీవించు మానవుఁడు మానవత్వమును గోల్పోయి, క్రిమికీటక పక్షిమృగాది వర్గములోఁజేరిపోవును. జిజ్ఞాస గలిగి తన నిజస్వరూపము నెరుగు మానవుఁడు దేవుఁ డగును,

607. మానవుఁడు మరణకాలమునఁదానొంటరిగా మరణయాతన ననుభవించి, ఒంటరిగాఁదన కర్మ చేర్చు చోటికిఁబోవలెను. ఇందెవ్వరును పాలుపంచుకొనరు. కావున ప్రతిమానవుఁడు దన్నుదానే బాగుచేసికొని, యెట్టి యాత నలు కలుగని రక్షణము చూచికొనవలెను, తాను శరీరము కాదని స్వప్నము, తాను మనోబుద్ధీంద్రి యాహంకారములు కానని సుషుప్తియుఁదెలుపుచున్నవి – ఇవి నశించును; దానుం డును. తన నిజ స్వరూపమెరిగినవాఁడు దుఃఖింపఁడు – తన నిజ రూపము దుఃఖ రహితమగు ఆత్మయే, "అవ్యక్తోఽ యమచింత్యోఽయమవికార్యోఽయముచ్యతే." – గీత.

608. గీతాదిక నిత్యపారాయణమువలన పారాయణ ఫలితమే వచ్చును. గీతాది గ్రంథములలోని యుపదేశముల నిత్యానుష్ఠానములోఁబెట్టిన ఫలితములు, కేవల పారాయణ వలన నెట్లు లభించును? మానవజీవితమును శుద్ధిచేసికొని మానవుఁడు దేవుఁడగుటకు వలయు కార్యక్రమములు గీతాది గ్రంథములు పేర్కొనియున్నవి. "మత్కర్మకృన్మత్పరమో మద్భక్తస్సంగవర్జితః నిర్వైరస్సర్వభూతేషు యస్సమామేతి పాండవ." మున్నగునను ష్ఠానమును గోరుసూత్రములెన్నియో గలవు. వాని నాదరించి సంపూర్ణ ఫలమనగా సర్వబంధ విముక్తి నొందవచ్చును. పారాయణము మొదటి మెట్టు మాత్రమే. అది మంచిదే. పై మెట్లు నెక్కుటకు యత్నింప కుండుట తప్పు.

609. ఆకలివేయు నపుడాకలి స్వరూపస్వభావముల గూర్చి, తినవలసిన ఆహారపదార్థముల పూర్వోత్తర చరిత్రల గూర్చి చదువుట, చర్చించుట, ఉపన్యసించుట మున్నగువాని వలన ఆకలి తీరదు. వెంటనే భుజించి ఆకలిని శాంతింప జేసికోవలెను. ఇహజీవితమనేక లోపదోషములచే దుఃఖ మయము. జీవి కోరునది, కోరవలసినది క్షణభంగురమైనది కాక, స్థిరముగానుండు నానందము. అది యెచట నున్నది ? దాని నార్జించు నుపాయమేది? తెలిసికొని దానికై యెంత యెట్టికృషిఅవసరమో ఆరీతినంతకృషిచేసి దానినార్జింపవలెను. భగవంతుఁడే అవ్యయానంద స్వరూపి. "ఆనందో బ్రహ్మ"

ఉపనిషద్వాక్యము. అందుచేనిట్టి నిరవధికానందము లభించు వఱకు భగవంతునాశ్రయించి, ధన్యులు కావలెను.

610. మృత్యువను కాలసర్పము ప్రతిప్రాణి దేహమును చుట్టికొనియున్నది. ఎప్పుడది కాటువేయునో తెలియదు. ప్రతివ్యక్తినది కరచితీరును. చావుతప్పదు. ప్రతిదినము కాలసర్పము కరచుటచే మృతినందినవారి సంఖ్య లక్షలలో నున్నది. మానవులకీ సంగతి తెలియును. విచిత్రమేమన, ఎరిగి యెరుగనట్లు, చూచిచూడనట్లు సంచరింతురు. ఇది దేవుడు కల్పించిన అజ్ఞానము. దేవునాశ్రయించి దానిని పోగొట్టుకొనుటే కర్తవ్యము. "అజ్ఞానే నావృతం జ్ఞానమ్, తేనముహ్యంతిజంతవః" గీతామృతము.

611. దేనివలనను భయములేకుండు స్థితిని ప్రతిప్రాణియుఁగోరును. జీవితమంతయు భయముతోనిండి యున్నది. ఏమానవుని చూడు, ఏదో ఒక భయముతో జీవితము గడపుచుండును. తనకు బాధకలిగించునదేది తటస్థించునో యను భయము. భగవంతుఁడొక్కఁడే అభయప్రదాత. అభయప్రదానము లభించువరకు భగవానునాశ్రయించుటకు యత్నింపవలెను.

612. "మచ్చిత్త సర్వదుర్గాణి మత్ప్రసాదాత్తరిష్యసి." గీత. జన్మజరామృత్యువులనునవిదాటరాని దుర్గములు. దైవకృప లేనిదే వానిని దాటుట కెవరికిని శక్యము గాదు. దైవకృపలభించుటకు దేవుఁడే ఉపాయమును దయతో

జెప్పినాఁడు. చిన్నపని, నీ చిత్తమును దేవునిపై నుంచుము. ఆయన ప్రసాదముకలుగును.

613. "యదృచ్ఛాలాభ సంతుష్టోద్వంద్వాతీతో విమత్సరః; సమస్సిద్ధావసిద్ధౌచ కృత్వాపిననిబధ్యతే." – గీత. కర్మలు బంధింపకుండుట కెన్ని నిబంధనలు పెట్టినాఁడో! 1) దైవికముగా సంప్రాప్తించినదానితో సంతుష్టి పొందవలెను. 2) శీతోష్ణములను సుఖదుఃఖములను సమానముగా జూడవలెను. 3) మాత్సర్యమనగా, ద్వేషరాహిత్యము కావలెను. 4) నీవుకోరినది లభించుటయు లభింపకుండుటయు సమముగా దర్శింపవలెను. అప్పుడు కర్మలు బంధింపవు. దీనికిఁగొన్ని జన్మములకృషి అవసరమగును.

614. "సంతుష్టో యేన కేనచిత్" అనగా "యదృచ్ఛాలాభ సంతుష్టి." దీని నెట్లాచరణలోఁబెట్టుట? ప్రాప్తించినది– అవసరములకు సరిపోనిదే కాక, బాధించునదికూడఁగావచ్చును. దానితో సంతుష్టి పొందు టెట్లు? మనకు లభించునది, లభింపనిది, యీశ్వరసంకల్పము వలననే యని తెలియవలెను. సర్వప్రాణులకు దాత యీశ్వరుఁడుతప్ప మరేయొకఁడును లేఁడు. నీకవసరములిచ్చినను, లోపముచేసినను, సుఖమిచ్చినను, దుఃఖమిచ్చినను – అది భగవంతుఁడు చేసినదే. భగవత్సంకల్పమును తిరస్కరించుట కెవనికినిసామర్థ్యము లేదు. అందుచే విచారించి లాభము లేదుగావున సంతుష్టినందుటే బుద్ధిమంతుని పని. కాని భక్తికి భగవంతుఁడు వశుఁడగునుగావున, భక్తి,

అనగా నిశ్చల పవిత్రభక్తి కీశ్వరసంకల్పమనుకూలముగా మారుపొందుట కవకాశములున్నవని భక్తుల చరిత్రలు సాక్ష్య మిచ్చుచున్నవి.

615. కన్నులకు కామెరలు, చూపుదోషములు, చెవులకు చీము. కురుపులు, చెవుడు, ముక్కుకు రొంప, దంతములకు పుప్పి, పోటు, జిహ్వకు రుచిచెడుట, రణము, మూత్ర పురీషనాళములకెన్నియో జబ్బులు, యెముకలకు కీళ్లజబ్బు, కాలుచేతులకు పక్షవాతము, తలకు లెక్కలేని దోషములు, గుండె జబ్బులు, ఊపిరితిత్తులకు క్షయాదులు – ఇక అంటు వ్యాధులు, చర్మరోగములు, జీర్ణకోశరోగములు ఇన్ని దోషముల కవకాశముగల అవయముల గలిపి దేహము కల్పించి మనకు దేహమిచ్చినాఁడు. అదియు నెప్పుడు కుండవలెఁబగు లునో తెలియదు. ఇట్టి దేహముతో సుఖమనుభవించుకోరికె విడచి బుద్ధిగలవాఁడు వెంటనే విరాగియై, జన్మరాహిత్యమును సాధింపవలెను.

616. భగవానుఁడు, లోకములో నితర వస్తువుల వలె, మనకింద్రియ గోచరుఁడుగాఁడు. సూక్ష్మ బుద్ధిచే, భక్తిచే, వివేకముచే భగవానుని గుర్తించుట నేర్వవలెను. అట్లు విశేషపరిశ్రమచేసి, గుర్తించి, మనయెడ కృపచే ఫలితములను ప్రకటించిన మహాభక్తుల, జ్ఞానులమాటలు, బాటలు నమ్మి వారివలె మనము జీవించి కృతార్థులము గావచ్చును. మార్గాంతరము లేదు.

617. మన జీవితమును పరిపాలించు వాఁడెవఁడు? ఎట్టివాఁడు? సర్వప్రాణికోటిని సృజించి సర్వకాల సర్వావస్థలలో నడపుచుండు భగవానుఁడు. ఆతఁడెట్టివాఁడు? సకల ప్రాణుల క్షేమమును జూచువాఁడు, సత్యధర్మములకు జయమిచ్చువాఁడు, భక్తుల దోషములను క్షమించు పరమోదారుఁడు, ఆశ్రితుల కనంతదయారసము చూపు కారుణ్యమూర్తి, యెన్నఁడేవిషయమునను పొరపడనివాఁడు – అట్టి పుణ్యరాశియైన యీశ్వరుఁడు మన పరిపాలకుఁడై యుండగా మనము నిశ్చింతగా నమ్మి, భజించి, సుఖింపవచ్చు. ఇది ఊహాగానముకాదు. త్రికరణశుద్ధిగా నమ్మినక్షణము మొదలు నిన్నాతఁడెట్లు రక్షించునో చూచికొనుము.

618. భగవత్కృపామృతమును నీవీజన్మములో నొక్కసారియైనను రుచి చూచితివా? అట్టిరుచి నీకులభించినచో, లోకములోని సర్వవిషయములు నీకు రుచిలేనివగును, అనగా నీకిహలోకభోగములయందు మోహము తొలగనిచో భగత్కృపామృత రుచి పిసరంతయు దొరకలేదని స్పష్టము. అనగా నీవు భక్తుఁడవని చెప్పికొను నధికారములేదని యెరిగి, నిజమైన భక్తి నభ్యసింపుము.

619. భగవంతుని త్రికరణశుద్ధిగానమ్మి, సంపూర్ణాత్మార్పణము చేసికొనినవానికొక ప్రమాదమున్నది. ఆతఁడికనెట్టి తప్పుపనిని చేయజాలఁడు. భగవానుఁడు వానియోగక్షేమ భారము స్వీకరించును గనుక, తప్పుపని చేయుఁటెన్న

షును సాధ్యపడదు. నీ బ్రతుకు నీవు దేవుని చేతిలోఁ బెట్టితివా, నీ వెవఁడవైనను, బాగుపడి తీరుదువు.

620. జ్ఞానము – ఏడ్పు నొకచోటనుండవు. జ్ఞానమనగాఁ దెలియనిదేమీ మిగులకుండుట. "యత్ జ్ఞాత్వా నేహభూయోఽన్యత్ జ్ఞాతవ్య మవశిష్యతే." గీత. మరియు జ్ఞానమనగాఁ బరబ్రహ్మమే, "సత్యమ్‌జ్ఞానమనంతమ్‌బ్రహ్మ." తై. ఉపనిషత్తు. జ్ఞానమనగా ఁబరమాత్మతో నొకటగుట. పరమాత్మ నిత్యానందమే. "ఆనందో బ్రహ్మేతి." అందుచే ఁబరబ్రహ్మకు దుఃఖము లేదు; జ్ఞానికి లేదు.

621. "జ్ఞానమ్ విజ్ఞాన సహితమ్‌యత్ జ్ఞాత్వా మోక్ష్యసేఽ శుభాత్." ఇదంతు తే గుహ్యతమమ్ ప్రవక్ష్యామి.' అనియు భగవానుఁడు పలికినాఁడు. సర్వాశుభ విముక్తి నిచ్చునది జ్ఞానమ్ విజ్ఞానసహితమ్." జ్ఞానము తత్త్వ జ్ఞానము – విజ్ఞానము – అనుభవజ్ఞానము. ఇదియే పరమ రహస్యము. సత్యమైన పరమాత్మతత్త్వమును దెలిసికొనుట తెలిసిన దానిని నమ్మి ఆచరణలో కృతార్థుడగుట – అపుడు జ్ఞానము విజ్ఞాన సహితమగును. అనగా మానవుఁడు దేవుని గూర్చి తెలియుట, దేవుఁడగుట – అప్పుడింక నేయశుభములు నుండవు. అందుచే నది పరమరహస్యము.

622. సకల దుఃఖములను, అశాంతిని కాల్చివేసి శాశ్వతానందశాంతు లనుభవించుటకై ప్రతిప్రాణియుఁదహతహ లాడుచున్నది. దుఃఖమునకు ఁగారణమజ్ఞానము. జ్ఞాన

ముచే అజ్ఞానము, వెలుగుచేఁజీకటివలె నశించును. వెలుగు దేవుఁడు – దుఃఖము అను అజ్ఞానము దేవుఁడను వెలుగును జూచిననే పోవును. వెలుగే ఆనందము, చీకటియే దుఃఖము.

623. వివాహకర్మ సుఖముగా, సులువుగాఁజేసికొను నేర్పు హిందువులకెప్పుడు లభించునో? అనవసర వ్యయ ప్రయాసలకులోనై, పైకి నవ్వుచు లోపలనేడ్చుచు – వధూవరుల కుటుంబములు తలక్రిందులగుచున్నవి. సకుటుంబముగా బంధువులరాక, వేళకు నిద్రాహారములు లేమి, వివాహలక్ష్య మెరుగని బాహ్యాడంబరములు,- అందు లోపములచే వివాదములు, కొట్లాటలు. – అశాంతి – ఇది నేటి వివాహము.

624. నేటి వివాహములు, వధూవరుల కామసంతృప్తియే లక్ష్యమై నడచుచున్నవి. వైదిక కర్మకలాపము కామసర్ప విషమును పిండివేయుట కుద్దేశింపఁబడెను గాని, నేఁడు వైదిక ధర్మభావమును గుర్తించువారులేరు. వేదములు గృహిని గృహమేధిగాఁజేసి, తరింపఁజేయఁబూనినవి. కాని నేఁడు వేదభావముగాక, కామదేవత కేంద్రస్థానమాక్రమించినది. అందుచే నేగృహముననుసుఖశాంతులులేవు. కామము బలికోరును. తనువు, బుద్ధి, ధనము, పరమార్థము సర్వమును కామము గ్రసించును.

625. సాధారణముగా జనులందరు, నుద్రేకవశులు. ఉద్రేకముండవలెను. అది మనవశములోనుండవలెను. ఉద్రేకము లెవని స్వాధీనములోనున్నవో, వాఁడు లోకమంతను

స్వాధీనమొనర్చుకొనగలఁడు. స్వార్థము, నహంకారములను విడిచిన వెంటనే మనకు లోకమేకాదు, దేవుఁడునువశుఁడగును.

626. ఈశ్వరసంకల్పమనగా అప్రతిహతము, అమోఘమునగు ననంతశక్తి. ఏదేనొక కార్యము సంకల్పించుట, నది జరుగుటయు నేకకాలముననే యగును. ఈశ్వరసంకల్పమేయితర సాహాయ్యమును గోరదు. అందుచే నీశ్వరునిపై నాధారపడిన భక్తుఁడు దాను దేవునర్థించిన కార్యమెట్లు జరుగునా యని ఆలోచింపనవసరములేదు. జరిపించువాఁడీశ్వరుఁడై యుండగా నెటులను ప్రశ్నకే తావులేదు.

627. చెడిపోవు వస్తువులు 'నావి' యనుకొని అవి చెడగా నీవు దుఃఖించుచున్నావు. ప్రతివానిలో 'నేను' చెడని వస్తువు. ఆ 'నేను' 'ఆత్మ' 'పరమాత్మ'యు నని తెలియవలెను. 'నేను'కు రాకపోకలు, దుఃఖములు లేవు. నేనుకానివి నశించుచుండగా 'నేను' దుఃఖించుటకు ఁగారణము భ్రాంతి, మాయ, అజ్ఞానము. 'నేను' నెరిగి సుఖించు; దేహాదులు నేనందువా, దుఃఖము తప్పదు. ఎన్ని వేల జన్మములెత్తినను 'నేను' తెలియువరకు దుఃఖముతప్పదు.

628. ఈలోకము సుఖదుఃఖ సమ్మిశ్రితమైనది. వ్యక్తికి సుఖదుఃఖము లేపాళ్లలో నుండునో వాని సుకృత దుష్కృతములపై నాధారపడియుండును. మనుష్యత్వములో దుఃఖము తప్పదు. దేవత్వము దుఃఖములేని సుఖమేకాని, పుణ్యక్షీణముతోఁదిరిగి మర్త్యలోకమున జన్మింపకతప్పదు.

"క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి," – గీత. దైవత్వమనగా దేవుఁడగుట, పూర్ణ సుఖము. మానవుఁడు దేవుఁడై శాశ్వత సుఖి కావచ్చును.

629. పాపమనగా నేమి? నిజముగా సత్యము నెఱుగకుండు టే పాపము. సత్యమనగా జగద్రహస్యము. జగమను దృశ్యము వెనుక దానికి హేతువు, అధిపతి ఆధారమునైన పరమాత్మయున్నది. పరమాత్మ నెరుగకుండుటే పాపము. పరమాత్మయే ప్రాణులలో ఆత్మయనఁబడును. దేహేంద్రియ మనోబుద్ధ్యహంకారములు – 'ఆత్మ'ను ఆచ్ఛాదించియున్నవి, ఆచ్ఛాదనము నిజమని భావించుట పాపము, వెనుకనున్న ఆత్మనెరుగుటే పుణ్యము.

630. నీ వల్పుఁడవని కించపడనవసరము లేదు; నీవధికుడవని, గర్వింపనవసరము లేదు. నీవు నీకెంత విలువగలదో సరిగాఁ గట్టుకొనుము. తక్కువ, యెక్కువకూడవలదు. నీ నిజ రూప మాత్మయే. ఆత్మసాటిలేనిదగు పరమాత్మయే. అది దేనితోడను పోల్చుటకు సాధ్యముకానిది. తత్తుల్యమైనది, తదధికమైనదియు లేదు. నీ విలువ సరిగా గ్రహించి, నిశ్చల నిత్యానంద సాగరములో నీదులాడుము.

631. 'మనశ్శాంతి' యను మాటయే తప్పు. అశాంతియే మనస్సు సహజ లక్షణము, శాంతి ఆత్మలక్షణము. మనస్సున కాత్మలక్షణ మెట్లు కలుగును? మనస్సు మార్పు చెందు వస్తువులపై నాధారపడునదిగావున అశాంతి తప్పదు.

మనస్సునకు అనగా (ప్రకృతికి-మనస్సు ప్రకృతిలో భాగము) చైతన్యమిచ్చున దాత్మయే. అందుచే బాహ్యావిషయముల నుండి మనస్సునులాగి, ఆత్మపై కేంద్రీకరించినచో శాంతి లభించును.

632. ప్రపంచములో నన్నియు దగాచేసి యేడ్పించు నవే, భార్యావిత్త బంధుగృహ దేహాదులన్నియు మోసము స్వభావముగాఁగలవి. ఏమి చేయవలయునని ఆలోచించు టకుఁగూర్చుండినచోఁగాలము (మృత్యువు) మోసగించును. ఇట్టి లోకములో జన్మమంది – వెంటనే చేయవలసిన పనులు రెండే యున్నవి. (1) పరమపావనమూర్తులై, సత్యమెరిగి, భగవత్తుల్యులైన వారిమాటలు నమ్మవలెను. (2) వారు చూపిన బాటలఁబడి పోవలెను. అనగా దైవభజనచేఁదరింప వలెను

633. "సర్వం విష్ణుమయం జగత్తు"ని చెప్పఁబడెను. విష్ణుమయము కానిదేదియు లేనప్పుడు, విష్ణుమయమైన దానిలో దేనిని ద్వేషించుట, దూషించుట? రాగద్వేషము లకుఁదావు లేదు. ధ్యానించుపనియొక్కటే మిగులునది.

634 నిజమైన నాగరకతలో విలాసములకుఁదావు లేదు. కనిష్ఠవస్తుప్రాప్తిచే, జీవయాత్ర కనవసరములైనవాని నన్నిటిని తృణీకరించి, సంతుష్టినొందఁగల ప్రజలదే నిజమగు నాగరకత. చరిత్రలో, భోగవిలాసములకెగఁబడి, మితిమీరి వర్తించిన నాగరకతలు తుడిచివేయఁబడినవి. నేటి నాగరకత తుడిచి వేయఁబడుననుటకెట్టి సందేహమును లేదు.

635. రష్యాదేశము నేడమెరికాతో సమానమైన బలము గలిగినదని గుర్తింపుకొఱకు తహతహలాడుచున్నది. అమెరికా బలమును మించవలెనను కోర్కెయు నమితముగా నున్నది. ఎంతబలమార్జించినను రష్యా తనతో సమానము, నధికముగాకుండ జూడవలెనని అమెరికా కోరుచున్నది. ఈ పోటీ నాగరకత యెంతకాలముండగలదు? ఆధ్యాత్మిక నైతిక ప్రయోజనముల నుభయులు ప్రక్కకు నెట్టిరి.

636. "ధర్మాఽ విరుద్ధో భూతేషు కామోఽస్మి భరత ర్షభ." గీత. కామ మీశ్వర శక్తియే. అదిలేకున్న లోకమే లేదు. అదిధర్మసహితము కాకున్నచో విషమగును. ధర్మ సహిత కామ మమృతమై ఆదర్శ సంతతిని, ధర్మఫలమగు జ్ఞానమును, ముక్తిని ప్రసాదించును.

637. విద్య భుక్తిముక్తిప్రదముకావలెను. భుక్తి ముక్తులలో ముక్తి ముఖ్యలక్ష్యము. భుక్తి లక్ష్యముకాదు. ముక్తికొఱక అల్పసాధనము. కేవల భుక్తినిచ్చు విద్యచే నేటి ప్రపంచమున బహుసంతృప్తి లభించుచున్నది. భారతదేశ మున రెండును లేవు.

638. ఆత్మ-అనగా పరమాత్మయే సత్యమనికాని, భగవానుడేకైక కర్తయని కాని యెరిగినవానికి గీర్తికాంక్ష నశించును. ఆత్మయే సర్వమనుచుండగా నాత్మకుగీర్తి యేమిటి? భగవానుడు సర్వకర్తయనుచుండగాగీర్తియన నేమి? ఇక జీవాత్మయే అసత్యము; అది యత్నించు కీర్తియు శతధా అసత్యము.

639. నీవెన్ని తెలిసికొన్నను, నిన్ను నీవు తెలిసికొననివాఁడవైనపుడేమిలాభము? నీ సంగతితప్ప నీకన్నియు (దెలియునని గర్వము పెక్కు రూపములలో నుండును. అన్నియు నుండి ఐదవతనములేని దానికెంత గర్వముండునో! నీకంటె నీకుఁగావలసిన వాఁడెవఁడు? అత్యంత సమీపము, అత్యంత ముఖ్యమునైన నిన్నే నీవెరుగకున్నచో, నితర విషయములన్నియు నీకుఁదెలియుననుట నిజమెట్లగును? నిన్ను నీవెరిగినప్పుడే లోకమర్ధమగును. అంతవరకు నీవేమియుఁదెలియని అజ్ఞుఁడవే!

640 కనపడునవి; కనపడనివి – అనగా అర్ధము పరమార్ధము – ఇహము – పరము – రెండు విషయములుగా నున్నవి. కనపడు దేహమనోబుద్ధులు – వాని విషయములు నీదృష్టి నరికట్టి, తొందరగా వానినార్జించుట, రక్షించుట, పోషించుట మున్నగు సమస్యల పరిష్కారములను గోరును. అందుచే నీమనోబుద్ధుల శక్తులు చెల్లాచెదరై ఏకాగ్రత – సూక్ష్మదర్శిత్వము లేకుండఁజేయును. కనపడని విషయములు ఆత్మ. పరమాత్మ. జపము, ప్రేమ, ముక్తి మున్నగునవి. వానినెరుగుట కేకాగ్రతసూక్ష్మదృష్టియు నవసరము, కావున నర్ధబంధములలోఁదగుల్కొని, మూర్ఖులేకాక విద్వాంసులును, బయటపడలేకున్నారు.

641. ఏమి జరిగిన నీశ్వరసంకల్పముచేతనే జరుగుచున్నదని గుర్తించి, యీశ్వరుని నిత్యము దృష్టిలోనుంచికొని భజించువానికి మనః క్లేశము గలిగించున దేదియునుండదు.

ఇది అల్పకార్యమువలె గోచరించును. కాని యీశ్వరానుగ్రహము గల వానికిదప్ప నన్యులకిది లభింపదు. అనేకజన్మముల కృషి తపస్సు, జపము, భక్తిజ్ఞానము మున్నగు నుత్తమసంస్కారములు గలవానికే యిదిలభించును. లభించిన వానికిది చిన్నిపనియే. లభింపని వారికిఁ గొన్ని వేల జన్మములు గతించినను దుర్లభమే. ఈపని తనజీవితమునకు సహజమైనవాఁడు ధన్యుఁడు.

642. ఈ ప్రపంచము భగవానునిది. ఈ ప్రపంచములోని సర్వమును భగవానుని సొంతమైనఆస్తి. అందుచేఁ దన లోకము నందలి సర్వవిషయములను. భగవానుడు పరిపాలించుచున్నాఁడు, వ్యావహారిక ప్రపంచములోని ప్రభువులు, అధికారులు, భగవానుని చేతిలోని యంత్రములు, "ఈ రాజ్యము నాది, యీధనము, పదవినాది" యనివారు చెప్పికొందురు. ఇది సంపూర్ణమైన భ్రాంతి, భగవానుని శాసన మొక్కటే అవ్యాహతమై జరుగుచున్నది, దీనినెరిగి, దేవుని కొక్కనికే తల వంచుము.

643. "అరతిర్జనసంసది"; "వివిక్త దేశసేవిత్వమ్" – గీత.భగవదనుగ్రహ మొక్కటే విలువ గలది. దానినార్జించు కృషియే సాటిలేనిదని గుర్తించిన మానవుఁడు త్తముఁడు. లోకములో నాతని కెవరితో సంపర్క సంభాషణములుండ వలెను? నూటికి తొంబది తొమ్మండుగురకు (బరమార్థ దృష్టి లేదు. ఉన్నను అది మాటలతో ముగియునే కాని క్రియాత్మకముగాదు. ఎవరిని గలిసికొన్నను, తమ గొప్పతనమో, తమ తాపత్రయమునో, చిల్లిగవ్వ విలువ లేని పరజన స్తుతి నిందలో

వెల్లడింతురు. మరియు రాగద్వేషాదుల నుద్రేకింపఁ జేయ వారే. అందుచే సాధకుని కేకాకిత్వము తప్ప గతిలేదు.

644. భగవాను నాశ్రయించు పనికంటె వేరుపన లేవియు నవసరములేదు. అదిచిన్న పనియని, అముఖ్యమైన దని తలపరాదు, అంతకంటెఁ బెద్దపని, అంతకంటె శ్రేష్ఠమైనది, అంతకంటె సర్వదోషహరము, సకల శుభప్రదము నైన పని మరొకటిలేదు. గాయత్రీ మంత్రములో సకల మంత్రము లిమిడియున్నట్లు హస్తిపాదమున సకల జంతుపాదములు నిముడు నట్లు, భగవంతు నాశ్రయించు పనిలో సకల కర్మల ఫలితము లిమిడి యున్నవి.

645. అహంకారము పూర్తిగా దొలగిన గాని జ్ఞానోదయము కాదు, అది దేహాభిమానముతో, నవినాభావ సంబంధము కలిగి యుండుటచే, అది సులభముగా నిర్మూలింపఁ బడదు. ఎంత నిగ్రహమును మనమభ్యసించినను, అది ముడిచి పెట్టుకొని సర్పమువలె సూక్ష్మలింగ దేహము, లను లోలోని పుట్టలలో నొదిగియుండును. అదను దొరికి నపుడది పడగనెత్తి నృత్య మొనర్చును. మన యేమరుపాటు, దాని కాటు నొకమాటే జరుగును,

646, మనము దేవుని కధీనులమై నపుడు. దేవుఁడే మనచే నన్ని పనులు చేయించును. అందు దోషములు కాని అశుభములుకాని యెన్నడు నుండవు. అవిజరుగు చున్నప్పు డవి మనకుపకరించునో లేదోయని సంశయింప నవసరము లేదు. అన్నియు మనక్షేమమునకే జరుగుచున్నవని వెంటనే

కాకున్నను క్రమముగాఁ దెలియును. నీవొకటే చేయవలెను. నిన్ను నీవే దేవుని కొప్పగించుకొనుము.

647. "మానావమాన యోస్తుల్యస్తుల్యో మిత్రారి పక్షయోః" మానావమానములు, మిత్రులు శత్రులు – సమానముకాలేరు, రెండును సమాన మెట్లగును. మిత్రుఁడు శత్రువు సమమగు టెట్లు? మతిహీనుని భావమువలె గోచరించును – కానియది భగవద్వాక్యముగదా! నిరర్ధక మెట్లగును? ఇందు ముఖ్యములైన మూఁడు విషయములున్నవి (1) అంతయు నీశ్వరమయమైనది; (2)అంతయు భగవానుని లీల (3)సమదృష్టియే సమ్యక్ దృష్టి, గుణాతీతత్వము – మోక్షప్రదము.

648. తల్లియొడిలోఁ గూర్చుండి యున్న చంటిబిడ్డ నిష్కపటమై, నిర్దుష్టమైన చిద్విలాసములోని చిరునగవు లొలుక పోయుచు మహాయోగులకు దుర్లభమైన ఆనందము ననుభవించును, సకల బాధలనుండి తన్నుఁదనమాత కాపాడ గలదని బిడ్డకుఁబుట్టుకతోడనే అప్రయత్నముగాఁదెలియును. పరుల చేతిలోనికి బిడ్డపోవఁదిరస్కరించును – బలవంతముగా నితరులు దీసికొనిన నేడ్చును. మనమందరము సర్వవ్యాపియైయున్న జగన్మాత ఒడిలోనున్నాము. మనమును దేహావయో భేదములు విడిచి, బిడ్డలమని యెరిగి, చిద్విలాసానంద తన్మయులము కావలెను.

649. మనలో దైవాంశములేనిదే, యితర వస్తువు నిమిషమాత్రమును లేదు. అగ్ని, జలము, ప్రాణాదివాయువులు, మాంసాస్థి చర్మాది భూమ్యంశము, లోని కాళీభాగరూపమున

నున్న ఆకాశము - ఇవిపంచ భూతములు - దైవాంశములే. "ఆత్మన ఆకాశ స్సంభూతః..." తై. ఉ. మనమనోబుద్ధ్యహం కారాదులు భగవానుని మూలశుద్ధ చైతన్య రూపములే. అందుచే చరాచరములన్నియు దేవుఁడే! నీవు, నేను, అన్నియు దేవుఁడే. కాదనుభావముభ్రాంతి-భ్రాంతి విడుచుటేమోక్షము.

650. 'నేను' ఏమియుఁ జేయుటలేదు-లేదా, విశ్వము లోని సర్వము 'నేనే'చేయుచున్నాను. అనగావిశ్వకర్తను నేనే దేవుఁడు. కూర్చుండినను లేచినను, నడచినను, నిద్రించినను, తిన్నను, త్రాగినను, పలికినను, తలచినను, కోరినను, కోరకు న్నను, కామక్రోధములఁజూపినను,నిష్కాముఁడనైనను, మల ముత్రాదుల విడిచినను, చదివినను,వ్రాసినను, సుఖదుఃఖరాగ ద్వేషాదులు చూపినను, మరేమి చేసినను, అన్నియు దేవుఁడే- చేయుచున్నాఁడు - వినుగీత"నైవకించిత్కరోమీతి యుక్తోమ న్యేత తత్త్వవిత్-పశ్యన్ శృణ్వన్... ఉన్మిషన్ని మిషన్నపి "ఇంద్రి యాణీంద్రి యార్థేషు వర్తంత ఇతిధారయన్,"; "ప్రకృతేః క్రియామాణాని గుణైః కర్మాణిసర్వశఃఅహం కారవి మూఢాత్మా కర్తాహ మితి మన్యతే" అనగా'నేను' కాదు ప్రకృతి సర్వము చేయుచున్నది. ప్రకృతి యెవరు? దేవుని మాయాశక్తి, 'మయాధ్యక్షేణ ప్రకృతి స్సూయతే సచరా చరమ్", ప్రకృతి యనగా దేవుఁడే, ఇక'నేనె'వరు? దేవుఁడు !!!

651. భగవంతుని నమ్మని వారికంటె నమ్మినవారు బుద్ధిమంతులని చెప్పనవసరములేదు. నమ్మని వారికి లభింపని

సత్ఫలితము లెన్నియో నమ్మిన వారికి లభించును, కాని నమ్మినవారి కంటె, నమ్మి భగవంతునితో నిత్య సంబంధము పెట్టికొని, తల్లిదండ్రులతో వలె, ఆప్తబంధు మిత్రులతో వలె ప్రవర్తించు దీక్షగల వారధికులు, వారికంటె భగవంతుఁడొక్కఁడే ఉత్తమ బంధువని తలచి, తమతోడి బాంధవ్యమును భగవంతుఁడు గుర్తించి, ఇహపర సర్వశుభములనిచ్చునట్లు జీవించు వారికి సాటి యెవ్వరుండరు. వారికి వారేసాటి.

652. దేవుఁడు భక్తునికిఁ గనబడి, మాటాడునా? వలసిన వన్నియు నిచ్చునా? మనమందఱము భక్తులమనుకొనుచున్నామే కాని, మనకు భగవంతుఁడు కనబడలేదు, పలుకరింపలేదు; వలసిన వన్నియు నీయలేదు; లోపమెచటనున్నది? ఏలోపము లేనివాఁడే భగవానుఁడు కాబట్టి, లోపము మనదే యని చెప్పుకొనుట కాలోచింపనవసరము లేదు. మనలోపములు వెదకికొని, కాల్చివేసి, నిజమైన భక్తికలిగి పిలిచినచో దేవుఁడు పలుకును.

653. అందరలో నుండి అందరకంటె నిత్యామత్యాంతసన్నిహితుఁడై యున్నవాఁడు భగవానుఁడే. "నన్నాశ్రయించిన వారిని సర్వవిధముల సకల వేళలరక్షింతునని, భగవానుఁడే వేనోళ్లఁ జాటియున్న సంగతిని సంశయించుటకుఁ బాపము తప్పమఱొక కారణము లేదు, భగవత్సంకీర్తన మతిశయ మొనర్చి, దీక్షతోఁ బూజించు వానికి సంశయము కలిగించు పాపము నశించును.

654. ఒకక్షణము కూడ భగవంతుని మరచి యుండుట దుస్సహాముగా భావించు నాతఁడే భక్తుడు. ఆగకుండ గుండెకొట్టుకొనునట్లు, ఊపిరి పీల్చునట్లు, స్థూలసూక్ష్మ లింగ దేహాముల నుండి భగవత్సంకీర్తనము అప్రయత్నముగా జరుగు చుండవలెను, ఇట్టి అదృష్టవంతుని కశుభము లన్నియు నశించి, శుభములన్నియు లభించి, మోక్షకవాటము తెరువఁబడును.

655. కంఠమువరకు ఊచ్చులో దేహాము దిగబడి కదలలేనిదే మానవుని దుస్థితి. కాని మనమందరమట్టిస్థితిలో నుండి క్షేమముగానే యుంటిమని భావించు చున్నారము. బలవంతుఁడెవఁడో వచ్చి చేయిపట్టి మనలను బయటికి లాగి రక్షింపవలెను - ఆతఁడే గురువు, దేవుఁడే గురువు. మనలనాస్థితిలో నుంచినవాఁడు దేవుఁడే. ఇట్టిస్థితిలో మన ఁజాలను రక్షింపు మనిగట్టిగా ఁగోరినప్పుడా భగవానుఁడే స్వయముగానో, గురురూపముననో, వచ్చిరక్షించును.

656. అమెరికా అధ్యక్షుఁడైన నిక్సన్ పతనము, విశ్వరాజ కీయము పూర్తిగా ఁగలుషితము కాలేదనియు, ధర్మపక్షము జయించు ననియు సూచించినది-అధర్మపరుఁడు పడిపోక తప్పదను ఆర్యధర్మము ఋజువైనది. రెండేండ్ల క్రిందటనిక్సన్ భారతదేశమునకు ద్రోహాము చేసెను. ఈతఁడు పదభ్రష్టు డగునని అప్పుడేనాకు స్పష్టముగా గోచరించెను. అది నిజమైనది. ధర్మరక్షణ పరత్వము, అధర్మ నిరసనము

చూపిన అమెరికా జాతి ప్రజలు మొత్తము మీద పుణ్యాత్ములు, అన్ని దేశములకిది యొక గుణపాఠము, ధర్మరక్షకుఁడగు భగవానుఁడున్నాఁడనియు ఋజువైనది. భగవానుఁడు ప్రజా వాక్యములోఁ బ్రవేశించి పలికెను.

657. భగవంతుని గూర్చి తేలికగా మాటాడుట, దూషించుట, తిప్పిపట్టుట, మున్నగున వెన్నఁడును చేయరాదను నియమము, నొక వ్రతముగా భావింప వలెను. భగవన్మహిమలో మనకెంత నమ్మక మున్నను, మనము కోరిన రీతిగా (బరిస్థితులుండి, మన వాంఛితములు సిద్ధింప నపుడు, రోగ దారిద్ర్యావమానాదికము తటస్థించి నపుడును, మనము తాత్కాలిక క్రోధ నిరాశా క్లేశవశులమై దేవుని సైతము దూషింపఁ బూనుదుము — ఇది ప్రాయశ్చిత్తము లేని పాతకము. జాగ్రత్త!

658. మనయింట లక్షలు విలువ గల ధనపాత్ర, రహస్యముగాఁ బాతిపెట్టఁ బడియొకనిర్దిష్ట ప్రదేశమునఁ గలదని తెలిసిన వెనుక మనము నిద్రింతుమా? అన్ని పనులు మాని, దానిని త్రవ్వి, బయటకు దీసి ఆవెనుకనే విశ్రమింతుము. మన దేహమను నింటిలో ఒక నిర్దిష్ట ప్రదేశ మనగా హృదయాకాశమున భగవంతుఁడు సుఖాసీనుఁడైయున్నాఁడని అమోఘములైన వేదములు పలుకు టెరిగి, అంతర్ముఖులమై దేవుని దర్శించు పనిచేయ కున్నారము. ఆపని తప్ప నన్ని పనులుచేయు చున్నారము. ధనపాత్ర మాత్రము, దేవుఁడు విలువ చేయఁడా?

659. అతివృష్టి. అనావృష్టి యోగములు రెండును దుర్దశలే, సముచిత వృష్టిమనకు గావలెను. సముచితదృష్టి సముచిత వృష్టి నీయఁగలదు. సముచితదృష్టి యనగా ధర్మ దైవభీతి గలిగి, నీతికి గట్టువడి జీవించు దీక్ష.

అదేవిధముగా భగవంతు ననుగ్రహ వృష్టియు లభించును. దైవానుగ్రహ లోపము దారుణ దుర్దశయే. భగవానుని సముచిత దృష్టితో నాశ్రయించి, భగవానుని కృపా వృష్టిని పొందఁగలము.

660. భగవంతు నాశ్రయించుటలో, నీకు నిర్మల భావ మున్నదో లేదో చూచికొనుము. నిర్మల హృదయ సమర్పణమునకు భగవానుఁడనుగ్రహము చూపునా చూపఁడాయను ప్రశ్నమునకు దావే లేదు. ఇకనొకటి యున్నది. కాలము, నీవను కొనిన సమయము, భగవానుఁడు కృప జూప నిశ్చయించిన సమయము – ఒకటే కావచ్చును – వేరు కావచ్చును. దేవుని దృష్టిలో నీవనుకొన్న సమయ, మసమయ మగుచో దేవుని కృపాసమయమునకై వేచియుండు నోర్పు నేర్వవలెను. –

661. వేదోద్ధరణ మనగా వేదము చదివిన వారికి సంభావన లిచ్చుట యని నేటి ప్రముఖుల భావము. అందుఁ గొంత ప్రయోజనము లేక పోలేదు కానిఅదియే వేదోద్ధరణ మని తలచుట నిజము కాదు. వేదపండితులు వేదపోషకులు ధనము, గౌరవములపై దమ దృష్టిని కేంద్రీకరించిరి.

వేదరహస్య మెరిగి, జీవితములోఁ జూపునాతఁడే వేద విదుఁడు; వేదపోషకుఁడు నగుదురు. వేదములు శాశ్వతసత్య ప్రతిపాదకము లగుటచే నవి నశింపవు.

662. పరమేశ్వరానుగ్రహలాభమునకు, దానికి వ్యతిరేకములైన కోర్కెలు నిన్ను బాధించు చుండ వచ్చును, అవి అసత్కామములని నీకు దెలియునుగాని వానిని నీవు త్రోసిపుచ్చలేని వాఁడవై యుండవచ్చును. అందుకై చికాకు పడకుము. హృదయమువిప్పి భగవంతు నితో నీ పరిస్థితి వెల్లడించికొని, నీవు జయింపలేని దుష్కామ ములఁ దొలగించి రక్షింపుమని ప్రార్థింపుము. దేవుఁడు నీకు లోటు చేయఁడు.

663. నీవు నీ అవసరముల నిమిత్తము, నీపుత్రులు మిత్రులు, బంధువులు మున్నగువారిపై నాధారపడి, వారు నీకు దోడ్పడకున్నచో వారిని నిందించుట, రాగద్వేష వశుఁడవగుట జరుగును. ఇది ప్రబలదోషము. (1) ఇందు రెండు విషయములున్నవి. (2) నీ అవసరములన్నిటిని పలు దోముపుల్ల మొదలు, బ్రహ్మజ్ఞానము వరకు దీర్పగల వాఁడు, దీర్చుచున్నవాఁడు, ముందుదీర్ప గలవాఁడు భగ వానుఁడు తప్ప మరెవ్వరును లేరు. (2) ఆవగింజంతయైనను, నీకు దోడ్పడుటకుఁగాని, మానుటకుఁగాని కర్తృత్వము లేని పుత్ర మిత్ర బంధు జనమును నిందించుట కేవలము గాఢమైన అజ్ఞానము.

664. మనము కోరినవన్నియు భగవంతుఁడిచ్చినచో మనము కోరినవానిలోఁ గోరఁదగినవి లేకపోవచ్చును; కోరఁదగనివెన్నియో యుండవచ్చును. కోర్కెలు రెండు రకములు. (1) ఇహలోక జీవయాత్రకవసరమైనవి - అనవసరమైనవి. (2) మోక్షసిద్ధికి సంబంధించినవి, ఇహకాంక్షలు మోక్షకాంక్ష కడ్డురానివై యుండవలెను. అటులే ముక్తికాంక్ష ముఖ్యమైనదైనను, కొన్ని యిహలోక జీవితావసరములు లోపించినచో, మోక్షకాంక్ష బలము కృశించును. ఇది తెలిసి కోరుట తప్పులేదు. భగవంతుని కన్నియుఁ దెలియును. గావున, నేమియుఁ గోరకుండ భజించినచో, నీయవసరములన్నిటి నాతఁడే తప్పకతీర్చును.

665. ధర్మగ్లాని సంభవించినపుడు, నేనవతరించి సాధురక్షణము, దుష్టశిక్షణము, ధర్మసంస్థాపనము, చేయుచుందునని భగవానుఁడు పలికినాఁడు కాని ప్రతివ్యక్తియు, నొకవ్యష్టిలోకమే. వ్యక్తిలో ధర్మగ్లాని కలిగినపుడు కూడ భగవానుఁడు కలుగఁజేసికొని, వ్యక్తిలోని దుష్టశక్తులనణచి, సద్గుణములను రక్షించి, వ్యక్తి జీవితములో ధర్మస్థాపనము చేయుచునే యున్నాఁడు. ప్రతిప్రాణిలో భగవానుఁడవతరింప నక్కరలేదు. ఆతనికిఁ బ్రతిజీవియు నివాసస్థానము. ప్రతిప్రాణిలో జరుగు కర్మలాతని సంకల్పముచే ధర్మవిజయమగుటకే నడచుచున్నవి. భక్తివిశ్వాసములు గల వారికిది తెలియఁగలదు.

666. ఈ లోకములో జన్మించిన ప్రతివ్యక్తికి బాధించు క్లిష్టసమస్యల నెదుర్కొనక తప్పదు. జన్మము లేకుండ జేసికొనుటే దానికిమందు. బ్రహ్మజ్ఞాన సిద్ధి వలననే జన్మరాహిత్యము లభించును. అందుచే ప్రతివ్యక్తియు బ్రహ్మజ్ఞాన సంపాదనమున కగ్రస్థానమిచ్చి కృషిచేయ వలెను. గర్భాష్టమమందే ఉపనయన కర్మపెట్టి బ్రహ్మోప దేశముచేయు వైదికవిధానము సాటిలేనిది, నేటిద్విజులు దానినివిడిచి శోకహతులైరి. వారితోబాటు లోకమును శోకమగ్నమైనది.

667. భగవానుడు సంపూర్ణ స్వచ్ఛభక్తిలేని సామాన్య భక్తులకు భయంకర పరిస్థితులు కల్పించి ముంచి వేయుచున్నట్లు గోచరించి. వారికి చిత్తసంస్కారము గలి గించి, ఉత్తమ భక్తశ్రేణికి జేర్చును. అట్లువారిని శుద్ధుల నొనర్చుచు, వారికాశ్చర్యము కలుగునట్లుగా మేఘములు చెదరి పోవునట్లు, విషమసమస్య లదృశ్యములగుచు, పరి స్థితు లనుకూలము లగునట్లుచేయును. భగవానుడు తన్నా శ్రయించిన వారితో నీ విధముగా నాడుకొనును. ఉత్తమ శ్రేణి భక్తులకిట్టి పరీక్షలుండవు.

668. నీ కెవరుపకారము చేసినను దేవుడే చేసె ననియు. నటులే యెవరపకార మొనర్చినను, భగవానుడే చేసెననియు, నిస్సంశయముగా గమనింపుము. భక్తునికి శ్రమ కలిగించుటకు దేవుడిచ్చగింపడు – కాని భక్తుని భక్తిని సమగ్ర

మొనర్చుటకు శ్రమకలుగఁజేసి, దానినోర్పుతో సహించు సామర్థ్యమిచ్చి, బాగుచేయును. ఆశ్రయించిన భక్తునికి శ్రమయేకాని, శాశ్వతమైన అపకార మెన్నడు జరుగదు. "నమే భక్తః ప్రణశ్యతి" యని భగవానుఁడు హామీ యిచ్చి యున్నాడు.

669. చిన్నదికాని పెద్దదిగాని యేపనినైనను శ్రద్ధ గలిగి, సమస్తశక్తి నైపుణ్యములుచూపి చేయుట వలననే, చేసిన పనులు పూర్తిగా సఫలతనందును. దేవునాశ్రయించు పని, మిగిలిన అన్నిపనుల కంటెను చాల కష్టమైనది. అందుచే భగవానునాశ్రయించు పనికి మనము దగినంత శ్రద్ధాభక్తి శక్తి నైపుణ్యములు చూపకుండుట చేతనే, ఫలితములు తదను గుణముగానే యున్నవి.

670. నీకు నిజముగా కర్తృత్వము లేదు. దేవుని చేతిలోని కీలుబొమ్మవు. నీవుచేయు పనులన్నియు దేవుఁడే చేయించుచున్నాఁడు. గీతదీనినే బోధించెను. అందుచే నీవేమి చేసినను, మంచిదైన, చెడ్డదైన, సంతోష విచారములు పొందుటయు దప్పగును, చేసినవాఁడు దేవుఁడేకదా. నేను చేసినానని నమ్మితివా నీవుచేసిన కర్మల ఫలములు కట్టికుడుపును. నేనుకర్తనుగాను, దేవుఁడే చేసెనని నిస్సంశయముగా నమ్మితివా నీకు కర్మఫలబంధములు లేవు.

671. గృహయజమాని యింటిపనులుమాని, నిరర్థక కార్యములందు కాలము వ్యయించుచో, నాతనియిల్లాలు

యజమాని దోషము నుగ్గడించును. అటులే, మానవుఁడు స్వస్థచిత్తుఁడై హాయిగా గూర్చుండి సుఖింపక, దేవుఁడు చేయుచున్న పనులన్నియు దానే తనపై నారోపించుకొని కర్మ ఫలితము లనుభవింపలేక విలపించు చున్నాఁడు. అంత రాత్మ అనునిల్లాలి ప్రబోధమును విని బాగుపడవలెను.

672. లోకము నందలి సర్వమును జూచి, జీవులను, సూర్యచంద్ర నక్షత్రాదికమును నదీపర్వత వృక్షలతా దులను, అన్నిటినిజూచి భగవానుననంత ప్రతిభా నైపుణ్య సౌందర్యములను గుర్తించి ఆనందింపవలెను. వాని నార్జించి అనుభవింప వలయునని కోరుదువా అవి నిన్ను మోసగించి, దుఃఖసాగరమున ముంచివేయును. ఈలోక వస్తుప్రదర్శన శాల, వెనుకనున్న ప్రదర్శకుఁడగు భగవానుని గుర్తించి ఆనందించుటకే.

673. ఏవ్యక్తి ముఖము తిలకించినను, సంసారమను ఘోరయుద్ధములో బాల్గొని దేహమంతయు గాయములై, యుద్ధము మరణ పర్యంత ముండునదిగావున, నింకను ముందుకు వెనుకకు బరుగిడుచు, నడచుచు, సొలయుచు దుస్థితిలోనున్న దుర్దశాప్రదర్శనము చేయురేఖలు ముద్రిత ములై గానిపించును. కామక్రోధములు - రాగద్వేషములు జయాపజయములు - లాభనష్టములు - జనన మరణములు ఇవియే ప్రబలశత్రువులు - వీనితో యుద్ధము మరణముతో గాని ముగియదా? నిరాశానిర్వేదములను కారుమేఘములు- ముఖచంద్రకాంతి నణచివేయును.

674. ఉత్తమగ్రంథములు చదువవచ్చును; ప్రఖ్యాత గ్రంథరచనము చేయవచ్చును; మహోపదేశము లుపన్యసింపవచ్చును; కాని చదివినవి, రచించినవి, ఉపదేశించినవి తన స్వకీయజీవిత సకల దశలలో ననుసంధించి, ఆచరించిన మహనీయుఁడు కోటికొకఁడుండును. తత్త్వవేత్త యనగా పండితుఁడు గాఁడు, గ్రంథరచయితగాఁడు; వక్తగాఁడు; తత్త్వవేత్త తత్త్వముఁలో నొకటైనవాఁడు. "బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి" బ్రహ్మవిదుఁడు బ్రహ్మయే యగును.

675. శ్రోత్రియుఁడైన బ్రాహ్మణునింట జన్మించుటయే మహాపుణ్యరాశిఫలము. అట్టిజన్మము బ్రహ్మజ్ఞానము సంపాదించికొని, తరించుటకు సూటిమార్గము. ఇదే తుది జన్మము చేసికొను నవకాశము. అట్టిపుణ్యజన్మావకాశమును గాంచి, ధనకాంతా భోగలాలసులై, వ్యర్థమొనర్చువారు తమకేగాక తమ కుటుంబమునకేగాక, తమ దేశమున కప కార మొనర్చిన వారగుదురు. సదవకాశమును జారవిడుచు వారెంత అవివేకులో!

676. విశ్వప్రపంచమంతయు, నందలి సకలచేతనాచేతనములు - అత్యంత సనాతనములైన వేదములు - ఉపనిషత్తులునై యున్నవి. ప్రసూతి గృహము, స్మశానము, ప్రతివృద్ధుఁడు, ప్రతివైద్యాలయము, రాలినఆకులు, వాడిన పువ్వులు, యెండిపోయినచెట్లు. నెరసినవెంట్రుకలు, ప్రవాసియైన ప్రతిభూపతి, పదవీచ్యుతుఁడైన ప్రతిఉద్యోగి, గొడ్రాలు

సూర్యోదయాస్తమయములు మున్నగునవన్నియు వేదములే. అన్నియు బ్రహ్మజ్ఞానోపదేశముచేయు నుపనిషత్తులే. జీవితములు, క్షణికములు, దుఃఖమయములునని అవినిత్యము బోధించుచున్నవి. వేదవేదాంతములు అదియే బోధించును,

677. భగవదర్పిత జీవితము గడుపుటలో నడుగడుగునకు బ్రమాదము లెదుర్కొనును. అందు - అహంకార మమకారములు కామక్రోధాదికము - రాగద్వేషములు ఏక్షణములోనైనను మన నిశ్చలభక్తిని చలింపఁజేయును. అహంకారాది శత్రువర్గము నెదిరించి జయించుట దుస్తరము. వాని నీశ్వర మాయాలీలలని గ్రహించి, చలింపక, దేవు నర్చించుటయే మనము చేయవలెను. ఇది అభ్యాసముచే లభించును.

678. పిండివంటలతో మృష్టాన్నభోజన మొనర్చి, నేను తినలేదనియు, ఇంటినిండ ధనముండి, దమ్మిడి లేదనియు, పుత్రమిత్ర బంధువర్గముండి, దిక్కు లేదనియు, బెట్టెలనిండ దుకూలములుండి, కట్టవస్త్రము లేదనియు నేడ్చువారిని జూచి యేమనవలెను? సకల ప్రపంచ హేతువై సకలైశ్వర్య జ్ఞానసౌందర్యానంద నిలయమైన పరమాత్మ తానేయై అది మరచి, తానొక దేహముననియు, దీనుఁడననియు, నల్పుఁడననియు, భ్రాంతివశుఁడై విలపించువాని నేమనవలెను? నీవు పొరఁబడు చుంటివి - నిజము తెలిసికొమ్మని చెప్పుటే వేదవేదాంత సారమైయున్నది.

679. మన జీవిత సర్వస్వ మీశ్వరార్పణ మొనర్చి యావెనుక, మన జీవితావసరములకై పరుల నాశ్రయించు టాత్మ విరుద్ధ ప్రవర్తనమే. నా యోగక్షేమకర్త యీశ్వరుఁడని యెరిఁగి, నాకుఁదోడ్పడుమని పరులఁజేరుట – దేవుని యందు మనకుఁగల విశ్వాసములో లోపమును జూపుట, మన మన్యుల నాశ్రయించుటయు నీశ్వరసంకల్పమే యగుచో, దానికి ప్రబల సాక్ష్యములుండవలెను – అప్పుడు మనము నిరహంకారులమై, యీశ్వరార్పిత బుద్ధితోఁ గర్మ చేయుదుము; దేవుఁడే మనచేనట్టి పనులు చేయించు చున్నట్లు మనము చూడఁగలుగుదుము; చూడఁగలుగుటే ప్రబల సాక్ష్యమగును.

680. ఏదేనొక వస్తువు విలువనావస్తువును మన మొకటి రెండుసారులు రుచిచూచి అనగా అనుభవించి గుర్తింతుము, కాంతాకనక సౌఖ్యములను మనమట్లు రుచి చూచి, వానివిలువనెరిగి, వానికి మరగుచున్నాము. అదే విధముగా భగవానుని దివ్యానుగ్రహానుభవము మనమొక సారియైనను రుచిచూచినచో దేవునెన్నడును విడువము, అప్పుడు కాంతాకనకాద్యనుభవానందమును దైవానుగ్రహాను భవానందమునుపోల్చి మొదటిది క్షణభంగురము, బాధాన్విత్మము, దుఃఖమిశ్రితముననియు, రెండవది శాశ్వతము, నిక్షే దము, స్వచ్ఛ సంపూర్ణానంద ప్రదముననియు గ్రహించి, రెండవదాని నాశ్రయించి మొదటిదానిని విడిచి పెట్టుదుము,

అనుభవమే అన్నిటి విలువ నెరుగును. దైవకృపానుభూతియే మతము, తత్త్వజ్ఞానము, వేదాంత రహస్యము నైయున్నది.

681. 5 సంవత్సరములు వచ్చినవెనుక బాలుని కక్షురాభ్యాసము చేయవలెను. 25 యేండ్లకు విద్యాపూర్తి కావలెను. అనంతరము వివాహము, ఉద్యోగవృత్తి; 55 వ యేట ఉద్యోగ విరమణము; సంతానాదికమునకై గృహ విత్తారామాదికముసము పార్జింపవలెను. ఈవివిధకార్యక్రమము లందరెరిగినవే. వానినాచరింతురు-కాని బ్రహ్మజ్ఞానము నార్జించుట కెన్నవయేట నారంభించి, యెన్నవయేట ముగింపవలెను? ఈప్రశ్న యెవరును వేసికొనరు. కాని, పైకార్యము లన్నిటి కంటె నిది అత్యంత ముఖ్యమైనది; స్థిరానందము నిచ్చున దియుఁ గాదా? జీవితమందలి మొత్తముశక్తిలో నత్యధిక భాగమునైనను దీనికొరకుపయోగించి, మరణాత్పూర్వమైనను బ్రహ్మవేత్తయై సుఖింపవలదా?

682. సూర్యుఁడుదయించునపుడు,అస్తమించునపుడు గడియారపుముల్లు తిరుగుచున్నప్పుడు, ఒకవిధమైన బెంగ, భయము, దిగులు, అందరకును కలుగవలెను, ఏలన మనము జీవించు కాలము తరిగిపోవుచున్నది. ఈ సంగతిని గూర్చి యేమి చేయవలెనని ఆలోచించుచుండగా, (గూఢనాయువు తరుగుచున్నది. మృత్యువు నెదుర్కొని జయించుబలమునకై వ్యాయామము చేయవలెను. అదియే బ్రహ్మజ్ఞాన సంపాదనము. అది సులభమా? దుస్తరమైనది. అందుచే వెంటనే దానినార్జించు తీవ్రకృషి చేయవలదా?

683. ప్రతివ్యక్తియు నిజముగాఁ దానెంతటి వాఁడో, అంతకంటె నధికుఁడనని భావించును, ఇతరులటులే తన్నుఁ గుర్తింపఁగోరును, అనగాఁ దమకు నిజముగాలేని గొప్పతనము నారోపించికొనుట కందరు కుతూహలము చూపుదురు, ఇందొక రహస్యమున్నది. తమకు ప్రత్యక్షముగా లేని ఔన్నత్యము నారోపించు కొనుకోరిక ఉదయించుటకుఁ గారణము వస్తుతః ప్రతివ్యక్తియు సాటిలేని ఔన్నత్యముగల పరమాత్మ స్వరూపమయి యుండుటే, ఆత్మప్రేరణచేతనే యీఆరోపించుకొనుభావ ముదయించుచున్నది. సాటిలేని ఆత్మను నేనే యని తెలియువరకు నీయారోపణము జరుగుచుండును,

684. మరలఁ బుట్టుటెంత కష్టమైన విషయమో మరణానంతరము, ఏతల్లిగర్భముననో సూక్ష్మరూపమునఁ జేరి, తొమ్మిది నెలలందుండి, గర్భనరకబాధ లనుభవించి, ఎట్టి ప్రమాదములు లేకుండ బయటపడవలెను. ఐదేండ్లు పూర్తిగా అజ్ఞానదశ; పరులపై నాధారపడి బ్రతుకవలెను. మరల తిరిగి చదువు, పెండ్లి, సంతానము, ధనాదికము నార్జించు యాతన, అందలి సుఖదుఃఖములు-చర్విత చర్వణము. ఎందుకీ పుట్టుక చావులమధ్య సంచారము? పుట్టని గిట్టని స్థితి లేదా? దానినార్జింపవలదా?

685. దొంగనుబట్టి చెఱసాలలోఁ బెట్టుదురు, శిక్ష అయినవెనుక, బయటికివచ్చి ఆదొంగతనమే చేసి, మరల జెఱఁబడును, ఎందుకట్టి తుచ్ఛజీవితము? చౌర్యవృత్తి విడిచి

నీతినియమముతో బ్రతుకవలెనని దొంగనిర్ణయించి, సత్పురుషుఁడు కాఁగూడదా? మనమందరము పుట్టి, తుచ్ఛ సంసారమను చెఱసాలలోఁబడికుమిలి, నానాదుఃఖము లనుభవించి, మృతిచెంది, మరల పుట్టుటకు సిద్ధపడుచున్నాము; మరల దేహము, సంసారదుఃఖము, మరణము మరలజన్మము; చేసిన తప్పే మరలచేయుట – అంతాదుఃఖమే, మనకు లజ్జా వివేకము లున్నవా?

686. జ్వరమువచ్చినపు, డుపవాసము చేయుదుము. లేకున్న జ్వరమధికమై ప్రమాదించును, మానవ జీవితమునకు కామినీకాంచ నానుభవ కాంక్షయను జ్వరముపట్టి పీడించుచున్నది. దాని కుపవాసమున్నది, ఉపవాసమనగా దేవుని సమీపమున నుండుట; అనగా దేవునిభక్తితో భజించుట – అప్పుడు కామజ్వరముహరించి, జ్ఞానారోగ్య సిద్ధియగును.

687. ఫలితము దైవాధీనమగుటచే నిష్కామ కర్మ చేయుమని గీతబోధించుచున్నది. అసలు కర్మచేయుట మన చేతిలోని పనియా? అదియు ఁజేయించువాఁడు భగవానుఁడే. అనగా నీశ్వరప్రేరణచే నీశ్వరార్పణముగా ఁగర్మచేయవలెను అప్పుడే బంధములుండవు.

688. కృత్రిమముగా లక్కతో ఁజేసిన మామిడి పండిచ్చినచో ఁబిల్లలాడుచు, నదినిజమైన మామిడిపండని తిన ఁగోరి కొరుకుదురు, కొరుకుపడదు, అందురసము, మాధుర్యమునుండునా? అదేవిధముగా, మానవు లను పిల్ల

లాడుకొనుటకై కామినీ కాంచనాదులను దేవుఁడిచ్చినాఁడు. ఇవి నిజమైన రసమాధుర్యములు గలవికావు. మనము వాని ననుభవింపఁబోయి, దుఃఖసాగరమునఁ బడుచున్నాము.

689. మనము మాటలాడు మాటలన్నియు దేవుఁడు మాటలాడుచున్న వే. మనముచేయు నాలోచనలు, పనులు దేవుఁడు చేయుచున్న వే, ఇచటనొక వైచిత్ర్యమున్నది. మనమే అన్నియు చేయుచున్నాము కాని దేవుఁడుకాదను భ్రాంతిని దేవుఁడే కలుగఁజేయుచున్నాఁడు. ఈ భ్రాంతి వలన, మనమే అన్నియుఁజేయుచున్నామను విషయములో లేశమాత్ర సందేహమును కలుగదు. భగవానుఁడే అన్నియు జేయుచున్నాఁడని అందరకు నిస్సంశయముగాఁదెలిసినచో, జగన్నాటక మాగిపోవును; కాని కొలది ధన్యులేతెలిసి, జన్మ మరణ దుఃఖములనుండి విముక్తులగుచున్నారు.

690. స్థూలసూక్ష్మ కారణ దేహములు మూడింటిలో అహంకారములేక 'నేను' అనుభావము అనాదిగాఁబాతుకొని పోయియున్నందున, దీనిని దొలగించుట సులభముకాదు. అహంకారము కామరూపధారి. అదిపెక్కు రూపములు ధరించి, సత్యము నసత్యముగా గోచరించునట్లు చేయును; దీనికిఁగారణము దేవుని మాయాశక్తి, అదియే ప్రకృతి. అనవరత నిష్ఠతో భగవాను నాశ్రయించి భగవదనుగ్రహముతో నహంకారమును దొలగించు కొనవచ్చును.

691. "నీకీ జన్మమిచ్చినది; నీకుగలిగినవన్నియు నిచ్చినది, జీవితావసరములను, నీయందుగల భక్తి జ్ఞానాంకురములను, సర్వము - అనగా సంతతి, గృహ, వృత్తి, విత్తాదుల నిచ్చునది - యిచ్చుచున్నది - యికముందిచ్చునది - సర్వలోకాధిపతినైననేనే - మరెవ్వరును గాదు. ఎవరి ద్వారా యిచ్చిననేమి - దాతనునేనే - ఎవరును కర్తలుగారు - వారిని స్తుతినిందలు చేయకు - ఏమి కావలసినను - నన్నే అడుగు - ఇది స్పష్టముగా గుర్తించి - మరల నింకెవ్వరిపై భ్రమపెట్టుకొనకు -" మని భగవానుని దివ్యవాణి చెవులలో మ్రోగుచున్నది.

692. మన మానందములోఁబుట్టి,ఆనందములోఁబెరిగి, ఆనందములోఁజేరుచున్నామని ఉపనిషత్తు చెప్పుచున్నది. కాని మనము దుఃఖములోఁబుట్టి, దుఃఖమునందుఁబెరిగి, దుఃఖములోఁజేరుచుండుట కనఁబడుచున్నది. కాని ఉపనిషత్తు పలికిన దసత్యమా? మనము దంపతుల ఆనంద సంయోగములోఁబుట్టుచున్నాము ఆనందము. లేనిచో నొక క్షణ మెవ్వఁడు బ్రదుకఁడనియు నుపనిషత్తే చెప్పుచున్నది. ప్రతి ప్రాణిహృదయములో బ్రహ్మానందమున్నది. దాని ప్రభావముచే మనము బ్రతుకుచున్నాము. మరల మరణానంతరము దేహసంబంధ విముక్తిచే నానందమే. ఇంకొక రహస్యము; దేవుఁడనగా బ్రహ్మానందము; సర్వవ్యాపి దేవుఁడు; మనము దేవునిలోఁబుట్టి, దేవునిలోఁ పెరిగి, అందే

చేరుచున్నామని యెరుగవలెను. ఇదియెరిగినచో అంతయు బ్రహ్మమయము, ఆనంద మయమునగును.

693. ఒక మామిడి పదివేలుకాచినది. అందెన్ని రాలి పోవునో, యెన్ని పక్షులుతినునో, యెన్నిపుచ్చునో, మిగిలిన పండ్లెవరెన్ని తిందురో, నిర్ణయించుట దుస్సాధ్యము, ఇదియే కష్టమైనచో, గణనాతీత సంఖ్యగల జీవజడ వస్తురాశియైన ప్రకృతిలో దేనినెట్లెందుకు భగవానుని సంకల్పము నడపుచున్నదో తెలియుట సాధ్యము కానిపనియని చెప్పనవసరములేదు. మనబుద్ధి శక్తిపరిమితము; అపరిమితశక్తి సంపన్నుడగు భగవంతుని గుర్తించి, అర్చించుటకే పనికి వచ్చునుగాని, వాని అనంతమహిమను దెలిసికొనుటకు గాదు.

694. అన్నిగొడవలు విడిచిపెట్టి నిన్నునీవు బాగు చేసికొని, తరించుటకు శీఘ్రతీవ్రతమ కృషిచేయుము. మరణ కాలమున నిన్నెవరును రక్షింపలేరు. భగవంతు నాశ్రయించి రక్షణ పొందవచ్చును. కాలహరణము చేయక, అనంత కృపామూర్తియగు భగవానుని అనుగ్రహామృతము నార్జింపుము.

695. అన్నియు నీశ్వరాజ్ఞచే జరుగుచున్నవని యెరిగియు, నీకిష్టములేనివి కొన్నిజరిగి బాధించునపుడు చిత్తము చలించి దుఃఖపడుదువేల? సర్వకర్త భగవానుడను సత్యమే నీవైపోవలెను. అప్పుడు నీచిత్తవృత్తుల పాటునొందదు. అఖండాభ్యాస బలము, దీక్షకావలెను, ఇదియే రాజమార్గము.

696. భగవానుఁడు నమ్మినవారి నాపత్కాలములో రక్షించునా? అనుమానమున కవకాశము లేదు. అనంతశక్తి కృపాసాగరుఁడైన భగవానుఁడు నమ్మినవారిని దగాచేయునా? భగవంతుని భక్తరక్షణశీలము ననుమానించుటే ఘోర పాపము. అనగా దేవుని నమ్ముటయేచాలదు; నమ్మిన వారిని తప్పక రక్షించుననియు నమ్మవలెను. అదిసత్యమని కోటి సాక్ష్యములు గలవు.

697. సత్త్వగుణము మంచిదని విని, అది తనకున్న దనియు, బ్రహ్మజ్ఞానము, ఉత్తమభక్తి ముక్తి నిచ్చునని చదివి అవి తనకుఁగల వనియు దాననుకొనినవి జరిగినపుడు, తనకు సాక్షాత్కారమైన దనియు జెప్పికొనుట వలఁనదన కధిక గౌరవ మున్నదని తలచుటయు, మానవుని స్వోత్కర్ష లక్షణము. కాని అదిలేని దున్నదని భావించు మౌఢ్యము.

698. సాధనవేరు, సిద్ధివేరు; ప్రార్థనవేరు; ప్రార్థించినది ఫలించుటవేరు. వంటచేయుటవేరు, భుజించువేరు. సాధనయే సిద్ధియని పొరఁబడుట వలన, సిద్ధిలేదు. సరికదా, సాధన లోపభూయిష్టమై ఖేదకారణమగును. మనమొకపని చేసినపుడది యేఫలితమునాసించి చేసితిమో అది లభింపవలెను, లభింపకున్నచో పనిలోలోపముస్పష్టము, భక్తిజ్ఞానసాధనము లట్టివే. లోపములు లేకున్నచో ఫలితము తప్పకలభించును.

669. చిత్తశుద్ధితో మనము దేవు నారాధించు చున్నది యథార్థమైనచో, దానికి సాక్ష్యము ప్రత్యక్ష గోచర

మగును. అట్టివ్యక్తి ముఖవైఖరియే సాక్ష్యమిచ్చును, ఆతఁడు నిర్విచార మహోల్లాసముతో చిరునగవు వెదజల్లు ముఖమునే ప్రదర్శించును. అట్టివ్యక్తి సర్వకాల సర్వావస్థలలోను సముజ్జ్వలానంద ప్రసన్నవదనుఁడై; "నేను దేవుని బిడ్డను, నాకేమి?" యని తన చూపుచేతనే ప్రవచించును.

700. సుఖము నన్వేషించుటే సర్వప్రాణికోటి సర్వ కార్యక్రమమైయున్నది. ఏప్రాణి జీవించుచున్నను. జీవించుచు, పనిచేయుచున్నను, సుఖముకొఱకే. కాని సుఖమాత్మగతము, అది బాహ్యమున లేదు. అది వస్తుగతముగాదు అది స్థూల రూపమును గాదు, అది అత్యంత సూక్ష్మరూపము, అది పరులపై వస్తువులపై నాధారపడదు. ఏ పరాధార మవసరము లేని సర్వ స్వతంత్రాత్మ వశమైనది సుఖము. పరాధారము కోరు సుఖము సుఖాభాసము. సుఖము కావలెనా, నీ లోపల వెదకి కొనుము.

701. భగవత్సాధకుని కడ్డువచ్చువానిలో, పరిగ్రహాపేక్ష, కీర్తికాంక్ష, ప్రబల దోషములై పరిణమించును, దైవ కృపచే దానంతటనది ప్రాప్తించినదానితో సంతృప్తిచెందుట సాధకుని ముఖ్యలక్షణమై యుండవలెను. మనకు ధన కనక వస్తు వాహనాదికమెవరైన తెచ్చి యిచ్చిన బాగుండునని కోరెనా, సాధకుని దీక్ష దానితో నశించును. దైవోద్దిష్టముగా నెవరైన నేదైననిచ్చుటగాక, అట్టిదాతలను వెదకికొనవలయునను కోర్కె జనించినచో సాధకుని భ్రష్టుని చేయును. కీర్తి

కాంక్షయు నట్టిదే. దేవుని మెప్పుగాక ప్రజలమెప్పు కోరి నచో, దానికై యత్నించు కోర్కెయు జనించి, భగవత్సాధనము నణచి వేయును. కావున సాధకుఁడు రెంటిని తిరస్కరింపవలెను.

702. దేవుఁడున్నాఁడని నమ్ము; నమ్మిననాతఁడు తప్పక రక్షించుననినమ్ము. అనుమానము పెట్టుకొనకుండ నమ్ము. ఈ సూత్రక్రమము నిత్యము పారాయణ చేయుము. సాధకావస్థలో కష్టములు వచ్చుచుండును. లేమి, అవమానము, అనారోగ్యము మున్నగునవి, అవి శ్రుతి మించుచున్నట్లగపడును; దేవుని నమ్మితివా? అవిశ్రుతిమించవు. మేఘాడంబరముచేసి, చినుకు లేకుండపోవునట్లు కష్టమేఘములను జూచి, నమ్మకము సడల నీయకుము.

703. అందరు స్వార్థపరులే; అందరు స్వార్థరహితులే! సుఖమీయని దేహగృహ భోగాదుల కొరకు క్షణిక వస్తు సమార్జన ప్రయత్నములో నందరు స్వార్థపరులే, అది మనకు ప్రత్యక్ష విషయము.

స్వార్థమున కుత్తమార్థము శాశ్వత సౌఖ్యప్రదమగు ఆత్మజ్ఞాన లాభము. కొలదిమంది మహాత్ములుతప్ప, నీ విషయములో నందరు స్వార్థరహితులే! ఏలనఁదమ బాగు తామెరుగరు, క్షణికస్వార్థము దుఃఖప్రదము; స్థిరస్వార్థము బ్రహ్మానందప్రదము.

704. చంటిబిడ్డ వాకిట గూర్చుండి ఆడుకొనుచు మధ్యమధ్య తనతల్లి సమీపమున నున్నదో లేదో చూచి

కొనుచు, నున్నచో ధైర్యముతో నాడుకొనుచు, తల్లి కనపడ కున్నచో కంగారు పడి రాగములు పెట్టును. రాగములు విని తల్లివచ్చి, "ఇక్కడనే ఉన్నాను, ఏడవకమ్మా" యనిచెప్పి, ఒకసారి యెత్తుకొని, మరల ఆటలోనికి (బంపును మనమట్టి చంటిబిడ్డలము. మనము సంసారములో ఆడుకొనుచు, కష్ట ములు వచ్చినపుడు, తల్లికనపడక యేడ్చుచున్నాము, జగన్మా తయే మనతల్లి; ఆమె మనదగ్గరనే యున్నది; ఆమెను తలచు కొని గట్టిగా నేడ్చినచో, "నేనిచటనే ఉన్నానురా! భయ పడకు; ఆడుకో" మని పలుకును. "జగన్మాతను పిలిచి చూడుఁడు; ఆటలాడుకొనుఁడు; తల్లిని మరువకుఁడు.

705. సర్వకాల సర్వావస్థలలోను మరుపురాకుండ దేవుని దృష్టిలో నుంచికొనుటే, సకల విధపుణ్యకర్మలకు, పూజలకు, జపతపాదులకు నుద్దేశము, నీవు దేవుని మరువ కుండునట్లు నీ కిచ్ఛవచ్చిన నియమములను పాటించి, ఆత్మ శిక్షణాభ్యాసము చేసికొని తరింపుము. అందరకొకే సాధనము సరిపడదు.

706. నీ యిచ్ఛ జరుగుట మంచిదా? ఈశ్వరేచ్ఛ జరుగుట మంచిదా? ఈశ్వరేచ్ఛ సర్వప్రాణికి (గల్యాణ ప్రదము. నీ యిచ్ఛ లోప భూయిష్టము. దైవేచ్ఛయే, నీ కిష్ట మున్నను లేకున్న నెల్లప్పుడు జరిగి తీరును, ఇక నీ యిచ్ఛకు విలువలేదు. నీ యిచ్ఛ నీశ్వరేచ్ఛలో (గలిపి వేసి, సంపూర్ణాత్మార్పణము చేసికొని, జీవించుచో, నీ యిచ్ఛయు నీశ్వరేచ్ఛయు నొకటేయగును.

707. దేవునికి కోపము వచ్చుచో నెవరడ్డు కొనగలరు? అందుచే ప్రతి మానవుడు, దేవుడున్నాడు; అపమార్గమున మనము చరింప గోరుచో శిక్షించును, అను దైవభీతితో బ్రతుకవలెను. ఇదియొక పద్ధతి; ఇంకొక పద్ధతి యున్నది. దేవునికి కోపము కలిగించు పనులు మానుటేగాక, దేవుడు సంతసించు సత్కార్యాచరణముతో బ్రదుకుట – దైవభీతి, దైవప్రీతి రెండును ముఖ్యములే, ఈ రెండు ధర్మముల ననుసరించి జీవితము మలుపుకొను నాతడు ధన్యుడగును.

708. ముసురుపట్టి, కుంభవృష్టిగురిసి, మూడు దినములు సూర్యభగవానుడు కనపడలేదు. సూర్యభగవానుడు లేడందుమా? అజ్ఞానమను మేఘము దట్టముగా వ్యాపించి దుఃఖమను కుంభవృష్టిచే జీవిత మంధకార బంధురమై, సుఖశాంతి కిరణ ప్రసారియగు భగవానుడు లేడనిపించును. కాని దేవుడు లేని కాలముండునా? మూడు దినముల మున్పైరే, నాల్గవ దినమున సూర్యభగవానుడు దర్శనమీయ లేదా? అజ్ఞానులు, మూర్ఖులు కనపడని దేవుడు లేడందురు. తెలిసినవారికెల్లప్పు డున్నాడు.

709. భగవ ద్ధ్యానమనునది మానవుడు చేయుపనులలో సర్వోత్తమమైనది. దానికిసాటి మరొక పనిలేదు. ఏలన, సకలాపత్తులను పోగొట్టి, సకల శుభ సంపదల నిచ్చునది భగవద్ధ్యానము. అది చేయుటకు మంచిముహూర్తము, మంచి

ప్రదేశము నవసరములేదు, భగవద్ధ్యానము జరుగునదే మంచి ముహూర్తము. జరిగిన స్థలమే పుణ్యక్షేత్రము. అన్ని స్థలముల లోను, అన్ని ముహూర్తములలోను భగవంతుఁడున్నాఁడు.

710. తమయింట నమూల్య ధననిక్షేప మున్నదని యెఱుఁగక,పరులనాశ్రయింపదిరుగువారు దురదృష్టవంతులు. కలిమి గలిగి లేమి ననుభవించు నవివేకులు. మన యిల్లనగా మనదేహము, దేహమందలి హృదయ పుండరీకములో పుండరీ కాక్షుఁడు సర్వ కాలములందు నివసించి యున్నాఁడు. ఆ భగ వానుని శక్తి వలననే మన మన్నిపనులు చేయుచున్నాము. లోనున్న భగవాను నెరుగక, దేశాంతరముల దిరిగి చూడనేల? బయటనుండి లోపలికి చూపుమళ్లించి చూచుటే యోగము, ధ్యానము.

711. భగవానుఁడనంతుఁడగుటచే సంపూర్ణముగా మనమా భగవాను నెఱుగఁజాలము. నిజమగు వినయము, భక్తిగల వారికిఁ గొంత తెలియనగును. దేవుని తెలిసికొనుటే దుస్సాధ్యమగు చుండగా, దేవుని విమర్శించుటకు, నిందించు టకుఁ బూనుకొను వారెంత అవివేకులో! భగవానుని పరి పూర్ణుఁడందుము; సకల వాక్కుల కతీతుఁడైన వానిని పరి పూర్ణుఁడని వర్ణించుట మనస్సంతుష్టి కొరకుమాత్రమే. భగ వానుఁడు పూర్ణుఁడేకాదు, పూర్ణతరుఁడని వేదము పలుకు చున్నది. అదియు మనస్సంతుష్టి కోరకే, అందుచే దేవుని పూజించుటే మనపని.

712. భగవంతుఁడు చేసిన, చేయుచున్న కార్యములు మనశక్తికొలది అర్థము చేసికొని, భగవానుని మహిమను గుర్తించి, ఆనందముతో బూజింపవలెను. తెలిసీ తెలియని భావములతో దేవునిగూర్చి అవినయసంభాషణములు చేయుట పాపహేతువు. ఇంకను దెలియఁగోరుచు, నధికముగా నారాధించుచుండుటే కర్తవ్యము.

713. సకల సంపూర్ణ, సంపూర్ణతర, అనంత కల్యాణ గుణమూర్తి పరమేశ్వరుఁడు. అట్టివాని పాదపద్మములు గట్టిగా బట్టుకొని విడువకుండు మహాభాగ్యమున కంటె నికఁ గోరవలసిన దేమున్నది? అంతకంటె జేయవలసిన పనియేమున్నది. అన్నియు దెలిసిన దేవుఁడెందుల కేది చేయు నని, యేమీ తెలియని నీవు తర్కింప జూచుట, తెలివి తక్కువ పనియని చెప్పనక్కరలేదు. ఎన్నివేల క్షుద్ర జన్మములో నెత్తి భగవాను నెరుగు నదృష్టము పట్టక, సకల దుఃఖములనుభవించితివి. ఈ జన్మములో నైనను, భగవానుని గుర్తించి ఆశ్రయించి ఆరాధించు నవకాశము లభించుట కంటె నింకేమి కావలెను?

714. భగవంతు నాశ్రయించినచో సకల బాధలును పోవలెను. బాధలన్నియు నిలిచి యుండుట కాని, కొన్ని పోయి, కొన్ని మిగిలి యుండుట కాని యేమి సూచించునో గ్రహించుట కష్టముకాదు. పాపముల వలన బాధలు సంభవించును. భగవదారాధనము పాపముల నశింప జేయును. బాధలు మిగిలి యున్నవనగా బాపములు మిగిలి యున్నవన్నమాట;

అనగా మనము చేసిన దైవారాధనము చాలదని స్పష్టము. ఇంతకాలమునుండి భగవంతుని ధ్యానించుచుంటిమి, యింకను పాపములు మిగిలిన వాయని తలపరాదు: సంపూర్ణ పాప క్షయము చేయు నంతటి పరమేశ్వర సేవ చేసితిమని సాక్ష్యము, సకల బాధలు నశించి, సర్వ శుభములు లభించుటయే.

715. అన్ని బాధలు పోయినను, భగవత్కృప కలిగి అన్ని శుభములు చేకూరినను, భగవద్ధ్యానము మానరాదు. భవిష్యత్తులో బాధలు రాకుండఁగను, కలిగిన భగవత్కృప ఇతోధికముగా (బెంపొందుటకును, అన్ని శుభముల కంటె శ్రేష్ఠమైన మోక్షము సిద్ధించుటకును భగవంతుని సేవించుచునే యుండవలెను. అనగా భక్తుఁడు భగవంతు నారాధింపకుండ క్షణ కాలమైన జీవించుట దుర్భరమై తోచు నుత్తమ స్థాయికి (జేరవలెను.

716. దేవుని విశ్వపరిపాలనలో నన్నియు క్రమపద్ధతి ననుసరించి జరుగుచున్నవి. సూర్యచంద్రాదు లుదయించుట, అస్తమించుట, నక్షత్రగమనము, సాగరములు మేర మీరకుండుట మున్నగునవి. కాని కొన్ని అపక్రమములుగా గోచరించునవి కనప్పట్టుచున్నవి. భూకంపములు, పెనుగాలులు, మహాజాడ్యములు, ఘోరయుద్ధములు అకాలమృత్యువులు, మున్నగునవి. కాని దేవుఁడపక్రమములకు (గర్త యగునా? అయిన నెట్లు జరుగుచున్నవి? మన దృష్టి వేరు; దేవుని దృష్టి వేరు. దేవుని దృష్టి మనకు (గలిగినపు డేయపక్రమము గోచరింపదు.

717. మానవ ప్రేమలన్నియు స్వార్థకలుషితములు. భార్యాభర్తలు, తల్లిదండ్రులు వారిసంతతి, బంధుమిత్రాదులు వీరి పరస్పర ప్రేమలో స్వార్థమల్పాధిక భేదములు కలిగి యుండును. మన మందరమున్న దానికంటె ప్రేమనధికముగా, స్వార్థము నిమిత్తము నటింతుము. స్వచ్ఛ ప్రేమగల వారి సంఖ్య అత్యల్పము. మనకీ యభ్యాసము, దేవుని ప్రేమించు టలోఁ గూడ జూపుదుము. మనము దేవుని యెడ గూడలేని ప్రేమ నటింతుము. దాని వలన దేవునికి నష్టము లేదు గాని, మనము దుర్గతి పాలగుదుము.

718. విడ్డూరములనగా, మన మూహింపని విధ ముగాఁ గొన్ని తటస్థించుట. సన్నిహిత మిత్రులు ద్రోహము చేయుట; అత్యంతాప్తులు వ్యతిరేకముగా బ్రవర్తించుట, యోగ్యుఁడయోగ్య కార్యములు చేయుట; మన మను కొనిన వానికి వ్యతిరేకముగా ననేకము సంభవించుట మున్నగు నవి. అట్టి వేళల మన చిత్తములు వికలతనందును. కాని యీ లోక స్వభావ మట్టిదని యెరిగి, విడ్డూరములను సహజము లుగా జూచు సమదృష్టి నలవరచుకొని చిత్తశాంతిని నిలుపు కొనవలెను.

719. మనశ్శాంతిని చెడఁగొట్టు సర్వతాటస్థ్యము లను తృణప్రాయముగాఁ జూచి, వానిని దూరముగా నెట్టివేసి, శాంతి నిచ్చువానినే స్వీకరింపవలెను. ఇదియే సుఖజీవిత మార్గము. దేవుని స్మరించు టొక్కటే శాంతి లాభము నిచ్చు

కర్మ. తద్విరుద్ధముల నన్నిటిని మానసికముగా దిరస్కరింపుము.

720. ఏది యెట్లెప్పుడు ఏవిధముగా జరిగిన నీకేమి? అన్నిటిని జరిగించు భగవానుఁడే చూచికొనును. ఈశ్వరు డన్నియుఁ జేయుచున్నాఁడని గుర్తించి, యీశ్వరుని భజించుటే నీ కర్తవ్యము. గణనాతీత బ్రహ్మాండములను, అనంత కోటి జీవరాశులను సృజించి, నడపుచున్న భగవానుఁడెందుల కేది యేరీతి చేయుచున్నాఁడో గ్రహించు శక్తి మనకు లేదు. నీకు కర్తృత్వమే లేనపుడు, విషాద మెందుకు? భగవత్సంకీర్తనము చేయుచు బ్రహ్మానంద మనుభవించుటే నీపని.

721. ఆశ్రయించిన వారిని భగవానుఁడు, నిస్సంశయముగా సకల విపత్తుల నుండి రక్షించునని ప్రతి పౌరాణికుఁడు వక్కాణించును. అందరు వినుచునే యున్నారు, అది మామూలు మాటయై పోయినది. అందుచే దాని భావమును పూర్తిగా గ్రహించుటకుఁ బూనుకొనువా, రరుదు. అయినచోఁ జేయవలసిన పనియేమి? దేవునాశ్రయించు పనిచేసి, సకల వేళలనెట్లు రక్షించెనో చూచికొని యా పౌరాణిక సత్యము ననుభవ సిద్ధిలోనికిఁ దెచ్చికొనవలెను.

722. భగవంతు నాశ్రయించి, భజించినచో, సకల వేళల భక్తునెట్లాతఁడు రక్షించునో, చూచి ప్రత్యక్షముగాఁ దెలిసి కొనుటే భక్తిసాధన—కాని నిజముగా నాలోచించినచో నేసాధనయు నవసరము లేదు. ఏలన, భక్తులనే గాక, సకల ప్రాణులను, లోకములను భగవానుఁడు రక్షించుచునే

యున్నాఁడు. ఒకక్షణ మా భగవానుని రక్షణము లోపించి నచో, మనస్థితి, లోకస్థితి, దుర్భర దుస్థితిగా మారును. భక్తుఁడు దీనిని గుర్తింపవలెను; ఇతరులు గుర్తింపలేరు.

723. నీవు నీమనస్సును, బుద్ధిని, సర్వమును దేవుని పై నుంచుము; అనగా దేవుని కర్పింపుము; నీవు నిజముగా పూర్తిగా నర్పించినపుడు నీవు దేవునితో నేకమగుదువు. నీకు దేవునితో అనన్యత సిద్ధించును. అప్పుడు చరాచరాత్మక ప్రకృతి యంతము దేవుని జూచి నటులే నిన్నును జూచును; సేవించును. భక్తునికి, జ్ఞానికిని దేవుఁడే సేవకుఁడగుచుండగా, ప్రకృతి యేలకాదు?

724. దేవుని భజించు, అన్నివేళల భజించు; సంశయము లేకుండ భజించు; చిత్తశుద్ధితో భజించు; యావజ్జీవము భజించు, భజన చాలునని యెన్నడు తలపకుము; నీ భజన ప్రార్థన, జప తపాదికము లెక్కలోనిది కాదని యెరిగి, వినయముతో భజించు; సర్వములో వ్యాపించి భగవంతుఁడున్నాడని గుర్తించి, రాగద్వేషములు విడిచి భజించు నీ సర్వావసరములను దేవుఁడెరుగును,జూచును, రక్షించుననినమ్మిభజించు; లోక వ్యవహారము లన్నియు దేవుని లీలలని యెరిగి, మానముతో, శ్రద్ధతో, సంతోషముతో భజించు, అట్లు చేసినచో నీవు తరింతువని వేరుగా చెప్పవలెనా?

725. దేహము, మనస్సు, ఇంద్రియములు, బుద్ధి, అహంకారము – అన్నియు దేవుని సంకల్ప ప్రభావముచే

గఁబని చేయుచున్నవని, నిస్సంశయముగా నెఱుగుము. చేతనా చేతనము లన్నియు నిమిత్త మాత్రములనగా, దేవుని ఆట బొమ్మలని యెరుగుము. నీ విట్లు గుర్తించి, దేవుని భజించినచో, నీ వేమియుఁ గోర కుండగనే, సర్వ విషయములలో నిన్ను వేయి కనులతోఁ జూచి, రక్షించి, దేవుఁడు నీకు ముక్తినిచ్చి తనలోనికి ఁదీసి కొనునని నమ్ముము.

726. అర్ధరాత్రిమున మనము నిద్రించు చుండగా, నింటనేదైన ఁబెద్దచప్పుడైనచో, మనము లేచి, నలువైపుల ఁబరికించి, చప్పుడు కారణము తెలిసికొని కాని నిద్రింపము. అదే విధముగా మన మజ్ఞానమను గాఢనిద్రలో నున్నాము. అనేక విషయములు మన మనస్సులకు ఁజికాకు గలిగించి, దుఃఖ కారణములై రణగుణధ్వనులు చేయుచున్నవి. మనము మేల్కొని, దుఃఖజనక ధ్వని కారణముల నరసి, తొలగించు కొని శాంతి నందఁజాలమా?

727. మనో నిగ్రహమను మాట అర్థరహితము. మనస్సునకు ఁజాపల్యమే లక్షణము. దానికి నిగ్రహమును దేనితో సాధించుట? ఆత్మశక్తిచే మనో నిగ్రహము చేయ వలెనా?అవసరము లేదు. నేనాత్మను చలించు మనస్సునుగానని యెరిగినంతనే మనస్సే అదృశ్యమగును, అనగా ఆత్మలోఁ గలిసి పోవును. మనో నిగ్రహ సమస్యయే లేదు.

728. 'నేను' అనగా ఆత్మయే. దానికి జన్మ జరా మరణాదికములు లేవు, 'నేను' సత్యజ్ఞానానందము. మాయచే

నజ్ఞానము జనించి, దేహమనోబుద్ధీంద్రియాదులు తామే, నేనను భ్రాంతిని గలిగించుచున్నవి. భ్రాంతి భ్రాంతియని తెలిసికొని, సర్వసంపూర్ణ పరమాత్మ చైతన్యమును 'నేనే', యని గుర్తించుటే జ్ఞానము. అదియే బ్రహ్మజ్ఞానము; అది తెలియువరకు, నెన్ని జపములు, పూజలు, ఉపవాసములు, చేసినను, ఫలితము తక్కువ.

729. దేవుని సంపూర్ణ మహిమ నెరుగవలెనన్నచో నీవు దేవుఁడంతటి వాఁడవు కావలెను. నీ వల్పుఁడవైనచో నాద్యంతరహితుఁడైన అఖండ ప్రజ్ఞామూర్తియగు భగవంతు నెట్లెరుగ సాధ్యపడును? కానికొందరు మహర్షులు, యోగులు, జ్ఞానులు దేవుని మహిమనెరిగిరి. వారును దేవునితో సమానులే. దేవుఁడగుట కొందరికి సాధ్యము, కొందరకసాధ్యము నగునా? నిజముగా నందరలో "అల్పుడను నేను" అను పదార్థము దేవుఁడే. భ్రాంతివలన 'నేను అల్పుఁడ ననుభావము కలుగుచున్నది. భ్రాంతి తొలగినచో 'నీవు' 'నేను' అందరు దేవుఁడే. అజ్ఞానము నశించినచో భ్రాంతి నశించును. నేనే దేవుఁడనని తెలిసికొనుటే దానికి మార్గము. అదియే బ్రహ్మ జ్ఞానము.

730. పుట్టుటయే ఒక పెద్ద సమస్య. పుట్టినదిమొదలుగాఁబెరిగి గిట్టువరకు వివిధావస్థలలో కోటి కడగండ్ల నెదుర్కొను దుఃఖానుభవము తప్పదు. అందువలన దేహధారిత్వమే అనర్థము. అనర్థము సుఖమిచ్చునా? పుట్టుక లేని

స్థితి అనగా జన్మరాహిత్యమనగా మన స్వస్వరూపమైన పరమాత్మతత్త్వము నెరిగి, సాధించి, సుఖించు టే మార్గము. పుట్టి, గిట్టుచు, మారంత దుఃఖములలోఁబడి కొట్టుకొనుచు – మరల మరల ఁబుట్టుటకు గిట్టుటకు సిద్ధపడు టేకాని, దీనిని దొలగించుకొనుట నేర్వని వానిది తెలివని చెప్పవచ్చునా?

731. కదలుచు ఁగదలుటలేదను భ్రాంతి సర్వప్రాణికోటి నావహించి, జన్మజరామృత్యు పాశములచే బంధించి, యేడ్పించుచున్నది. ప్రతి గడియారపుగంట చేయుధ్వని కర్థమేమి? ఎన్నడైన నూహించితివా? "నీ ఆయుర్దాయములో నొకగంట తరిగినది. మేలుకో! ముందు కర్తవ్యముచూచికో" యని పిలుపుకాదా? గడియారమే ఉపనిషత్తు. "ఉత్తిష్ఠత! జాగ్రత, ప్రాప్య..." పసిబిడ్డ తెలిసికొనఁగల యీచిన్ని విషయ మెవరాలోచింపరే!

732. దేవుఁడు సర్వవ్యాపి యనగా, సర్వజీవులలోనే కాక సకల జడపదార్థములలో, సమస్త రేణువులలో నున్నాఁడనియే అర్థము. అచేతనములు, జడములుగా ఁగన్పట్టు, ఱాయి, యిసుక, మట్టి, బట్ట, తలుపు, కఱ్ఱ మున్నగునవన్నియు నీశ్వరచోదితములై వర్తించి, మనకనుకూల ప్రతికూలతలను జూపును. రామకార్యమునకై ఱాయి సముద్ర జలముపై ఁదేలెను. ప్రహ్లాదునికి స్తంభము దేవునిఁజూపెను. మహాభక్తులకు విషమమృతమైనది. అగ్ని హనుమంతుని, సీతాసాధ్విని కాల్పలేదు. మనము దైవదృష్టితోఁజూచిన జడపదార్థము లీశ్వరుని జూపును.

733. దేశాధిపతి దర్శన సాన్నిధ్య మైత్రుల నందరు కోరుదురు. అందరకది సాధ్యపడదు. ఒకవేళ వ్యయ ప్రయాసల కోర్చి, సంపాదించినను; తాత్కాలిక లాభములే కాని స్థిరమైన ప్రయోజనముండదు. అట్లుగాక, లోకాధిపతి దర్శన సాన్నిధ్య మైత్రులు లభించినచో నెట్లుండును. అదృష్టవశమున వ్యయప్రయాసలతో నిమిత్తము లేకుండ లోకాధిపతిని సర్వత్ర, సర్వవేళల, నందరు దర్శింపవచ్చును, సాన్నిధ్యమా? భగవానుఁడందర కత్యంత సమీపమున నున్నాఁడు, మైత్రియా? ఆశ్రిత మందారుఁడు; ప్రయోజనమా? శాశ్వత బ్రహ్మానందదాత. నీకే పతి సాన్నిధ్యము మంచిదో చూచి కొమ్మ!

734. లోకములో నత్యధిక సంఖ్యాకులు, తమకుఁ జావు రాలేదు కనుక బ్రదుకుచున్నారు. వారి బ్రతుకు చావుతో సమమైనదే! ఎందుకు బ్రతుకవలెనో, ఏ రీతిగా బ్రతుకవలెనో తెలిసి బ్రతుకువాఁడు బ్రతుకువాఁడు. అసలు బ్రతుకనగానేమి? ఉత్తమ గ్రంథములు, పెద్దలు జీవితమును గూర్చి యేమి చెప్పిరి? చావు దుఃఖము, అశాంతి లేని జీవనముండునా? దానినెట్లు సంపాదింపవలెను? ఎంతకృషి, ఎంత కాలము చేయవలెను? సునిశితముగా వీనిని దెలిసికొని,భూమిపైఁదన మనుగడను సాగించు మానవుఁడే మహనీయుఁడు. వాని వలన లోకము పావనమగును. ఇతరులు భూభారము.

735. మనుజునిలో సత్వరజ స్తమోగుణములు. మనుష్యత్వ, పశుత్వ పైశాచికత్వ రూపములలోఁ గలిసి

యున్నవి. పశుత్వ పైశాచికత్వముల (దొలగించి, మనుష్య త్వమును శుద్ధమొనర్చినచో సత్వగుణ ప్రధానిమై 'మానవుడు పరిశుద్ధ మానవ ధర్మమును ప్రదర్శించును. ఇదియే సాధింప దగిన గొప్ప ఆదర్శ మని కొందరు చెప్పుచున్నారు. (Humanism), మానవులలో దైవత్వము కూడ నున్నది. మానవత్వావధులను గూడ దాటి దైవత్వము నావిష్కరించు కొనుటే పరమ గమ్యమని ఉపనిషత్తులు ఘోషించుచున్నవి. ఇవి భిన్న సోపానములు, ఒకమెట్టెక్కి ఇదియే తుది మెట్టను వారే మానవతా ధర్మోప దేశికులు. పై మెట్టు వారు చూడలేదు. చూడనిదే లేదనుట వివేకమా? మధ్యమం దాగి, యాత్ర ముగింపక, తుది మెట్టెక్కి దైవత్వ మార్జించుటే మానవ పరమావధి.

736. ప్రకృతి యనగా భగవంతుడే. ప్రకృతి భగవానుని బాహ్యరూపము. సత్వరజ స్తమోగుణములచే నిర్మితమై ప్రకృతి జీవుల నజ్ఞానములో నాడించును. ప్రకృతి వ్యతిరేకముగా నున్నదనగా దేవుడే వ్యతిరేకమని అర్థము. దైవారాధకులకు ప్రకృతి అనుకూలమై వర్తించును. అతివృష్టి, అనావృష్టి, భూకంపాదులు దేవు నుగ్రరూపములు, దుష్టశిక్షణకై ప్రదర్శింపబడును.

737. వేదములు, శాస్త్రములు, మీమాంసలు, పురాణములు – ఎన్నో గ్రంథములున్నవి. అవి కాలహారణము మతిభ్రమణము కలుగజేయును. తరించుటకొకటి రెండుపదే

శములనెరిగి, వానిననుసరించి జీవించుట చాలును. "ఏమిచేసి నను దేవుని కర్పింపుము లేదా నేను కర్తనుగాను, దేవుఁడే సర్వకర్తయని నమ్ముము. ఇఁకనే గొడవ పెట్టుకొనకుము; నీకు ముక్తి కరతలామలక మగును.

738. అనంతాకాశమును గొలుచుట, మహాసాగ రములలోని జలబిందువుల లెక్కించుట, సాధ్యముకానిపనులు. అట్టిదే భగవాను ననంతమహిమనెరుగుటకు యత్నించుటయు, అట్టి వ్యర్థప్రయత్నములు మాని, దేవుని భజించి, తరింపుము.

739. ఆత్మజ్ఞాన కాంక్షగల వ్యక్తి మహాపురుషుఁడే. అది అత్యంత కష్టసాధ్యమైన కాంక్ష. ఫలించినచో, అవ్యయానందము నిచ్చునది. బాహ్యదృష్టితోఁగాక సూక్ష్మమైన ఆత్మదృష్టి కావలెను. అట్టి సూక్ష్మదృష్టితో నేది పరిశీలించి నను, పరమాత్మప్రత్యక్షమగును. అంతయు దేవునితోనిండి యున్నదని గోచరించును. స్థూల దృష్టికి లోకము; సూక్ష్మ దృష్టికి దేవుఁడు గోచరించును.

740. దేవుని అనంతమహిమ వాక్కునకు, మనస్సునకు అందనిదని ఉపనిషత్తులు ఘోషించినవి. ప్రకృతి శాస్త్ర వేత్తల ప్రయత్నములు చంటిబిడ్డల ఆటలవంటివి. వారా ప్రయత్నము విడిచి, తపోధ్యానాదులచే, ఆంతరంగి కాత్మ దృష్టిని పెంపొందించుకొని, ప్రాచీన మహర్షులవలె ధన్యులగుట తప్ప గత్యంతరము లేదు.

741. దేవుఁడుండగా దైన్యము; ఈశ్వరుఁడుండగా నేడుపు; భగవంతుఁడుండగా భయము; పరమేశ్వరుఁడుండగాఁ బరితాపము – ఎందుకుండవలెను? అన్ని అశుభములు తొలగించుటకు – అన్ని శుభములు ప్రసాదించుటకు – వ్రతబద్ధుఁడై సర్వసమర్థుఁడై, సర్వత్రనిలిచి, ఆహ్వానించుచుండగా దైన్యము, ఏడుపు, భయము, దుఃఖము నేల పొందవలెను? నిన్ను దేవుఁడంతగా శ్రమకలుగున దేమైననిమ్మని అడిగెనా? "నన్నెప్పుడు మరువకుండ స్మరింపుఁడు; మీ బాధ్యతనాది" యని చెప్పినాఁడు. ఈ చిన్నపనిచేసి సుఖింపరాదా?

742. చంద్రుఁడు దైవభక్తుఁడు; ఈశ్వరశాసనము ననుసరించి వర్తించుచున్నాఁడు. అప్పుడప్పుడొకఁడు, గ్రహణమునకులోనై, తేజస్సునుగోల్పోవును. భక్తుని జీవితమటులే, అప్పుడప్పుడు దుర్దశాగ్రస్త మగును – చంద్రునివలెనే, మరల దివ్యతేజస్సుతోఁ బ్రకాశించును. దేవుని మరువకుండు భక్తియే దీనిలోని రహస్యము. దైవభక్తునికెన్నఁడు నాశనము లేదు. "నమేభక్తః ప్రణశ్యతి" యని గీతావాక్యము.

743. బంధము దేనితోఁ బెట్టికొన్నను, మనము దానిని విడువఁగోరినను, అది మనల విడువదు. కాంతాబంధము, ధన, గృహ, భూవస్తువాహనాదిక బంధములు, వీనియన్నిటి కంటెను దృఢతరమైనది కీర్తికాంక్షాబంధము. ప్రతిదినము, "నీవు గొప్పవాడవు, పూజ్యుఁడవు" అని స్తుతించి, పూమాలలు వేసి, సన్మానములు చేయుచుండుటను కోరును. దీనికిఁబరిమితి

లేదు. అన్నియు నెరిగిన పండితుల నీ కీ ర్తికాంక్ష గట్టిగా బంధించి, సకల దుఃఖములు నిచ్చును, సకల బంధములు త్రెంపివేయు శౌర్యము గలవాఁడే జ్ఞాని.

744. అజ్ఞాని లక్షణము లనేక రీతులలో నుండును. ఆతఁ డేవిషయమును గూర్చియు సత్యము నెరుగఁడు. తా నెరుగనని యెరుగఁడు. అట్లుంటిమా, ఆతఁడు దురహంకారమును, క్రోధ మాత్సర్యములను మనపైఁ జూపును. అజ్ఞానముతో దుర్గుణము లన్నియుఁ గలిసి యుండును. అట్టివానితో సంపర్కము పాపఫలితము, వారి మూర్ఖత జూచి యూరకుండ లేము; ప్రసంగించుట నిష్ప్రయోజనమే కాక ప్రమాదహేతువు నగును.

745. ఎవరితో మాటాడవలెను? ఎవరి సాన్నిధ్యము సాంగత్యము సుఖమిచ్చును? మాటాడ వలసిన వారీ లోకములో నెవరును లేరు. మనకుఁ దెలియకుండ నేకొలది మందియో సిద్ధపురుషు లుండవచ్చును. మిగిలిన వారందరు స్వార్థపరులు, కామలంపటులు, అసూయాగ్రస్తులు. వారి సాంగత్యము దుర్గతి కీడ్చును. ప్రసంగ, సాంగత్య, సాన్నిధ్యముల వలన, శాంతి సౌఖ్యముల ననంతముగాఁ బ్రసాదింప దక్షుఁడొకఁడే యున్నాఁడు. ఆయనతో నీ సంగతులన్నియు చెప్పికొని, ఆయన సాన్నిధ్య సాంగత్యము లూహించికొని, సర్వదా సుఖించుటకు యత్నింపుము.

746. నిష్కామ దైవారాధన మనగా, సకామ దైవారాధనమే. కామశబ్దము లోకములో దూష్యమగుటచే, నిష్కా

ముగా నీశ్వరుని సేవింపవలెనని చెప్పిరి. నిష్కామ మనగా స్థిరవస్తు కామము; కామమనగా అస్థిరవస్తుకాంక్ష. స్థిరవస్తువు మోక్షము. మోక్షమనగా శాశ్వతా నందశాంతి పరిపూర్ణత. వానిని గోరకుండినచో దేవునారాధించుటలో నుద్దేశముండదు, కోరినను, కోరకున్నను, సర్వప్రాణులకు వానిని భగవానుడను గ్రహించును. అప్పుడు కామ నిష్కామములు సమానము లగును. అస్థిర వస్తు కామత్యాగమే నిష్కామమని యర్థము.

747. కర్మసిద్ధాంత మెంతవరకు సముచితమైనది? కర్త యీశ్వరుడే, నేను నిమిత్త మాత్రుడనని కాని, చేయు సకల కర్మ లీశ్వరార్పణముగా జేయుటకాని, జరుగు చున్నంత కాలము కర్మసిద్ధాంత మమలు జరుగుచుండును. నేను కర్తను కాని, నిరహంకారియైన వాని నేకర్మలును బంధింపవు. అసలుకే 'నేన' నువస్తువే పరమాత్మ యనికాని, అంతయు భగవానుడే. 'నేను, లేనని తలచు జ్ఞానికి గర్మబంధము లేదు.

748. దేవుడే సకల ప్రాణికోటి రూపములు ధరించి నాడు. అది దేవుని వినోదము. ఇక కర్త దేవుడే కాక మరె వరున్నారు? దేవుడు ధరించిన రూపములు 'మావి' 'మీవి' యని ప్రాణులు భ్రాంతివశులై తలచుచున్నారు. ప్రాణులతో బాటు, భ్రాంతియు దేవుని రూపమే. దేవుడు కల్పించిన భ్రాంతిని దేవుడే తప్ప నెవరును తీసివేయజాలరు. జ్ఞాని యనగా దొలగిన మాయగల దేవుడే, ప్రాణులనగా కప్పబడిన మాయగల దేవుడే!

749. ప్రపంచమంతయు నేనాడుకొనుచున్న ఆట యని తెలిసికొనుదాక, లోకము నిన్నేడ్పించును. అందుచే సర్వము నాలీల యని గ్రహించినచో నీకు, నాయింటనున్న నీకు శ్రమ, క్లేశము లేకుండఁజేసెదను" అని భగవాను నుపదేశము, ఎందుకీ లీల? ప్రాణులు సకల దుఃఖము లనుభవించుటలో దేవునికి వినోదమెట్లు కలుగును? మున్నగు ప్రశ్నలకు ఁదావులేదు. ఏలన భగవానుఁడర్థమైనఁగాని ఆయన లీల, దానికిఁగారణము నర్థముకావు. అంతవరకు ప్రశ్నలుమాని దేవుని భజించుటే పని.

750. చంటిబిడ్డ తల్లియొడిలోనుండి ఆకలికి తల్లి స్తనమునే వెదకికొనును. బొత్తుగా చంటిబిడ్డకు వెదకి కొనుటయు ఁదెలియదు. తల్లిచే స్తనమును బిడ్డనోటఁబెట్టి పాలిచ్చును. మనమును దేవుఁడను అమ్మఒడిలో ఁబరుండియున్న చంటిబిడ్డలము, సకల ప్రాణులు దేవుని బిడ్డలే, అందరు తల్లి స్తన్యామృత సౌఖ్యమునకై తడవులాడుచున్నారు. అత్యధిక సంఖ్యాకులు బొత్తిగాఁజంటిబిడ్డలు. తల్లి స్తనమెచటనున్నదో యెరుగనివారు, లేనిచోట వెదకి నోటికి పాలురానందున నేడ్చుచున్నారు. జగన్మాత అందరకు స్తనమిచ్చి పోషించి పెంచును. కాలభేదముండును. ఇదియే ఆమెలీల. గట్టిగా నేడ్చినవారికి వెంటనేము క్తియను క్షీరమిచ్చి తరింపఁజేయును.

751. 'వెదకుట' యను పని సకల ప్రాణులు చేయుచున్నవి. దేనిని వెదకుట? ఎచ్చట వెదకుట? ఎంతసేపు

వెదకుట యను మూడు ప్రశ్నలు, లేని వస్తువును వెదకుట నిప్రయోజనము; ఉన్న వస్తువున్నదని తెలిసి దానికై వెదకుట తప్పుకాదు. వెదకు వస్తువును జేబులో నుంచికొన్ని, ఊరంతము వెదకినను దొరకదు. మనకు సుఖముకావలెను. సుఖమనగా దేవుఁడు. దేవుఁడను వస్తువున్న చోటఁదెలిసి వెదుకవలెను. దేవుఁడు సర్వవ్యాపియగుటచే ఆయన లేని చోటులేదు. అగుచో నేల కనపడఁడు? జ్ఞాననేత్రముతో ఁజూచినచో దేవుఁడంతట గోచరించును. వెదకు టవసరము లేదు. జ్ఞానమిమ్మని దేవునర్థించుటే తపస్సు.

752. అద్దములో మనముఖము స్వచ్ఛముగా ఁగని పింపక పోవుటకుఁగారణము, అద్దముపైఁజేరిన మాలిన్యమే. మాలిన్యము దట్టమైనచో ముఖమే కనపడదు. మాలిన్యమును పూర్తిగాఁదుడిచివేయుటే చేయవలసినపని. అటులే, అంతట నిండియున్న పరమేశ్వరుఁడు మన మనస్సను నద్దములో ఁబ్రతిబింబించుటలేదు. కారణము అనేక జన్మములందలి మాలిన్యము మనస్సులో గడ్డకట్టియున్నది, దానిని దైవసంకీర్తనము, ధ్యానము, అను నీరుపోసి కడిగవేయవలెను. కడుగుచున్నాము గాని యింకను కనపడుటలేదన్నచో గడుగుట చాలదని చెప్పవలెనా?

753. పలురంగులు, రూపములు, పరిమళములుగల పువ్వులు కుప్పలుగాఁజూచి, నేత్రోత్సవ మొనర్చును. కొన్ని గంటలలో నన్నియువాడి, యెండిపోవును. తెల్లవారుసరికి

నవ్యకాంతులతో వికసింపఁజేసి, కొలది గంటలలో వాడి నశించునటులుచేయు నీశ్వర సంకల్పములోని భావమేమో? అటులే, భిన్నసౌందర్యములతో (జిత్తముల నాకర్షించు మానవ రూపములను సృజించి కొలది కాలములో వానిని మట్టిలోఁ గలిపివేయు దేవుని చేత కర్థమేమి? అదియే దేవుఁడే చెప్పినఁగాని తెలియని దేవుని దివ్యలీల!

754. భగవంతునియెడ మనకెట్టి భావముండవలెను? దేవుని శక్తిసామర్థ్యములకుఁదగిన గౌరవము మనకుండవలెను. లోకములో విద్వాంసులను, వీరులను, ధనికులను, పరిపాల నాధికారులను మనమెంతయో గౌరవింతుము. అన్ని కల్యాణ గుణములు పరిపూర్ణముగాఁగల భగవానుని మనమెంత గౌర వింపవలెను? అంత గౌరవము చూపఁగలశక్తి మనకులేదు. కాని, పరిశుద్ధ చిత్తముతో, మన శక్తికి లోపములేని భక్తి గౌరవములను దేవునియెడ (జూపవలెను. భక్తులీ విషయము గుర్తులో నుంచికొనవలెను.

755. నీకేమి కావలసినను, నీవాశ్రయించిన దేవు (డుండగా, మరెవ్వరినైన నడుగుట యుక్తమా? ఒకవిధముగా యుక్తమే; మరొక విధముగా నయుక్తము. నీచే దేవుఁడే మెవరినైన నడిగించినచో నీ బాధ్యతలేదు. కాని నీవడిగి, దేవుఁడే అడిగించెననుట పొసగునా? ఇది కష్టసమస్యకాదు. దేవునితప్ప మరెవ్వరి నడుగనని ప్రమాణముచేసికొని జీవిం పుము. నీ వితరుల నడుగక తప్పనిసరియగు పరిస్థితు లెట్లుండ

వలెనో అట్లుతటస్థించినచో, నీచే నితరులను దేవుఁడే అడిగించి నాఁడనుటకు, నిస్సంశయ సాక్ష్యములు నీకులభించును. ఆ సాక్ష్యములు నిర్దుష్టములైనచో నవియు దేవునే చూపును.

756. భగవంతుఁడు చేయుపనులను దెలిసికొనుటకు ప్రయత్నమవసరమా? ఏప్రయత్నము నవసరము లేదు. దేవుఁడేక కర్తయగుటచే జగతిలో జరుగు సకల క్రియాకలాపములు దేవుని పనులే! ఇంకొక కర్తయే లేఁడు కదా! సర్వప్రాణులు భగవంతుని కుపకరణములు. అందుచే లోకమందలి పనులన్నియు – నొక్కటియు విడువకుండ – దేవుని పనులే! ఇంకవానిని దెలిసికొనుటకు యత్నమెందుకు ?

757. భగవంతునిలీల యెట్లుండును? భగవంతుని లీలలు, ఆడిలీలకాదు నిజముగా జరుగుచున్నదను భావమును గలిగించు శక్తిగలదై యుండును. నాటకపాత్రలు, చారిత్రక పురుషులేయనియు, రజ్జువు సర్పమేయనియు, గోచరించునటులే జగత్తు దేవుని గారడీ. అనగా నిజముకాదు. నిస్సంశయముగా నిజమేయని నమ్ముటకు వలయు ఋజువులన్నియు నుండును. భగవదనుగ్రహమువలన మాత్రమే సత్యము. సత్యముగా గోచరించును. అందుచే భగవదారాధన మేకైకశరణ్యము.

758. సంతోషింపవలెనా? విచారింపవలెనా? రెండును దోషమే. ఏలన నవి విడదీయుటకు వీలులేకుండ గలసి యున్నవి. సునిశితముగాఁబరిశీలించువారికి, సంతోషములో విచారము, విచారములో సంతోషము గోచరించును. సుఖ

దుఃఖములోనే అజ్ఞానావస్థలోని గతి భేదములు, వీని నతిక్రమించినపుడు దుఃఖ సంబంధములేని యానంద మను భూత మగును. ఆనందము పరమాత్మ లక్షణము. పరమాత్మనెరిగి కాని, పరమేశ్వర కృపనందికాని, ఆనంద మందవచ్చును.

759. చిన్న చిన్న జబ్బులనగా, తలనొప్పి, కడుపుబ్బరము, వాంతి, విరేచనము మున్నగు వానికి చిన్నమందేది వేసినను గుణమిచ్చును. పెద్ద పెద్ద రోగములనగా క్షయ, గుండెజబ్బు, రక్తహీనత, మున్నగు వానికి శరీర భాగములన్నిటిని క్షాళన మొనర్చి శుద్ధిచేయు పెద్దమందులు దీర్ఘకాలము వాడవలెను. సంసారమను జబ్బు దీర్ఘకాలికమైన పెద్దజబ్బు, దానధర్మములు,తీర్థయాత్రలు,వ్రతములు,పూజలు మున్నగు చికిత్సలు చాలవు. బ్రహ్మచర్యము, సత్యనిష, నిరంతర జపతపములు, ధ్యాననిష్ఠ మున్నగు నుగ్రములగు ప్రక్రియలవసరము. అవి జాడ్యము నిర్మూలమై ముక్తిలభించు వరకు వాడవలెను,

760 నిర్గుణ సగుణోపాసన లనగా సులభముగా దెలుపవచ్చును. $2 \times 2 = 4$, $2 \times 3 = 6$, $2 \times 4 = 8$ ఎక్కాలు పుస్తకములు చూచి, బాలురు కరస్థముచేసి తెలిసికొనునది సగుణోపాసన, రెంటను రెండు, మూడు, నాలుగులచే గుణించినచో 4, 6, 8, యెట్లువచ్చునో వాని విలువ చర్చించి దెలిసికొనుట నిర్గుణోపాసన. ఫలితమొకటే; నిర్గుణోపాసన జ్ఞానసిద్ధి, సగుణారాధన భక్తిసిద్ధి యనిచెప్పవచ్చును. మొదట భక్తి

తరువాత జ్ఞానము - సగుణము మొదట - నిర్గుణము తరువాత సులభముగా లభించును. భక్తితో భగవంతునినమ్మి ఆరాధించినచో, సాక్షాత్కార సిద్ధినిచ్చి, భగవానుడే నిర్గుణరూపమును దెలుపును.

751. చిత్తశుద్ధి కావలెనందురు? అనగానేమి? చిత్తమన్నదొకటి యున్నప్పుడు కదా దానికిశుద్ధి! శుద్ధియనగా పూర్ణపావనత్వము - సమగ్ర నిష్కలంకత్వము. అది ఆత్మ లక్షణము. అజ్ఞాన వశమున, జీవి, తానాత్మయని యెరుగక, కోర్కెలకు వశమై నామనస్సు, దేహము, చిత్తమునని చెప్పికొనును, అది దుఃఖహేతువగును. ఆత్మలక్షణమే జ్ఞానము, అదియే పరిపూర్ణముగా శుద్ధము; అజ్ఞానము భ్రాంతిజాతము; దేహము, చిత్తము మున్నగున వందులోనివే. ఆత్మనెరుగుటే శుద్ధి; ఎరుగమియే కాలుష్యము.

762. ఉన్నది సర్వము పరబ్రహ్మపదార్థమే. జరుగుచున్న దంతయు నా బ్రహ్మవిలాసమే యనిగ్రహించి, ఆనందించుటే చిత్తసిద్ధి, తపస్సిద్ధి జ్ఞానసిద్ధి, యని చెప్పనగును. ఇది యెవరు తెలిసి కొనగలరు? తెలిసి కొనినవారే! ఎట్లుసాధించుట? సాధింప బడినరీతినే, ఎప్పుడు లభించును? లభించినప్పుడే! యత్నము వలదా? అప్రయత్నముగా లభించిన వారికి యత్న మెందుకు? యత్నము జరుగు వారికి మానుటెట్లు?

763. మానసికాందోళనమునకు గారణము దేవునిపై నమ్మకము కుదరకుండుటే,నీవు దేవుని నమ్మిన సాక్ష్యము,

మానసికముగా నిశ్చంచల శాంతి కలుగుటే; నిత్యానంద చిద్విలాసములు విరజిమ్ముచుండుటే. దేవుని నీవు పూర్తిగా నమ్మినప్పుడు దేవుడే నీ వగుటో, నీ యోగక్షేమములన్నియు నీ పనులన్నియు దేవుడే చూచుటయో జరుగును, అప్పుడు కలతకు దావేది? నిజమైన విశ్వాసమే అఖండశాంతి, నిత్యానందము, అదేమోక్షము.

764. చిన్నదికాని, పెద్దదికాని యే సమస్యవచ్చి, పైబడినను నీ మనస్సు కటకట లాడుట సహజము. ఆ క్షణమందే, నీవొక మంత్రము జపించినచో మనశ్శాంతి సుస్థిరమై అమే యానందము నిచ్చును. "ఇది నాన్నగారికి దెలియును," మంత్రము. నాన్నగారు 'నేన' ను బిడ్డకు చికాకు కలుగ నిచ్చునా? అందు విశేషము, ఎంత ఉత్తముడైన నాన్నగారు! సాక్షాత్తు బ్రహ్మాండాధి పతియైన దేవుడే నాన్నగారు!

765. లోకములోని మన తల్లిదండ్రులు మనలనెంతో గారాబముతో బెంచి, మన అవసరముల దీర్చి, మనదుఃఖ కారణముల దొలగింప యత్నింతురు. కానియెంత అభిమానమున్నను, మనతల్లిదండ్రులు–మనలోప దోష దుఃఖము లన్నిటిని తొలగించు సామర్థ్యము గల వారుకారు. ఇక సర్వసమర్థులగు పార్వతీపరమేశ్వరులు మన తల్లిదండ్రులని యెరిగి, నమ్మినచో, మనకు సర్వదుఃఖములను దొలగించి, సర్వసుఖములొక క్షణార్థములో సమకూర్పగలరు, దేవుని తల్లిగాదండ్రిగా నమ్మి సుఖించుము.

766. భగవద్ధ్యానము చేయుటకు వేళ, మడి, నియమము మున్నగున వేమియు నవసరము లేదు. కారణము భగవంతుని వైపు మనము తిరిగి స్మరించిన క్షణములో, నన్నియు పవిత్రములగును. అశుద్ధమనగా దేవునికి వెనుదిరిగి యుండుట; శుద్ధమనగా దేవుని కెదురుగా ముఖము త్రిప్పి నిలుచుట. అందుచే దేవుని స్మరించుటే, జపించుటే, ధ్యానించుటే, సంపూర్ణ సదాచారము.

767. ఎల్లవేళల భగవద్ధ్యానము చేయుటకు సాధ్యపడునా? ఇహలోక జీవిత సంబంధ కార్యకలాపము మానుట సాధ్యపడదుకదా? అందుచే కొంతకాలము దేవునర్చించుటకు కేటాయింగలము కాని, అన్ని వేళల దైవారాధన చేయుట సాధ్యపడదని చెప్పుట యుక్తముగానుండును. కానియిది అయుక్తము. ఏలన, దేహము విడిచి యేపనియు చేయనటులే, దేవుని విడిచి యేదియు చేయజాలకుండవలెను, దైవ స్మరణముతో సహా అన్ని పనులు; దైవస్మరణము వినా, ఏపనియు జేయరాదు.

768. తుపాను గాలిలో బెట్టిన దీపము నిలుచు టెట్లు? అటులే సంసారమను తుపాను గాలిలో నిలుచు మనశ్శాంతి దీపమారి పోకుండ నెట్లుండును? గాలి ఆగిపోయినచో, దీప మారదు; సంసార మహావాయువు నాపినచో మనశ్శాంతి దీపము చక్కగా ప్రకాశించును. ఇది అనగా సంసార మారుతమును, మనస్సును, మనలను కల్పించిన దేవుడే దానినాపి రక్షింపవలెను, మన చేతిలోని పనికాదు. అందుచే దేవునారాధించి దీపము నిలబెట్టుకొనుము.

769. నేనెవరు? నా నిజస్వరూపమేది?యని ప్రశ్నించి కొని, యీ సమస్యను పరిష్కరించి కొనుటే బ్రహ్మజ్ఞానము, మోక్షము; ఆనందము. నా దేహము, నా బుద్ధి, నా మనస్సు, నా తెలివి మున్నగు శబ్దములచే, నేను వేరు, దేహము, బుద్ధి, మనస్సు, తెలివి – నేనుకాను. అవి నేను కాదని యర్థము, 'నేను కు చెందునది 'నేనే, నేను కాని వన్నియు'నావి' కాని, అవి నేనుగాను, నాదియేది? నేనే నాది, నేను గానిదంతయు నేనని తలచి కాకుండుటచే దుఖించు టెందులకు? అందరలో 'నేను' ఒకటే పరమాత్మ. నిత్య నిర్వికారానంద ప్రశాంతి స్వరూపము.

770. కాలమును జయించు టెట్లు? కాలమనునది నిజముగా లేదు. సార్వకాలికుడు, నిర్వికారుడు. అవ్యయుడు నగుటచే భగవానునికి గాలము లేదు. మాయా కల్పితము, సవికారము, నైనది ప్రకృతి. సవికారమైన దానికి గాలముండును, అందుచే ప్రకృతి, కాలము మాయాజన్యము లగుటచే నసత్యములు, నేను దేహ మనో బుద్ధీంద్రి యాదులతో గూడిన జీవుసను కొనువానికి గాలమున్నది. నేనాత్మను, అనగా నేనే భగవానునని యెరిగిన వానికి గాలములేదు. ప్రకృతి, కాలము – మాయాకల్పితము; మాయ యీశ్వర కల్పితము, కావున ప్రకృతి, కాలము, మాయ, అన్నియు దేవుడే!

771. సంకీర్తన మనగానేమి? భగవంతుని దివ్యగుణోపేతమైన మహిమను స్తవమొనర్చుటే భగవంతుని కీర్తించుట

స్తుతించుట సంకీర్తనము, కాని భగవానుఁడు స్తుతిప్రియుఁడా! లోకములోని ధనికులు, అధికారులు తమ్ము స్తుతించినచో. సంతసించి మన కుపకార మొనర్తురు, దేవుఁడు నట్టివాఁడేనా? అగుచో నది పూజ్య లక్షణమెట్లగును? నిందా స్తవముల నను సరించి వర్తించు నాతఁడు దేవుఁడెట్లగును? సర్వమున కతీతుఁడై సర్వదా సర్వప్రాణికోటిని రక్షించుచున్నాఁడు గావున, దేవుని మరువకుండుటకై మనకొఱకు మనముచేయు సాధనమే సంకీర్తనము.

772. భగవంతుని నమ్ముట సులభముగానే గోచరించునుగాని, సరిగా నమ్ముటచాల కష్టమైనపని. మన కనుకూలముగా పనులు జరుగుచుండగా, దేవుఁడు కృపజూపెనని నమ్ముటలోఁ గష్టములేదు, మనము తప్పని సరిగా జరుగవలెనని కోరు కొన్నిపనులు, వ్యతిరేకముగా జరిగి, చిక్కులు చికాకులు కలిగించి నపుడెంత వానికైనను చిత్తముచలించి, భక్తిసన్నగిల్లి, నమ్మకముచెడును, అందుచే భగవంతుని సరిగా నమ్మనిచో ఫలితములు సరిగా నుండవని తెలియవలెను.

773. మన మనస్సును చలింపఁజేసి, దేవుఁడు బాధింపఁదలచిన యెడల నెవ్వఁడాపఁగలఁడు? ఏది జరిగింప దేవుఁడు పూనినను దాని నెవ్వఁడాపగలఁడు? అసలు దేవుఁడు చేయుటకు ఁబూనుకొనినవి కాక, వేరు కార్యము లుండుటకు, దేవుఁడు గాక మరొక కర్తగలఁడా? అందుచే నేదికావలసినను, దేవునే ఆశ్రయింప వలసియుండగా నిశ్చలచిత్తము,

నిర్మల శాంతియు మనము చేకూర్చు కొనఁగలమా? అవియు అన్నిటి వలెనే దైవప్రసాదములని యెరుగవలెను. ఈశ్వరారాధనము తప్ప చేయవలసినది లేదు.

774. భగవానుఁడు చేయఁబూనిన పనికి భిన్నముగా మనమేమియు (జేయఁజాల మన్నచో దానియర్థమేమి? జరుగున వన్నియు దైవకర్తృకము లనియు, మనకాయన అంటగట్టిన కర్తృత్వము తప్ప వేరెద్దియు లేదనియు స్పష్టముగా గ్రహింపవలెను, లేనికర్తృత్వమున్నదను భ్రాంతి దుఃఖమూలమనియు గ్రహించుట, వివేకము.

775. దైవభక్తునికి (గార్యక్రమ మేదియు లేదు. దైవస్మరణముచే నిరతిశయానందములో మున్గితేలుచుండుటే కార్యక్రమము. అది జరుగు చుండగా నెప్పటికేది చేయవలసివచ్చినను అది స్మరణముతో బాటుచేయుచుండుటే. నిరంతర స్మరణశీలికి, ఆతఁడు చేయవలసిన కార్యక్రమము లన్నియు దేవుఁడే నిర్ణయించి చేయించుచుండును. దానిని (గూర్చి మన మెట్టి యాలోచనము చేయనవసరము లేదు. భగవన్నామ స్మరణము చేయుచుండుటనగా దేవుని యొడిలో గూర్చుండి నిర్భయ సౌఖ్యమనుభవించుట. మనకు లోకమునకు వలయు సర్వ కార్యము లందిమిడియుండును. ప్రేమతో నొడిలో గూర్చుండిన మనల నాడించుచు మన సర్వభారం మాతఁడే వహించును.

776. సకలాపదల (దొలగించి, సకల సంపదల నిచ్చునదే భగవన్నామము. భగవంతునికి భగవన్నామమునకు

క్షేమము లేదు. అశుభము లన్నియు నశించి, శుభములన్నియు లభించుటకంటె మనము కోరఁదగిన దేమున్నది? వేయి గ్రంథ ములు చదివి తర్కోప తర్కములు చేయుట వ్యర్థప్రయాస. భగవంతుని అంతరంగమున మౌనముగా స్మరించుటలో శ్రమ యేమున్నది? వ్యయ ప్రయాసలు కోరుకర్మకాండ,తీర్థయాత్ర, యజ్ఞయాగాదులు నన్నిటికంటె సులభతరము, సుఖతరము నగు భగవన్నామ సంకీర్తన మొనర్చి, పారవశ్యము గాంచి, అవ్యయానంద నిధానమగు ముక్తి నొందవచ్చును.

777. మానవులకు నిరంతరము చోదనములు కలుగు చుండును. ఒకవైపునుండి, "ఇది ధర్మమిదిచేయుమని" ప్రేర ణము. వేరొక వంకనుండి,"ఇది సుఖప్రదము. ఈ కామ మనుభవింపుము." అని చోదనము కలుగును, ఒకటి పుణ్య కర్మ; రెండవది పాపకర్మయని చెప్పుదురు. రెండు రకముల చోదనములు చేయు వాఁడీశ్వరుఁడేయని గుర్తించిన భక్తునికి కర్తృత్వ బాధ్యతలుండవు; రెంటిఫలములునంటవు. అన్నియు ఈశ్వర కర్తృకమై యీశ్వర ప్రేరణచే జరుగుచుండగా కర్మ, కర్మఫలములకు మనకు సంబంధము శూన్యము.

778. నీ పనులని వేరేమియు లేవు. ఎవరి పనులు నేమియు లేవు. అన్ని పనులు, అనగా అందరిపనులు దేవుని పనులే. అందర పనులను దేవుఁడే నియమించి, జరిగించును. ఈ విశ్వమంతయు నేకైక నాయకము, ఏకైక కర్తృకము. అందుచే విశ్వములోని వన్నియు దేవుని పనులే. ఇక నీ పనులు,

నా పనులు వేరొకరి పనులు నెచటినుండి వచ్చును? భ్రాంతి వలన దుఃఖము ననుభ వించుచున్నాము. భ్రాంతివిడిచి, అన్నియు దేవుని పనులేయని గుర్తించినచో దుఃఖాంతమగును. ఈ భ్రాంతి చాల ఆశ్చర్యకరమైనది. దేవుని పనులు నీవని తలచుట; అది తప్పని తెలియుటే మోక్షము.

779. నీవులోక కల్యాణమును గోరిపని చేయఁగోరు దువా? మంచిదే; నీవు చేయవలసిన పని దేవుని ధ్యానించుటే. సకలలోక కల్యాణప్రదాత, కర్తయు దేవుఁడే. నీవు దేవుని ధ్యానించు చుందువేని, దేవుఁడే నిన్నవసరమని తోఁచినచో నేదోయొక పనిలో నియమించి, లోకహితము జరిగించును. లోకములోఁ బరోపకార పరాయణులందరు, భగవంతునిచే నియమింపఁబడినవారే. నియమించి శక్తిసామర్థ్యములిచ్చి, దేవుఁడే లోకహితము చేయించును. నీ వేమిచేయవలెనను విషయము పూర్తిగా దేవుని చేతిలో విడిచిపెట్టి, నిరంతరము భగవంతుని ధ్యానించుటే నీపని. అదియే లోకకల్యాణము.

780. ఏ యొక సత్యమును నమ్మి, ఆచరించినను బ్రహ్మాత్వసిద్ధి లభించును, నేనేమి చేసినను దేవుఁడే చేయు చున్నాఁడని నమ్మి యాచరించువానికి ముక్తికరతలామలకము. నా కేమియుఁదెలియదు, భగవంతుని నమ్మి కీర్తించుటే నా పనియని నమ్మిచరించు వానిదే ముక్తి. ఇటులే ఒక నమ్మకము; ఒకనిష్ఠ; దైవారాధనము – మోక్షసిద్ధినిచ్చును.

781. వైద్యశాస్త్ర మెఱుగని వాని చికిత్సలోఁ బడి, రోగము హెచ్చుటేకాక, మరణముకూడఁ గొని తెచ్చుకొను

రీతి, జన్మజరామృత్యు బాధలకు వశులైన వారిని మనము బంధువులని నమ్మి మోసపోవుచున్నాము. జోగి జోగిని రాచి కొనిన బూడిదరాలును; అనగా బిచ్చగానిని బిచ్చమడుగుట; యిసుకలో మంచినీరు వెదకుట - సకల భవరోగములకు నుత్తమచికిత్సచేసి, మోక్షారోగ్యమిచ్చి రక్షింపగల దేవుఁడే నిజమైన వైద్యుఁడు, బంధువునని గ్రహించి, దేవుని నమ్మి బ్రతుకుట, మంచిదని యేల తెలియదో! చిత్రము!

782. జగత్తుమిథ్యయని వేదాంతము ప్రకటించినది. మనము మిథ్యలోభాగము. మనము చేయు పుణ్యాపాపములు, సుఖదుఃఖములు - మిథ్యయే కావలయును. వేదశాస్త్రములు, అవి బోధించు కర్మజ్ఞానభక్తి వైరాగ్యములు — మోక్ష యత్నములు - అన్నియు మిథ్యలోని భాగములే! బ్రహ్మ యొక్కటే సత్యము - మిగిలిన దంతయుమిథ్య; అనగా నేనే బ్రహ్మపదార్థమని యెరిగి జ్ఞానసిద్ధిచేఆనందించుటే మోక్షము.

783. "ధర్మసంస్థాపనార్థము ప్రతియుగమున నేను అవతారము దాల్చెదన"ని భగవానుని వాక్యము. అనగా అధర్మము మీతి మీరునపుడు, ధర్మహాని కలుగునప్పుడు దేవుఁడవతరించి, ధర్మమును రక్షించును. కాని అధర్మమును సృజించిన దెవరు? దానిని పెంపుచేసినదెవరు? "అమృతంచైవ మృత్యుశ్చ సదసచ్చాహ మర్జున" యని గీతావాక్యము. దైవ సంకల్పము లేనిదే అధర్మము నెవఁడు సృజింపఁగలఁడు? ధర్మాధర్మ కర్త పరమేశ్వరుఁడే, ఇది యీశ్వరుని వినోదము,

వినోదము కావుననే మిత్రులకు శత్రువులకు, ధర్మాత్ములకు అధర్మపరులకు సమముగా ముక్తినిచ్చినాఁడు, అందుచే నధర్మ నిరాసము, ధర్మసంస్థాపనము దేవుని వినోదనాటకము.

784. ఒక అల్పవ్యక్తిని బలవంతముగా దోడ్కొని పోయి, చక్రవర్తి కలంకరించు దుస్తులను, ఆయుధములను, ఆభరణములను గూర్చి అలంకరించి, "నీవు చక్రవర్తివి" రాజ్యమును పాలింపుమన్నచో నాతఁడు సింహాసనమందు గూర్చుండిన వెంటనే రాజ్యము నశించును, జన్మచే రాజ పుత్రుఁడై వంశపారంపర్యముగా నొకఁడురాజై, రాజ్యమును వర్ధిల్లఁజేయును. మనమీ లోకమున బలవంతముగా దోడ్కొని పోయి, చేయఁబడిన చక్రవర్తులమై, యేమిచేయవలెనో తెలి యక చకితులమై విలపించుచున్నాము. ఈ నాటక మాడుచు న్నది దేవుఁడని గుర్తించినచో, మనకెట్టి బాధలుండవు.

785. దేవుని నమ్ముటే మనపని; తక్కిన పను లన్నియు దేవుఁడే చూచికొనును. దేవునినమ్మి, ఆపైని మన మేమి చేయవలెనో, మనపోషణ మెట్లగునో అన్నియు దేవుఁడే చూచును. ఇంతకంటె శ్రమలేని పనియేమున్నది? సర్వకర్త భర్త, రక్షకుఁడు దేవునివలె మనయోగక్షేమము చూడఁగల వారెవరున్నారు? అట్టి భగవంతునినమ్మి సుఖపడలేవా? లేని పోని గొడవలెందుకు?

786. ఎవఁడేపని చేసినను దేవుని కొఱకే. "మానవు లందరు నా మార్గమునే పట్టుచున్నారు." గీతావాక్యము.

చీమ మొదలు సింహము వరకు సామాన్యుని మొదలు చతు రాననుని వరకు - అన్ని వేళల చేయునన్ని పనులు దేవునిఁ జేరు నిమిత్తమే; అనగా ఆనందము, సౌఖ్యము, నిత్యశాంతి వారికిఁ గావలెను. దొంగల దొంగతనము, దుష్టుల మారణ కృత్యము, దేవుని జేరుటకే. అనగా దానివలన సౌఖ్యానంద ములు లభించునని వారియూహ. వారు పొరబడి యుండ వచ్చును, గాని వారి ఉద్దేశము సౌఖ్యకాంక్షయే, దేవుని మరొక పేరానందము.

787. "సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణమ్ వ్రజ." శ్రీకృష్ణభగవానుని గీతోపదేశము. అన్ని ధర్మములు విసర్జించి దేవునాశ్రయింప వలెనని దేవుఁడే పలికెను. కాని, దేవునాశ్రయించుట యుక్తమే కాని ధర్మముల విడుచు టెందు లకు? సర్వధర్మరాశియే దేవుఁడు. దేవునిలో సర్వధర్మములు నున్నవి, సర్వధర్మాచరణ ఫలమే దేవుఁడు. ఇక ధర్మము లెందుకు? దేదీప్యమానముగా సూర్యుఁడు ప్రకాశించుచుండగా దీపమెందులకు?

788. "రసో వైసః" యని ఉపనిషద్వాక్యము, రస మనగా పరబ్రహ్మమే. రసమనగా బ్రహ్మానందరసము. ఆనంద మెట్టిది? సర్వసంపూర్ణము, త్రికాలాబాధ్యము. సంపూర్ణా నందము సంపూర్ణజ్ఞాన భరితము కానిదేయుండదు, సంపూర్ణ జ్ఞాన మనగా సమ్యక్ జ్ఞానము; సర్వవిషయములు సమగ్రముగా దెలిసి, సర్వవిషయములకు యథోచితార్థ స్థానములిచ్చి సమ

వ్వాయసిద్ధి నిచ్చునది. రసమనగా దేవుఁడే, ఆనందము నవరస పరిపూర్ణమైన రసము, జ్ఞానము, కళ, సౌందర్యము, నన్నియు దేవుఁడే! రసికుఁడనగా దేవునెరిగినవాఁడు!

789. భగవంతుఁడు మనల రక్షించుచున్న విషయము ప్రత్యక్షము, ఏలన నే క్షణములో దేవుని రక్షణము లోపించునో, అపుడు మనము మృత్యువశులమై నశింతుము. ఇఁక భగవానుఁడు మనల రక్షించునా, రక్షింపఁడా యను ప్రశ్న కొకేయర్థమున్నది. మనము కోరుకోర్కె లిచ్చునా యనియే దాని యర్థము. మనయోగక్షేమములు దృష్టిలో నుంచికొని, మనకీయఁదగినవిచ్చును. మనకీయని వన్నియు మన కశుభ హేతువు లన్నమాట. అందుచే మనము దేవుని రక్షకుఁడుగా నిత్యము చూచుటేగాక, మనము బ్రతికియుండుటే దేవుని చూచుట కాదా?

790. ప్రాణికోటి స్వరూప స్వభావక్రియా కలాప మంతయు దైవమయము, అన్నియు నశింపగా మిగులు 'నేను' దేవుఁడే. అందుచే దేవుని స్వరూపములగు చరాచరము లన్నియు నా స్వరూపములే. ప్రాకుచున్న చీమ, యెగురుచున్న పక్షి, గర్జించుసింగమునేనే! భర్త, భార్య, బిడ్డలు, నేనే! సూర్యచంద్ర నక్షత్రాదు లన్నియు నేనే! అందరలోనుండి అన్నియుఁజేయుచు ననుభవించుచున్నది నేనే! నేనుకానిది లేదు.

791. దేవుఁడు 'సర్వదర్శి' యని పలికిరి, ఆయన నేత్రములు లేనిచోటులేదు. అనగా ఆయన చూడనిది లేనిదే,

ఆయన విననిది లేనిదే, ఆయనకు దెలియనిది లేనిదే. అట్టి దివ్యమహిమగల దేవుఁడుండగా, భయాందోళనము లేల? భజించి, తరించు.

792. భక్తియు నహంకారము నొకచో నుండవు. అటులే జ్ఞానము అహంకారము కలియవు. కాని భక్తుఁడు నేను భక్తుఁడనని జ్ఞాని నేను జ్ఞానినని అనుకొనుట, పరస్పర విరుద్ధ ప్రసంగమగును. సర్వము దేవుఁడే యనువాఁడే భక్తుఁడు – 'నేను' భక్తునిలో లోపించును. సర్వము పరబ్రహ్మమని యెరిగిన వాఁడుజ్ఞాని. అందుచే జ్ఞానిలో 'నేను' లేదు. కాని, అహంకారము కోటిరూపములు ధరించి, ఏ క్షణముననైనను, భక్తుని భక్తిని, జ్ఞాని జ్ఞానమును కలుషిత మొనర్చును. కాలుష్యమహంకార రూపమునవచ్చి, మన భక్తిజ్ఞానముల చెడఁగొట్టినపుడే మనము గ్రహింతుము, భక్తులు జ్ఞానులు అహంకారము కలుగకుండ వేయికన్నులతో ఁజూచికొనవలెను.

793. నిశ్చయమగు భగవద్విశ్వాసము మనకున్నదని యనుకొందుము. సంసారమెట్టిదనగా మనకు దెలియకుండ మన విశ్వాసము సడలి, మూర్ఖముగా ప్రవర్తించి,తత్ఫలిత మనుభవించిన తరువాత మనకు సంభవించిన అవివేకమును గుర్తింతుము. అందుకే సంసారికి బూర్ణభక్తిజ్ఞానములసాధ్యములని చెప్పిరి, కాని ఒకసారి దైవము నారాధించిన వాఁడెన్ని మారులు పతితుఁడైనను దయచూపి, వానిని భగవానుఁడు రక్షించి, కొంతకాలమైన వెనుక పతనము లేకుండ ఁజేయును.

794. మానవులకు విశ్రాంతి కావలెను. దేవునికి విశ్రాంతి కావలెనా? దేవుని సంసార మనంతమైనది; అనంత కార్యము లాయన చేయు చుండవలెను, ఇఁక దేవునికి విశ్రాంతి కవకాశమే లేదు. కాని దేవుని కంతయు విశ్రాంతియే! ఆయన యేమియు (జేయుట లేదు, అన్నియు (జేయుచున్నాడు. అనగా దేవుని మహిమ అనిర్వాచ్యమైనది, సంకల్ప మాత్రముచే సకలము నడుపగల శక్తి దేవునిదైయున్నది. త్రుటికాలములో నర్బుదముల పనులు నిర్విఘ్నముగా ననాయాసముగా నిర్వ క్రమముగా నాతఁడు చేయును. దేవునారాధించు భక్తులకు జ్ఞానులకు నట్టిమహిమ సంక్రమించిన సంగతి చరిత్ర తెలుపుచున్నది.

795. దేవుని మరచుటెట్లు సాధ్యమగును? ఆలోచించు శక్తిని మానవుఁడు కలిగి యున్నాఁడు. సవ్యమైన ఆలోచన గలిగినచో, దేవుని మరచుట అసాధ్యమగును. కాని అత్యధిక సంఖ్యాకులు దేవుని మరచు చున్నారనగా వారి ఆలోచనలు సవ్యముగా నడచుట లేదని స్పష్టము, అనగా దేవునెరుగని వారి ప్రవృత్తి అనాలోచితప్రవృత్తి. (1) మనము ప్రతిక్షణము జీవించి యుండుటయే దేవుఁడున్నాఁడనియు మనలనురక్షించు చున్నాఁడనియు సాక్ష్యమిచ్చుచున్నది. దేవుఁడు, దేవుని కృప లేనిదే మన బ్రదుకు లేదు. మనము బ్రదికియుండుటే దేవుని ఉనికికి సాక్ష్యము. (2) సృష్టి దేవుని కార్యము; సృష్టిని జూడకుండ నుండజాలము కావున దేవుని జూడకుండ నుండఁజాలము, అందుచే దేవుని మరచుటెట్లు పోసగును?

796. నిన్ను నీవు మరువఁగలవా? నీ వుంటుటకు గారణము దేవుఁడే! నీవు నిన్ను మరువ లేవు గావున దేవుని మరువ లేవు. నీవుంటుట దేవుఁడుండుట పెనవేసికొనిన విడదీయ రాని పరమ సత్యములు. అందుచే దేవుని మరచుటకు యత్నించుచో, నిన్ను, లోకమును మరచుటకు యత్నించి విఫలుఁడ వైనటులే యగుదువు. అది జరుగదు. ఎంత ప్రయత్నించి నను దేవుని మరచుట కుదరదే!

797. అన్ని క్షణములలోను దేవుఁడే కర్తయై జగన్నాటకము నద్భుతముగా నడపుచున్నాఁడు, ఏ క్షణములో భగవానుఁడేమి చేయునో మన మూహించు శక్తిలేనివారము; మరుసటి క్షణములో పరిస్థితు లన్నియు నద్భుతముగా మారి పోవచ్చును, అందుచే నుత్తర క్షణమేమి జరుగునోయను బెంగ లేకుంటుట కొకేమార్గమున్నది. సర్వక్షణరూపి, సర్వకాలాధిపతి, సర్వకర్త, సకల రక్షణ సమర్థుఁడునగు దేవుని పాదపద్మములు గట్టిగాఁబట్టుకొని కూర్చుంటులే. అపుడన్ని బెంగలు నశించి, ఆనంద గంగ ప్రవహించును.

798. లోకదృష్టి, అనగా నానాత్వమును దర్శించు దృష్టి; పారలౌకికదృష్టి అనగా ఏకత్వమును దర్శించుదృష్టి, రెంటును గలవు. లోకవస్తువులను మనము విడదీసి, తాత్కాలిక ప్రయోజనములకై అర్థము చెప్పుకొనుచున్నాము. కాని యిది దుఃఖహేతువు; ఏలన, యీనానాత్వము నిజముకాదు. అన్నిటికి కాధారభూతమై అన్నిటి రూపమొకటేయైన ఏకత్వముననగా

భగవానుని జూచుదృష్టి, సత్యమైన దగుటచే స్థిరానంద శాంతుల నిచ్చుదృష్టి.

799. అది జరుగునా? జరుగదా! ఇది యేమగును? ఏది జరుగును? అని మనమన్ని విషయములలో నాందోళిత మనస్కులమై తర్కోపతర్కములు చేసి, చికాకు పడు చుందుము, ఇందు శాంతిలేదు, సుఖమునులేదు, ఈశ్వర కర్తృకములై సర్వము జరుగునని తెలిసినచో, మనకు నిత్యానంద మిచ్చును. అన్నియు దేవుని చేతలే యని నమ్మిచూడు; నీకు దుఃఖముండదని ఋజువగును.

800. మనకు విచారము, బెంగ, ఆందోళనము, దుఃఖమును కలుగుటకు గారణమేమి? మనము కొన్ని కోరుదుము; వానిని సాధించు శక్తి మనకులేదు. అందుచే మన కశాంతి దుఃఖాదులు కలుగును. దేవుఁడేకైక కర్త, సర్వకార్యములు చేయువాఁడని గుర్తించినచో - మన కోర్కెలు విచారములు పోవును. మనము కర్తలముగా మన్నప్పుడు దేవుఁడిచ్చిన దానితో సంతుష్టిపొంది సుఖించుటే కర్తవ్యమగుటచే విషాద మునకుఁ దావుండదు.

801. ప్రతిక్షణ మేమి జరిగినను, "అదిదేవుఁడు చేసినదే!" యని నిశ్చయబుద్ధి కలుగవలెను. దేవుని క్రియాహస్తము నన్నిటిలో ననుక్షణము దిలకించు నభ్యాసము చేసికొని, దైవారాధన తత్పరులమై ఆనంద పరవశులమై జీవించుట నేర్చికొనవలెను, ఈ లోక వ్యాపారమంతయు దేవుని

యూట; మన మాటలో దేవుడాడించు బొమ్మలము. దేవునితో నాఁడు కొనుట తెలిసినిచో దుఃఖమునకు దావు లేనే లేదు.

802. దేవునెట్లు ప్రార్థింపవలెను? "తండ్రీ! నాకేది మంచిదని నీవు తలచెదవో అదియిమ్ము."ని ప్రార్థింపవలెను.? ఏలన మనకేమి కావలెనో. యేదిలభించిన సుఖము కలుగునో, యేది లభింపకున్న దుఃఖముండదో మన మెరుగము. మనము కోరువాని గుణదోషములు సమగ్రముగా మనము తెలిసికొను శక్తి మనకులేదు, అందుచే నన్నియు దెలిసిన దేవునికే ఆ సంగతి విడిచిపెట్టి దేవుని పాదములుపట్టి భజించుటే పరమ శ్రేయః ప్రదము. ఇక తాపత్రయ దుఃఖాదులకు జోటేది?

803. "నా తండ్రి జమీందారు; నా తండ్రిమంత్రి; నా తండ్రి ధనికుఁడు; నాతండ్రి జగత్ప్రసిద్ధ కీర్తివంతుఁడు." నని లోకులు సగర్వముగా జెప్పికొని స్వాతిశయమగు నౌద్ధత్యమును జూపుదురు. భక్తుఁడైన వాఁడేమనుకొనవలెను? 'నా తండ్రి జగన్నాథుఁడు; అనంత ప్రజ్ఞాబల ధైర్యగాంభీర్యాది సర్వకల్యాణగుణ పరిపూర్ణుఁడు," నని చెప్పికొని, "నా తండ్రి వంటి తండ్రి యింకొకఁడు లేఁడ'ని చెప్పికొని సాటిలేని బలధైర్య సంతుష్టి శాంత్యానందములను మనము పొందవలెను.

804. సృష్టి తలక్రిందైనను, ఏమేమి విడ్డూరము సంభవించినను, ఏమియు జరుగనట్లు, ప్రశాంత మనస్కులమై హాయిగా గూర్చుండు నుపాయమున్నది. అది సులభమైనది.

తక్షణ ఫలితము నిచ్చునది; సర్వ వేదవేదాంత సారభూతమై నది. అత్యంత రహస్యమైనది. "మానక యెల్లప్పుడు దేవుని పాదములు పట్టుకొని విడువకుండ (గూర్చుండుము." అంతే ఉపాయము! దీనిననుసరించినచో, నట్టివాని కేమి జరిగించి నచో, నశాంతి కలుగదో అదియే జరిగించువాఁడు దేవుఁడు. ఈపని చేసిచూడు; మాటలెందుకు?

805. భక్తుఁడెవఁడు? ఎవరికి భక్తుఁడు? దేవుని భక్తుఁడు కదా! భక్తుఁడనగా దేవుని సంపూర్ణముగా నమ్మువాఁడు. దేవుఁడెట్టివాఁడు? దేవుఁడు సర్వకర్త; సర్వజగత్పరిపాలకుఁడు; సత్యధర్మరక్షకుఁడు; భక్తజనాధీనుఁడు; సంకల్ప మాత్రముచే సర్వక్రియలు నడపు మహిమాన్వితుఁడు. అట్టి దేవుని నమ్మ భక్తుఁడు ముక్తుఁడే. ముక్తుఁడనగా సకల లోపదోషములు లేని వాఁడే; అనంత శాంతిసౌఖ్యములు గలవాఁడే! అనగా దేవునితో సముఁడే; దేవుఁడే!

806 మొన్న హిమాచలప్రదేశమున దారుణ భూకంపము కలిగి రెండుమూడు జిల్లాలలో నిండ్లుకూలి, లెక్క తెలియనంతమంది మృతులైరి. మిగిలినవారి దురవస్థ! తల దాచుకొనుట కిల్లులేదు; బయటమంచు కుంభవృష్టి; కొండల నుండి పెద్దగండశిల్లు మీదఁబడుట; ప్రభుత్వ సాహాయ్యము వారికిఁజేరుట కవకాశములేకుండ బాటలన్నియు (గప్పడినవి; విమానములకు (దెన్ను కనపడదు; ఇంట, బయట, పైన అన్నియు ప్రమాదములే! చచ్చిన వారికైయేడ్పు మాట

టుంచి బ్రదికియున్నవారు బ్రదుకుటెట్లనియేడ్పు! ఏమి భగవాను నుగ్రత్వము! పాపములకు శిక్షవిధించెను కాబోలు! అందుచే దేవుని మఱువక భజించుటే కాదు; పాదాక్రాంతులమై, గర్వాహంకారములు విడిచి భజింపవలెను.

807 కుటుంబము (జీవితము) ను పడవ ఆగకుండ మునగకుండ ప్రమాదములకు లోనుగాకుండ నడువవలసినంత కాలము సక్రమముగా నడువవలెను. దానికై వలయు సామగ్రియనగా, ధనవస్తు సంగ్రహము చేయక తప్పదుగదా! కాని ధనవస్తు సంపాదనము మొదలు పెట్టుట తోడనే దురాశ, దురహంకారము, అక్రమ ప్రవర్తనమునందు లోలత్వము బహువిధ కామక్రోధ లోభాదిదోషములకు పాల్పడుట - అప్రయత్నముగా జరుగును. అట్టివి రానీయకుండ రక్షించునందాక దేవునర్థింపవలెను.

808. కర్తకర్మక్రియలు - దాత, దానము, భోక్త - బ్రహ్మమే! అనగా దేవుఁడే! కర్త దేవుఁడొక్కఁడే. క్రియ కర్త చేయునదే, మరొకకర్త లేడు, క్రియాశక్తి దేవునిదే. ఇక కర్మ దేవుని చేతయే; దేవుని చేతయు దేవుఁడే! దేవుఁడే కర్త; దేవుని సంకల్పమే క్రియ; సృష్టియేకర్మ. దాతయెవరు? దేవుడొక్కఁడే. దానమాయన సంకల్ప క్రియాశక్తి; సర్వద్రవ్యము లాయనవే. దేవుని రూపములే, భోక్తయెవరు? ద్రవ్యానుభవ శక్తి దేవుఁడిచ్చినదే, భోక్తదాత రూపమే. ఈ దృష్టి కలిగి వర్తించుటే జ్ఞానము; ముక్తి, ఆనందము.

809. దేవునెరుగుటకు, దేవుఁడు కానిదేదో తెలిసికొనవలెను. దేవుఁడుకానిది లేదు కనుక, దేవునితప్ప నీవింకేమి చూచుట కవకాశమున్నది? ఎంత మేధావులయినను వెదకి దేవుఁడుకాని వస్తువును దర్శింపఁజాలరు. ఏమిచేయుట? చచ్చినట్లు దేవునే దర్శింపవలెను. ఎంతవిచిత్ర విషయమో! ఇంకొకటి, దేవుఁడుకాని వస్తువు లేకున్నచో నీవెవఁడవు? నీవు దేవుఁడవే! అనగా ఉన్నది దేవుఁడే! మరొకటి లేదు.

810. సంసారములో జీవించువాని కవసరములెన్నో పైఁబడి, "లే! బయటికి తిరిగి, ఆపనిచేయుము; ఈపని ముగించు; వారిని కలిసికొనుము, వీరిని కలిసికొనుము" మున్నగునుపదేశములు చేసి, స్థిమితముగాఁగూర్చుండనీయవు. "దేవుఁడున్నాఁడు; నీవు కదలవలసిన పనిలేదు." అని అంతర్వాణి పలుకును; కాని తొందరలకుఁదట్టుకోలేక, కదలి, అన్యులతో జోక్యము పెట్టుకోవలెనని బుద్ధిపుట్టునా? పెట్టుకో! తప్పులేదు; దైవసంకల్పమే నన్ను కదిపి, నడపుచున్నదని దృఢముగా నమ్మి చరించుట – కదలకుండుటతో సమానమే! అపుడు కూర్చుండినను కదలినను, క్రియాపరుఁడవైనను, నిష్క్రియుఁడవైనను – దోషములేదు.

811. దేవునితప్ప లోకములో నెవ్వారిని నమ్మరాదనుటకుఁగారణము, నమ్మి ప్రయోజనము లేకుండుటే. ఈశ్వర సంకల్పానుగ్రహములులేనిదే యెవరేమియుఁ జేయఁజాలరు కదా? కావున దేవునొక్కనే నమ్మి జీవించుటవలన లాభ

మేమన, దై వేతరులను నిగ్రహ యోజనముగువరకుఁగలియుగ్రమ తప్పును. ఇతరులే దైవప్రేరితులై, నీకోర్కెలు సఫల మొన ర్చుచో, అపుడు దేవుఁడే దానికిఁగర్త యని చిత్తశుద్ధితో నమ్ముము; అపుడునీకు దోషము లేదు. ముఖ్యవిషయమన్ని టిలో అందరలో దేవుని నమ్ముటే, చూచుటే!

812. ఎప్పటికేది చేయవలెనని బుద్ధికలిగిన నదియే చేసి, ఒకటిమాత్రము మరువకుము. అది దేవుఁడు చేయించె నని నమ్మి, ఆపని యీశ్వరార్పణముగాఁజేయుము. ఈసూత్ర మునను సరించి జీవించినచోఁగర్మఫలములు నిన్ను బంధింపవు; పైగా నీశ్వరానుగ్రహముకలిగి, సర్వశుభములు లభించును. అప్పుడు నీచే దేవుఁడే తప్పు పనిని చేయింపఁడు.

813. ఏఫలిము నీవుకోరినను, దానికొరకుఁబ్రయ త్నము చేయవలెనని తోచినచోఁజేయుము; ప్రయత్నమవస రము లేదని తోచినచో మానుము. ప్రయత్నము చేయుట, మానుట నీచేతిలో లేవని స్పష్టముగా నెఱుగుము. ప్రయత్నా ప్రయత్నములకు దేవుఁడొక్కఁడే కారణమనియు స్పష్టముగా గ్రహింపుము. అపుడుచేయుట, మానుట సమానమగును. విను గీతావాక్యము: "కర్మణ్యకర్మయః పశ్యేదకర్మణిచ కర్మయః; సబుద్ధిమాన్ మనుష్యేషు సయుక్తః కృత్స్న కర్మకృత్."

814. నీకేద్వవలయునని యున్నదా? ఏడుపువచ్చు చున్నదా? ఒక్కదానికోసమే యేడ్వుము, దైవకృపకొఱకు

మాత్రమే: ఇంకదేని కొఱకేడ్వకుము, దేవునాశ్రయించి కూడ నింకనేడ్పెందుకు? లోకములో సమృద్ధి గలవారి నాశ్ర యించి, మన కొఱతలు తీరి, సుఖించుచుంటిమి. సర్వసంపూర్ణ సమృద్ధిగల భగవాను నాశ్రయించినచో, లోపము లన్నియు బోయి యెంత సంతుష్టి కలుగవలెను? "నన్నాశ్రయించిన వారెవ్వరైననుసరే, సర్వవిధముల రక్షింతు"నని భగవానుఁ డెన్ని పర్యాయములు వాగ్దానము చేసియుండలేదా? ఎందుకు నమ్మి ఆనందాబ్ధిలో నీదులాడవు; ఏడ్పు లెందులకు?

815. అరుగుపైఁగూర్చుండి బయటకు జూచుచుం డగా, అద్భుతదృశ్యము గోచరించును. అందు దేవుని దివ్యలీల కనఁబడును. వీధి వెంబడి నిటునటు పోవుబిడ్డలు, యువకులు పెద్దలు, వృద్ధులు, ఎగురుపక్షులు, వీచుచున్నగాలి, ప్రకాశించు సూర్యకాంతి, నీలాకాశము నన్నియు ప్రచండము అమోఘము నగు నీశ్వర శాసన బద్ధములై చరించుచున్నవి. ఎందుకో? ఎవరెరుగుదురు! దేవుఁడొక్కఁడే యెరుగును; తన్నాశ్రయిం చిన వారికెరిగించును!

816. దేవుననుసరింపవలెనా? పుత్రునినమ్మి చరింప వలెనా? ఇందొక సమస్య యున్నదా? దేవునే నమ్మి వర్తింప వలెనుగదా! అగుచో పుత్రాదుల నుపేక్షింపవలెనా? అవ సరము లేదు, దేవుఁడే, పుత్రాదుల రూపములోనుండి మాటా డును; వర్తించును. అందరను పూజింపవలెను, కాని దైవ భావముతోడనే; దేవునితో సముఁడు;అధికుఁడు లేఁడు గావున దేవునికిచ్చు ప్రథమస్థాన మెవ్వరికీయరాదు.

817. ఈ వ్యవహారము సఫలమొనర్పుమని దేవుని ప్రార్థింతుము. మనకు నిజమగు భక్తియున్నచో దేవుఁడు మనము కోరిన పని సఫలమొనర్చుటలో సందేహము లేదు. కాని వ్యవహారము నడుపుటలోగల శ్రమతప్పదు, "వీరులంద రను నేనే చంపితిని. నీవు నిమిత్తమాత్రుఁడవనియెరిగి యుద్ధము చేసి రాజ్యమనుభవింపుము'ని అర్జునునికి భగవాను, డుపదే శించెను. యుద్ధకర్మ యోగివై, నిర్విచారముగా చేయు మనెను, కాని యుద్ధము యుద్ధమే. అందలిశ్రమ తప్పదు. కాని దేవుఁడే చేయించుచున్న వాఁడని తెలిసి యుద్ధము (ఏపని యైనను) చేసినచో. మనోవ్యథయుండదు.

818 స్వగతమనగా నొకవ్యక్తి తనకు దానే చెప్పి కొనుట. "నేను నన్ను దూషించికొంటిని." అనుటలో దప్పు చేసిన నేనువేరు; తప్పుదిద్దిన నేనువేరు, నాలోఇద్దరు నేను లున్నారు! అజ్ఞానియగుజీవాత్మ తప్పుచేసినది; సర్వద్రష్టయగు సత్యాత్మ తప్పుదిద్దును. అజ్ఞానము తొలగినచో జీవాత్మయే సత్యాత్మయని తెలియును. ఇది తెలిసి తన నిజస్వరూపాను సంధానము గాంచుటే జ్ఞానసిద్ధి.

819. ఏ వస్తువును సమగ్రముగా బరిశీలించినను, దేవుని జూపునటులే, ఏ పనినిచేసినను, సమగ్రముగా బరిశీలిం చినచో భగవానునే చూపును. ఎట్లన, సర్వజీవులుచేయు సకల కార్యములు దేవుని పర్యవేక్షణములో, సంకల్పముచే జరుగు చున్నవి. జీవుల ద్వారమున పనులు జరుగుచుండుటచే, మనము బాహ్యదృష్టితో జూచి, అవి మనుజులు చేయు పనులేయని

తలతుము. ఎవరే పనిచేసినను, ప్రత్యల్ప కార్యమునందు - అది జరుగు సన్నివేశములను, సూక్ష్మదృష్టితోఁ బరికించి నచో, దైవభక్తి కలిగిన వారికి దేవుని దివ్యహస్తమన్ని పను లలో గోచరించును.

820. కాలము విలువ నెరుగుటనగా దేవుని విలువ నెరుగుటే! కాలమనగా దేవుఁడే! మానవుఁడు తనకు దాత్కా లికముగా లాభించు నిహలోక సంబంధ కార్యముల నెక్కువ చురుకుగా నియత కాలములో ముగించును. కాని అత్యంత ముఖ్యమైన విషయములో అశ్రద్ధ, అలసత్వముల జూపి, కాలము విలువను గ్రహింపఁడు. ప్రతిక్షణము జరిగి మరణ వేళ సమీపించుచుండగా దేవుని దయ సంపాదించుటకు బ్రతి క్షణము మిక్కిలి విలువైనదే కావలదా? మరణము రాకుండ దేవునికృప నార్జించి చేతఁబెట్టుకొని, నిర్భయముగా గూర్చుం డవలదా? అఖండ దీక్షతో సకల వేళల భగవంతు నర్చించి నచో కాలమే దేవుఁడై రక్షించును. లేకున్న కాలము కాలుఁడై హింసించును.

821. ఎన్నివిధముల భగవంతుని ప్రార్థించినను ఎట్టి బాధయుఁగలుగనీయక కాపాడుమనియే ప్రతిప్రాణియుఁ గోరు నది కదా! నీవెవరిని బాధింపకుండు దీక్ష పూనవలదా? నీ వెవరిని మనోవాక్కర్మల బాధింపకుండుటేగాక, ఎవరికి నేవిధమ్ములైన బాధలు కలుగకుండఁ జేయుమని దేవుని ప్రార్థిం చినచో, దేవుఁడు నిన్ను తప్పక రక్షించును.

822. విధినిషేధములను వేదశాస్త్రములు నిర్ణయించి నవి. వాని విలువలు మనహ్రస్వదృష్టికి బూర్తిగా దెలి యవు. మన మన్నిటినెరుగు శక్తిలేని వారమగుట వలననే, వేదశాస్త్రములు మనయెడ దయతో వానిని నిర్ణయించి యిచ్చినవి. మనము నిజముగా గర్తృత్వము లేనివారమేమై నను, కర్తృత్వ భావము సులభముగా బోవునా? జ్ఞానసిద్ధి కలిగినచోనది తొలగును, అంత వరకు విధుల నాచరించి, నిషి ద్ధములు పరిహరించు దీక్షబూని, దానివలన జిత్తశుద్ధి నార్జిం చినచో జ్ఞానసిద్ధిలభించును.

823. ఈ లోకము సుఖము లేనిదని శ్రీకృష్ణభగ వానుడు గీతలో జెప్పి యున్నాడు. ఇంక సుఖము కొఱకు లోకమందు వెదకు వారెంత మందబుద్ధులో! ఇచట మనము గుర్తింప వలసినవి రెండున్నవి. (1) మనము సుఖమనుకొని యనుభవించుచున్నది నిజముగా సుఖము కాదన్నమాట. ఏలన నదిదుఃఖదూషితము, లేకున్న దేవుని కసత్యదోషము పట్టును. విషదూషితము విషమే. (2) నిజముగా సుఖమెచట నున్నది? లోకమునందును, లోకవస్తువులందును లేదని భగ వానుడు చెప్పిదో యున్నాడు, సర్వాధార భూతుడగు దేవునిలోనే సుఖవస్తువున్నది. దేవుడే సుఖము; తదితర మంతయు దుఃఖమే; అందుచే దేవునాశ్రయించు టొక్కటే సుఖము.

824. ఆత్మహత్య దోషమని అందరుచెప్పుదురు; న్యాయశాస్త్రము దానిని నిషేధించినది. కాని మనమందరము

ఆత్మ హంతకులమని ఉపనిషత్తు చెప్పుచున్నది. బాహ్య దేహ మును హత్యచేయుటయే నిషిద్ధమైనది; ప్రతివ్యక్తియు దన లోనున్న 'ఆత్మ' నెరుగకుండుటే ఆత్మహత్యయని ఉపనిష ద్భావము. మన నిజస్వరూపమగు నాత్మనుగూర్చిన జ్ఞానము నార్జింపని వారందరాత్మ హంతకులే! ఆత్మమృతిలేనిది; దాని నెరుగుటేముక్తి.

825. ఏదియెట్లు జరిగినను, ఆశ్చర్యపడనవసరము లేదు. లోకసృష్టియే ఆశ్చర్యకరమైనది. లోకమును సృజిం చిన పరమాత్మశక్తియు నత్యంతాశ్చర్య కరమైనది. ఇఁక యోగ్యులయోగ్యముగా వర్తించుట, ఊహింప వీలుకానివి తటస్థించుట మున్నగువానిని జూచి, ఆశ్చర్యమెందులకు? ఇవన్నియు భగవానుని దివ్యలీలలు; అందుచే సర్వాశ్చర్య ములలో నుండి తొంగిచూచుచున్న సర్వాశ్చర్యమూర్తి నారాధించి, ఆశ్చర్యార్థమెరిగి తరించి సుఖించుటే కర్తవ్యము.

826. ప్రపంచమనగా గాంతావిత్తములు లేక కామ కాంచనములు. కామములో, ననగా గాంతలో విత్తము,విత్త ములో గాంతియునున్నవి. రెండునొకటే. విత్తములేని కాంతయు లేకకామమును, కాంతలేని విత్తము నెవఁడుగోరఁడు. అత్యధిక సంఖ్యాకులీరెంటిచే బద్ధులై, దుఃఖాబ్ధిమగ్నులగు చున్నారు. కాని యీరెండు శక్తుల వలననే లోకవ్యాపారము నడచుచున్నది. కాని లోతుగానాలోచించువారికి, కామకాంచ నముల దోషములు గోచరించును. అవి సుఖమిచ్చు నటన

చేసి దుఃఖమిచ్చుననియు, వీనిని విసర్జించుటే సౌఖ్యమనియు బోధపడును.

827. ప్రతివస్తువునందు ఆకర్షణానర్థములు రెండు నున్నవి. అనర్థమాలోచించిన గాని బోధపడదు; అందుచే వస్త్వాకర్షణమను సుడిగుండములోఁ బడి, లోకప్రజలు కొట్టుకొనిపోయి, తీరము దొరకనందున దుఃఖమనుభవించుచున్నారు, ఏవస్తువాకర్షించినను, దానిని సమగ్రముగాఁ బరిశీలించి, దాని అనర్థము నెరిగినవాఁడే ధన్యుఁడు. ఆకర్షణ వస్తువులకుఁ జెందినదికాదు - వస్తుమూలశక్తియగు దైవలక్షణమే, అనగా సర్వము దేవుని దివ్యచైతన్యమును జూపుచున్నది. దేవుని మహిమ గుర్తించుటకే, ఈ యాకర్షణములన్నియు నుపయోగించును - ఆకర్షణశక్తియగు దేవుని విడిచి, వస్తువుల వెంటాడుట మనము చేయుపొరపాటు.

828. తప్పుచేయు వారందరు తాముతప్పుచేయుచున్నామని తెలిసుకయే చేయుచున్నారు, తాముచేయుచున్న పనులనుగూర్చి, మంచిచెడు పనులేవైనను, వానిని సర్వతోముఖముగాఁబరిశీలించుటకుఁదీరిక లేదు; పరిశీలన శక్తియు లేదు. అందుచే నందరు తాముచేయు పనుల వలన కొన్ని ఫలితములనే దృష్టిలో నుంచుకొందురు, వారుపరిశీలింపక విడిచిపెట్టిన ఫలితములు పెక్కు గుణదోషములను గలిగి యుండవచ్చును. ఇప్పని స్పష్టముగాఁదెలిసి, యెవఁడు చేయికాల్చుకొనును? ...ర్మాచరణము పాపాగ్నిగుండమునఁబడుటేయని తెలి

సినచో నెవ్వఁడును దానికి బాల్పడఁడు. అనగా సకల పాప ముల కజ్ఞానమే గారణము. నేటినవ్యనాగరికతలో, భోగపరా యణత కెక్కుడు కాలమిచ్చుటచే జేయరాని పనులు మితి మీరి విశ్వశాంతి భగ్నమగుచుండుట మనదురదృష్టము.

829. "నేను నిర్ధనుఁడను; అల్పుడఁను; అసమర్థు డను. నేనెవరికి గావలెను? నన్నెవరు చూడఁగోరుదుర"ని నీవు ఖిన్నుఁడవుగాకుము. నీపని నాకున్నది. ఉన్నది గనుక నే సృజించి యిట్లునిలిపితిని. నాకందరును గావలెను, నీవును గావ లెను. సర్వ లోకప్రభువునగు నేను పనిలేక యెవరిని సృజించి యుండలేదు. అందుచే నీవు నాకేకావలసి యుండగా, నీ వితరులకు గావలసినను, అక్కర లేకున్నను నీకులోటేమి?" యని భగవానుఁడు పలుకుచున్నాఁడు. ధైర్యముతో దేవునాశ్ర యింపుము. లోకము నిన్నాశ్రయించి తీరును.

830. నీవు నూరేండ్లుబ్రదుకుము. బ్రదుకుట కర్థము తెలిసి బ్రదుకుము. అది తెలియకుండ బ్రదుకు చావుతో సమమే. జీవించుటనగానేమి? ఏమిచేయవలెను? గుణదోషము లేమున్నవి? ఎట్లుజీవించుట సుఖమిచ్చును? ఎట్లుజీవించుట దుఃఖహేతువు? ఈ స్వల్పవిషయము తెలిసికొను బుద్ధియే పుట్టలేదా? నీకు స్వయముగా దెలిసికొను తెలివిలేకున్నచో, దెలిసిన వారిఁజేరి తెలిసికొని – బ్రదుకునుగల సకలదోషము లను నిర్మూలించికొని, స్థిరసౌఖ్యశాంతులు సంపాదింపుము. ఈ పనినెప్పుడో యొకప్పుడారంభింపక తప్పదు. కావున వెంటనే ఆరంభించుట మంచిదికదా?

831. సకలప్రాణులచే సర్వకార్యములు దేవుఁ డేకైక కర్తయై చేయించుచుండగా, దేవునితో సంబంధము లేకుండ నేను స్వతంత్రముగానొక పనిచేయుదునని తలచుటెంత అవివేకమో! కానియీయాలోచనమును మనకుఁగలిగించినదియు దేవుఁడే! దేవుఁడు సంకల్పింపనిది; చేయింపనిది, తానందు ప్రవేశింపనిది లోకములో నేదియు లేదు.

832. హఠాత్సంభవములు, ప్రమాదములు లోకములో నెన్నియో జరుగుచున్నవి. కాని యిది మనమను కోనివి, మనల బాధించునవి యగుటచేనట్లు వానికి నామకరణము చేసితిమి కాని, అవి దేవుని స్వేచ్ఛ సంకల్పమువలన సహజముగా జరిగినవే. భగవానుఁడు తనలోక క్రీడారంగములో సమగ్రముగా నాలోచించియే వానిని ప్రదర్శించును. అందుచేనవి హఠాత్సంభవములుగావు, ప్రమాదములునుగావు. ప్రాణుల కర్మలననుసరించి తానేర్పరచిన యొకవిశిష్ట దైవధర్మము ననుసరించి, దేవుఁడిచ్చు అపక్రమము లేని ఫలితములే. ప్రాణుల కర్మలకు జరిగిన ఫలితముల ననుసరించి చూచినచోఁ గ్రమభంగముండదు.

833. నీ శరీరమును నీవు పరిశీలించినచో, సులభముగా జీవిత మనిత్యమని వెంటనే బోధపడును – బాల్యము నుండి కౌమారయౌవనవార్ధక దశలంది దేహము మృతి చెందును. దాని వలన మనమిటనుండు కాలము స్వల్పమని స్పష్టపడును. తప్పనిసరిగా నశించు దేహమును ధరించి

నామని తెలిసినచో మనస్సు వికలమగును. దేహమునశించు లోపున, చేయనగు కర్తవ్యమును నిర్ణయించికొని తొందరగా పూర్తి చేయవలసియుండును. దేహము నశించినను దుఃఖింప నవసరములేని బ్రహ్మజ్ఞానము నార్జింపవలెను.

834. సంసారసాగరము దుఃఖనిలయమని చెప్పుదురు. సాగరముపై నుత్తుంగతరంగములు, విపరీతమారుతములు, తుపానులు, సాగరములో నక్రతిమింగిలాది ఘోరజంతువులు-మానవుని వేధించును, అయినను, సముద్రముపైనొక రక్షణ నౌక గలదు. అందుచేరి కూర్చుండినచో నెట్టిభయముండదు. అదియే దేవుఁడను నౌక. నమ్మియందెక్కి కూర్చుందుమా, మోక్షమను నొడ్డుచేర్చి, రక్షించును.

835. వ్యాసభగవానుఁడు విష్ణుసహస్రనామములలో దేవునికి 'పుష్పహాసః" యని యొక నామమును జెప్పినాఁడు. పువ్వువంటి నవ్వుగలవాఁడని యర్థము. పువ్వులు పలువన్నెలు గలిగి ప్రాణుల చిత్తముల నాకర్షించి, హాయిని గూర్చును. అటులే దేవుని చిద్విలాసము సర్వప్రాణి హృదయాహ్లాద కరముగా నుండునని చెప్పవచ్చును. కాని యింకొక గంభీ రార్థమున్నది. వికసించిన వివిధ పుష్పములు, తమరూప సౌందర్యసౌరభములచే నాహ్లాదమిచ్చి, కొలది గడియలలో వాడి నశించును. పువ్వులలోని సౌందర్యము పువ్వుల నుద యింపఁజేసిన దేవునిది. మనము పువ్వులను, తదితర సకల సుందర వస్తువులనుజూచి, దేవుని మహిమను గమనించి తరింప

వలెను. పువ్వులను, సుందరవస్తువులను భోగింపఁగోరుదుమా అవి నశించి మనలను మోసముచేసి, దుఃఖ హేతువులగును.

836. జ్ఞానమనగా (గొంత తెలియుట; సంపూర్ణజ్ఞానమనగా, అన్నిటినిగూర్చి అన్నియుఁదెలియుట; తెలియని దేమియు మిగులరాదు. కాని అనంతకోటి విషయములు గలవు. వానినన్నిటిని సమగ్రముగా నెరుగుట కనంతకోటి జన్మములు కావలెను. అందుచే సంపూర్ణజ్ఞానసాధనమార్గము లేదని తోచును. అందుకే వేదాంతము సంపూర్ణజ్ఞానమును బ్రహ్మజ్ఞానమని చెప్పియున్నది. బ్రహ్మజ్ఞానమనగా, సర్వమున కాధారభూతమైన పరమాత్మజ్ఞానము. ఒక్కదైవ సాక్షాత్కారసిద్ధితో, సర్వమును దెలియును. సృష్టికర్త నెరిగిన, సృష్టిలోని సర్వరహస్యములు సమగ్రముగాఁదెలియును. మహర్షులు తపస్సుచే దానిని సాధించిరి. అందుచే బ్రహ్మజ్ఞానమే సంపూర్ణజ్ఞానము.

837. నిద్రలేనిదే యేప్రాణియును జీవింపనేరదు. గాఢనిద్రలేక సుషుప్తి నిత్యమందర కవసరము, కాని సుషుప్తి యనగానేమి? సుషుప్తి పొందిమేల్కాంచి మనయనుభవమును గూర్చి ఒక్కముక్కయే చెప్పఁగలము. చాలసుఖముకలిగినదని; వివరమేమియు నుండదు. ఏలన సుషుప్తిలో నింద్రియములు, దేహము, మనస్సు,బుద్ధియు చేష్టాశూన్యములగును. అందుకే సుఖము లభించును. అంతేకాదు, సుషుప్తినుండి లేచిన వానికి దేహమనోబుద్ధీంద్రియములు, నవ్యచైతన్య

మును గాంచును. ఈ చైతన్య మెచటనుండి లభించినది ? నిద్రలో జీవాత్మ, దేహాదులను విడిచి, పరమాత్మతోఁ గలి యును. పరమాత్మనుండియే సర్వ చైతన్యము లభించును, ప్రతిదినము జీవాత్మ పరబ్రహ్మమును నిద్రలోఁ గాఁగలించు కొనుచున్నదని ఉపనిషత్తు పలికినది. అందుచే నిద్రయనగా దేవుఁడే !

838. భూమియనగానేమి? భూమిఅన్నియు, ప్రాణము, ధనము, వస్త్రము, వాహనము, రత్నము, దేహము, భూమియే యిల్లు, పువ్వులు, పండ్లు, తేనె, సర్వమును, కారణము భూమి దేవుని రూపమే. అటులే, వాయువు, జలము, అగ్ని, ఆకాశము. ఇవన్నియు దేవుని రూపములే. అనగా దేవునిలో సకలమున్న వని స్పష్టము. దేవునాశ్రయించినచో, సకల కామములు సిద్ధి గాంచునని ఉపనిషత్తుచెప్పినది. అనగా నిస్సంశయముగా నీకేది కావలిసినను దేవునాశ్రయించినచో లభించునని తెలియ వలెను.

839. నీ వొక యూరుజేరఁగోరి, పయనమై, తప్పు దారి పట్టిపోవుచో, గమ్యస్థానము జేరవు. కొంతదూరమేగిన వెనుకనైనను, మార్గశంకగలిగి యెవరినైననడిగి సవ్య మార్గము పట్టవచ్చును. అట్లుచేసినచో నాలస్యమైనను నీవను కొనిన యూరుచేరుదువు. ఎవరి నడుగనవసరములేదని గర్వా హంకారముల బెట్టుకొందువా నీకుగతిలేదు. జీవితమట్టిదే. మనప్రయాణము దేవుఁడు లేక మోక్షమను నూరిక, ఇది

నగరికే యాత్రప్రయాణముచేసి, గమ్యముచేరిన సత్పురుషులను గాంచి, మార్గాదులు విడిచి వినయగౌరవములతో సేవించినచో, వారు నుభవ సిద్ధులుగావున, సులభమార్గమును దగ్గరత్రోవను చూపుదురు. ఇదియే సజ్జనసాంగత్యఫలము.

840 చిత్తశుద్ధితో భగవానుని ప్రార్థింపవలెనని అందరు చెప్పెదరు. చిత్తశుద్ధియనగేమి? అదియెట్లులభించును? వికారముల కాశ్రయమిచ్చునదే చిత్తము, నిర్వికారచిత్తము నున దనసంగతివాక్యము. చిత్తశుద్ధినిమ్మని చిత్తమిచ్చిన భగవానునే ప్రార్థింపవలెను. భగవానుని ప్రార్థింపవలెనను నిశ్చయమే చిత్తశుద్ధినిచ్చును. ప్రార్థించుట కొనసాగించిన కొలది చిత్తశుద్ధియేగాక జ్ఞానసిద్ధియు, దైవానుగ్రహసిద్ధియు లభించును.

841. భగవానునేమరక, భజించుచున్నావా? అగుచో నీకిక భయములేదు, దేవుడున్నచోట భయముండదు. అభయమే దేవునిపేరు. నీవు దేవుని భజించుచున్నచో నాతడు నీలో, వెలుపల, సర్వత్రవ్యాపించియుండుట దెలియును. దేవుడుండుచోట భయమేకాదు, మరేప్రమాదములు, దుఃఖములు, అశాంతులు, నుండుట కవకాశమేలేదు. భగవంతుని గట్టిగా భజించి, నిర్భయ దివ్యానంద రాజ్యాధిపతివికమ్ము.

842. దేవుడే కార్యమున కెన్నడును దనపైబాధ్యత పెట్టుకొనడు. ఎంతభక్తుని కైనను, జ్ఞాని కైనను, నొకవేళ నహంకారముదయింపజేసియేదో తప్పుచేయించి, "ఇదిగో

నీతప్పునకు శిక్ష" ననుభవింపుమనును. నిరంహంకారియై నిలువ గల వానిచే, దేవుడే సర్వమును జేయించునుగాని, యింత దప్పొక్కటియునుండదు, దేవుడు తప్పుచేయింపడు. కాని తప్పుచేయించి శిక్షింపవలసి వచ్చినచో నహంకారము నుద యింపజేసి, తప్పుచేయించి శిక్షించును. అందుచే నహంకార ముదయింపకుండ భక్తులు జ్ఞానులు సర్వావస్థలలో నేమరక, దైవారాధనపరులై జీవింతురు. ఇక సామాన్యుల మాట నేమి చెప్పవలెను?

843. మనస్తాపమునకు దావులేదు. అయినచో, నందరు, మహావిద్వాంసులుకూడ మనస్తాపాగ్ని దగ్ధులగు చున్నారేల? ఒకచిన్న విషయమును దెలిసికొనని కారణము చేతనేయని చెప్పవలెను. చేతిలో నావగింజంత కర్మాధికార మున్నచో, అయ్యో, పనిసరిగా జేయలేదనియో, చెడిన దనియో, అనిష్ట ఫలితమిచ్చినదయో మనస్తాపము నందవలెను. నీవు, నేను, సకలజీవులు దేవుని చేతిలో నుపకరణములము. నీవు కర్తవు గానందున మనస్తాపము నీకెందుకు? ఆటబొమ్మలు దుఃఖించుటెచటనైన జూచితివా!

844. ఏకైకకర్త దేవుడేయైనను, కర్మఫలములు మనకు సంక్రమించుచున్నవి గనుక, మనకు సుఖదుఃఖములు తప్పవుకదా, మనకు కర్తృత్వము లేకుండుటచే, ఫలితములు కూడనెట్లు పోవునను ప్రశ్నయున్నది. (1) కర్తృత్వమున్నదని ఆరోపించుకొను నజ్ఞానమే, కర్మఫలములనుగూడ మనపై

నాలోచించి కొనునట్లు చేయుచున్నది. అందుచే సుఖదుఃఖాను భవము తప్పదు. (2) నేను కర్తనుగాను; అన్నియు దేవుఁడు నాచే ఁజేయించుచున్నాఁడని నమ్మినచోఁ గర్మఫలము లంటవు. కర్తృత్వ పరిత్యాగముచేసి, దేవుని నమ్మినవానికి, సుఖానుభవ బాధ్యతలేకుండ భగవానుఁడు చూడఁగలసమర్థుఁడేగాక, పరిపూర్ణ దయామృతరాశి. అహంకారత్యాగమే సన్యాసము; సన్యాసమేమోక్షము.

845, దేవుఁడే సర్వలోక కార్యముల బాధ్యతను స్వీకరించి నడపుచున్నాఁడని తెలిసినచో, నేపనిని గూర్చికాని, 'నీకు – నాకు – ఎవరికి' ఆందోళన చెందు టెందులకు? దేవుని కార్యక్రమము, నవలోకించుట నేర్చి ఆనందించుటే మన నిజమైనపని. అయినను, కొన్ని దేవుని పనులే నిన్ను బాధించునవైనచో, నీవు దేవునితో మొరపెట్టుకొన్నచోవిని, నీబాధ లాతఁడు తగ్గించును లేకతొలగించును. దేవుఁడే సర్వకర్తయని విస్మరించి భక్తుఁడ్వైనచో భక్తునాతఁడు బాధింపఁడు.

846. "ఆత్మను దెలిసికొనుము, అన్యప్రసంగములు కట్టిపెట్టుము"ని ఉపనిషత్తు బోధించుచున్నది. ఎంత మహోపదేశమో! ఆత్మయనగా ఁబరమాత్మయే. ఆత్మను దెలిసికొన్నచో, సకల జగద్రహస్యములు బోధపడును. తెలియనిదేమియు మిగులని బ్రహ్మజ్ఞానసిద్ధిఅదియే; దానితో జరామరణ రహితమైన మోక్షానందమును లభించును. ఇకఁదక్కిన ప్రసంగములకు స్థానమేది! తక్కినవన్నియు నిరర్థకములగును.

బుద్ధిమంతు లీరహస్యము నెరిగి, ఆత్మజ్ఞానసిద్ధికై సకల శక్తు లుపయోగించి కృషిచేసి తరింపనగును.

847. "విశ్వమంతయు నాశక్తిలోనొక అంశమాత్ర ముచే నిలిచియున్నదని భగవానుఁడు గీతలోఁ బలికినాఁడు. అటులే కవి తనకావ్యముకంటె గొప్పవాఁడని చెప్పుదురు. కవిహృదయములో నెన్నియో కావ్యములకు సరిపడు విజ్ఞాన ముండును, అంతయు వ్రాయజాలఁడు. ఏలన, నాతని విజ్ఞా నము వాగతీతమై యుండుటచే దానినెన్నడును పూర్తిగా వ్యక్తీకరించుటకు సాధ్యపడదు. అటులే దేవుని దఖండ విశ్వ దృశ్యమున కతీతమైన అనంతశక్తి. అందుచే బాహ్యదృష్టి వలన దేవుని బాహ్యప్రదర్శనములో నేస్వల్పమో తెలియ నగును. ఆత్మలేక దేవుని మూలతత్త్వ మాంతరంగిక దృష్టికే గోచరించును. అందుచే భారతదేశమనాదిగా అంతర్ముఖత్వ మునకుఁ బ్రాధాన్యమిచ్చి, తపోమార్గము నాశ్రయించి అద్వితీ యాత్మ జ్ఞానసిద్ధిగాంచినది.

848. నీవు జన్మించుటకుఁ గోట్లకొలది దంపతులు, కోట్లకొలది స్థలములు, సమయములు నుండగా, నీవిప్పుడున్న దంపతులు, స్థలము, కాలమున నేల జన్మించితివి. ఈ నీతల్లి దండ్రులకుఁ బుట్టి, యీకుటుంబము పరిసరములయు సుఖ దుఃఖము లనుభవించుచు, లభించిన కొన్ని అవకాశములతో జీవితము నడపి గతించుట - కారణములేని తాటస్థ్యమెట్లగును? సర్వ జీవరాశుల నీవిధముగాఁ బుట్టించి, దేశకాల

శాస్త్రల నిర్ణయించి, నడపు అనిర్వాచ్యశక్తి యొకటున్నదని గ్రహింపలేదా? ఆశక్తినే దేవుఁడనిరి. తదారాధనముచే దుఃఖ విరతియు, సుఖానుభూతియు స్థిరముగా లభించునని మహాత్ములు చెప్పిరి. వారిమాట విని, నమ్మి, ఆరాధించి తరింపరాదా!

849. నిన్నందరు దెలిసికొని, నీ గుణగణములను సామర్థ్యమును, గ్రహించి, నిన్ను పూజింప గోరుదువా? మంచిదేకాని, మొదటిప్రశ్న నిన్ను నీ నిజగుణసామర్థ్యములను నీవు తెలిసికొంటివా? నిన్ను నీవు సమగ్రముగాఁదెలిసికొంటివా? అథమము తెలిసికొన యత్నించితివా? లేదు; నీవెవరు నిన్ను పూజింపవలెనని కోరుచుంటివో వారెట్టివారు? వారినిగూర్చి వారునెరుగరు; తెలియఁగోర్కెయు లేనివారే. నీవెవరో యెరుగని నిన్ను, తామెవరో యెరుగని యితరులు–చేయుపూజ, గౌరవము, తెలిసి చేసిన దెట్లగును? నిన్ను నీవు సమగ్రముగా దెలిసికొన్నచో, జననమరణాదులు లేని, అద్వితీయానందశాంతి, సర్వజ్ఞత్వములు గల ఆత్మస్వరూపివని గ్రహింతువు. అపుడు నిన్నెవరును పూజింప నవసరముండదు.

850. అన్నిటిలో భగవానుని జూడనేర్వవలెను? అన్నిటిలో ననగా, చరాచర ప్రకృతి వస్తువులలో, జగత్తులో జరుగు సర్వక్రియలలో జలనములలో, తాటస్థ్యములలో భగవానునిఁజూడనేర్వవలెను. అది సాధ్యమా? నిస్సంశయ

ముగా సాధ్యమే. ఏలన నన్నిటిలో భగవానుఁడున్నాఁడు. భగవానుఁడన్నిటిలో లేకున్నచో జూచుటయు సంభవింపదు. మరియొక చిత్రము! దేవుని జూచుశక్తి దైవశక్తియే! నీలో దైవశక్తి లేకున్నచో, దేవుని దర్శించుట దుస్సాధ్యమగును. అందుచే జూచుశక్తి, చూడఁబడుశక్తియు నొకే దైవశక్తులు. అనగా జూచునది చూడఁబడునది దేవుఁడే! అప్పుడు నీవెవరో గ్రహించుకొనుము! "తత్త్వమసి" "అహంబ్రహ్మాస్మి" "బ్రహ్మమే నీవ"ని ఉపనిషణ్మహా వాక్యమైయున్నది.

851. స్త్రీకి మాతృస్థానము, పాతివ్రత్యము రెండును ముఖ్యములైనవి. పాతివ్రత్యమామెకు భగవానుఁ డిచ్చిన దివ్యాయుధము. పాతివ్రత్యముచేఁబరమేశ్వర కృపనుసాధించి, మాతృత్వముచే లోకసేవచేసి, ఆత్మమోక్షమును, జగద్ధితము నేకకాలమున సంపాదించుటే స్త్రీ ధర్మము. పతివ్రతగా వనిత జన్మజరామృత్యువులనుతృణీకరించి జయింపఁగలదు. మాతృమూర్తిగా సర్వప్రాణులకు మాతయై సేవచేసి లోక కల్యాణమును సాధించును. ఈ రెంటిలోఁబరిపూర్ణమానవ దైవధర్మములు మేళవించినవి. ఇదియే సనాతనార్య స్త్రీధర్మము. ఈ రెంటిలో నెందులోపము సంభవించినను, జాతిశ్రేయస్సు దెబ్బతినును.

852. ఒకవ్యక్తిని బంధించి, నేత్రములుకట్టి తానెన్నడెరుగని దూరదేశముననొక యింట విడిచి, బంధములూడ్చి, నేత్రావరోధము తొలగించినచో నాతఁడు మొదటవేయు

ప్రశ్నలివి: "ఇది యెవరియిల్లు? ఈదేశనామమేది? నాస్వగ్రామమున కిది యెంతదూరము? ఇచట నాకు రక్షకులెవరు? నా నిజగృహము చేరుమార్గమేది?"

అటులే, ప్రతివ్యక్తియు మాతృగర్భము నుండి యీలోకమున బడినపుడీ స్థితిలోనే యున్నాడు, కాని వెన్వెంటనే యీ ప్రశ్నలడుగు శక్తియాతనికి లేదు. ఆతని యోడ్పు కదిరవే కారణము కావచ్చును. పోనీ, పెరిగి పెద్దవాడైన వెనుకనైనను యీ ప్రశ్నలువేసి, సమాధానము పొంది తన స్వగృహమును జేరుయత్నము చేయవలదా? తన అసలు దేశము గృహము దేవుడే. ఈ లోకము వచ్చినయిల్లు, ఇచట దన్నురక్షించి కోరినచో దన స్వగృహమైన దేవుని జేర్చువాడెవరు? దేవుడే! అందుచే నీలోకమునబుట్టి చేయవలసినది దైవారాధనమే.

853. విశ్వ ప్రపంచనాథుడైన పరమేశ్వరుననంత మహిమ నర్థముచేసికొనుటకే మనకు శక్తిలేదు. పైగా దేవుని విమర్శించుటకుగాని దూషించుటకుగాని పూనుకొనుటకంటె మూర్ఖత వేరుగానుండదు, దైవకృపచే మాత్రమే దేవుని మహిమ కొంత తెలిసికొనుటకు వీలగును. అందుచే భక్తుడు కాగోరు వ్యక్తి వినయవిధేయతలు గలిగి, భగవంతునారాధించుచు, భగవత్కృపనార్జించి, భగవంతుని దివ్యప్రభావము నెరుగగోరవలెను. హాస్యమునకైన, స్వప్నమందైనను దేవుని విమర్శింపబూనుట, దూషింప బూనుటయు, వినాశహేతువగును.

854. ఒక కార్యక్రమమును చేపట్టి, నిర్వహింప దలచితివా? అప్పుడు నీవు పలువురతోఁ గలసి పనిచేయవలసి యుండును. నమ్మినవారు దగాచేయవచ్చును, కొందరు బూటకపు మాటలాడి మోసగింతురు; కొందరెట్టి యాసక్తిని జూపరు. అనుకొనని వారుకొందరు మనశ్శుద్ధితోఁ దోడ్పడుదురు. మొత్తముమీద భిన్నరుచులు, భావములు, గలవారు రాగద్వేషవశులు, అభిసంధిపరులు సమాజములో నుందురు. నిరాశ, నిస్పృహా, చికాకులు సంభవించును. చిత్తశాంతిభగ్నమగుటకుఁ గావలసిన లక్షణములన్నియు నుండును. కాని మార్గములేదా? చెక్కుచెదరని చిత్తస్థైర్యముతో నిశ్చలమనస్సు నిలుపుకొను మార్గమున్నది. నీ కార్యక్రమమున కూహ నీలో జనింపజేసినవాఁడు భగవానుఁడు. సకలదశలలో, అందరలోఁ బలురీతుల భావములు, క్రియలు కలుగఁ జేయువాఁడు భగవానుఁడే, నీకార్యక్రమము నిజముగా భగవానుని లీలయనినమ్మి, పరమశాంత చిత్తుఁడవై యుండవచ్చును. అందుకే గీతాకారుఁడు సర్వకాలములందు యోగివైవర్తింపుమని బోధించినాఁడు.

855. చిత్తశాంతి చెడకుండ నుండుటకెల్లవేళల మననము చేయవలసిన సూత్రమొకటియున్నది. "అన్నియు దేవుని సంకల్పమే నడపుచున్నదిగదా.' దేవుని సంకల్పమేదియైన నమోఘముగా జరిగితీరును. ఆవిషయమున నెవరేమియుఁ జేయఁదగిన దేమియులేదు. మనచేత నేమియు

[illegible] పొందనవసరమేమున్నది? సదాభగవానుః
[illegible] [illegible], [illegible] కేరీతిగా సందర్భము లుండఁగోరుదువో
[illegible] [illegible] [illegible]కొనుము. సామాన్యముగా నీభక్తిప్రమా
[illegible] [illegible]ంచి, నీకు దేవుఁడనుకూలత కలుగఁజేయుటలో
[illegible] [illegible] [illegible]ములేదు.

856. [illegible]చువస్తువులపై మనస్సు సంచరించుటచే
[illegible] [illegible] [illegible]ల్యము స్వభావమైనది. దానికొకటే పరి
[illegible] మార్గము.చలింపని ఆత్మపై ననగా దేవునిపై మనస్సు
ను[illegible] అప్పుడు మనస్సుచలింపదు, గాలివీచుచున్నచోట
[illegible] [illegible] నారిపోవును. దానికి బరిష్కారము గాలిలేని
[illegible] [illegible]ముంచుటే, అటులే నశించు వస్తువుల నపేక్షించి,
[illegible] [illegible]శించుచుంటిమి నాశనములేని దేవునపేక్షించి, నిత్య
[illegible] పొందఁగలము.

857. ప్రస్తుతక్షేమము, భావిక్షేమమునని రెండురక
ములు. మొదటిదానిపై నందరుదృష్టిని కేంద్రీకరించి వలయు
[illegible]ను [illegible] బూనుదురు. కాని భావిక్షేమవిషయ
ములో [illegible] తరువాత జూచికొనవచ్చునని యుపేక్షిం
[illegible]రు. కాని నిజముగా, ప్రస్తుత భావిక్షేమములు విడదీయ
రానివై ముడిపడియున్నవి. ప్రస్తుతక్షేమము వ్యావహారిక
[illegible] [illegible]వాహనాదిక సంపాదనము; భావిక్షేమమనగా
[illegible] [illegible]సంపాదనము. అర్థపరమార్థములు నిజముగా
[illegible] రెండును భగవత్కృపపై నాధారపడియున్నవి.

దైవకృప లేనిచో రెండును లభింపవు. అందుచే భగవదారాధనమే, వర్తమాన భావిక్షేమములకుననగా నర్థపరమార్థ సంసిద్ధికి మూలము. దైవభక్తుని కిహపరములు రెండును పరస్పర పోషకములై సిద్ధించును.

858. జగమంతయు నఖండానంత పరమాత్మ చైతన్యముతో నిండియున్నది. ఆ పరమాత్మ చైతన్యమేకము, నద్వితీయము నమోఘమునగు అనిర్వచనీయశక్తి. ఆశక్తి సంకల్ప చోదనములచే,జగమంతయు స్పందించుచున్నది.చీమ ప్రాకినను పక్షియెగిరినను, మనుజుఁడు మాటాడినను, సూర్యచంద్ర నక్షత్రములు ప్రకాశించినను, సాగరములు ఘోషించినను, మేఘమధ్యమందు మెఱుపు మెరిసినను, ఏమిజరిగినను పరమాత్మ చైతన్య సంకల్పముచేతనే, అంతియకాదు. జడపదార్థమందలి ప్రతిరేణువాత్మ చైతన్యసంభరితమై సంచరించుచున్నది. భక్తుఁడు కాఁగోరునాతఁడు దీనిని గుర్తించి. సర్వగతమైయున్న భగవానుని దర్శింపవలెను. జ్ఞానికాఁగోరునాతఁడునటులే పరమాత్మనన్ని రూపములలోఁదిలకింపవలెను. అదియేభక్తి, అదియే జ్ఞానము.

859. కర్మయేదైనను దుఃఖమూలమే. అందుకే శ్రీశంకరులు కర్మసన్యాసమే ముక్తిమార్గమని బోధించిరి. నిష్కామకర్మ అర్థములేనిది,కోరికలేని పనియుండదు. నిస్సంగబుద్ధితో ఫలాపేక్షవిడిచి, యీశ్వరప్రీత్యైకై కర్మచేయుటనగా కర్మసన్యాసమే. సకామకర్మజయప్రదము కానిచోదుఃఖము;

...కర్మలలో దేవుఁడు కర్మ చేయును; కర్త వేరుగా లేఁడు. ...బుద్ధితోఁ గర్మ చేయుటనగా ఁగర్మ నిమిత్త మాత్రుఁడగు నుపకరణమే కాని కర్తగాఁడు. సర్వకర్త దేవుఁడే. అజ్ఞాని తానుకర్తనని భ్రమించును; జ్ఞాని దేవుని ...త్వమును గుర్తించును.

860. నీకు రానిది – నీది కానిది. నీది కానిది నీకు రాదు; ...దైనది మరెవనికిఁబోదు, అందరకు రావలసిన దిచ్చువాఁడు దేవుఁడు. దేవుఁడు నీకీయదలచిన దానినెవఁడును పుచ్చుకొనలేఁడు; నీకు రాకుండ నెవ్వఁడాపలేఁడు. నీవు కోరినది రానప్పుడా వస్తువు నీది కాదని నీకు రాలేదని దుఃఖింతువా? అది అవివేకము; ఈవివేకము గలిగి, నిర్విచారముగా బ్రదుకుము.

861. పారమార్థికముగా మంచిచెడ్డలు, పుణ్యాపాపములు, విధినిషేధములు లేవు. రాగద్వేషములు, సుఖదుఃఖము లసలే లేవు. పారమార్థికముగా అద్వితీయబ్రహ్మ మొక్కఁడే యున్నది. ఆపరబ్రహ్మ లీలయే జగత్ప్రదర్శనము. వ్యావహారికముగా పుణ్యాపాపములు – సుఖదుఃఖములు, విధినిషేధములు అన్నియు నున్నవి. వ్యావహారిక జీవితము దుఃఖసమ్మిశ్రితమనగా దుఃఖమే, పారమార్థిక జీవితమనగా భగవంతుఁడగుటే. బ్రహ్మవేత్త, బ్రహ్మయే. "బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి." అందుచె, శాశ్వతానందము కోరుదువా, దేవుఁడగుట తప్ప గతిలేదు.

862. అందరు జీవుల బాధ్యతయునాదే, అందుచే ...బాధ్యతనాదే. అన్ని విషయములు నేనెల్లవేళల ఁజూచు

చునే యున్నాను. ఇక నీబాధ్యత నాపైవేసుంచుమనగా, నీవుంచనక్కరలేదు. అదివరకే నాచేతిలోనున్నది. అట్లున్న దని నీవుగుర్తించుటే ముఖ్యము. అందుచే నీవు చేయవలసిన దొకటే యున్నది. నన్నునమ్మి, నాతత్త్వము, మహిమ నెరిగి, తరింపఁగోరు భక్తుఁడవుకమ్ము. అట్టిభక్తుల బాధ్యతను నిర్వహించుటలో, సర్వనియమముల నతిక్రమించి, వాత్సల్యము చూపుదును. నన్నుభక్తితో నమ్మి నీచిన్న పనియే చేయలేవా? ఇంతకంటె చిన్నపనియేమున్నది? ఇదిగో నేను హామీ యిచ్చుచున్నాను. ఈ పైన నీకెన్నడు దుఃఖకారణము కలుగనీయను, నేను మాటయిచ్చి, మరచుటగాని, వ్యతిరేకముగా జేయుటకాని యెన్నడు జరుగదు.'' అని దేవుని మాటలు కర్ణరంధ్రములలో ఘోషించుచున్నవి.

863. నీ యొద్ద నమితధనమున్నది. కాని నీవు దరిద్రుఁడవని నిశ్చయించి భిక్షాపాత్ర చేతఁబట్టి, యింటింటికిఁదిరుగుచు దుస్సహానైచ్యము ననుభవించుచున్నావు. నీవుసిగ్గుపడ వలదా? నీ హృదయమందిరమున నీ యాత్మయనగా బరమాత్మ లేక భగవానుఁడు అనంత కల్యాణ గుణనిధియై నివసించుచున్నాఁడు. అనంత బలసౌందర్య జ్ఞానానందము లాతనిలోఁ బరిపూర్ణత నందియున్నవి. ఏకాంతముగా నొకచోఁ గూర్చుండి, నీ యాత్మైశ్వర్యము కోటిసూర్యుల తేజస్సుతో నెట్లు వెలుగొందుచున్నదో, లోనికి దృష్టిమరలించి చూచితివా? నీ యింద్రియములు, నీదేహము నీమనస్సు, పనిచేయు

హృదయములోనున్న దేవుని శక్తియే, నీవు వేరుగాలేవు, నీవాత్మఁడే! ఈ ప్రకాశమును జూచికొని, సకల నైచ్యములను దహింపుము, ఆ ఐశ్వర్యము లనుభవింపుము.

864. దుఃఖమును తుడిచివేసి మరలరాకుండఁ జేయు నదే జ్ఞానము. వెలుతురు చీకటివలె, జ్ఞానము దుఃఖము నొక చోట నుండఁజాలవు. దుఃఖమును హరించుటే కాక, వాగ తీతమైన శాంతిసౌఖ్యానందములను గలిగినదే జ్ఞానము. అందుకే ఉపనిషత్తు "సత్యంజ్ఞాన మనంతమ్ బ్రహ్మ" యని చెప్పెను. జ్ఞానమే బ్రహ్మ; అదియే బ్రహ్మజ్ఞానము. దాని నెప్పు డార్జింతువు?

865. నీకేది కావలెనో, దానికొరకెవరియొద్ద కేచ టికిఁబోవలెనో, తెలిసికొని పోవుచున్నావు. నీకు జదువు కావలెనని పాఠశాలకు, ఉద్యోగమునకై అధికారులయొద్దకు, సామగ్రి కావలసిన బజారుకు, మందుకావలసిన వైద్యునొద్దకు బోయి, నీపనులు చూచికొనుచున్నావు. ఇవన్నియు దేహా వసరములే. తాత్కాలిక జీవితావసరములే కాని దుఃఖసమ్మిశ్రితములే, పరిశుద్ధమైన అనగా దుఃఖసమ్మిశ్రితము కాని స్వచ్ఛమైన సుఖము కావలెనని యెప్పుడైన కోరితివా? కోరినచో దానికొరకెచటికేగవలయునో ఆలోచించితివా? స్వచ్ఛసుఖము నార్జించుటకు దానినిదివరకే సంపాదించిన వారియొద్దకనగా మహాభక్తులు, జ్ఞానులు, మహాయోగులునైన వారియొద్దకేగి, వారుచూపు సాధనలొనర్చి, తరింపవలెనని తెలిసికొంటివా? ఎంతచిన్న విషయమిది?

866. భగవద్భక్తుఁడగుట సులభమని చాలమంది భావింతురు. పైకిసులభముగానే గోచరించును గాని, అత్యంత కష్టసాధ్యమైనదని పరిశీలించినచో<sup></sup> ఁదెలియును. బిచ్చగానికి సార్వభౌమునికి మైత్రికలియదు. నిశానీదారుకి నిఖిలశాస్త్ర వేత్తకు ఁబొత్తుకుదరదు, మహాదాతకు ఁబరమలోభికి, పతి వ్రతకు ఁగులటకు, వినయశీలునకు, దంభ గర్వాహంకారవశు నకు మైత్రియెట్లు? అటులే క్షుద్రగుణప్రేరితుఁడగు మానవు నకు, అనంత కల్యాణగుణపరిపూర్ణుఁడగు భగవంతునికి సాహ చర్యముండునా? భగవంతుఁడు మాటలకందని మహిమలు అనగా, అఖండజ్ఞానము, దయ, ఔదార్యము, ఆనందము,శక్తి, బలము, మున్నగునవి కలఁవాడు – మనమట్టి లక్షణములను జీవితములో ననుసంధించికొనినచో, కొంత దేవునితో మైత్రి కవకాశముండును. అంతవరకు నేను భక్తుఁడననుకొని సంత సించుట నిష్ప్రయోజనము.

867. దేవుఁడు మానవులకు ఁదమ యిచ్చవచ్చిన రీతిగా ఁగర్మచేయు స్వాతంత్ర్యమిచ్చి, వారిసత్కర్మలకు సత్ఫ లితములు, దుష్కర్మలకు దుష్ఫలితములు ప్రసాదించునని కొందరు చెప్పుదురు. కానిమానవులలో నత్యధిక సంఖ్యాకులు తమస్వేచ్ఛను దుర్వినియోగ మొనర్చుట మనము చూచు చుంటిమి. అత్యల్ప సంఖ్యాకులే తమస్వేచ్ఛను సద్వినియోగ మొనర్తురు, ఇచట నొకప్రశ్నకలదు. మానవుల కిచ్చిన స్వాతంత్ర్యమును పూర్తిగా సద్వినియోగ మొనర్చుకొను శక్తి వారికున్నదో లేదో భగవానుఁ డెరుగకుండనిచ్చెనా?

ఎఱుగకుండ నిచ్చినచో నాతఁడు భగవానుఁడు కాఁజాలఁడు; ఎఱిగియే యిచ్చినచో, స్వేచ్ఛాదుర్వినియోగ మొనర్చు మానవులను శిక్షింపరాదు. దీనియర్థమేమి? ఇది దేవుని లీల యని తలపవలెను.

868. అస్థిరములైనవి స్థిరములైనవని కలుగుభ్రాంతి విచిత్రమైనది. అవియే దేహము, ఇల్లు, విత్తము, బంధుమిత్రాదికము. పూర్తిగానివి అనిత్యములని గోచరించినచో మనము వానితోఁ గలిసి వానినార్జించు వ్యయప్రయాసలు భరింపఁజాలము; అవి నిత్యములు గావని వికారమంది అదృశ్యములై నశించుట వలననే తెలియుచున్నది. అందుచే భ్రాంతివలన అనిత్యములు నిత్యములని తలచి, అవి అదృశ్యములైనపుడు నిత్యములుగావని గ్రహించుచునే మరల భ్రాంతివశులమై జీవితములను గడపుచున్నాము. భ్రాంతిపాశముల ద్రెంపి, నిత్యమైన దానిని వెదకికొని పొంది సుఖించుటే కర్తవ్యము.

869. కాంతాకాముకత్వము, కీర్తికాంతాకాముకత్వము ప్రబల దోషభరితములైనవి. అందు మొదటి దానికంటె రెండవది ప్రబలతరము. వార్ధక్యమున కామినీకాంక్ష సడలును. కీర్తి కాంతాలాలసత్వము వయసుతో నిమిత్తము లేనిది. ప్రజలు తన్ను స్తవ మొనర్పని దినము దుర్దినముగా భావించును, స్తుతిపాఠకులపై హృదయము కేంద్రీకరించి, అట్టి వారిని వెదకిపట్టుకొను యత్నమునకై జీవితమును బలిగొనసగును. ఇది నైచ్యమున కట్టకడపటిమెట్టు. సత్కీర్తినుంచుటే. మనస్స్వచ్ఛశీల సంపదగాంచి సత్పురుషులు, భగవానుఁడు

మెచ్చవలెను. దానికొకటే యత్నమున్నది, ఆత్మావలోకనముచే నీలోఁబవిత్రతను పరిపూర్ణమొనర్చుకొనుటే. అనగా దైవారాధనమే విమలకీర్తిప్రదము, సజ్జనులకిదియే యేకైక మార్గము.

870. భగవానుని జాడలెట్లుండును? అవి అత్యాశ్చర్య కరముగానుండి, అవ్యయానందమునిచ్చును. దేవుని బాహ్యరూపమగు ప్రపంచమే ఆశ్చర్యకరమైనది. ఒక్కభూమి వైపుచూడుఁడు. ఎన్ని అద్భుతమ్మైన జీవరాశులు, వృక్ష లతాదులు, ఆకసమ్ము వైపుచూడుఁడు; ఎన్నిజ్యోతిర్గోళములు వీనిలో వేనిని పరీక్షించినను, భగవానుని జాడలు కనపడును— వలయునది, దేవుని మహిమను దర్శించు భక్తిజ్ఞాన వినయ వివేకములతోఁ గూడిన సముజ్జ్వలదృష్టి. అదియున్నచో, నన్నిటిలో, నన్నితావుల భగవానుని జాడలు గోచరించును. ప్రకృతియంతయు భగవానుని బాహ్యరూపమే, లోకదృష్టితో జూచినచో లోకము, దైవదృష్టితో దిలకించినచో లోకనాథుఁడు గోచరింతురు.

871. ప్రతిక్షణము, భగవానుఁడు చేయించుచున్నదే చేయుచున్నానని నిశ్చయముగాఁ దెలిసికొని, నిర్విచారముగా నుండుట నేర్చుకొనవలెను. నీవు మరేపని చేసిననునిట్టి సుఖము లభింపదు. సకల కార్యములు నీలో, వెలుపల, సర్వత్ర నిండియున్న భగవానుఁడే నడపుచున్నాఁడు. ముక్కుచీదుట, గోకికొనుట, జాగ్రన్నిద్రలు, మాటాడుట, పనులు,చిన్నవైనను,

పెద్దవైనను, నీవుకాదు-నీలోనున్న దేవుఁడే చేయుచున్నాఁడు, తెలియక – నీపనులని తలచి, సుఖదుఃఖము లనుభవించు చున్నావు. భ్రమవిడిచి, అన్నియు భగవానుని దివ్యలీలలని గ్రహించి, సుఖించుటే కర్తవ్యము.

872. ఏరూపములో, నేనామములో, నేవిధముగా భగవంతుని స్మరించు మానవుఁడే దేశజాతి మతకులములకు ఁజెందినను, పవిత్రుఁడే? ఏలన భగవన్మహిమ అట్టిది. అది అఖండ దివ్యాగ్నిజ్వాల. అన్ని కల్మషములను హరించుశక్తి గలది. భగవంతుని నమ్మి స్మరించు మానవులు దైవత్వమునంద ఁగలరు. కాని, భగవన్నామము, భగవద్భక్తి, బలికోరును, రాగద్వేషములు, ఈర్ష్యాసూయులు, స్వార్థపరత్వములు, క్షుద్రవాంఛలు, సంకుచితదృష్టి మున్నగు పశువులను భక్తి హోమగుండమున హోమమొనర్చి, భగవంతుని స్మరింప వలెను. నీవు దేవుని స్మరింప ఁగోరుదువా? ఒక్క ప్రాణినైన ద్వేషింపరాదు, నీకు ద్వేషమున్నదా? భగవంతుని స్మరించు నధికారము లేదు.

873. మానవజీవిత, మనుకొంప అంటుకొని నలు వైపుల మండుచునేయున్నది. దైవకృపామృతవృష్టి, లేక బ్రహ్మజ్ఞాన వర్షపాతము మంటలనార్పు శక్తిగలది. అట్టిపవిత్ర ధారలచే మంటలార్పుకొని రక్షణమందుటే ప్రప్రథమకర్త వ్యము. వివాహము, సంతతి, ధనవస్తువాహనాదిక సంపా దనము మున్నగునవన్నియు నైన వెనుకమంటలార్పు ప్రయ

త్నము వ్యర్థము. ఏలన ఈలోపున జీవితమంతయు భస్మ మగును. అన్నిపనులు కట్టిపెట్టి బ్రహ్మజ్ఞాన మార్జించుపని వెంటనే ఆరంభించి కృతార్థుఁడవు కావలెను.

874. సాంసారిక జీవితములో ననేకసమయములలో నితర కార్యక్రమములనన్నిటిని విడిచిపెట్టి, తత్క్షణమే కొన్ని పనులు చేయవలసియుండును. కాని యేసమయ మందును విడువరానిది భగవంతుని స్మరణము. అది మరచి యేదియు జేయరాదు, చేసితిమా, అవి దుఃఖహేతువులగును. అన్ని వేళల భగవంతుని మనసులో మరువకుండ నుంచుకొనుటెంత వారికిని శక్యముకానిది. దానికప్రమత్తమగు నాత్మశిక్షణము కావలెను.

875. నీవెచటనుండి వచ్చితివో, నీనిజపితరులెవరో, యెచ్చటికి బోవలెనో, నీ నిజస్వరూపమేమో, నీ జనకుని స్వరూప స్వభావములెట్టివో మున్నగు విషయములేమియు తెలిసికొనకుండ, నిచట స్థిరముగా నుందునను భావముతో నెన్నియో లోకవ్యవహారములు జరుపుకొనుచు, నీవీవిధముగా నవివేకివయ్యు బుద్ధిమంతుఁడనని భ్రమించి సంచరించు చున్నావు. నీబ్రతుకేమో దానియర్థమేమో తెలియనినీకు, క్షణములో నదృశ్యములగు భోగద్రవ్యములు దుఃఖమును గాక మరేమిచ్చును? గర్వము విడిచి, నిజము తెలిసికొని బ్రతుకుట ముఖ్యమని గ్రహింపుము.

876. ఏక్షణములోనైనను, కోటివిధములైన దోష ములలో నేదోషమైనను మీదపడి దుఃఖాబ్ధిలో ముంచివేయు

తుచ్ఛదేహమునునమ్మి, జీవితసత్యమెరుగు కృషి, స్వప్నమం దైనను జేయక, క్షణికములగు నింద్రియసుఖముల కెగఁబడి, వానికొరకై తాపత్రయాగ్నిలోఁ గ్రమగ్గి, జీవించుచు, మానవులు లజ్జాహీనులై తాముగొప్పవారమని,పూజార్హులమని భావించు నుస్థితి యుస్పహామైనది. వారి వేషభాషాటోపములు, వారి అహంకార గర్వములుచూచి, తెలిసినవారు, "అయ్యో! పాపము - పసిబిడ్డలు" అని విచారింతురేగాని, కోపము చూపరు. పసిబిడ్డలను కోపగించుటెట్లు?

877. "యోగః కర్మసు కౌశలమ్." భగవద్గీత. యోగమనగాఁ జేయుకర్మలో నేర్పులేక నైపుణ్యము. నైపుణ్య మనగా నపార్థముచేసి శిల్పచిత్రలేఖనాది నైపుణ్యమని భావింప రాదు. ఇది చిత్తవృత్తిని దీర్చిదిద్దు నైపుణ్యము. ఎట్టి చిత్త ముతోఁ బనులు చేయవలెను? ఏభావముతో నన్నిపనులు చేసినచోఁ జిత్తశాంతి నిర్వక్రమై నిలచునో, కర్మలఫలితము లంటకుండునో. పుణ్యపాపములు సంక్రమింపవో, మరియు జన్మబంధములు విచ్ఛిన్నమై, స్థిరశాంతి సౌఖ్యనిలయమగు మోక్షపదవి లభించునో, అదియే నేర్పు. ఆనేర్పునేర్వని వారికి దుఃఖముతప్పదు.

878. కర్మచేయుటలో నైపుణ్యమెట్టిది? కర్మచేయు టయుఁ జేయకుండుటయు సమానము గావలెను. ఏకర్మయుఁ జేయకుండ నెవ్వఁడొక్క క్షణమైననుండలేఁడు. కాని కర్మ చేసి చేయనివాఁడగుట, చేయకయే చేసినవాఁడగుట కర్మ

నైపుణ్యమని గీతబోధించుచున్నది. ఏకర్మయుఁ జేయకుండ నుండ గలవానికి కర్మఫలితములేదు. కాని చేయుట మానిన వాఁడు, నైపుణ్యముతో చేసినవాఁడు - ముక్తినొందుదురు. మానుటనగా దేవుఁడే కర్తయనియు ఁదానునిమిత్తమాత్రుఁడనియు, నెరిగి చేయుట మానుటే; నైపుణ్యముతో ఁగర్మ చేయుటయు ఁజేయకుండుటేయగును, ఏలన, దానుగాదు దేవుఁడే యేకైకకర్తయని యాతఁడు గ్రహించుటచే నిర్వురు సమానులే యగుదురు. కర్మలోని యీరహస్య మెరిగినవాఁడు ముక్తపురుషుఁడగును.

879. సర్వేపల్లిరాధాకృష్ణ పండితుఁడు 86 యేట మృతినందెను. ఆతని జీవితము మిక్కుటమగు శ్రమకులోనైనది. (1) బహుళగ్రంధరచనము (2) ఉద్యోగములు బాధ్యతలు. ఇవి యాతని కవసరములేదు, అవసరములేనివి చేయవలసివచ్చి, శ్రమకులోనయ్యెను. పదవీకాంక్ష, కీర్తికాంక్ష రెండును మిగిలి వానిననుభవించుటకై యోగభ్రష్టుఁడై జన్మించెను. కాని యీతఁడు లోకకల్యాణమునకై సేవచేయలేదా యను ప్రశ్నముదయించును. నిజమే. భగవానుఁడాతనికి పైరెండు కాంక్షలు మిగిలించి,లోకసేవ చేయించెను. కాంక్షలు లేని యోగి, లోకసేవ, శ్రమతో నిమిత్తములేకుండ, సంకల్ప మాత్రముననే చేయఁగలఁడు.

880. భగవంతుని పాదపద్మములపైఁదప్ప, నేయితర వ్యవహారములపైఁగాని, కోర్కెలపైఁగాని మనస్సునుంచిన

యెడల, నవిచ్ఛిన్నముగా భగవంతుని మరపింప జేయఁగలవు. అందుచే గోర్కెలన్నిటిని విడిచిపెట్టుటే ముఖ్యపద్ధతి, అటులు గాక కొన్నికోరికలు మిగిలినచో వానికొరకై మరల గొన్ని జన్మములెత్త వలసియుండును. అందులో భోగకాంక్ష, పదవీ వ్యామోహము, కీర్తిలాలసత్వము దుర్జేయములు. ఎంతమహా వ్యక్తియు వానిని జయింపఁజాలఁడు. వానివలని దోషములను నిత్యము మననము చేసికొనుచు, వానిని జయించుటకు వలయు దైవకృప నెల్లప్పుడర్థించుచుండవలెను.

881. ఖిన్నులు, దరిద్రులు, దీనులు, దుర్దశలలో నలుగువారు, "మాయోగమింతే; యోగమునెవఁడు తప్పింప గలఁడు?" అని నిస్పృహచెంది దైన్యముతో బలుకుచుందురు. సర్వప్రాణికోటికి, యోగకర్త భగవానుఁడే, మనము కర్తల మైనచో దుర్యోగములకు దురవస్థలకు బాల్పడు పనులే చేయము. తప్పుపనులు చేయుదుమా, తప్పులు చేయుటకు వలయు లోపముగల స్వేచ్ఛను మనకు ప్రసాదించిన వాఁడును భగవానుఁడే, అందుచే దుర్దశలనుండి బయల్పడుటకు దుఃఖించుట మందుకాదు, దుస్థిలన్నిటిని దొలగించి, సకల శుభములను ప్రపాదించి రక్షింపుమని పరమేశ్వరుని నిరంతరము ధ్యానించుటయే పరమ కర్తవ్యము, ఈకర్తవ్యమును భక్తితో నిర్వహించిన వారికి భగవానుని రక్షణము లభించిన లక్షల సాక్ష్యములు దిలకించి, నీవు నభ్యసించి ఫలితములను పొందగలవు-అంతఃకరణశుద్ధితో జేసిచూచుటే నీవు చేయవలసిన సాధన.

882. జరిగినది, జరుగుచున్నది, జరుగనున్నది అంతయు భగవంతుని దివ్యసంకల్ప చోదితమై నడచుచుండగా, నందు పకరణముగా నిమిత్తమాత్రుఁడవుగా ఁగాక స్వతంత్రముగా ఁబాల్గొను నవకాశ మావగింజంతయు లేని నీవు ప్రపంచ వ్యవహారముల గూర్చి విమర్శించి, విచారించి, ఆందోళనచెందుటకు నీకవసరమే లేదు. భగవానుని దివ్యలీల ఎంత అద్భుతముగా జరుగుచున్నదో చూచి, భగవన్మహిమను గుర్తించి, రక్షణకోరుటే కర్తవ్యము.

883. ధర్మవిరుద్ధములైన అర్థకామములయెడఁగాంక్షలు హెచ్చుపెరిగి, వంశ, జాతి, దేశవినాశములకు దారితీయుచున్నవి. ఇవి ముఖ్యముగా పశ్చిమనాగరక జాతులలో మనము చూచుచున్నాము. వారి నాగరకతలోని యీఘోర లోపదోషములను పరిశీలింపకుండ, అధిక సంఖ్యాకులగు భారతీయులు వారి ననుకరించుట ప్రమాదసూచకము. భారతదేశము తన స్వధర్మమైన, భోగవైముఖ్యము ధర్మానుష్ఠానము, దైవారాధనములను విడిచిపెట్టి సూటిగా విపత్పరంపరలో దుముకుట నరికట్టుట ముఖ్యము.

884. బలము - దేహబుద్ధిబలము - కామరాగవవిర్జిత మైనపుడు - 'నాస్వరూపమే" యని గీతాకారుఁడు పలికినాఁడు. కాని యీదేహబుద్ధిబలములు దుర్వినియోగమగు నవకాశము లధికముగానున్నవి; నిజమే, యిదిలేకున్నచో, సత్కార్యాచరణము జరుగదు. ఆత్మజ్ఞానము చేసుశిక్షితమగు

బలమే దైవబలము. దేవునారాధింపనిదే యీబలము లభింపదు. దేశములోని యువతీ యువకులకిట్టి సుశిక్షణము నీయని విద్యావిధానము దేశద్రోహకరమగును, ఇట్టి సుశిక్షణమిచ్చుటే హిందూమత కర్మకాండకు లక్ష్యము. పశుబలము పశువులను, ఆత్మబలము దేవతలను తయారుచేయును.

885. దేవుని (దెలిసికొనకుండ నెన్నిదినములు, వత్సరములు, జన్మములు ఇతర వ్యవహారములలో (గడపివేసినను, దేవుని దెలిసికొనక తప్పనిసరియగు దినమువచ్చితీరును. ఏలన, నీకు శాంతి, నిత్యానందము, జన్మజరామృత్యు రహితమగు ముక్తి, దేవుని వలన (గాక, మరొక విధముననెన్నటికిని లభింపవు. అందుచే నీకు (దెలివియున్నచో, వెంటనే, దేవుని దెలిసికొనుపని యనగా, భక్తిజ్ఞాన పూజా ప్రార్థనాదికము నారంభింపుము. ఈపని నెంతత్వరగా నారంభించి, యెంతత్వరగా ముగింప(గల్గిననంత ధన్యు(డవగుదువు. ముగింపనగా దైవ కృపాసిద్ధియే.

886. నిత్యము మనదేహము దగాచేసి నశించునని యెరిగియు, (గన్నులు తెరచిచూచుచునే దగాలో (బడిపోయి, శరీర సౌకర్యసౌఖ్యాదులకై ధర్మవిరుద్ధముగా (బ్రవర్తింప (బూనియున్నాము, అదినిప్పని తెలిసి, అందుచేయిపెట్టి కాల్చుకొని దుఃఖించురీతిగా, మనము వర్తించుట విచిత్రము. ధర్మాచరణము, దైవారాధనము – ఈరెండుపనులకే దేహమును వినియోగించు మహనీయుని కెవరుసాటిరారు.

887. ఎవరికి మాటనిచ్చి, యిచ్చినమాట ప్రకారము చేయకున్నను దోషమే. అట్టిదోషము మనము మనుజుల విషయములో (జేసినచో, మనుజులు మనదోషమునకు (బ్రతీకారము చేయవచ్చును, చేయలేకపోవచ్చును; మన వాగ్భంగదోషమునకు మనకు దేవు(డుశిక్షనీయకుండనుండ(డు. ఇ(క మనము దేవునికే మాటనిచ్చి, వ్రతాదికము చేయుటమున్నగునవి, తప్పినచో, నెట్టిశిక్షనైన నిచ్చుటకు సమర్థు(డు గావున నప్పుడును మనకు శిక్ష దేవు(డే యిచ్చును, వాగ్భంగదోషము నెరిగి మనుజులకు (గాని దేవునికి (గాని పరిశుద్ధచిత్తములో క్షమాపణ చెప్పికొన్నచో, దోషనివారణమగుట నిశ్చయము.

888. భారతదేశము ప్రపంచమునకు గుండెకాయవంటిది; భారతదేశమునకు గుండెకాయ బ్రహ్మజ్ఞానము. భారతదేశపు గుండెదెబ్బతిన్నచో, విశ్వశరీరము దెబ్బతినును. అందుచే భారతదేశ నాయకత్వము, బ్రహ్మజ్ఞానమహత్త్వమునందు (బరమ విశ్వాసముగల వ్యక్తులనే కోరుచున్నది. ఆర్థికరాజకీయసాంఘిక రంగములందాధ్యాత్మిక దృష్టికి లోటు రానీయని అభివృద్ధి పద్ధతులను మనమనుసరింపవలెను. ఇదియే భారతీయ స్వధర్మము; అనగా నిష్కళంకమగు దైవ విశ్వాసము; బ్రహ్మజ్ఞానోపాసనము, మహానాయకులు తాము బొంది, ప్రజలచే ననుష్ఠింప(జేసి, లోకమునకంతకు దివ్యజ్యోతిని జూపవలెను.

889. ఈ ప్రపంచములో నెప్పుడేది యెందుకు జరుగుచున్నదో యెవరికిని బోధపడదు. దానికిఁగారణము సకలమీశ్వరసంకల్ప చోదితమై నడచుచున్నది. ఈశ్వరసంకల్పము మానవప్రజ్ఞకతీతమైనది. మహాజ్ఞానులు, భక్తులు, యోగులు, నిరంతర పరమేశ్వరారాధన నిమగ్నులై యుండియు నీశ్వర సంకల్పము నెరుగఁజాలకున్నారు. ఈశ్వర సంకల్ప మీశ్వరుని కొక్కనికే తెలియును. మరియు నీశ్వరుఁడు దయతోఁ జెప్పిన వారికి ఁదెలియును. ఈశ్వర సంకల్పమును వ్యక్తమొనర్చునవే వేదవేదాంతములు – మహర్షి ప్రోక్త ధర్మములును. మనము నిరాశ చెందనవసరము లేదు. సర్వము పరమేశ్వర విలాసమనినమ్మి, వేదములుచెప్పు ధర్మములనెరిగి, నిరంతర దైవారాధనపరులమై జీవించు వో భద్రత లభించును.

890. ఆలోచనలో, మాటలో, క్రియలో నుద్రేకములకు లొంగనివ్యక్తి లోకపావనుఁడు. కాని యిందొక రహస్యమున్నది. ఈవాఙ్మనఃక్రియానిగ్రహము సత్యధర్మనిష్ఠ, దైవసేవ లక్ష్యములైనపుడే, లోకకళ్యాణమును సాధించును. వ్యావహారికములు స్వార్థములునైన ప్రయోజనముల సాధించుటకై యిట్టి నిగ్రహమునభ్యసించి లోకకంటకులగుదురు. వారి నిగ్రహము దుర్వినియోగమగును, ఆత్మ నిగ్రహమున కుదాత్త లక్ష్యమవసరము.

891. జన్మరాహిత్యమనగా మోక్షమనియే అర్థము. మనము జన్మించుటలోని బహుముఖానర్థ దుఃఖములను

బాగుగా బరిశీలించినచో మరల దేహమును ధరించు పుట్టుకను కోరఁజాలము. కారణము పుట్టుకతో నారంభించి చనిపోవు వరకు నన్నిదశలలోను పీడించు బాధలు దుఃఖములు లెక్కించుటకు శక్యముగానివి. గర్భములో దుఃఖము, పుట్టినది మొదలు బాల్యము తెలియని దుఃఖము, కౌమారయౌవనములలో దెలిసీ తెలియనిదుఃఖము, వార్ధకమరణములలో నిండుదుఃఖము, కావున బుద్ధిమంతుఁడు జన్మరాహిత్యమునే సాధింపవలెను.

892. నేఁడుదుర్విని యోగమైనంతగా సమానత్వమను పదమిది వరకెన్నడును కాలేదు. అసమానతలనన్నిటినీఁదుడిచి వేసి,సమానతను స్థాపింపవలెనని దీనిభావము. పశ్చిమఖండము నుండి యిది బయలుదేరి జగమంతయు నలముకొన్నది. అనేకత్వములో నేకత్వము, అసమానతలో సమానత – ఇవి ప్రకృతి సిద్ధములు. ఆధ్యాత్మికముగా – నందరలో నొకే యీశ్వర చైతన్యమున్నది, అనేకత్వము, నానాత్వము, భిన్నత్వము నీశ్వరకల్పితము. ఏకత్వము, సమానత్వము, సమత్వము విజ్ఞాన సంస్కార బలముచే సాధింపఁదగినవి. అధికార బలము దానిని తొలగింప ఁజాలదు. ప్రజాహృదయ సంస్కారమొక దినములో ఫలించునదికాదు. ఆధికారికసామర్థ్యము, అసమానతలను భిన్నతలను పెంపొందించును. విజ్ఞాన సంస్కారము పని, అధికారము చేయఁగలదని భావించుట బుద్ధిమాంద్యము.

893. సర్వశుభ శాంతి సౌఖ్యములను సంపాదించుట కొరకే మార్గమున్నది. అది దైవకృపాసంపాదనమే. దైవకృప వినా మనమితర ప్రయత్నములెన్ని చేసినను వ్యర్థములగు టయేకాక, అశుభ అశాంతి, దుఃఖములు ఫలితములగును. ఇది అనుభవముచే గాని తెలియని పరమసత్యము-ప్రశాంత చిత్తముతో బరిశీలించి చూచినచో నిది తెలియుట కవకాశ మున్నది. కొలదిమంది దీనిని గ్రహించి, దైవకృప నార్జించి, ధన్యులగుదురు. ఇతరులు దుఃఖసాగర మగ్నులగుట తప్పదు.

894. కడుపులో గుళ్లుపూర్తిగా బయటికి పోయి నచో నెవరికైనను దేహమారోగ్యముపొంది, తేలికపడి సుఖ మిచ్చును. కాని మనకు బాహ్యదేహ మొకటియేయున్నదా? సూక్ష్మకారణ శరీరము లింకను రెండు గలవు. మనోబుద్ధీం ద్రియములు సూక్ష్మదేహము, అహంభావము - జీవభావము కారణశరీరము. అనేకజన్మముల అజ్ఞానసంస్కారములు రెండు దేహములలో నిలువయుండి కుళ్లియున్నవి. ఈలోపలి కుళ్లు పోయిన గాని సౌఖ్యానంద శాంతులనిచ్చు జ్ఞానము లభిం పదు. దైవారాధనముచేతనే లోపలికుళ్ళు నశించును. ప్రాజ్ఞుడు మూడు దేహములలోని కుళ్ళను నిర్మూలించుకొనుట చేయ వలసిన కర్తవ్యము.

895. మీరందరు సుఖపడుట కువ్విళ్లూరుచున్నారు. అందుడ తప్పేమియు లేదు. సర్వవిధములచేతను సౌఖ్యమార్జించు ప్రయత్నము చేసికొనుడు. కాని ఒకమనవి. సౌఖ్యమను

వస్తువేచట లభించునో, దానినార్జించు పద్ధతులేవో ఆపద్ధతులు మనము క్రొత్తగాఁ గనుగొన నవసరము లేకుండ నిదివరకే పూజ్యులు బుద్ధిమంతులు కనుగొని వ్యక్తమొనర్చియున్నారో తెలిసికొని మరియు యత్నించుట మంచిదికాదా? అహంకారా జ్ఞానములతో సౌఖ్యము లేనిచోట వెదకి వేసారి దుఃఖింపనేల?

896. నీపుత్రికను కన్యాప్రదానమొనర్చి, వరునింటికి ఁబంపివేసిన వెనుక, ఆమెపై నీకెట్టి యధికారమును లేదు. ఆమె భర్తయే ఆమెబాధ్యతలనువహించి, యోగక్షేమముల నరసి రక్షించును. ఆమె భర్తనాజ్ఞాపించు నధికారము నీకు లేదు. ఏలన వివాహమనగా నీయధికారమును నీవుమరొకని కిచ్చివేసితివి.

అదేరీతిగా, మనవ్యక్తిత్వమను పుత్రికను దేవుఁడను వరునికొప్పగించిన వెనుక, మనకింక నెట్టి స్వతంత్రతయు నుండ రాదు. దేవునికిచ్చిన మనస్సుతోడను - దైవేతరములయిన ఆలోచనములుచేసి, పనులు నిర్వహింపఁబూనినచో, దైవ ద్రోహమగును. ఒక వరునికిచ్చి వివాహముచేసిన కన్యను మరల నింకొకనికిఁజూపి పెండ్లియాడుమనవచ్చునా? అందుచే నీవు భక్తుఁడవైనచో దైవద్రోహమునకుఁబూనుకొనకుము.

897. ప్రస్తుతనాగరకతలో నన్నియుసమస్యలైనవి. ధనమణ్వాద్యాయుధసంపత్తికై అత్యధికముగా వినియోగించి, లోకులకు దారిద్ర్యమును పంచిపెట్టుచున్నారు. జీవితావసర వస్తువులన్నిటికి ధరలు మితిమీరి పెరిగినవి. సరుకు కలుషితము;

తూనిక దగా, ధర అధికము - మనశ్శాంతికిఁదావులేదు. దీనిని నాగరకతయని పశ్చిమఖండనాయకులు పలుకుచున్నారు. ఇహ లోక జీవితమే దుర్భరమై కాలమునంతయు మ్రింగివేయు చుండగా, పారమార్థికచింతనము, ధర్మానుష్ఠానములకు - కాలము - అవకాశము - పూర్తిగాఁబోయినది. ప్రస్తుత విశ్వ ప్రవృత్తి, దైవేతరము, దైవద్రోహకరమునైనందున, సుఖ మునకుఁదావులేదు.

898. ఏడ్చుట, ఏడ్పించుట, లోకము, వ్యక్తులు, వస్తువులు చేయుచున్నపని. వ్యక్తులేడ్చుటకుఁగారణము స్వార్థము, కోరఁదగనివి కోరిలభింపమి యేడ్పుతప్పదు. వారేడ్చియూరు కొనరు. ఇతరులనేడ్పింతురు. వస్తువులు సుఖమిచ్చునట్లు నటించి, దుఃఖమిచ్చి యేడ్పించును. ఈవిధముగా వస్తువులు వ్యక్తులు - ఇవిగలలోకము - పరస్పర దుఃఖహేతువులై వర్తించుచున్నవి. చిత్రమే! కర్తవ్యమేమి - వస్తువ్యక్తిలోక స్వభావమునెరిగి, సర్వదుఃఖాపనోదనము, సర్వసుఖప్రదానము చేయు - లోకకారణ శక్తియగు భగవానునాశ్రయించి తరిం చుటే, వేరుమార్గములేదు.

899. గతమునుండి అనేకమహోపదేశములు మనకు లభించును. గతమును పూర్తిగా విస్మరింపవలెననుమాట వివేకరహితమైనది. గతమేమియుమనకు బోధింపదా? మరియు వర్తమానస్థితి గతములోననేకాంశములచేతనే నిశ్చితమగును. వర్తమానము అనగా మనముపనిచేయుచున్నకాలము ముఖ్య

మైనది. భావిదశాస్వరూపమును వర్తమానమే నిర్ణయించును. గతానుభవజ్ఞానము, భావిదశాస్వరూపస్వభావమెట్లుండఁగోరుదుమో ఆభావసంపుటి వర్తమానమును నిర్ణయించి నడుపవలెను. ధర్మదైవభీతి, భక్తి కలిగి వర్తమానమున మనము వర్తించుట ముఖ్యకర్తవ్యము. దైవారాధనము గతదోషములను నిర్మూలించి, భావికల్యాణహేతువు కాఁగలదు.

900. మానవజీవితమత్యంత విచిత్రమైనది. దీని కాలోచింపగాఁదలతోకయు ఁగనపడవు. ఇచటననగా నీలోకమున జీవితమెట్టిది? సుఖప్రదమా? ఔనని స్వేచ్ఛగానెవఁడు పలుకఁగలఁడు? ఇదిస్థిరమా? స్థిరమేయనుట కెవఁడు సాహసింపఁగలఁడు? జీవితమునకు దేహమనో బుద్ధీంద్రియములు సాధనములుగదా, అవెట్టివి? అన్నియు దగాచేయునవే; అన్నియు దుఃఖసాగరమున ఁబడఁద్రోయునవే. అన్నియు మిత్రులవలె గోచరించి శత్రువులవలె బాధించునవే. కాదని చెప్పుటకాధారములు లేవు.అందుచే నేమిచేయవలెను?సత్యము నెరిగి, సత్యస్వరూపమగు భగవంతుని మహిమను గుర్తించి, తరించుటే కర్తవ్యము.

901. అద్దములోనందరు తమముఖవైఖరి పరిశీలించికొందురు. ఏమి చూతురు? రంగు, తీరు, అందము, కనులు, కనుబొమలు, నుదురు, ముక్కు, చెవులు, జుట్టు, మొత్తము ముఖవిలాసము చూచికొని, ఎవనిమటుకువాఁడు తృప్తిపడుచుండును. కాని యచటఁగొన్ని ప్రశ్నలున్నవి. అద్దములో

ముఖభాగముల జూచు శక్తియేది? కనులు కనులను, తదితర ములను జూచునా? చర్మమును జూచునా? రక్తమాంసములను జూచునా? చూచుశక్తి. యేశక్తి ముఖభాగములకు చైతన్య మిచ్చునో, ఆశక్తినే చూచును. ఆశక్తి చైతన్యము లేనిదాని నెవండును జూడండు. నిజముగానాత్మ, చైతన్యమును జూచు చున్నది. చూచుశక్తి, చూడంబడు ముఖభాగచైతన్యశక్తియు నొకటే.

904. స్త్రీకి భర్తయే దైవమని వేదములుపదేశించి నవి. అనగా భార్యభర్తను దేవునిగా భావించి, సేవచేసి తరింపవలెను. ఇది స్త్రీని బానిసగాంజేయు స్వార్థపరులగు పురు షులు రచించిన ధర్మసూత్రమని నేటి విద్యాధికుల భావము. అగుచో, వేదమహర్షులు పాక్షికదృష్టితో ధర్మోపదేశముచేసి రనిచెప్పుట సాహసముకాదా? ఇందలిపరమార్థమును గుర్తిం చుట వలదా? అందరును స్త్రీలు, పురుషులు, దైవారాధనము చేతనే తరింపవలెను. భర్తను దేవునిగాపూజించు నభ్యాసము పరమోత్కృష్టమైనది. విగ్రహమును దేవునిగాంబూజించుట చూచుచున్నాము. ప్రత్యక్షచైతన్యమూర్తియగు భర్తను దైవభావముతోనారాధించుట నభ్యసించినచో, భగవానుండు గుర్తించి భర్తలోంగల లోపదోషములనుదొలగించి భార్యను భర్తనుగూడ నుద్ధరించును. ఇకనేవ్రతములు, పూజలు నవ సరము లేదు. సీత, సావిత్రి, దమయంతి, అనసూయమున్నగు మహాపతివ్రతలు తాముతరించి, జగత్కల్యాణమును సాధిం

చిరి. అయినచో, భర్తలో దోషములున్న నెట్లు దేవునిగా భావించుట? దేవుఁడే భర్తగా వచ్చినచో నందరు పూజిం తురు. లోపములున్నపుడే పూజించుటభ్యసించినచో ఆమె పూజలో దేవుఁడే ప్రవేశించి, సర్వదోషపరిహారమొనర్చి. ఉభములను తరింపఁజేయును.

903. తల్లిదండ్రులను భగవంతుని రూపములుగా మన్నించి పూజింపవలెనని వేదవచనము. ఎవరైనను తరించు టకు మార్గము దేవునారాధించుటేతప్ప గత్యంతరము లేదు. మనకీ జన్మమును, దేహామునిచ్చి పోషించి రక్షించిన తల్లి దండ్రులను గౌరవముగాఁజూచుట యుక్తమని అందరును చెప్పుదురు. కన్నతలిదండ్రులకు సేవయెట్లును తప్పదు. లేకు న్నచో పితౄఋణమును దీర్చుట కవకాశమేలేదు. కాని వారి భగవంతునిగా నమ్మి అర్చించుటభ్యసించినచో. మరే జప తపోపవాస పుణ్యక్షేత్రదర్శనాదు లవసరములేకుండ ఁదరించు మార్గము చెప్పఁబడెను. నీభావముననుసరించి, నీ పూజలో దేవుఁడు ప్రవేశించి; నిన్ను నీమాతాపితరులనుగూడ ఁబవి త్రుల నొనర్చి యుద్ధరించును, అందుచే ధర్మానుష్ఠానఫలము తలిదండ్రుల సేవవలనను, భగవంతునిగా భావించి పూజించు టచే మోక్షమునుగూడ సిద్ధించు సులభోపాయమును వేద ముపదేశించినది. నీభావము పరిశుద్ధమైనదైనచో, నీయందలి లోపములు సర్వమునశించును. భగవంతునిగా భావించుటలో నంత అమోఘమహిమగలదు.

904. "అతిథిదేవోభవ" యని శ్రుత్యుపదేశము. ఒక వ్యక్తికి సహాపంక్తిని భోజనమిడుట అతిథిపూజ. ఈయొక్క పని వలన గృహస్థుఁడు తరించు సూటిమార్గము, మనయెడ కృపతో వేదముసూచించి ఆదేశించినది. అతిథికి యథాశక్తిగా అన్నముపెట్టి దానఫలితమును పొందవచ్చును. కాని అతిథి నేదేవునిగా భావించి పూజించుటచే, మానవునికేగాక దేవుని కన్నదానముచేసిన దివ్యఫలితము లభించును. పరిశుద్ధచిత్తముతో నీభావములో దేవునతిథిగాఁదలచి, దేవుని పూజించుచున్నానను భావసంశుద్ధితో భుక్తినొసగుటలో దేవుఁడు నీపనిలోఁప్రవేశించి, కేవలమన్న దానఫలమునేకాక, దైవభావ ఫలితమగు జన్మరాహిత్య బ్రహ్మానంద సౌఖ్యమును నీకు లభింపఁజేయును.

905. "ఆచార్యదేవోభవ" యనునది వేదాదేశము. ఆచార్యుఁడుపాధ్యాయుఁడుగాఁడు, ఆచార్యుఁడనగా బ్రహ్మవేత్తయే. బ్రహ్మవిదుఁడు బ్రహ్మయేయనియు వేదము చెప్పుచున్నది. అందుచే బ్రహ్మజ్ఞానముపదేశింప సమర్థుఁడగు జ్ఞాని లేక ఆచార్యుని భగవంతునిగా సేవించుటవలన, భగవంతుని సేవయే యగును. ఇచట, నంతఃకరణశుద్ధివలయును. శుద్ధచిత్తముతో బ్రహ్మవేత్తయగు గురువును దేవునిగా నారాధించుచో దేవుఁడు నీభావములోని బలముననుసరించి, నీకు దివ్యఫలమైన బ్రహ్మజ్ఞానమును, బ్రహ్మత్వమును ప్రసాదించును.

906. 'చావు' సమస్య మనమాలోచింపవలసిన సకల సమస్యలకంటె ముఖ్యమైనది. ప్రతిప్రాణికి జావు తప్పనిసరి యగుటచేతను, అదియెపుడు తటస్థించునో తెలియనిదగుట చేతను, సర్వదుఃఖములకుఁగారణమైనదగుటచేతను, – చావును గూర్చి అందరు తీవ్రముగాఁదెలిసికొనవలసియున్నది. కాని బ్రతుకు – దాని అవసరములు – మనకాలమునంతను బ్రమింగి వేయుచున్నందున, చావునుగూర్చి తలపోయుటకుఁగాలమేది? చావుబ్రతుకులు మిళితములై యున్నవి, వీనినీవిధముగాఁగలిపి నడపు భగవానుని విచిత్రవైఖరి బుద్ధికతీతమైనది. అందుచే భగవానునారాధించుచు, భగవత్కృపవలననే వానిరహస్య ముల నెరిగి తరింపవలెను.

907. లోకములోని ప్రతివస్తువును, మోసగించుటకు ఁదరింపఁజేయుటకుఁగూడ నుపయోగించునవిగా భగవానుఁడు కల్పించి తన అమోఘప్రజ్ఞను ప్రదర్శించినాఁడు. స్వార్థ దృష్టితోడను, బాహ్యదృష్టితోడను వానిననుభవించి సుఖింప ఁగోరుచో నవి చెడినశించు స్వభావముగలవి కావున, మనల మోసగించి దుఃఖింపఁజేయును. మార్పులోనై, చెడినశించు స్వభావమును దిలకించి, చెడని, నశింపని భగవంతుని వెదకి కొని తరింపుమని వస్తువులు మనల నాహ్వానించి మహోప కారమును చేయుచున్నవి. "మేముకాదు మీకు సుఖసాధన ములము. మాకు, మీకు మూలకారణుఁడైన జగన్నాథు నెరిగి స్థిరసౌఖ్యము సందుటకు కృషి చేయుఁడ"ని వస్తువులు మనల నాహ్వానించుచున్నవని గ్రహింపవలెను.

908. అపరవిద్య, పరవిద్యయని విద్యను రెండు విధములుగా నుపనిషత్తు విభజించినది. వేదవేదాంగములన్నియు నపరవిద్యలోఁజేర్పబడెను. ఎంతసాహసము! వేదమే వేదము నపరవిద్యలో జేర్చినది. ఏలన వేదవేదాంగములు మనకు బుద్ధి జ్ఞానమిచ్చునుగాని అనుభవజ్ఞానము నీయవు. అనుభవజ్ఞానముచే, మనము బ్రహ్మాత్మసిద్ధినిగాంతుము. తపస్సేదానికి సాధనమనియు వేదము చెప్పినది. మృత్యుంజయత్వము బ్రహ్మానందమిచ్చుననియు నదియే నిజమైన విద్య యనియు వేదములు చెప్పినవి. మృత్యుంజయత్వమెట్లు లభించునో వేదములు సూచించును. సూచించిన మార్గముననుసరించి, అనుభవసిద్ధిగాంచుటను పరవిద్యయనిరి. అమృతత్వమిచ్చునదే నిజమగు విద్య. దానినార్జించుటే మానవజాతికి బరమ లక్ష్యమని భారతదేశ దివ్యసందేశము.

909. ఎవరేమిచెప్పినను వినకుము; జీవితములోఁజేయవలసినది – చేయుటవలన – సకల దుఃఖములను నిర్మూలించి, సర్వసుఖముల ననుగ్రహించునది – మార్గమొక్కటే గలదు. సర్వజగత్కారణుఁడు, పోషకుఁడు, రక్షకుఁడునైన పరమేశ్వరుని కృపనార్జించుపనియే చేయవలసినది. ఎంతశ్రమమైనను దానితో సమానమైన పవిత్రకార్యమింకొకటిలేదు. దీనికి భిన్నముగా నెవరు పలికినను వినవలదు. ఈపని చేసినవారికి బరమసుఖము; చేయనివారికి దారుణ దుఃఖము తప్పదు.

910. భగవానుని దృష్టిలోనుంచికొని, వానిని స్మరించుట మానకుండినచో, మనకున్న బాధలుపోవుట, క్రొత్తవి

రాకుండుట జరుగును. కానిబాధలువచ్చి మనలను హింసించు చున్నప్పుడు, సాధారణముగా భగవానుఁడు దృష్టికిరాఁడు. ఒకవేళ నెవరైనను స్మృతికిఁదెచ్చినను, భగవంతుని కీర్తించు నుత్సాహము సన్నగిల్లుటో, పూర్తిగా నదృశ్యమగుటో జరుగును. దీనికొకటే సాధన. బాధలు లేనప్పుడు, నున్నప్పుడు నెల్లవేళల భగవంతుని మరువకుండ సంకీర్తముచేయు నభ్యాసముత్తమదీక్షయై, దీక్షయే మనమైపోవునంతగా జరుగవలెను. అప్పుడేబాధలకవకాశము లేదు.

911. నీకు నేత్రములు లేవా? ఉన్నచోఁజూచుట లేదా? జగన్నాథుఁడెట్టయెదుట, సర్వత్రనిండియుండి, సకల చరాచర జగత్కార్యముల నడపుచుండుట నేలచూడవు? ఆకు కదలిన దానిని దేవుఁడే కదుపుచున్నాఁడనియు, గదలకున్న కదలకుండ దేవుఁడేచేసినాఁడనియు గుర్తించి, తరించి, పరవశుఁడవై యేలసుఖింపవు? తక్కిన భావములన్నిటిని తగులఁబెట్టి, యీపరమసత్యము నాచరించి, దేవుని దర్శించి, గంతులు వేయుము.

912. నీకుఁబ్రబల శత్రువు నెరుగుదువా? అది నీ మనస్సే! అది సర్వకాలసర్వావస్థలలో నిన్ను తప్పుత్రోవ పట్టించుటే పనిగాఁగలది. దానినెట్లు జయించుట? మనస్సు నాత్మయందు లగ్నమొనర్పుము. మనస్సునకుఁగల చాంచల్యాపక్రమాది దోషములన్నియు నాత్మాగ్నిలోఁబడి నుసియై పోవును. ఆత్మయనగా భగవంతుఁడే! భగవంతుఁడు లేక

ఆత్మ, అనంతజ్ఞానాగ్నిజ్వాల. అనగా మనస్సు నాపరమేశ్వర పాదారవిందములకు బంధించియుంచుటే. భగవత్పాదస్పర్శచే మానసము సకలవక్రతలను గోల్పోయి, శుద్ధమై, దైవశక్తియే యగును. అపుడది సత్యమునే దర్శించి, తరించును.

913. నాస్థితికి బాధ్యులెవరు? ఎవరిని నిందింపవలెను? ఈప్రశ్న ప్రతివ్యక్తివేసికొని, దానికియుక్తమైన సమాధానమును దెలిసికొనుట ముఖ్యము. నిజమాలోచించిన నిందార్హులెవరునులేరు. ఏలన నాస్థితికి నేనే బాధ్యుఁడను; అటులే ప్రతివ్యక్తియుఁదనస్థితికిఁదానే బాధ్యుఁడు, అయినచో, నన్ను నేను, ప్రతివ్యక్తియుఁదన్నుఁదాను నిందించుకొనవలెనా? అదియు యుక్తముకాదేలన, నేను, ప్రతివ్యక్తియు నిమిత్తమాత్రులే! సకలప్రాణులీశ్వరాదేశ సంకల్పముల ననుసరించి వర్తించుచున్నారు. అటులయినచో భగవానుఁడే బాధ్యుఁడు గావున నాతనినే నిందింపవలెనా? అదియు యుక్తముకాదేలన, భగవానుఁడనింద్య పరిపూర్ణ పరిశుద్ధమూర్తి. దేవునికేదోషములు లేవు. అందుచే నిందార్హులెవరును లేరు! ఇఁకఁగర్తవ్యమేమి? సర్వజగన్నాథుఁడు, సకల కల్యాణగుణ పరిపూర్ణుఁడు. సర్వదుస్థితి నిర్మూలకుఁడు, సర్వశుభప్రదాతయునగు భగవానుని నమ్మి, సేవించుటచే, మనస్థితి, ఉత్తమస్థితిగామారి, మనముశాశ్వతానందప్రదమగు మోక్షమునుసాధింపఁగలము.

914. "నియమః" అని శ్రీవిష్ణుసహస్రనామమున దేవునిపేరుగాఁజెప్పబడెను. నియమమనగానొకధర్మసూత్రము

ననుసరించి జీవించుట; ఒక పెద్దమనిషికొక మాటయిచ్చి ఆమాట ప్రకారముచేయుట; పరుషవాక్యమునెన్న డుపయోగింపనని నిశ్చయించికొని అటులే వర్తించుట; ఏప్రాణిని ద్వేషింపననివ్రతముగా బెట్టుకొనిఅదిసాధించుట; దేవునెన్నడు మరువనని నిర్ణయముచేసికొని, దానిని సాధించుకృషిచేసి చూపుట మున్నగునవన్నియు నియమములే, ఏయొక నియమము నంతఃకరణశుద్ధితో పాటించి ఆదీక్షలో కృతార్థుఁడైనను, భగవానునికృప కలిగి తరింపఁజేయును. ఏలన, నియమానుసరణమే దైవారాధనమగును.

915. "దేవుఁడేమనుకొనును?" అను ప్రశ్నమును నిరంతరము పారాయణ మొనర్పుము. నీవేమి యాలోచన చేసినను, ఏమిమాట్లాడినను, ఏపని చేసినను, ఈప్రశ్నయే వేసికొని, "దీనికి దేవుఁడు సంతసించును, లేక కోపించును" అను విమర్శచేసికొని, సంతసించుపనియేతప్ప మరేదియుఁజేయకుము – ఇది దైవప్రీతి కరప్రవర్తన వ్రతము ఈవ్రతనిష్ఠకలిగి నీవు జీవించుచో నచిరకాలములో నీకు దైవకృప లభించును. చేసిచూడుము.

916. ఏల విచారగ్రస్తుఁడవై యుంటివి? ఏమి తటస్థించి నిన్ను బాధించుచున్నది? లేకయే దుర్భరస్థితి రానున్నదని భయపడుచుంటివి? నీకు దటస్థించిన, ఁదటస్థింపనున్న కష్టముల నెటులెదుర్కొనుటయో తెలియక బెంగపెట్టుకొని, తలక్రిందులగు చున్నావా? ప్రభుత్వాధికారి, తన కక్రమములని

తోఁచిన పత్రములందలి పంక్తులను దన యెఱ్ఱసిరా కలముతోఁ గొట్టివేయురీతిగా నీవును జేయవచ్చును. అది యెట్లందువా? "అన్నియు భగవానుఁడెరుగును. ఆభగవానునినమ్మి భజించుచో, అన్నియు నాతఁడే సవరణ చేయును." అని దృఢదీక్షతో వర్తించితివా, కష్టరాశులు కాలిపోవును.

917. మనుజులను సంస్కరించి బాగుచేయు బాధ్యత సామర్థ్యము ఎవరిది? పుట్టిలోఁబుట్టినబుద్ధి పుడకలతోఁగాని పోదని తెలుగుసామెత. ఇందు గంభీరార్థమున్నది. మనుజుని లోఁగల ఆసుర లక్షణములు క్షయమై దైవలక్షణములు పెంపొందుటే సంస్కారము. ఇది సులభమైన పనికాదు. అనేక జన్మములనుండి లోతుగాఁబాతుకొనిపోయిన ఆసుర భావములు మార్పుచెందుటకు (బెక్కు జన్మములు పట్టును. అట్టిమార్పుదెచ్చుటకు బాధ్యత, సామర్థ్యము రెండును సమగ్రముగాగలవాఁడొక్క భగవానుఁడే; భగవద్భక్తుల సాంగత్యము వలన భగవత్సేవ, భక్తి లభించును. భగవానుఁడే సంపూర్ణ సంస్కర్త; ఉత్తమసంస్కర్తయని చెప్పవలెను.

918. "సర్వత్రగమచింత్యంచ" గీతావాక్యము, భగవానుఁడన్నిచోటుల నిండియున్నాఁడు. భగవానుని తెలియుట కచింత్యుఁడనగా మనబుద్ధిశక్తి చాలదని భావము. విచిత్రమేమనగా, అంతట భగవానుడు నిండియున్నాఁడు. ఎచట నున్నట్టు కనపడఁడు. అంతా దేవుఁడే, పిసరంత గోచరింపఁడు, దీనిభావము తెలియుదమన్న, తెలివికి లొంగఁడు; ఊహా

తీతుఁడు. బుద్ధిశక్తి చాలదు. భగవానునెట్లు గ్రహించుట? తన్ను భక్తితో భజించినవారి అజ్ఞానాంధకారమును, జ్ఞాన దీపముచేఁబోగొట్టి, తనదర్శనమిచ్చును. అనగా ఆలోచించుటకాదు; భజించుటే మార్గము.

919. "ప్రాప్యవరాన్ నిబోధత" యని కఠోపనిషద్వాక్యము. సంసారదుఃఖ విముక్తి కొఱకిదివరకే విముక్తులైన మహాపురుషులనుదర్శించి వారివలన ప్రత్యక్షానుభవ జ్ఞానమార్జించి తరించుట మిక్కిలిసులభమైన సూటిమార్గము. కాని ముక్తులైన మహానీయులెవరో తెలియుటెట్లు? ముఖ్యముగా ప్రస్తుత దేశములో యోగులమని, జ్ఞానులమని, సిద్ధులమని భ్రమింపఁజేయువారిసంఖ్య మితిమీరినది. అందుచే నిజముగా ముక్తులైనవారి దర్శనము దుర్లభము. కాని నిజమైన ముముక్షుత్వముగలవారికి భగవానుఁడే ముక్తపురుషరూపము ధరించి, బోధించి తరింపఁజేయును.

920. కుర్చీలోఁగూర్చుండి వ్రాసికొనుచుండగా నొక చిన్నచీమ చేతిమీఁద ప్రాకుచున్నది. అదియెందుకెచటికి ఁబోవుటకట్లు ప్రాకుచున్నది? దానిని నెమ్మదిగా క్రిందకూది వేసితిని – నేలపైఁబ్రాకుచున్నది. ఎచటికి? ఎందుకు? దానికి ఁదెలియదు, మనకుఁదెలియదు. మనుజులమగు మనము నటులే సంచరించుచున్నాము. మనుజులు నిజముగాఁదమకేమి కావలెనో, యెరుగకుండుటేకాదు; యెరుగవలెనని యెరుగకుండుటయు సత్యమే. చీమలవలెనే మానవులు తమకుఁదోచిన

ప్రవృత్తిలో మగ్నులై సంచరించి, కొంత కాలమునకు దేహ త్యాగము చేయుదురు. మనకు నిజముగా నేమికావలెనో, దానికొరకేమి చేయవలెనో తెలియుటే నిజమైన మతలక్ష్యము.

921. బ్రదుకుటలోని విషయములఁగూర్చి మనకు 'విసుగు' కలుగవలెను. భరింపరాని విసుగే మోక్షమిచ్చును. ఆహార నిద్రామైధునాదులు – లెక్కపెట్టుటకు సాధ్యము కానంతగా ఁదిరిగి తిరిగి మనము చేయుచున్నాము. రాత్రింబవళ్ళు నిత్యము వచ్చును; జనన మరణములు పౌనః పున్యములే; దీనికి మొదలు తుదలేదు. ఈచేసినవే, జరిగినవే, మరల యథాప్రకారమో, కొలది మార్పులతోఁడనో జరుగుట చేయుట – ఈచర్విత చర్వణమున కంతములేదా? ఎన్ని వేల మారులు, నీవుచంటిబిడ్డవై, బాలుఁడవై, యువకుఁడవై, వృద్ధుఁడవై, మృతుఁడవై, మరలబుట్టి, యీ ఘట్టములలో, బడరాని పాట్లుఁపడి దుఃఖము లనుభవించితివి? విసుగు విరతి అక్కరలేదా? దుఃఖనిర్మూలనము, నిత్యశాంతి సౌఖ్యములు వలదా? విసుగురావలెను; అదిభరింప లేనంతగా వచ్చినప్పుడు, విసుగే ముక్తినిచ్చి రక్షించును.

922. "నీవే నాకుసర్వమును." అని మహాభక్తుని వాక్యము; అనగా భగవానుఁడే సర్వమున కాధారము, పోషకము, రక్షకమునై యున్నాఁడని భావము. ఈపని భగవానుఁడు తప్ప మరెవ్వరును చేయలేరు. ఎంతగొప్పసత్యమో! అన్నిటికి భగవానుఁడే! ముల్లుగ్రుచ్చుకొని బాధించుట మొదలు

మోక్షము లభించి సర్వదుఃఖములు పోవువరకు సర్వము భగ
వానుఁడే చేయవలెను. మన బ్రతుకంతయు నగణిత ప్రమాద
క్లేశాయాస దుఃఖదూషితమే; చిన్నది పెద్దది యేకష్టమున్నను,
దేవుఁడే తొలగింపవలెను. మన దైన్యము, అజ్ఞానము, నీరసము,
భయము, పోఁగొట్టి, ఎన్నడును చెడని, ధైర్యము, జ్ఞానము,
బలము, అభయము, నిరవధికానందము దేవుఁడే అనుగ్రహింప
వలెను. మరెవ్వరును లేరు. అందుచే అన్నిటికి దేవునే ఆశ్ర
యించు టభ్యసించి కృతార్థుఁడవు కావలెను.

923. దేవునితో దాగుడు మూతలాడుటయే అతి
విచిత్ర విషయము. ఎవరికి? నిజమైన భక్తులకు మాత్రమే,
అన్నియు వ్యతిరేకముగా జరుపుచున్నట్లు తోపింపఁజేసి, తుద
కొక్క మెరుపురీతిగా అనుకూలత ప్రసరింపఁజేయునదే భక్త
లతో భగవంతునియాట. కాని దేవుని వ్యతిరేకభావ ప్రద
ర్శనమునకును, తరువాత అనుకూలకాంతి ప్రసారమునకును
మధ్యకాలము భక్తునిభక్తి పరీక్షాకాలము. ఇఁక భగవానుఁడు
రక్షింపఁడని భక్తిబలముచాలనివ్యక్తి,జంకి అపజయమందును.
ఓర్పుతో, శ్రద్ధతో భగవానుఁడు తప్పకరక్షించునని నమ్మిన
భక్తిబలముగల భక్తుఁడు నిర్విచారముగా నిలిచి జయించును.

924. ప్రజాసేవ చేయవలెనని చెప్పువారు, ప్రజా
సేవకులమని చెప్పికొనువారు, వారుచెప్పు దానికి, చెప్పికొను
దానికి నర్థము నెరుగనివారే! అటులే మానవసేవయే మాధవ
సేవయని వారే పలుకుచుందురు. కాని సేవయనగా నర్థమేమి?

సామర్థ్యమున్నప్పుడు సేవచేయుట మంచిదే. కాని భగవాను డొక్కడే నిజమైన ప్రజాసేవకుడు. అనగా మాధవుడే నిజమైన మానవసేవకుడు. సంపూర్ణముగా నిరహంకారియు నసక్తచిత్తుడునై భగవానుడు సకల ప్రాణికోటికి సేవచేయుచున్నాడు. నీవు సేవచేయగోరుచో భగవానుననుకరింపవలెను, భగవానుని లక్షణమెరుగనిదే అనుకరించుటెట్లు? భగవాను నెరుగుటకు భగవద్భక్తుడవు కావలెను. మాధవ సేవచేసి, మాధవునెరిగి, మానవుని సేవింపవలెను.

925. మాధవునెరుగని మానవసేవ క్షుద్రప్రవృత్తి యగును. ఏలన, అహంకార మమకారములు, స్వార్థపరములగు కాంక్షలు, కామక్రోధాదులు జయించిన వానికి గాని మాధవుడు బోధపడడు. మానవసేవ మాధవసేవయగుచో మాధవుని మానవునిలో జూడవలెను. నిరహంకారికి, స్వార్థరహితునికిగాని అది సాధ్యపడదు. మాధవునెరిగి, మాధవుడు సర్వవ్యాపియగుటచే, మానవునిలో మాధవుని దర్శించి, యీశ్వరార్చనగా సేవచేయుటే నిజమగు మానవసేవ యగును. మాధవుని కృపచే మాధవుని తెలిసి, మానవునిలో మాధవుడుండుటెరిగి, మాధవుడిచ్చిన బలముతో మానవసేవ లేక ప్రజాసేవ చేయుటకర్హత నార్జింపవలెను. అది లేనినాడు, స్వకీయక్షుద్రకాంక్షా సేవయే జరుగును.

926. నిత్యప్రసన్నచిత్తము భగవంతుడొసగవలసిన ప్రసాదమే. మనుజ ప్రయత్నముచే నది లభ్యముకాదు, ఏలన,

నిగ్రహచిత్తముగల మహాత్ములమతులు కూడ గొన్ని వేళల జలించి, వికలతపొంది చెడినసంగతి నుదాహరించు పురాణ గాథలు పెక్కుగలవు; లోకములో మనమును జూచు చున్నాము. అందుచే, "నేనుస్వాధీన చిత్తుడను; జితేంద్రి యుడను; అస్ఖలిత చిత్తప్రసాదము నాకున్నది." మున్నగు నహంకార గర్వము లెవ్వనికి దగవు, "భగవత్కృపచే నేటికి నాకు చిత్తస్వాస్థ్యము లభించినది; ముందేమగునో తెలియద", నియేమానవుడు దెలిసి గర్వమును విడిచి వర్తించుట ముఖ్యము. వినయభక్తి వివేకములతో నిరంతర భగవత్సేవ చేయుటయే దీనికి మార్గము.

927. మానవుని దేవునిగా దీర్చిదిద్దుటే వేదమత పరమలక్ష్యము. మానవులలో సత్వరజిస్తమో గుణములు భిన్న పరిమాణములలోనున్నవి. హిందూమత మహర్షుల లక్ష్యమేమన, మానవుని పూర్ణసత్త్వమూర్తిగాను, త్రిగుణా తీతుడైన భగవత్తుల్యునిగాను దీర్చిదిద్దుటే. వర్ణవిభాగము నీలక్ష్యముతో జేసిరి, క్రమసంస్కారము, సముద్ధరణము నాధర్మముగా బెట్టికొని, యీవర్ణవిభాగమును వారుత్తమ భావముతో స్థాపించిరి. కాలక్రమమున బట్టిన దోషములు వారి లక్ష్యశుద్ధిని దూషింపవు. మానవ సమత్వము బాహ్య మునలేదు; ఆధ్యాత్మికముగా నున్నది. ఆత్మదృష్టితో వారు సంఘనిర్మాణమును జేసి, ప్రజాసముద్ధరణమునకు బూనిరి.

928. సమానత్వము ప్రకృతిచే లేనిచోట దానిని శాసనములచే స్థాపింపగోరు పశ్చిమఖండ మేధావులు, ఆర్థిక

రాజకీయ, సాంఘిక సమానతలనుబోధించి ఆధ్యాత్మికతను విస్మరించి. అదియే పరమలక్ష్యమనియు నుత్తమధర్మమనియు బోధించుచున్నారు. ఆంతరంగికాత్మ సమానతను గడించి, మానవజాతి కాత్మోద్ధరణసందేశమిచ్చినది భారతీయధర్మము, రాజకీయార్థిక సాంఘికరంగములు మానవుని బాహ్యావసరములు – వాని వలన క్షణికవిత్తవైభవ పదవీకీర్తులు లభింపవచ్చును. కాని మానవుని మూలాధారమైన ఆత్మలక్షణమును విస్మరించిన పశ్చిమ నాగరకత స్థిరముగా నిలువఁజాలదు. మానవుఁడు మానవులలో సమానుఁడగుట వలన – మానవజాతికిగల మూలసమస్యయైన సాంసారిక దుఃఖములు, జననమరణాది దుఃఖములు తొలగవు. మానవుఁడు మృత్యుంజయుఁడు కావలెను. బ్రహ్మవిద్యయే దానికి సాధనము. అందుచే దానికగ్రస్థానమిచ్చి మానవుని దేవునిగా సంస్కరించు లక్ష్యముతో భారతీయులు నిర్మించిన నాగరకత సాటిలేనిదని తెలియవలెను.

929. శరీర సౌకర్య సౌఖ్యములకై అధికసంఖ్యాకులు జీవించుచున్నారు. ఇది మానవుల మాట; పశుపక్ష్యాదుల సంగతి చెప్పనవసరములేదు. దేహమననేమి? ఎందుకది వచ్చినది? దేహియెవరు? దేహిస్వరూప స్వభావములెట్టివి? దేహి దేహసంబంధమెట్టిది? ఎంతకాల మీసంబధము? సుఖదుఃఖ కారణములెవ్వి? యను ప్రశ్నలు వేసికొని. సమాధానములు దెలిసికొని, యెటులు బ్రతికినచో స్థిరసౌఖ్యశాంతుల

నార్జించి అనుభవింప వీలగునో అటులు బ్రదుకుట మానవుల కర్తవ్యము. ఈసంగతి చెప్పని తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు, విద్యావిధానములు, ప్రభుత్వములు ఘోరమగు అపరాధము చేయుచున్నవి.

930. నిర్దోషులెవరు? అందరును దప్పుచేయువారే! నిర్దోషులు లేరు, తప్పు, లేక దోషమనగానేమి? భగవానునికి దదారాధనకు, భగవంతుని గూర్చిన జ్ఞానమునకు మన మీయవలసిన అగ్రస్థాన మీయకుండుటే దోషము. అధర్మా నృత ప్రవృత్తులు, జారచోరత్వాదులు మాత్రమే దోష ములుగావు. నిత్యసత్య స్వరూపియగు భగవానునెరిగి, అన్నిటి కంటె నీశ్వరసేవకగ్రస్థానమిచ్చి వర్తింపకుండుటతో సమాన మగు ప్రబల దోషమింకొకటిలేదు. దైవతత్త్వమును దెలిసి, దుఃఖమూలమగు నజ్ఞానమును దొలగించి, శాశ్వతానంద శాంతులనొందు యత్నముచేయకుండుటే మహాపాతకము.

931. ఈశ్వర సంకల్పమును గూర్చి నిర్ణయింప బూనుకొనుట దేవతలకును సాధ్యము కానిపని. ఏలన నీశ్వ రుని వలెనే యీశ్వర సంకల్పమును అనంతము, అప్ర మేయము, మానవబుద్ధి కతీతమునగుటయే. మనము చేయ వలసిన దీశ్వరారాధనమే. ఒకటి మాత్రము చెప్పనగును. ఈశ్వరారాధకుల కీశ్వరసంకల్ప మెల్లప్పుడనుకూలమైయుండు నని మహాజ్ఞానులయు భక్తులయు చరిత్రలు చెప్పుచున్నవి. అందుచే మనకసాధ్యమైన పనికిబోక, వినయ భయభక్తులతో

నల్లపుశీశ్వర పాదపద్మముల నాశ్రయించి, నిశ్చలచిత్తముతో భజించుచుండుటే కర్తవ్యము, దీనివలన సాటిలేని దైవకృపా భాగ్యము లభించును.

932. సంపూర్ణసంతృప్తి, అనవరతసంతుష్టి, అనిర్వాచనీయానందము, అఖండశాంతి దేవుఁడనగానివియే. అసంతృప్తి, అసంతుష్టి, అశాంతి లేశమాత్రము నేక్షణమునను లేకుండుటే మోక్షలక్షణము, అదియే పరమాత్మ లక్షణము. అందుచే మనము పరమాత్మనెరిగి తత్తుల్యత్వము నార్జించినఁగాని మన సమస్యలు తీరవు. మన కప్పుడప్పుడు కలుగు సంతృప్తి, నిజమగు సంతృప్తికాదు; ఏలన నదిక్షణిక వస్తుభోగలచే వచ్చునది. అటులే తాత్కాలికముగా మనకు లభించు సంతుష్టి, అసంతుష్టి గర్భమునుండిలభించునదే. అసలు విషయము పరమాత్మేతర విషయములన్నియు అసంతృప్తి. దుఃఖకారణములే. వానిని నమ్మి వాని వెనుక దిరుగుటమాని పరమాత్మ నాశ్రయించిననే, నిజమగు సంతృప్తి, సంతుష్టి లభించును.

933. దేవు నేమని ప్రార్థింపవలెను? ఈ ప్రశ్న మనకు సమాధానము సులభముగా గోచరించును గాని అంతసులభసాధ్యముగాదు. ఏలన మనకు నిజముగా గోరఁదగిన వేవో, మనమెన్నఁడు క్షుణ్ణముగా నాలోచించి నిర్ణయించికొనియుండ లేదు. కాని మనకు నిజముగా గోరఁదగినవి రెండే; బ్రహ్మజ్ఞానము; దైవకృప. వీనివలన మనము జన్మజరామృత్యు

దుఃఖములు పోయి, నిత్యానందశాంతి సౌఖ్యముల నంద గలము. ఇవి మనము ప్రధానముగా గోరదగినవి, తక్కిన అవసరములకు ద్వితీయస్థానమీయవలెను. కావున దేవునెదు టికి బోవుటకు ముందే నిర్ణయము దెలిసికొని పోవలెను.

934. 'నేనను నిజమగు ఆత్మస్వరూపమే విశ్వ మంతయు నిండియున్నది. నీలో నేనే యుండగా, నీవే నేనై యుండగా నిన్ను నేనేమని పిలువవలెను? పిలుచు టెందుకు? నన్ను నేను పిలుచుకొనుటేమిటి? అంతట నన్నే నేనుజూచి ఆనందించుటే. మనము, ఆనందము నెడతెగని రీతి ననుభ వించుటే, మహాయోగులిటులే గడపిరి. నిజమగునేను - ఆత్మ, పరమాత్మ, పరబ్రహ్మ భగవంతుఁడు - అన్నియు నేనే.

935. టాబెఅను జపాను వనితయొకతె ఎవరెస్టుశిఖర మెక్కి విజయము సాధించినది. ధృవమునొద్దకుపోయి నిలువ వలెనని ఆమె కత్యంత ప్రియమైన వాంఛకలదట. అటులే చాల వ్యయప్రయాసలకోర్చి, కొందరమెరికావారు చంద్ర మండలమెక్కివచ్చిరి. కొందరు భూప్రదక్షిణలు చేసిరి, అటులే, వివిధ క్రీడారంగములలో గొందరు ప్రపంచఖ్యాతి నార్జించిరి. ఇవన్నియు గొప్పవిజయములని వారు నితరులు చెప్పికొను చున్నారు! మానవునకు ముఖ్యముగా వలయు వికల్పములేని చిత్తశాంతి, ఆనందమును లభించినవా? జన్మజరామృత్యు దుఃఖములు తొలగినవా? లేకున్నచో వారి విజయములవిలువ యేమి? భగవానునెరిగి, భగవత్కృప వలన లభించు సర్వ

దుఃఖాపనోదక మగు ముక్తినీయని వారి ఘనతలో విశేషమే మున్నది? ఈ సంగతి వారికెవరు తెలియఁజేయుదురు?

936. భక్తుఁడనగా భగవాను నమోఘ రక్షణ వాగ్దాన భాగ్యమందిన మహాపుణ్యపురుషుఁడు. భగవానుఁడు తన భక్తులయెడ నప్రమేయ కృపామృతముచూపును. భక్తుఁడైన వాని నెవరుగాని అవమానించినను, అపకారము చేయఁబూనినను భక్తుఁడు వారియెడ రాగద్వేషములు పెట్టుకొన నవసరములేదు. భక్తుఁడనగాఁదన సకల బాధ్యతలను భగవానుని దివ్యహస్తముల కొప్పగించి జీవించు ధన్యుఁడు, భక్తునికి జరిగిన అవమానాపకారములను దనకే జరిగినట్లు భావించి, సముచితరీతిని క్షణమాత్రములో వారించి, బుద్ధిచెప్పును. ఇది భక్తునికి భగవానుఁడిచ్చిన అనివార్యమైనహక్కు. దీనికెన్నడును భంగముండదు.

937. సంపూర్ణాత్మ సమర్పణము భగవానునికిఁ జేయవలెనని చాలమందియెఱుగుదురు. అది సులభమైన పనిగా భావింతురు. కాని యిది క్లిష్టము, కష్టమైనపని. కొలదిమందికి మాత్రమే సాధ్యమగునది. స్వతంత్ర వ్యక్తిత్వభావము పూర్తిగా నదృశ్యమైపోవలెను. సర్వమునకు సర్వవేళల, దేవునిపై నాధారపడి జీవించు నభ్యాసబలము నార్జింపవలెను. ఈయభ్యాసము నిర్విఘ్నముగా జరుగుటకు గొన్ని జన్మముల కృషి, సాధన అవసరము, కఠోరదీక్ష, వజ్రసంకల్పము, అనన్యభక్తి, సంపూర్ణాహంకారరాహిత్యము సమగ్రముగా సభ్య

సింప వలెను. సామాన్య సాధకులాత్మార్పణమొనర్చి, సాంసారిక తాపత్రయములలోఁ జిక్కువడి, తామిచ్చిన జీవితమును దిరిగి పుచ్చుకొని, దేవుని మరచి, స్వతంత్రముగా వినియోగింప సంశయింపరు.

938. నాగరకతకు – అనాగరకతకు భేదములనేకములున్నవి. ముఖ్యమైనది దైవత్వపశుత్వములకు గల భేదము. పరేంగిత జ్ఞానముండుట లేకుండుటయే భేదకారణము. పరుల హృదయములందలి భావములను గమనింపకుండ వర్తించుటే పశులక్షణము; గమనించి, సముచిత మర్యాదను జూపుటే దైవత్వము. పరేంగితజ్ఞులకు దురహంకారము, గర్వమునశించును. వారు స్వార్థరహితులై వర్తింతురు. పతివ్రత, ఉత్తమ పుత్రుఁడు, గురుశుశ్రూషా పరుఁడగు శిష్యుఁడు దైవసములు. వారి ఉనికియే లోకకల్యాణప్రదము.

939. పాత్రుఁడననెవరు? దేవుని కృపకుఁ బాత్రుఁడైన వ్యక్తియే. దైవకృపాహీనుఁడే అపాత్రుఁడు. ఈనియమమే పాత్రతాపాత్రతలను నిర్ణయించును. సాధారణముగా విద్యాధికులు, ధనికులు, ఉన్నత పదవులందున్నవారు పాత్రతగలవారని లోకులు భ్రమపడుచుందురు. దైవకృపా పాత్రతలేని విద్యాధికుఁడు, ధనసంపన్నుఁడు, నున్నతపదస్థుఁడు–అపాత్రుల సంఖ్యలోఁ జేర్పవచ్చును. అన్నిటికంటె విలువగలది భగవదనుగ్రహమే. అది లోపించిన పదవులు, విద్యలు, సంపన్నతలు దుఃఖహేతువులే. దైవకృపామృతము, సకలాశుభము

లను నివారించి, సకల శుభములను సమకూర్చునని తెలియవలెను.

940. సృష్టి భగవంతుని విశ్వవినోద ప్రదర్శనము మనకు గొన్ని కష్టములు కలిగించునవి, అనిష్టములైనవి, కొన్ని ఘోరముగా గనపట్టునవి లోకములో జరుగుచున్నవి మనము దేవుని వినోదములోని యర్థమెరుగము, ఎఱుగనివారమై, ఎరిగిన వారివలె, సృష్టికి దేవునికి అపార్థములు చెప్పుదుము. ఇది మన అహంభావమును, అజ్ఞానమును ప్రదర్శించును. అనంత పరిపూర్ణతగల భగవంతుని ప్రదర్శనములో, దోషమునకు దావెట్లుండును? పరిపూర్ణత్వము, దోషము నేకకాలమున నుండజాలవుకదా? అనగా మనకు చూపట్టు దోషము దోషము కాదన్న మాట - మనమజ్ఞులమగుటచే దోషముకానిది దోషమువలెఁగనపట్టుచున్నదని తెలియవలెను. భగవన్మహిమ నెరిగినపుడది తెలియును.

941. "ఎందుకై తమరు జీవించుచున్నారని" మనమెవరి నడిగినను సత్యమగు సమాధానము మనకు లభింపదు. ఎవరోకొలదిమందిమాత్రమే యుక్తమగు జవాబునీయ గలరు, సత్యమగు సమాధానమిట్లుండనగును; "నేను జీవించుచుంటకు గారణమమోఘము, అనతిరిక్తమునైన యీశ్వర సంకల్పమే, అదియే యీశ్వరశాసనము.' కాని అజ్ఞానాహంకార దూషితులమై మనమందరము, "మాకర్మమిట్లున్నద" నియో, "మేము చేయవలసిన పనులున్నవనియో," 'మాకు తెలియు

దని"యో బహువిధముల (జెప్పుదుము. మనజీవితమీశ్వర సంకల్ప రూపమనియు, మనమదిగుర్తించి, యీశ్వరతత్త్వ మహిమలనెరుగు నిరంతర కృషిచేసి ధన్యులముకావలెననియు నిశ్చయించుకొనవలసియున్నది.

942 దుఃఖమును బోఁగొట్టుకొను టందరకిష్టమైన పనియేకాని అది అంతసులభముగాఁ బోవునదా? మానవుఁడీ లోకమున జన్మించుచునే దుఃఖముతో నారంభించి, దేహమును వీడువరకు దుఃఖముతోడనే జీవించును. దుఃఖమును బోఁగొట్టుకొనుటకు సూటియగుబాట యొకటున్నది. భగవంతుని స్వస్వరూపజ్ఞానసిద్ధియే ఆబాట; ఆ బాటనువిడిచి, తప్పుత్రోవలబట్టి, తప్పుత్రోవల నడచిన దుఃఖము, అసలు దుఃఖము రెండుదుఃఖముల ననుభవించుట లోకులకుఁబరిపాటియైనది. జన్మించుచునే యుక్తమార్గముపట్టి, భగవద్ధ్యానము చేరువాఁడెంత ధన్యుఁడో!

943. నిన్ను బాధించునదేదైనను, స్వల్పాధిక సంభవములేవి బాధించినను, నీకు వెంటనే భగవానుఁడు స్మృతికి రావలెను. "హేభగవాన్! దీనిని దొలగించి, రక్షింపుము"ని నీవు స్మరించుటయు నీకుఁగలిగినబాధ తొలగిపోవుటయు జరిగినచో నీవు భక్తుఁడవే యని చెప్పనగును. ఇందుమూఁడు విషయములిమిడియున్నవి. (1) భగవంతుఁడే నీకు సకలవిధ రక్షకుఁడని నీకు గుర్తు, గురి యుండవలెను. (2) అట్టి నిశ్చల భక్తిభావము నీకున్నదనుటకు సాక్ష్యము నీకేబాధయు నసలే

కలుగరాదు. (3) మానవత్వ దోషముచే నొకవేళ నేబా
మైనను కలిగినచో, నీవు దేవుని స్మరించినంతనే అది తొల
పోవలెను. ఈవిధముగా నీ భక్తి నీ త్రివిధాంశములచే
బరీక్షించుకొమ్ము.

944. కూలంకషముగా భగవన్మహిమ నెరిగి, భగ
ద్ధ్యానము నేమరకచేయుచు జీవించుజన్మము పరమపావనము
పూజ్యతమమునైనది. దానియర్ధమేమనగా జననమరణ మహ
ప్రవాహములోఁబడి కొట్టుకొనిపోవుచున్న వానికిఁ దీరము
జేరుటకొక తెప్పదొరికినదన్న మాట. వేలకొలది జన్మములు
క్షుద్రక్షణికసుఖభ్రాంతివశములై, అనంతక్లేశ దూషితములై
జరిగిపోవుచున్నవి. శాంతిలేదు, సుఖములేదు; ఆనందము
లేదు. కష్టములు, దుఃఖములు దుస్సహములై బాధించును.
ప్రతివ్యక్తికిది నిత్యానుభవములోనిదే. కాని, దుఃఖానుభవా
భ్యాసము బలవత్తరమై, దుఃఖమునేకోరుట విచిత్రవిషయము.

945. ఎన్నియోసారులు తప్పులుచేసి, చేసినటులు
దెలిసి, వానినెన్నిసారులు దిద్దికొనినను, మరలఁదప్పులుచేయు
చుండుట విచిత్రవిషయము. అనగాఁదప్పులుచేయకుండుటకు
మనప్రయత్నముచాలదు. తప్పులుచేయు నభ్యాసబలమును
ద్రొక్కివేసి, తప్పులు చేయకుండు నభ్యాసబలమధికము
గావలెను. ఇందలి రహస్యమిది, మానవశక్తికి లొంగునది
కాదు. దైవకృప, లేక గురురూపమున దైవకృప నార్జించి
నచో నిది సాధ్యమగును. ఇది స్పష్టముగా గ్రహింపవలెను.

946. సమస్యయెంత గడ్డుదైననీకేమి? నీవుపరిష్కరించువాఁడవైనచో నీవు బాధపడవలెనుగాని, పరిష్కర్త భగవానుఁడైనపుడు, భగవంతునికెట్టి సమస్యయైనను తృణప్రాయమైనపుడు, నీవుక్లేశపడుటెందులకు? నీవుచేయవలసినది వచ్చిన సమస్యను భగవానుని పాదములపైనుంచి, నిశ్చలచిత్తముతో ధ్యానించుటే. నిజమే, గడ్డుసమస్య వచ్చినపుడెంతవానికైనను చిత్తముత్తలపాటునొంది, భగవానుని విస్మరించుటకెక్కుడవకాశమున్నది. ఇచటనే – సాధన కావలెను. సమస్యవచ్చినపుడాక్షణముననే, దానిని భగవానునికర్పించి, "తండ్రీ! ఇది యీరీతిగా వచ్చినది. దానిని నీవే దయతోఁ బరిష్కరించి రక్షింపు" మని వేడుకొను నభ్యాసబలము నఖండముగా నార్జించికొనవలెను.

947. మనకుఁగల, సంభవించు సకల సమస్యలను మన ప్రయత్నముచేఁ బరిష్కరింపఁ బూనినపుడు, మనశక్తులల్పములైనవి గావున, మనకుఁగోపతాపములు విషాదప్రమాదములు తటస్థించును; వానిని దొలగించు శక్తిలేదు. మనము దుర్భరదుఃఖమగ్నులము కాకతప్పదు. సమస్యలను సృజించునాతఁడు, పరిష్కరించునాతఁడు భగవానుఁడే యని తెలియకంకు బుద్ధిమాంద్యమే మన దుఃఖమునకుఁగారణము. అసలు జన్మించుటే పెద్దసమస్య; మిగిలిన సమస్యలు దాని సంతానము. జన్మరాహిత్యమను ముక్తిసిద్ధికై దేవునాశ్రయించి, సాధించుటే, సర్వసమస్యా పరిష్కారమార్గము.

948. శాంతమువహించుటకు లేశమాత్రమవకాశము లేనపుడే శాంతముజూపుటయు, సంతోషమున కీషణ్మాత్ర మాధారము లేనపుడు సంతసింపఁగలుగుటయు మానవు నుదాత్త గుణమునకును, సుశిక్షిత చిత్తమునకును చిహ్నములు. నీకట్టిశక్తియున్నదో లేదో తెలియుటెట్లు? నీకు దుస్సహ విషాద క్లేశములు సంభవించినపుడే. అందుచేఁదనభక్తులైన సాధకులకు భగవానుఁడు క్లిష్టకష్టపరిస్థితులు కల్పించి, వేరొక వైపుననుండి, వానితాకిడికి దట్టుకొని, శాంతిసామరస్య సంతోషములతో నిలుచుశక్తి నుజ్జ్వలింపఁజేసి, తరింపఁ జేయును.

949. గడుసువాఁడెవఁడు? స్వార్థసిద్ధికై సర్వవిషయములు నుపయోగించుకొనువాఁడని లోకులసామాన్యభావము. కాని యది నిజముకాదు. క్షణికవస్తు సంపాదనమందుఁగాక, తరింపఁజేయు శాశ్వతజ్ఞాన సంపాదనమందు సర్వవిషయములను, సకలశక్తుల నుపయోగించుకొనఁగల యాతఁడే గడుసువాఁడు. అదియెట్లు సంభవించును? సకల విషయములను సర్వశక్తులను రెండులాభములకై వినియోగించుట నేర్చికొనవలెను. (1) తనకుఁజికాకు కలిగించి బాధించు సర్వవిషయములను మనోనిగ్రహము, ఆత్మశిక్షణముల కవకాశములుగా నుపయోగించికొనవలెను. (2) బాహ్యదృష్టితోఁగాక, సర్వ విషయముల నాంతరంగికదృష్టితోఁదిలకించి, అవి దేవునిఁజూపు వానిగా స్వీకరింపవలెను.

950. "ఏమండీ! మీరు ప్రతిదినము దీక్షతో జపము చేయుచున్నారా?" యని ప్రశ్నింపగా, సామాన్యముగా సమాధానమిట్లుండును; "సంసార తాపత్రయములచే జపము చేయుటకు చిత్తస్వాస్థ్యము లేదు. చేయు కోరిక గలదు కాని జరుగుట కవకాశము లేదు" ఈ లోకములో జపమొక్కటే చిత్తశాంతినిచ్చు శక్తిగలది. చిత్తశాంతి లేనిదే జపమెట్లు? జపముచేయనిదే చిత్తశాంతి యెట్లు? ఈసమస్యపరిష్కారమగు టెట్లు? చిత్తశాంతి జపఫలితము; జపఫలితమును జపారంభము లోనే కోరుట వివేకమెట్లగును? అశాంత చిత్తముతో జప మారంభించి, భగవానుని స్మరించినచో, జపమధికమైనకొలది అశాంతిపోయి, చిత్తస్వాస్థ్యములభించును. చిత్తశాంతిని జప మిచ్చుననగా భగవానుఁడిచ్చునని యర్థము.

951. చేసిన పాపములు దుఃఖమునిచ్చును; పుణ్యములు సుఖమిచ్చును. అత్యధిక సంఖ్యాకులు పాపపుణ్యములు రెండును చేయుదురు. అందుచే సుఖదుఃఖములరెంటి, నుపాధి భేదముల ననుసరించి, అల్పాధిక ప్రమాణములతో ననుభవించుచున్నారు. కాని దుఃఖలేశమునైన నెవఁడుకోరును? అధికపుణ్యమధిక సుఖమునిచ్చును. అఖండపుణ్య మఖండ సుఖమిచ్చును. అఖండపుణ్య మఖండపుణ్యరాశియగు భగవానునాశ్రయించుటచేతనే లభించును. అఖండసుఖమనగా మోక్షానందమే. అఖండ సుఖమును గోరుదువా? భగవంతు నాశ్రయించి, కృతార్థుఁడవుకమ్ము.

952. పరబ్రహ్మతత్వ పదవినిగోరువాఁడు బ్రాహ్మణుఁడు. తక్కిన అల్పకాంక్షలను తృణప్రాయముగా విసర్జించి, బ్రహ్మజ్ఞానముద్వారా బ్రహ్మైక్యసిద్ధికై, జీవిత సర్వస్వము నర్పణము చేయువానిని బ్రాహ్మణుఁడనిరి. జ్ఞానకర్మానుష్ఠానములలోఁదానులోకుల కాదర్శప్రాయుఁడై, లోకోద్ధరణమే పరమలక్ష్యముగా సర్వజీవరాశిని, నిష్కామప్రేమతోఁజూచు నాతఁడే బ్రాహ్మణుఁడు. పరబ్రహ్మారాధన తత్పరుఁడై, సకల జన కల్యాణకాముఁడై, బ్రాహ్మణుఁడు జీవించినందుననాతని, దేశాధిపతులు ప్రజలు అపూర్వమర్యాదలతోఁ బోషించి పూజించిరి. లక్ష్యచ్యుతిచే ఁబతితులైన బ్రాహ్మణులు నామ ధారకమాత్రులై తమ పూజ్యతను దామే గోల్పోవుటలో నాశ్చర్యము లేదు. బ్రాహ్మణులీ విషయమును సమగ్రముగా గుర్తింపవలెను.

953. మహాదారుణ ప్రమాదములో మనమందరము చిక్కుకొనియున్నాము. అట్టిప్రమాదములో నుంటిమని కాని, ప్రమాదమునుండి బయటపడుటకు మహాశీఘ్రప్రక్రియ లవసరములని తెలిసి ఆచరించుటకుఁగాని మనము పూనుకొనలేదు. మనకాబుద్ధి కలుగుట లేదు; ఒకించుక కలిగినను, దానికివలయు వేగతీవ్రతలు మనకుదయించుట లేదు. మనలోపముల వలన ప్రమాదముమారదుకదా! మృత్యువే అట్టిప్రమాదము. దాని రాకకుఁగాలనిర్ణయము లేదు. అదివచ్చినంతనే, మన వ్యవహార జీవితమంతయు ధూళిలోఁగలిసిపోవును. అందుచే, అన్నిటిని

కట్టిపెట్టియో, అన్నిటిలో నిస్సంగదృష్టితోఁ బాల్గొనియో, అనంతకృపానిధియగు పరమేశ్వరునారాధించి, మృత్యుంజయులనై తరింపవలెను.

954. "నేనేమి చేయుదునో అదంతయు నీకనవసరము, నే ననంత ప్రపంచమును దృష్టిలోనుంచికొని, యెన్నియో చేయవలసియుండును. వానినిగూర్చి ఒకవేళ వివరించినను, నీకు బోధపడవు; ఏలన అది నీబుద్ధికతీత విషయము. నీవు చేయవలసినది నన్ను నమ్మి భజించుచుండుటే. అట్లు నీవున్న చో నీ యోగక్షేమములు నేనుజూచుటలో లోపమెన్నడును జరుగదు. ఈరీతిగా నేనభయప్రదానమిచ్చి రక్షించువాఁడనై యుండగా, నీవునన్ను మరువక స్మరించుచుండలేవా? ఇంతకంటె వేరొకమార్గములేదు. నమ్ము, భజించు, తరించు"మని భగవానుని అమృతవాక్యములు.

955. వేదాంతము, దైవభక్తి, బ్రహ్మజ్ఞానము ననగా నేమో తెలియునా? అన్నిటిని విడిచి, యేమూలనోకూర్చుండి విషాదమగ్నతలోఁ గాలము బుచ్చుటకాదు. సర్వతంత్ర స్వతంత్ర పరిపూర్ణుఁడగు పరమేశ్వరునాశ్రయించి తత్కారుణ్యామృతమునార్జించి, మహాభక్తుఁడై కోరినసర్వము నాజ్ఞాపించి పొందుశక్తికలిగి జీవించుట; లేదా, వేదాంతమెరిగి, బ్రహ్మజ్ఞానమార్జించి, పరమాత్మతాదాత్మ్యమునొంది విశ్వప్రపంచమును శాసించు సామర్థ్యముతో జీవించుటయో; ఏశక్తి గలిగినను, నిర్భయత్వము, సంకల్పమాత్ర సర్వకామ

సిద్ధి; అప్రతిహతముగా సర్వమునాజ్ఞాపించు పదవిపొంది, భక్తి శేఖరుఁడవో, బ్రహ్మవేత్తవో అయిమనుటయే. ఇందు విషాదదుఃఖములకుఁగాని, దైన్యభయములకుఁగాని తావు లేదు.

956. ఈశ్వరధర్మ మప్రతిహతమైనది. ఆధర్మ చక్రములోఁబడి, చక్రవర్తులేగాక, దేవేంద్రాదులును దానిని సరిగా గుర్తించి, అనుసరింపనందున, తుత్తినియలై పోయిరి. దైవధర్మమహిమను గుర్తించి. గర్వాహంకారములు విడిచి భజింపవలెను; వినయవినమిత శిరస్కులమై, ముకుళిత హస్త ములతో నమస్కరింపవలెను; భయభక్తిశిక్షితశుద్ధ చిత్తము లతోఁబూజింపవలెను. నిత్యానుష్ఠానతత్పరులమై జీవించుచో, నీశ్వరకృపామృతసిద్ధియు సకల దుఃఖవిముక్తియు, నిరవధి కానంత శాంత్యానందములును లభించును. లేదా, మన అజ్ఞతకాని అహంకారదూషితవిజ్ఞతకాని మనలను రక్షింప జాలవు.

957. భయాందోళనలు, విషాదవిచారములు, శోక దుఃఖములు వరుసగావచ్చి బాధించుపరిస్థితులలో బ్రదుకు కొనసాగించుటే జీవితము. ఉపాధిభేదముల ననుసరించి, తర తమభేదములుండును. ఇది లేకుండఁజేసికొను నుపాయ సాధ నములఁజెప్పునదే మతము; దుఃఖహేతువులను, సౌఖ్యమార్గ ములను సత్యస్వరూప స్వభావములను చర్చించి నిర్ణయించు నదే తత్త్వశాస్త్రము. తెలిసియో, తెలియకయో సర్వ ప్రాణులు నిత్యానందశాంతి జీవితమునకై పరితపించుచున్నవి.

సంపూర్ణానందశాంతి సమృద్ధమూర్తియగు సత్యమైన పర బ్రహ్మోపాసన మొకటే పరిష్కారమార్గము. మార్గాంతరము లేదు.

958. ప్రపంచము, నందలి వ్యక్తులు, వస్తువులు, మన దృష్టి ననుసరించి సుఖదుఃఖముల నిచ్చును. ప్రపంచము మారదు; మనదృష్టి పరివర్తనమందవలెను. మన చిత్తవృత్తి యుక్తరీతి మారినచో, దుఃఖమిచ్చు ప్రపంచమే సుఖమిచ్చును. అందుచే మనకువలయున దాంతరంగిక పరివర్తనము. మన మభిమానించిన వ్యక్తిని ప్రేమతోఁజూచి సంతసింతుము; మనము ద్వేషించిన వ్యక్తిని క్రోధముతోఁజూతుము. రాగ ద్వేషక్రోధములు విసర్జించి, నరిశుద్ధ మనస్సుతోఁజూచినచో మనమందరను ప్రేమభావముతోడనే చూతుము. మనలోపలి కాలుష్యము బాహ్యమున గోచరించి, దుఃఖకారణమగును. భగవంతుని సర్వత్ర, సర్వములో, సర్వమయునిగాఁజూచు టభ్యసించి, సంపూర్ణాత్మపరివర్తనమందినచో, విశ్వమంతయు భగవానుని దివ్య తేజస్సులోగోచరించి, అఖండానందమిచ్చును. అజ్ఞాన చిత్తమునకు జగత్తు దుఃఖమయమై, జ్ఞానసిద్ధిగాంచిన చిత్తమునకు జగత్తు దేవునసంత తేజోరాశియై గోచరించి, ఆనందప్రదమగును.

959. తెలియనిది లేనివాఁడు, చేయజాలనిది లేని వాఁడు, సర్వసద్గుణ పరిపూర్ణుఁడు, గుణాతీతుఁడు, అకలంక ప్రేమనిధి; అఖండానందశాంతినిలయుఁడు, భక్తజన సేవకుఁడు;

జ్ఞానిజనతాదాత్మ్యము గలవాఁడు నగు భగవానుఁడున్నా డని నమ్ముదువా? నమ్మి వినయభక్తిశ్రద్ధలతో భజింతువా? అగుచో నీకేమియు లోటుండదు. నీకు విషాదక్లేశదుఃఖము లుండవు; ఆపదలెన్నడు తటస్థింపవు; నీకు మరల పునర్జన్మ ముండదు; మోక్షానందము లభించును. నీకు దుఃఖము, భయము; అశాంతికలిగెనా? నిస్సంశయముగాఁ దెలిసికొనుము, నీకు దేవునియందు విశ్వాసము లేదని; నీకు భక్తికాని జ్ఞానము కాని లేదని; తెలిసికొని లోపముల సవరించుకొనుము; అంత కంటె నీకుఁజేయవలసినదేమియును లేదు.

960. ఎవని దేహమును వాఁడు సూక్ష్మముగా పరి శీలించి కొనవలెను. ఈ దేహస్వరూప స్వభావములెట్టివో గ్రహింపవలెను. దీనివినియోగము బహుక్లిష్టమైనదే! దీనిని పట్టుకొనుటకుఁగాని విడుచుటకుఁగాని వీలులేదు. దేహమగ్ని వంటిది; సద్వినియోగమొనర్చినచో, మన అవసరములఁదీర్చి సుఖమిచ్చును; దుర్వినియోగ మొనర్చితిమా, సర్వదహన మొనర్చును. మానవ దేహము ధర్మమోక్షసాధనము. దాని నత్యంతశుద్ధముగా నుంచికొని, సత్కర్మాచరణమునకును భగ వదారాధనమునకును వినియోగించినచో, నిహపరసౌఖ్య ములు సిద్ధించును. అట్లుగాక, అయుక్తాహార విహారములచే భోగకాంక్షాపరితృప్తికై దుర్వినియోగమొనర్చినచో, సకల ప్రమాదములు, దుఃఖములు సంభవించును. తనకత్యంతసన్ని హితముగానున్న దేహము నెట్లుపయోగించికొని సుఖింపవలెనో యెరుగకుండ బ్రదుకువారి దౌర్భాగ్యమెవఁడు వర్ణింపఁగలఁడు?

961. ఆహా! ఎంత అఖండశాంతి! ఎంత అవ్యయానందము! మనస్సును దేవుని దివ్యపాదపద్మములకు ముడిపెట్టి కూర్చుండిన వానితో (దుల్యుడుండఁడు. వాని పదవి దేవేంద్రాదుల (దలదన్ను పదవి; వాని శాంత్యానందములు సార్వభౌములకు లభింపవు. కారణము; ప్రత్యక్షమే! భగవత్పాదములనుండి, శాంతిఆనందమునను అమృతగంగ వాని హృదయములోనికి వరదలై ప్రవహించును. అట్టి పుణ్యపురుషుని హృదయము పునీతమై, యెట్టి దోషములు లేకుండఁ దుడిచి వేయును. వానినిఁజూచి మృత్యువుపారిపోవును; వానికిఁగలుగు సంకల్పమేదైన వెంటనే సిద్ధించును. వానికిక, భయము, ప్రమాదము, దుఃఖము నెచటనుండుట కవకాశము లేదు. ఇది పరమ రహస్యము. ఆచరించిచూడు; ఇక చేయవలసిన దేమున్నది?

962. మానవుల నెవరినైన నేకారణముచే నైనను ద్వేషించుట తప్పే! సత్పురుషులను మనము ద్వేషింపము; పైగాఁబూజింతుము; ఇక దుర్జనులను ద్వేషింపవలదా? వలదు! దుర్జనులు పెక్కు తెగలుందురు. జారులు, చోరులు, సురాపానాది దారుణకార్య పరతంత్రులుసరే! స్వార్థపరులు, ఈర్ష్యాసూయాగ్రస్తులు, వాక్పారుష్యము, పరనింద, పొగరుబోతు తనము, అవిధేయత, అకారణ శత్రుత్వము మున్నగుతమోగుణాధికులు - వీరిని ద్వేషింపవలదా? వలదు. కారణము? గాఢాంధకారతుల్యమైన అజ్ఞానమే వారిదోషములకు

హేతువు. మన కర్తవ్యమేమి? జ్ఞానిని పూజించుట; అజ్ఞానిని అల్పజ్ఞానిని మనమనుకంపతోఁజూచి, వీలైనచో వారి అజ్ఞతాల్పజ్ఞతలను దొలఁగించుట; ఇదియే ఉత్తములగువారిపని.

963. కామినీకాంచన కీర్తికాంక్షలు – ముముక్షువులకుఁ బ్రబలశక్తి సంపన్నములైన శత్రువులు. ఈశక్తిత్రయమే లోకమునేలుచున్నది. ఇవి ప్రాణికోటి హృదయములలో స్థిరనివాస మేర్పరచి కొన్నవి. వానికి వశులై, మానవులు సకల దుఃఖము లనుభవించుచున్నారు. ఈ విషయవిషవలయమునుండి బయటపడుట కుపాయములభింపక తల్లడిల్లుచున్నారు. యౌవనమున కామాభిలాష, సకలావస్థలలో ధనకీర్తిలాలసతయు యావజ్జీవమును బాధించుచున్నవి. కామినీవాంఛాసంస్కారము వార్ధకమునను బాధించును. అయినచో నీశక్తిత్రయమును జయించు మార్గములేదా? తపోబలమొక్కటే వానిని తృణప్రాయముగా జయింపఁగలదు. వాని బలము తపోగ్నిదగ్ధమై నశించును. అందుచే ముముక్షువు నిరంతర తపస్సంపన్నుఁడు గావలెను.

964. దేహారోగ్యమునకొక దివ్యౌషధరాజమున్నది. ఏ రోగములు రాకుండఁజేయును; ఉన్నవానిని పోఁగొట్టును. సకల జాడ్యాపహారియైన మందది. అది అందరకందుబాటులోనున్నది. వ్యయప్రయాసలతో వైద్యులయొద్దకుఁబోనవసరము లేదు. ఏ వెంగలకుఁ దావీయని స్వచ్ఛప్రసన్న మానసమే దానికి మందు. నిరంతర సంతుష్ట చిత్తునకు – అనగా చిత్త

ప్రసాదము గలిగినవాని దేహమున కనారోగ్యమెన్నటికిని రాదు. మరి మానసికారోగ్యమెట్లు లభించును? మనో రోగమునకు మందు లేదందురు. మందులేని రోగముండదు. మందున్నది; అదియు నందరకందుబాటులోనిదే. మనస్సును శుద్ధమొనర్చి దేవుని పాదములకర్పించుటే. దేవునంటిన మనస్సు పరిపూర్ణశుద్ధిని. ప్రసన్నతను, అనన్యభక్తిని, అఖండ జ్ఞానమునుపొందును. మానసిక మాలిన్య దహనముతో దేహ మాలిన్యములు నశించును. బజారు మందులుమాని, సంసారు లందరు నీ మందులువాడి, దేహమనో మాలిన్యములను పోఁ గొట్టుకొని ముక్తులు కావలెను.

965. విశ్వమంతయు జీవుల రోదనధ్వనితో నిండి యున్నది. మనుజుల వ్యవహార ప్రసంగములన్నియు నేడ్పు లోనివే. పక్షులకూతలు, పశువుల అరపులు, మనుజుల సంభా షణములు - ఏడ్పురూపములే; సంగీతనాట్యకళాప్రదర్శన ములు ఏడ్పులోనివే. కొందరు లోపల, కొందరు పైకి, కొందరు ప్రత్యక్షముగాను, కొందరు ప్రచ్ఛన్నముగాను, కొందరు తమవలె నేడ్చువారితోఁ జెప్పికొనియు నేడ్తురు. కొందరు నవ్వుటలేదా? నిజమే వారి నవ్వుదుఃఖముతోఁ గలు షిత మైనది. సకల జీవులకు తమకుఁగల కోర్కెలు ఫలింపమి, దుఃఖము సంభవించును. అయినచో నేడ్పులేకుండు టకు మార్గము లేదా? లేకేమి? మన యేడ్పువిని, యేడ్పుకు గారణములు తొలగించి, స్థిరమగు సంతోషమిచ్చువానివద్ద

నేర్పుటయే మార్గము. అట్టివాఁడెవఁడైన నున్నాఁడా? భగవానుఁడే అట్టివాఁడు. సర్వజీవకోటిని, వారియేడ్పులకు గారణములను వారియేడ్పులను పెట్టినవాఁడే యాతఁడు. ఆతఁడే నేడ్పుతీసివేసి, శాశ్వతానంద మీయఁగలఁడు. భగవానుని నమ్మి, భక్తితో స్మరించినఁజాలును; ఇక నెప్పుడు నేడ్వవలసిన యావసరముండదు.

966. "ధర్మక్షేత్రే కురుక్షేత్రే" యని భగవద్గీత ఆరంభింపఁబడెను. ధర్మక్షేత్రమనగా ధర్మమును నిర్ణయించి రక్షించుభూమి. యుద్ధమునకై అచటఁజేరిన రెండుపక్షము లలో ధర్మపక్షము విజయమునుగాంచును. ధర్మక్షేత్రమున జరిగిన యుద్ధము ధర్మసూత్రముల నిరుపక్షముల వారంగీకరించి జరిపినదే, సామదానభేద దండోపాయములలో మొదటి మూఁడును నిరర్థకములైనందున ధర్మసంస్థాపనార్థమై యుద్ధము తప్పనిసరియైనదని భగవంతుఁడగు శ్రీకృష్ణుఁడే నిర్ణయించి నడపినాఁడు. యుద్ధభూమి కిరుపక్షముల పక్షమువచ్చిన యోధులకే యుద్ధము పరిమితమై నడచినది. నేటి ప్రపంచమున జరుగు యుద్ధములకొక ధర్మసూత్రముకాని, యుద్ధనీతి వర్తనముకాని లేదు. ప్రపంచమంతయు రణరంగమే. యుద్ధసంబంధములేని వారికి ప్రమాదము తప్పదు. స్వార్థపరములైన లక్ష్యముల సాధించుటకే కాని. యుద్ధములు నేఁడుధర్మసంస్థాపనార్థము జరుగు లేదు; ముందు జరుగవు, ఇఁక అణ్వస్త్రప్రయోగము జగము నెరుద్రభూమిగా మార్పఁగలదు. నేటి విజ్ఞులిట్టి యణ్వస్త్ర విజ్ఞానమును సృజించుటే నాగరకత యనిరి.

967. అర్జునునకు శ్రీకృష్ణభగవానుఁడు విశ్వరూప సందర్శనము నిచ్చెను. దానిని భరింపలేక, అర్జునుఁడు సౌమ్య రూపమునుజూపుమని భగవానునర్థించెను. భూలోకము విశ్వ రూపములోనొకభాగమే. మనమందరము భూమండలమందలి విశ్వరూప ప్రదర్శన భాగములను దిలకించుచున్నాము. చేత నాచేతనమయమైన సృష్టిని భగవానుని దివ్యరూపముగా మనము గుర్తించి, నమస్కరింపవలెను. సకల రూపము లాభగవానుని లీలారూపములని తెలిసి భగవన్మహిమను గుర్తించి, స్మరించి, తరించుట మనకర్తవ్యము.

968. కొంతకాలమునకు లోకమునుగూర్చి విసుగు, జుగుప్సపుట్టును; పుట్టవలెను. ఒకేకూర నిత్యము తినగలమా? ఒకేయింట నిరంతరముండుటకు విసిగి, బంధుమిత్రాదుల యిండ్లకుఁబోయి తిరిగివచ్చుచుందురు. అటులే ఒకేగ్రామము నొకే పట్టణము; నొకే దేశమునందుఁ జిరకాలముండి విసిగి, స్థలాంతరములు దిరిగివచ్చుచుందురు. అటులే యీలోక ములోఁజాలకాలముండి, విసిగి, దేహమునువీడి లోకాంతరము లకుఁబోవుచుందురు. ఈ విసుగు, జుగుప్స, అసంతృప్తి కలుగు టకుఁగారణమేమి? లోకములు. లోకములోని వస్తువులు, విసుగు, జుగుప్స, అసంతుష్టి, అశాంతి, అసుఖమునకు వ్యతి రేకముగా విసువము, సంతృప్తి, శాంతి, సుఖము నెడతెగని విధమునసనిచ్చు వస్తువును వెదకికొమ్మనియే, ఆవస్తువే భగ వానుఁడు. అట్టిభగవానునెరిగి స్మరించి తరించుటే మార్గము.

969. సర్వవిషయములగూర్చియు సర్వసత్యాంశ సంపూర్ణ సమన్వయజ్ఞానమే భగవానునిది. అదియే బ్రహ్మజ్ఞానము లేక సంపూర్ణసత్యము. విషయము లనంతములుగావున వానినిగూర్చిన సత్యాంశములును అనంతములు; వాని సంపూర్ణసమన్వయమును అనంతమైనదే. అందుకే భగవానుని సర్వజ్ఞుఁడనిరి. సర్వజ్ఞుఁడగు భగవానునల్పజ్ఞులమగు మన మెట్లు తెలిసికొనఁగలము? అసాధ్యము, సంపూర్ణజ్ఞానము లేక సర్వజ్ఞత్వము సంపూర్ణానందము. అదియే బ్రహ్మానందము. అది నిజముగా మనకసాధ్యమైనచో మనగతియేమి? అది మనకుపూర్తిగా సాధ్యమేయనియు నంతియకాక, అదియే మన నిజస్వరూపమనియు నుపనిషత్తులు చెప్పుచున్నవి. అజ్ఞానముచే జ్ఞానమావృతమైనదని గీత చెప్పినది. తపస్సాధనముచే నజ్ఞాననివృత్తికాగలదు. అజ్ఞానము తొలగినంతనే, మనమే సర్వజ్ఞత్వసిద్ధి నందుదుము. మనము నూతనముగా సంపాదింపనవసరములేదు; అదిమన సహజస్వరూపమేయని గుర్తింతుము, తపస్సేదానికి మార్గము.

970. దేనికెంత విలువనీయవలెనో, యెరిగి వర్తించుటే నిజమైన జ్ఞానము, నాగరకతయును. విలువలేని వస్తువులకు మితిలేని విలువనిచ్చి, తరువాత నావస్తువుల కంతవిలువ లేదని గ్రహించి యేడ్చుట యేలోకులు చేయుచున్నపని. క్షణములో నదృశ్యములై పోవువానికి మిక్కిలి తక్కువ మూల్యమును, స్థిరమై కాలత్రయమందును. మార్పులేక, శాశ్వతా

నందశాంతులనిచ్చు వస్తువున కనంతమైనవిలువ నిచ్చుట నిజమైన తెలివి. అట్టివస్తువు నతివేగముగా నార్జించుయత్నములు, కార్యక్రమములన్నియు మిక్కిలి విలువైనవి. అట్టి అమూల్య వస్తువుకే, సత్యమని, భగవంతుఁడని, పరమాత్మయని, బ్రహ్మమని నామములీయఁబడెను. కావున ధర్మకర్మాచరణముచే, తపోధ్యానములచే, పూజాప్రార్థనాదికములచే, నట్టి సత్యము నారాధించుటే నిజమైన తెలివి.

971. "నీకేమి లోటున్నది? వలసినవన్నియు నీకుఁగలవు. ధనభూగృహాదులు, కనకవస్తువాహనములు, దాసదాసీజనము, బంధుబలము, సంతతి మున్నగునవన్నియునున్న నీకేమిలోటు?" అని సంపన్నునిగూర్చి లోకులు పలుకుదురు. భగవద్భక్తునిగూర్చి విజ్ఞులేమనవలెను? ఇట్లనవచ్చును; 'నీకేమయ్యా! నీఅదృష్టము మఱేసంపన్నునికిఁగాని, రాజులకుఁగాని రాజాధిరాజులకుఁగాని లేదు. నీవాశ్రయించినది విశ్వప్రపంచ చక్రవర్తియగు పరమేశ్వరుని, ఆయనకుఁగల అఖండైశ్వర్య జ్ఞానానందములు, అనంతదయాదాక్షిణ్యములు, అప్రమేయ శక్తి సామర్థ్యములు సాటిలేనివి. చిద్విలాసముతో నీవుతన్మయుఁడవై నృత్యముసల్పఁగలవు; నీకు మృత్యుభయము; దుఃఖప్రాప్తి, పునర్జన్మయాతన మున్నగునవేవియు లేవు. నీఅతిశయ భాగ్యము నెవరువర్ణింపఁగలరు?"

972. బుద్ధిమంతులకందరకాకే కార్యక్రమ మత్యంత ముఖ్యము మాత్రమేగాక, అత్యంతవేగముగా చేయఁదగినదై

యున్నది. అదియే భగవాను నాశ్రయించుపని. అనగా ప్రాపంచిక పనులన్నియు వదలుకొనుమని యర్థము కాదు. ఒక మట్టిముద్దవలెనో, ఒక శిలవలెనో 'నిశ్చలముగా, నిష్క్రియ తోడఁగూర్చుండి, భూభారముగా జీవింపుమని యర్థము కాదు. చతుర్విధపురుషార్థసిద్ధికై పవిత్రకర్మానుష్ఠానతత్పరుఁడవై, కార్యదీక్ష, దక్షత, మహోల్లాసోత్సాహములు కలిగియుండ వలెను. కాని ఒకటిమాత్రము మఱువకుము. పరమేశ్వరారాధనమున కత్యుత్తమ ప్రాధాన్యమిచ్చు కార్యక్రమములను విడువకుము. సర్వేతరకార్యక్రమములు, సవ్యముగా నడచి జయప్రదములై, నిత్యసుఖప్రదములై వెలయుటకు భగవదనుగ్రహ సంపాదనమే ముఖ్యమని మఱువకుము. ఇది మరచితివా, దుఃఖమునుండి నిన్నెవ్వఁడును రక్షింపఁజాలఁడు.

973. నీకిష్టముకానివి, లోకములో నెన్నియో యున్నవి. నీజీవితములోను, కుటుంబబంధములలోను, బంధుమిత్ర వర్గములలోను, దేహసంబంధ విషయములలోను, నీకిష్టము లేనివెన్నియో జరుగుచునేయుండును. నీకిష్టము లేనివే కాక, నీకవమానము, క్షోభ, దుఃఖమును గలిగించున వెన్నియోయుండును. వానిని గమనించి, నిరంతరఖేదమోద తరంగములలో మున్గుచు, తేలుచు బ్రదుకుకొనసాగింప వలసిన దేనా? అదియేపద్ధతియైనచో నీవు దుఃఖింపవలసిన అవసరము లేని క్షణమొక్కటియు నుండదు. ఈదుస్థితిని పోగొట్టుకొను నుపాయమన్వేషించుట శీఘ్రకర్తవ్యముకాదా? నిత్యసంతో

ష్టివై మనఁగలుగు సాధనములను తెలిసికొనవలదా? భగవంతుని సేవించి అనిష్టపరిహారమును, ఇష్టావాప్తిని పొందుచే మార్గముని మహనీయులు ప్రకటించియుండలేదా? వానిని విని యున్నచో నేలనడుముకట్టి దైవానుగ్రహము నార్జింప యత్నింపవు ?

974. ఆపత్సమయములలో నెట్లునడచుకొనవలెను? అనగా వ్యతిరేకపరిస్థితులు, అనుకొన్నవి జరుగక, అనుకోనివి అనిష్టములుజరిగి, మనస్సునెంతవానికైన చలింపఁజేసి విషాద విరోధములు, వ్యయప్రయాసలు, నష్టదుఃఖములు కలిగింపవచ్చును. మానవజన్మములో నివి తప్పనివి. అట్టి సందర్భములలో మనము నియమత్రయమునుపాటించి కృతార్థులము గావచ్చును. (1) మన స్థితి కితరులెవ్వరు కారకులుగారని యెరిగి రాగద్వేషవైరములను దరిజేరనీయకుండుట (2) మితభాషిత్వము లేక మౌనము వహించుట. (3) నిశ్చంచల మనస్సుతో హృదయమును భగవానుని పాదములఁజేర్చి, రక్షణార్థమై ప్రార్థించుట. మొదటి రెండును మనస్సును నిర్మల మొనర్చును. మూడవది, సర్వాపదలను దొలగించి, సకల శుభములను జేకూర్చును.

975. లోకములో నొకవైచిత్ర్యమును మనము గమనింపవలసియున్నది. భగవానుఁ డేప్రాణిని సుఖపడనీయఁడు. అనగా ప్రాణికోటి సుఖముగా జీవించుట భగవానుని కేమాత్రమును గిట్టదు! జీవులు సుఖముగానుండుట

నాతఁడు చూడలేఁడు! అనగా భగవానుఁడు దయానిధి యందురే; ఇంత కఠిన హృదయుఁడా? సౌఖ్యమను వస్తువు త్రికాలాబాధ్యమగు వస్తువందే యుండును. అట్టి వస్తువు భగవానుఁడే. భగవానుఁడు వినా యే వస్తువును సౌఖ్యమీయఁజాలదు. నిజముగా స్థిర సౌఖ్యమీయఁజాలని తాత్కాలికవస్తుజాలమునందు సుఖమున్నదని భ్రమించి, ప్రాణులు దుఃఖమునే సుఖముగాభావించి యనుభవింప యత్నించుచున్నారు. ఎండమావులలోని నీరు త్రావిన దాహముపశమించునా? అందుచే లోకములోని వస్తువులను సంపాదించి వానిననుభవించుటచే సుఖింపవచ్చునని భ్రమించు జీవుల భ్రమను దొలగించు నిమిత్తము భగవానుఁడు మేల్కొలుపుగా కష్టములు కల్పించుచున్నాఁడు. నిప్పని తెలియక చేయిపెట్టు బాలుని బలవంతముగా బయటికిలాగిరక్షించు తల్లివలె, భగవానుఁడు సుఖములేని వస్తుభోగముచే సుఖము లభించునను భ్రమలోఁబడు మనుజుల వెంటనే బయటికిలాగి రక్షించు నుపాయమే ఆపదలు సృజించు దేవుని లక్ష్యము. పచ్చికచే గప్పఁబడిన పాడునూయిని గమనింపక, నేలయేయని అడుగిడు మానవుని ప్రక్కకునెట్టి రక్షించు నుపాయమే దేవుని విచిత్రలీలలలోని ఉద్దేశమని గ్రహింపవలెను.

976 ప్రతిజీవి హృదయ కోశమందు నీశ్వరుఁడు దివ్య తేజోరాశియై ప్రకాశించుచున్నాఁడని వేద వేదాంతములు ఘోషించుచున్నవి. అజ్ఞానాచ్ఛాదితుఁడైన జీవి, తనలోనే

యున్న పరమాత్మను దర్శింపలేకున్నారు. హృదయస్థుఁడగు జనార్దనుని దర్శించుటకుఁ జిత్తైకాగ్రత, ఆంతరంగిక దృష్టియు నవసరము. ఏకాగ్రచిత్తము నంతరంగములోనికి మరలించి నచో, కోటిసూర్యప్రభతో వెల్గొందు పరంజ్యోతి దర్శన మగును. కాని పరిపూర్ణచిత్తైకాగ్రత సునాధ్యమా? పరి పూర్ణచిత్తశుద్ధిగలవానికిఁ బరిపూర్ణచిత్తైకాగ్రత లభించును. పూర్ణచిత్తశుద్ధి, పూర్ణైకాగ్రత లభించుటయు, ఆత్మ సాక్షా త్కారసిద్ధియగుటయు నేకకాలముననే జరుగును. పూర్ణ చిత్తశుద్ధి యెట్లులభించును? పాత్రశుద్ధికి బాగుగాఁదోముటయే ఉపాయము. అటులే, చిత్తములో, రాగద్వేషములు, ఐహికా కాంక్షలు, అడుగంటపోవువరకు దోమవలెను. అహం కారము, గర్వము, స్వార్థపరత్వము, క్షుద్రసుఖలాలస మున్నగు దోషములను పూర్తిగా కడిగివేయువలెను. సత్యము నెరుగవలెనను తీవ్రదాహము, పరమాత్మసందర్శనమును గోరు తీవ్రముముక్షుత్వము అనుచీపురుతో మాలిన్యములను మూలమట్టముగా దుడిచివేయవలెను. ఆత్మోద్ధారణ మహా- యజ్ఞమును కఠోరదీక్షతోఁ జేయవలెను. నిరంతర సాధన మార్గమునను సరించి, జీవి పరమాత్మనై తరింపవలెను.

977. ఒకనిర్దిష్ట గమ్యస్థానములేకుండ బ్రతుకుట కంటె మృతిచెందుటే మేలు. గమ్యస్థానమెట్టిదై యుండవలెను? అది ఉత్తమమైనదై యుండవలెను ఏది ఉత్తమగమ్యస్థానము? లేక ఉత్తమలక్ష్యము? అభ్యుదయ నిఃశ్రేయసములేనియు;

నిహాపర సౌఖ్యములనియు, దైవసాక్షాత్కార సిద్ధియనియు, పరబ్రహ్మైక్యస్థితియనియు బెక్కువిధముల జెప్పబడినది. అన్నిటికి మూలభావమొకటే; నిర్దుష్టస్థిరశాంతి సౌఖ్యస్థితి గాంచుటయే. దానినేముక్తియనియు మోక్షావస్థయనియు, స్థితప్రజ్ఞావస్థయనియు, జెప్పఁబడెను. అసలు బ్రతుకు లక్షణ మెట్టిది? కాలము మిక్కిలిపరిమితము; అవరోధములు, దోష ములు లెక్కకుమించినవి. మనకు సాధనసంపత్తి యెట్టిది? సకలదోషములకు, భయప్రమాదములకునిలయమైన దేహము, మనస్సు, బుద్ధి, యింద్రియములు. అందుచే నిర్దిష్టలక్ష్యము, నిర్దుష్టసాధనము; అఖండదీక్ష; అతివేగ గమనము - ఇన్ని యున్నఁగాని లక్ష్యసిద్ధి దుస్తరము. ఇట్టి కార్యక్రమమిచ్చి మానవజాతి నుద్ధరించు మార్గమును బోధించునదే నిజమగు విజ్ఞానము, నాగరకతయుననవలెను. భారతీయార్యధర్మమిదియే.

978. మహాపురుషలక్షణములలో నొక ముఖ్యలక్ష ణము పేర్కొనఁదగి యున్నది. సాధ్యమైనంతవరకు, సర్వ విషయములలో నితరుల కుపకార సౌఖ్యములకై, స్వకీయ లాభసౌఖ్యములను విడిచిపెట్టు లక్షణము, మహాపురుష లక్ష ణము. తన కుటుంబములోఁగాని, సంఘములోఁగాని యెవ రైన నెందుకైన బాధపడుట నాతఁడు సహింపలేఁడు. అట్టియెడ నాతని హృదయము ద్రవించును; కంటనీరు పెట్టును; వారి దుస్థితిఁజూచి తల్లడిల్లును. తనకు సాధ్యమైనంతగా తోడ్ప డును; విశేషముగా సాయపడలేకుంటినని విచారించును.

అందరు సుఖముగా నుండవలెనని కోరును; దేవుని ప్రార్థించును, ఇదియే మహాపురుషలక్షణము.

979. ఎన్నడేడ్వనవసరము లేకుండుటే అందరును కోరునది. ఏడ్పించులక్షణము గల వానినన్నిటిని విడిచి,ఏడ్పు పోఁగొట్టు వానినార్జించుటే దానికిమార్గము. పరమేశ్వరకృపామృతమొక్కటే ఏడ్పుకుమందు; మఱొకమార్గము లేదు. ఉన్నదని చెప్పువారికి వినువారికినేడుపుతప్పదు. కాని దైవకృపనార్జింపవలసియున్నది; దానికి వలయుకృషి చేయవలెను, ఈ సత్యమును ప్రకటించునదే తత్త్వశాస్త్రము; దానినిఁజేరు కృషి లేక సాధనమునుచూపునదేమతము. సిద్ధాంతముతత్త్వము అనుష్ఠానముమతము, క్షణికమ్మైన యింద్రియవిషయము లనునమ్మి, అవిదగాచేసి యేడ్పించిన నేడ్పుటకు బదులుగా, దేవుని పాదములు గట్టిగాఁబట్టుకొని దేవుని కృపకై యేడ్చుట వలన నికనేడ్వ వలసిన అవసరము లేకుండఁబోవును, దైవేతర మంతయు నేడ్పే! దైవసహితమంతయునవ్వే! అనగానానందమే! కావున దేవునినమ్మి సుఖించు. ఇదియే వేదసారము –

980. సర్వకర్త దేవుఁడే యనిచెప్పుట, నీవేకర్మయు, నేకృషియు ఁజేయకూడదనియు ఁజెప్పుటకాదు. సర్వకర్తయైనను, నేకైకకర్తయైనను, దేవుఁడు ప్రాణుల ద్వారముగనే పనిచేయును. ఏపనినెప్పుడెట్లే ప్రాణిచే ఁజేయింప ఁదలచునో, ఆవ్యక్తి కాపని చేయుటకవసరమగు తలంపు, నుపాయము, శక్తినిచ్చును. నీకు విధివిహితము, లోకహితము ననితోచిన

పనులను నీవుచేయుటకు నీ దైవభక్తిగాని, జ్ఞానముకాని అవరోధములెన్నడును గాంజాలవు. కాని కర్మయోగివై కర్మ నీవుచేయవలెను. అంతియకాని, దేవునిభక్తిలోనమ్మి, ముసుగు పెట్టికొని కదలకుండ బరుండుటకాని, నిర్విరామముగా గర్మ శూరత్వమును ప్రదర్శించుటకాని, దైవసంకల్పము చేతనే మానుటయు, చేయుటయు జరుగును. పనము చేయుటలో మానుటలో, దైవసంకల్పమేదియో యెరుగము. చేసినది చేయుటయు, మానినదిమానుటయు దైవసంకల్పమని తెలియవలెను. ఇదియేకర్మయోగము. భక్తియోగము, జ్ఞానయోగము యోగత్రయు సమన్వయార్థము.

981. ఏవ్యక్తికాని, సంఘముకాని, దేశముకాని, పతనము చెందుటకు గారణములు స్పష్టమైనవే గలవు. అవియు సులభముగా దెలియునవేకాని, నిగూఢరహస్యములుగావు. (1) దైవభక్తి. దైవభీతి లేకుండుట, (2) శాస్త్రనిషిద్ధ ప్రవర్తన మనగా ధర్మవిరుద్ధ ప్రవర్తనము, (3) సముచిత నిగ్రహము విడిచి, యింద్రియ వ్యాపారములకు స్వేచ్ఛగా సెలవ నిచ్చుట (4) కుల, ధన, యౌవన, విద్యాదులవలన నైన గర్వమహంకార దూషితమైన అవివేకము గొల్పుట యను నవే ముఖ్యకారణములు. దైవమును దూరముగా బెట్టి పరహితకర్మానుష్ఠానము నుపదేశించు జైన బౌద్ధాది మతములు [illegible] కొంచెదేశముల [illegible]. కాని వారు దైవ [illegible] భారతభూములో నశించి పోయినవి గారణముల

నెరుగరు. దైవభక్తి సంబంధములేని నైతికోపదేశము పునాది లేని కట్టడమువలె మొదటి పెనుగాలికి భూపతితమగును. కావున సకల కారణములలో ముఖ్యములైనవి రెండుగలవు. (1) ఈరెంటిలో దైవభక్తి, దైవభీతియు లేకుండు టగ్రస్థానము వహించును. (2) దైవభక్తి సహితనైతిక శీలసంపద లోపించినచో (బతినముతప్పదు. సకలదేశ, సంఘ, వ్యక్తి చరిత్రములు సరిగా (బరిశీలించినచో నిది సుస్పష్టమగును.

982. మానవ జీవితమున కవసరములు చాలగలవు. వానిని కనిష్టగరిష్ఠావసరములుగా విభజింపవచ్చును. ఏవి లేకున్న జీవితము నడువదో అవికనిష్ఠావసరములు; అన్న వస్త్రగృహాదికము. ఇక వానికంటె నధికముగా వలయునవి భోగావసరములు. వీనికి గరిష్ఠస్థాయి నిర్ణయించు, టసాధ్యము, ఏలన భోగములు కోరికలపై నాధారపడును. కోర్కెల కెన్నడును పరిమితులుండవు. అపుడేది గరిష్ఠస్థాయి యగును? భోగకాంక్షకెన్నడును హద్దులుండవు; భోగావసరములు మితిమీరియే యుండును. మితిమీరిన అవసరముల సంపాదన నీతినియమముల నతిక్రమించును. నేటి నాగరకతకుంగల దురవస్థయిదియే. అందుచే దాని ప్రళయపతనము నెవ్వ (డాపజాలడు. ఇది యిట్లుండగా అసలు జీవితమున కత్యంతావసర సమస్య నాలోచింపవలదా? చిత్తశాంత్యానందములగూర్చి సకలదోషపరిహార మొనర్చు నుపాయము నన్వేషించి, ఆచరించు టత్యంతావసరముకాదా? కామినీకాంచన

సంబంధభోగములపైఁగోర్కెలతో ఁగోటివిధముల జీవితము లను భ్రష్టమొనర్చినచో, అత్యంత ముఖ్యావసరము, అత్యంత వేగాచరణ యోగ్యమునైన పరమేశ్వర కృపాసంపాదనకృషి చేయుట కవకాశమెచటనుండును? భారతీయులైనను ఈ సత్య మును త్వరగా గ్రహించి అనుసరించుట యోగక్షేమ దాయకము.

983. కర్మసిద్ధాంతము హిందూమత ముఖ్యసిద్ధాం తములలో నొకటై ప్రఖ్యాతివహించినది. ఎంత స్వల్పమైన దైనను చేసిన ప్రతికర్మయు ఁదదనుగుణమైన ఫలితమునిచ్చి తీరును. కర్మఫలితముల నెట్టిపొరపాటును లేకుండనిచ్చు సామర్థ్య మొక్క భగవానునికే గలదు. అనంత వైవిధ్యము గల జీవుల స్వరూపస్వభావములే కర్మఫలముల సత్యమును ఋజువుచేయును. ఏ రెండు ప్రాణులును సర్వసమానములు గావు. కర్మభేదములే దానికిఁగారణములు. సదసత్కర్మలు సదసత్ఫలితములిచ్చును. పుణ్యకర్ములు సౌఖ్యములను, పాప కర్ములు దుఃఖములను అనుభవించుచుండుట ప్రత్యక్షనిదర్శ నము. కర్మనియతి ననుసరించి, భగవానుఁడు జీవుల సుఖ దుఃఖములకు హేతుభూతుఁడై, జగచ్చక్రమును నడపు చున్నాఁడు. చేసినకర్మములకు సముచిత ఫలితములనిచ్చుట, మానుట, కర్మలతో సంబంధములేకుండ, జీవులభక్తిజ్ఞానముల ననుసరించికాని, అకారణముగాఁగాని భిన్నఫలితముల నిచ్చు టయు భగవానుని సర్వతంత్ర స్వతంత్రతననుసరించి జరుగ

వచ్చును. భగవత్సంకల్పశక్తి అప్రమేయమైనదగుటచే, సకల జీవులకర్మల కతీతమ్ములైన ఫలితములనీయఁగలదు. అందుచే, మానవులు సాధ్యమైనంతవరకు సత్కర్మాచరణముచేయుచు, దైవారాధనము నేమరకసల్పుచో సర్వశుభ ఫలితములు లభింపఁగలవు. సత్కర్మాచరణము సామాన్యశుభముల నీయ గలదు. దైవారాధన మఖండశుభస్వరూపమగు ముక్తి నీయఁగలదు.

984. మానవునకుఁగర్మ స్వాతంత్ర్యమున్నదా? ఉన్నచో నుండుటమంచిదా? లేకుండుట మంచిదా? మానవునకుఁదనయిచ్ఛవచ్చిన కర్మచేయుటకు స్వాతంత్ర్యమున్నచో, పాపకర్మలు చేయకుండనుండఁగల వివేక సామర్థ్యములు గూడ నుండవలెను. అటుగాక, అసమగ్రజ్ఞానము - కర్మస్వేచ్ఛయునున్నచో నతఁడు నిషిద్ధకర్మలనగాఁ బాపములఁ జేయుట కవకాశముగలిగి, తత్ఫలితముగా ననేకవిధ దుఃఖములనుభవింపవలసి వచ్చును. లేదా, పూర్ణజ్ఞానము, క్రియాస్వేచ్ఛయున్నచో మానవునకు భగవంతునికి, భేదము లేకుండును. మానవుఁడే దేవుఁడగును. కాని మానవుఁడట్లు గాలేఁడు. పోని, కర్మస్వేచ్ఛ లేకుండ, భగవానుఁడే సర్వకర్తగా, మానవుఁడు నిమిత్తమాత్రుఁడుగా మాత్రమేయుండుటే సత్యమైనచో నాతనికపుడు పుణ్యాపాపకర్మఫలితములతో నెట్టిసంబంధమును లేకుండ, నుండునవకాశము కలుగును. కాని, అపుడు మానవునకు దానుపకరణమాత్రుఁడనే యను నిస్సంశయజ్ఞానమెల్ల

స్వభావము నుండవలెను. అదియు మానవునిలో నెల్లప్పుడుండదు. నేనే కర్తనను నహంకారము కలిగి, కర్మలఫలితము లనుభవింపవలసివచ్చుచున్నది. అందుచే మానవుడు జ్ఞానాజ్ఞానములయు, వివేకావివేకములయు, స్వాతంత్ర్యాస్వాతంత్ర్యములయు మిశ్రమస్థానీయుఁడై, సుఖదుఃఖతరంగమధ్యమందు మాగిసలాడుచున్నాఁడు. ఇందొక రహస్యమున్నది. సంపూర్ణజ్ఞానసిద్ధి గలిగి, కర్మస్వాతంత్ర్యముండి భగవంతుఁడై, ఆనందమనుభవింపవచ్చును; లేదా కేవలనిమిత్తమాత్రుఁడై జీవించుటనగా. మిగులునది దేవుఁడే యగును. ఏలన సర్వకర్త, సర్వవ్యాపి భగవానుఁడైనచో, నునకరణమాత్ర జీవితము దైవస్వభావమే యగును. అప్పుడును బ్రహ్మానందమే మిగులును.

985. ఈలోకములో 'సుఖ' మను వస్తువునకుఁగల ధర, మరే వస్తువునకును లేదు. సువర్ణమణిరత్నాదులకుఁగల ధర దీనితో బోల్చినచో, లెక్కలోనికే రాదు. కాంతాకనకవస్తువాహనాదులిచ్చు క్షణికసౌఖ్యముతో నక్షీణదుఃఖము ముడిపెట్టఁబడియున్నది. వాని సంపాదనము, రక్షణ వ్యయములు – జీవితమునంతను బలిగొనును. ఇంద్రియములిచ్చు తాత్కాలిక సంతృప్తి మానవుల నతిత్వరితగతి నిర్వీర్యులఁ జేసి, వార్ధకములోనికి విసరివేసి మృత్యువశ మొనర్చును. దుస్సహ మోహములను, దుర్భర రాగద్వేషములను జనింపఁజేసి, అవిమానవుల ధర్మరతిని, నైతిక శీలమును, దైవభక్తిని కొరికివేయును. అనేక దారుణపాపకర్మలఁజేయించి, యిహ

మున దురంత మనస్తాపమును, మరణానంతరము నరకయాతన నను కలుగఁజేయును. ఇట్టి దుఃఖసమ్మిశ్రితముకాని దైవ సాక్షాత్కారసిద్ధిచేఁగలుగు శాశ్వతానంద శాంతులను సంపాదింపఁగోరినచో, దానికిఁగలధర అమితము, అత్యంతకష్ట సాధ్యమునైనది. కోరికలన్నియు విడిచి, రజస్తమోగుణముల నణచివేసి, సాత్త్వికాహార విహారముల నభ్యసించి, యావజ్జీవ జపధ్యానపరతంత్రుఁడై, శ్రద్ధావినయభక్తిజ్ఞానవైరాగ్యముల నాశ్రయించి భగవత్కృప నార్జించుట సాధ్యము కావచ్చును. ఒకజన్మకృషి చాలకపోవచ్చును; పెక్కు జన్మములు గడచిపోవచ్చును. క్షణికసుఖము, శాశ్వతానందము రెండును కఠోరదీక్షను, కృషిని గోరును. రెంటిలో మొదటిది దుఃఖాంతమై పరిణమించును; రెండవది శాశ్వతానందప్రదమై లభించును. బుద్ధిమంతులు మొదటిదానిని తృణీకరించి, రెండవ దానికై జీవితముల నంకితమిచ్చి కృతార్థులగుట యుక్తమని స్పష్టము.

986. సృష్టిలోని ప్రతివస్తువును భగవానుని ప్రియదూతగాఁబనిచేయుచున్నది. "ఇదిగో! భగవానుని జూడుము; సాక్షాత్కరింపుము"ని చేతనాచేతనములన్నియు ననుక్షణము ప్రకటించి, మేఘములోని మెరుపువలె నదృశ్యమగుచున్నది. సకల వస్తువులు ప్రాణులు, బుద్ధిగల మానవులకు మోక్షధర్మోపదేశము చేయుచు, "భగవానుఁ డంతటవ్యాపించియున్నాఁడు; చూడరేమి" యని ఘోషించుచున్నవి. అఖిల

బ్రహ్మానందశాంతిప్రదాతయగు భగవానునిజూచుట కెచటి కేగుదువు? ప్రఖ్యాతాలయములకా? విశ్వమంతయు భగవానుని దేవాలయమే; పుణ్యతీర్థములకా? నీ వెనట పాదములు మోపినను నది పుణ్యక్షేత్రమే! ఆహా! ముక్తిపొందు టెంత సులభమో! ఏపుష్పమునుజూడుము; విశిష్టవర్ణకాంతి సౌరభముల వెదజల్లి ఇవి దేవుని మహిమలోనివే యని చెప్పి వాడి పోవుచున్నవి. అద్భుతములైన వృక్షములు, లతలు, పెరిగి, దేవుని మార్దవమునుజూపు చిగుళ్లను; సౌందర్యమునుజూపు పుష్పములను; మాధుర్యమునుజూపు ఫలములనిచ్చి – ఇవి దేవుని సౌభాగ్యములేయని చెప్పి అదృశ్యములగుచున్నవి; పక్షులు, పశువులుపుట్టి అత్యంతలాలిత్యమును ప్రదర్శించి, విలక్షణధ్వనులతో ఇది దేవునిలీల యని పలికి. తనువులు చాలించుచున్నవి. అటులే, మనుజులును బాల్యదశలోని లాలిత్య మనోహరత్వమును, యౌవనమున రూపలావణ్య మాధుర్యములను ప్రకటించి, వార్ధక్యమృత్యువశములై పోవుచున్నవి. ప్రళయకాలమువరకీరూపములు తిరిగితిరిగి, దివ్య ప్రబోధముచేసి, అంతర్ధానమగుచుండును. నామరూపము లదృశ్యములై, భగవానుని చైతన్యసౌందర్య, మాధుర్య విలాసములనుజూపి, బుద్ధిగలవారికందర సత్యంగ్రహి రసాస్వాదులైన జగన్నాథుని అనిర్వాచ్యప్రజ్ఞాప్రభావప్రదర్శనముసల్పి, "మేలుకొనుడు; దేవునిదిలకింపుడు; తరింపుడని" గొంతెత్తి అరచుచున్నవి. "వాసుదేవస్సర్వమ్" "సర్వం విష్ణుమయుం

జగత్" "జగమంతా రామమయం" సత్యమును దెలిసి, ఆ సత్యమే నీవై, అనగా నీవే భగవంతుఁడవై, అనంతచైతన్యానంద స్వరూపివై విహరించుటే కర్తవ్యము.

987. దేహమనునది సంచారకారాగారము. జీవుఁడందు బంధింపఁబడెను. దేహమను చెరసాలలో జీవునకుఁ గొన్ని సౌకర్యములు కల్పింపఁబడెను. జ్ఞానకర్మేంద్రియములు, మలమూత్రాదికోశములు, మున్నగునవి జీవులు జీవించుటకు సదుపాయములు. దేహము యావజ్జీవకారాగారమై యున్నది. మూర్ఖుఁడగు జీవి చెరసాలనే తన నిత్యనివాస నిజగృహ మనుకొనుటేగాక, తానే చెరసాలయని దేహాత్మ భ్రాంతినొంది చరించుచున్నాఁడు. బుద్ధిమంతుఁడగు జీవి దేహము బంధనస్థానమనియెరిగి, బయటపడి స్వేచ్ఛ (ముక్తి) నార్జింపవలెనని కోరును. అదియే దేహధారిత్వము అనగా ఁగారాగృహనివాస మెన్నడవసరములేని స్వేచ్ఛాజీవితమే మోక్షమని చెప్పఁబడెను. అజ్ఞాని దేహమునందుండుటయు దుఃఖకారణమే. దేహమును విడిచిపోవుటయు దుఃఖకారణమే. వివేకి తనయజ్ఞానముచే ఁజెరపెట్టబడితినని గ్రహించి, యోగ వర్తనుఁడై స్వేచ్ఛగాంచి, జన్మరాహిత్యమిచ్చు స్వేచ్ఛ లేక మోక్షమునార్జించి సుఖించును. చెరసాల బ్రదుకులో స్థిర సౌఖ్య మాసించుటకంటె నవివేక మేముండును?

989. సంకల్పసిద్ధి యననేమి? మనసులో నుదయించిన భావము ఫలించుట. ఎప్పుడో ఫలించుటకాక, భా

చును, ఫలసిద్ధి యేకకాలముననే లభించుట పేరు సద్య స్సంకల్పసిద్ధి. అట్టి సిద్ధికి సంకల్పేతర ప్రయత్నమేమియు నవసరములేదు. దేశకాలోపకరణ సాధనము లవసరము లేదు. పరమేశ్వర సంకల్పమట్టి శక్తిగలది. విశ్వసృష్టి, భగవంతుని సంకల్పమాత్రముననే జరిగెను. మానవసంకల్పమున కట్టిశక్తి లేదు. అందుచే దేశకాలసాధన ప్రయత్నములన్నియు నవసరము. ఇన్నియున్నను, సంకల్పసిద్ధి కావచ్చును, కాకపోవచ్చును. కాని మానవులలో దైవతుల్యసంకల్పశక్తి నార్జించిన మహాయోగులు, జ్ఞానులు, నుత్తమభక్తులునుగలరు. అందు రహస్యమేదియును లేదు. ఎవడు తన మనస్సును సంపూర్ణముగా దేవునికిసమర్పించి, లీనమొనర్చునో, ఆతడు తన సంకల్పమును దైవసంకల్పముతోఁగలిపి యేకత్వము నార్జించిన వాఁడగును. అపుడు దైవసంకల్పమే మానవ సంకల్పమై సద్యస్సిద్ధిగాంచును. అనగా మానవుఁడు భగవంతుఁడై సంకల్పసిద్ధుఁడగును. అందుకే మహాయోగులు జ్ఞానులు - తామున్నచోటనేయుండి, వ్యావహారిక ప్రపంచ రంగమున నడుగిడ నవసరములేకుండగనే జగత్కల్యాణమును సాధించిరి.

989. భగవానునఖండజ్ఞానము, బలము, ఆనందము మున్నగు లక్షణములు మానవునకు లభించుట కవకాశమున్నదా? నిస్సంశయముగాఁగలదు. ఎట్లు? ఇచట నొక రహస్యమున్నది. మానవుని కీశ్వరత్వసిద్ధి లభించులే. అది నే

మానవునిస్వస్థితి లేక నిజస్థితి. అది యిదివరకులేనిది క్రొత్తగా సంక్రమించునదియుఁగాదు. మానవుఁడు మూలములో భగవానుఁడే, కారణములేని అజ్ఞానమాచ్ఛాదించుటచే, ఁడానల్పుఁడనగు మానవుఁనని భ్రమించి, దేహాదులతో ఁదాదాత్మ్యమంది దుఃఖమనుభవించుచున్నాఁడు. తపోధ్యానాదికముచే నజ్ఞానావరణము భగ్నమై అదృశ్యమగును. అజ్ఞానవిచ్ఛేదముతో మానవుఁడు దన నిజస్వరూపమగు దైవత్వమును దర్శించును. ఇదియే ఆత్మసాక్షాత్కారము. చిత్తశుద్ధి, ఏకాగ్రత, వివేకము లభ్యసించి, మానవుఁడు దేవుఁడగును. అనఁగాఁదన యథాస్థితినిగాంచును. దీనికి నిరంతర ధ్యానయోగాభ్యాసము కావలెను. తన దుఃస్థితినుండి తొలఁగిపోవలెనను వజ్రసంకల్పమున్న వానికట్టిసాధనయు సిద్ధియులభించును.

990. "ఏమిజరిగినను నాకెట్టి నష్టముండదు; కలుగదు; కావున నా చిరునవ్వు చెడదు; నాచిత్తస్వాస్థ్యము చెక్కు చెదరదు; నా మహోత్సాహము; నా అవ్యయానందము; నా అనంతశాంతియు వీసమంతైనను తరుగవు," అని నిస్సంశయముగా నిర్భయముగా ఁజెప్పికొనగల్గిన దివ్యావస్థను మన మార్జించికొనవలెను. దీనికి రెండుమార్గములే యున్నవి. (1) జీవితసర్వస్వమును భగవానుని పాదపద్మములకు ఁగైంకర్యముచేసి, మహాభక్తులమై జీవించుచుచో, సర్వసమర్థుఁడు. పరిపూర్ణకారుణ్యమూర్తియునైన భగవానుఁడు మనకెట్టి లోపము, కష్టనష్టములు, క్లేశములు లేకుండ వేయిచేతులతో

రక్షించును, పరమేశ్వరానుగ్రహ సిద్ధియనగా సర్వశుభ సౌఖ్యము లిచ్చునదే. (2) బ్రహ్మజ్ఞానమునార్జించి, మన మాత్మ స్వరూపములము; నశించు దేహాదికము గామని తెలిసికొన్నచో, సర్వసంపూర్ణము, అమృతము, అనంతశాంత్యానంద మయము నాత్మయనియు మన నిజస్వరూపమదియేయనియు బోధపడును. అదియే ఆత్మసాక్షాత్కారసిద్ధి; అనగా దైవత్వసిద్ధి; రెంటిలో నేదేనొక మార్గమనుసరించి ధన్యుల మగుట మనకర్తవ్యము.

991. దేవుని సాన్నిధ్యమెంత అమూల్యమైనదో యెరిగి తరింపవలెను. అదృష్టవశమున మనమెల్లపుడు దైవ సాన్నిధ్యమందే యున్నారము. దానికొరకెచటికి బోనక్కరలేదు. భగవంతుడు సర్వవ్యాపియే కాక, సర్వమునకు లోపల, వెలుపల గూడ నిండియున్నాడు. అందుచే మనము దైవ సాన్నిధ్యమును గోరకున్నను, వలదనుకొనినను, అది మనలను విడువదు. కావున మనము నిత్యము దేవుని సన్నిధిలోనుంటిమి, ఇది వేదవేదాంతములు ప్రకటించిన సత్యమగుటచే మనము దానిని, నిస్సంశయముగా, పరిపూర్ణముగా నమ్మవచ్చును. అయినచో దైవసాన్నిధ్య మహిమయెట్టిది? మనము చేపలమ్మ సంతలో నిలచినచో జేపల వాసన మనలో బ్రవేశించును; పువ్వుల తోటలో గూర్చుండినచో, మనోహర పరిమళములు మనలోనికి బ్రవేశించును. మనము దేనిసన్నిధి నాశ్రయించిన దాని లక్షణములు మనకు గల్గును. భ్రమరు

కీటన్యాయము చెప్పఁబడెను; మనకుఁ గల భావము మన స్వరూపమును నిర్ణయించును, దైవసన్నిధిలో మన ముంటిమని విశ్వసించి, దేవునిపై దృష్టి కేంద్రీకరించుచో, దేవుని లక్షణ ములు మనకు సంక్రమించును. దేవుని లక్షణములు పరిపూర్ణా నంత కల్యాణగుణములు; అఖండ జ్ఞానబలైశ్వర్యములు, స్వ కారామేయ శాంతిసౌఖ్యములు, జన్మజరా మృత్యురహిత శాశ్వతానందము మున్నగునవి. కాఁబట్టి మనము సదా దైవసాన్నిధ్య మహిమలను నమ్మి, మన చిత్తమనవరతము వానిపై కేంద్రీకరించి ధ్యానించుట నేర్చినకొలది, దేవుని లక్షణములు, నేరుపుపూర్తియగుటతో దైవత్వమును సిద్ధించి తరింతుము

992. ఏది తెలిసిన సకలదుఃఖములు పోవునో, సకల సౌఖ్యములు లభించునో, దానిని తెలిసికొనుటకై, సర్వశక్తుల నుపయోగించి కృషిచేయుటకు కృతనిశ్చయుఁడై యితర వ్యాపారములను విసర్జించుటో, కనిష్టసంఖ్యకు దగ్గించుటో సలుపు మానవుఁడుత్తమ మానవుఁడని నిశ్చయింపవలెను ఇదియే పరమ లక్ష్యముగాఁ గలజాతిఉత్తమజాతి; ఈ యాదర్శ మున కగ్రస్థానమిచ్చు నాగరికతయే ఉత్తమ నాగరికతయ నని గ్రహింపవలెను. దీనినే భారతీయులు బ్రహ్మవిద్య, లేక బ్రహ్మజ్ఞానమనిరి. అనగాఁ దదితరరంగములన్నియు ఉపేక్షిం రింపఁదగినవని పొరపడరాదు. రాజకీయార్థిక, సాంఘిక రంగ ములలో నభ్యున్నతికై కృషియవసరము లేదని భావము కాదు

భోజనమున కన్నము ముఖ్యమనగా నితర సహకార ద్రవ
ములు వలదని చెప్పు టెట్లగును? తక్కిన రంగములలోఁ జేయ
కృషులన్నియు బ్రహ్మవిద్యాపరమ లక్ష్యమున కానుకూల
మును ఘటించురీతిగా నడపుకొనవలెను. బ్రహ్మజ్ఞానమనగా
నింకొకరీతిగాఁ జెప్పినచో దైవకృపనార్జించుటో, లేక దైవత్వ
మునే సంపాదించుటో యననగును. ఫలితములో రెండు
నొకటే. భారతదేశము దీని కత్యంతప్రముఖస్థానమిచ్చి
యుగయుగములనుండి నేటికిని సజీవమై నిలిచియున్నది. ఎన్ని
శక్తులన్యథా ప్రయత్నములు చేసినను వ్యర్థములై తీరును. ఏలన
సృష్ట్యాదినుండియు వచ్చిన బ్రహ్మజ్ఞాన సంస్కారబలము
భారతభూమిలోఁ బాతాళ పర్యంతమును బాతుకొనిపోయి
యున్నది. అది అజరామరము, అనింద్యము; విశ్వకల్యాణ
ప్రదమునైనది.

993 భగవానుఁడు సర్వవ్యాపిగావున, భగవద్దర్శ
నార్థ మెచటికిఁబోనక్కర లేదని చెప్పుటవలన, దేవాలయములు
పుణ్యక్షేత్రములు, నిత్యము మనము శాస్త్రోక్తముగా చేయ
వలసిన కర్మకలాపములు, పూజాదికములు నిరర్థకములని
భావింపరాదు. దేవుని స్మరింపఁజేయు కార్యక్రమమెంత బల
హీనము, నల్పజ్ఞానాన్వితము, ప్రాథమికమునైనను, దానిని
మనమెన్నఁడును తూలనాడుట కధికారము లేదు. కారణములు
స్పష్టమైనవిగలవు. మానవమానసికపరిణామ మనేకభిన్నదశా
పరిణామముగలది. భిన్నమానవుల వైవిధ్యమటుంచి, ఒకే

ించి. గమ్యస్థానము లేక మోక్షపదవిఁజేరుటకై దృఢనిశ్చయముతో జీవితము నియమించుకొను నాతఁడుత్తమ మానవుఁడు. సర్వమానవుల కాదర్శప్రాయుఁడునని చెప్పనవసరము లేదు.

994. భీతిని భీతియేపోఁగొట్టును దైవభీతి, ధర్మభీతి, మృత్యుభీతి, నరకభీతి, ప్రమాదభీతి, దుఃఖభీతి గలవానికి జీవితములో నేదియు భీతికలిగింపఁజాలదు. శిష్టరక్షణము, దుష్టశిక్షణముచేయు భగవానునెడ భీతిగలిగివర్తింపని మానవుఁడు భరింపరాని భీతి ననుభవింపవలసి యుండును. మనమెంత భక్తులమైనను, మనలోఁగొన్నిదోషములు, పాపములు మానవత్వ వశమున నుండితీరును. వానివలన శిక్షకలుగునో యను భీతితో మనము వర్తింపవలెను. ధర్మహానియగు కర్మలు చేసినచో మనకుఁబ్రమాదములు తప్పవు ధర్మాభిరతిగలిగియు నొకప్పుడు మన మధర్మకర్మలకు లోనుగావచ్చును. అందుచే ధర్మాపరాధమేమిజరుగునో యని భయముతోఁబ్రవర్తించుట క్షేమకరము. భయభక్తులతో దేవునారాధించుటేకాక, ధర్మనిష్ఠకలిగి సత్కర్మాచరణశీలిమై యుండవలెను ఇఁక మృత్యుభీతి; ప్రతిమానవుఁడు తనకు మృత్యువు తప్పదనియు నది యెప్పుడు తటస్థించునో తెలియదుగావున బాల్యమునుండియు మృత్యుంజయుఁడగు భగవానునారాధించు దీక్షగలిగి తద్దోష పరిహారమొనర్చికొనవలెను. నరకభీతి; మరణానంతరము దారుణదుఃఖానుభవస్థానములగు నరకాదులఁదలఁచి, భీతిగలిగి,

పుణ్యలోకప్రాప్తినిచ్చు జీవితములనే గడపయత్నింపవలెను; ప్రమాదభీతి; లోకములో బెక్కురకములగు ప్రమాదములు తలస్థించి, అవయవలోపములు, కుదరని రోగములు, దుర్భరావమాన నష్టములు కలిగించి, దుఃఖాబ్ధిలో ముంచివేయునేమోయను భీతిగలిగి, యెట్టిప్రమాదములు రాకుండ రక్షించు పవిత్ర జీవితము, భగవారాధనము నలవడఁజేసికొనవలెను. అన్నిటికంటె దేవుఁడెంతవారినైన దోషములకు శిక్షించెను. శిక్షించును గావున దైవారాధనమెన్నడుమానక భక్తితోఁ జేయుటన్నిటికంటె ముఖ్యకర్తవ్యమని తెలిసి వర్తింపవలెను.

995. మానవుని సర్వనాశనమొనర్చు దుర్జేయములగు ప్రబల శత్రువులు కామినీకాంచనములు. కాంతాధనములు లేకున్న జీవితమసాధ్యము; కాని. అవియెంత ముఖ్య జీవితావసరములో అంతప్రమాదకరములు–కొన్నిమితులలో వాని ననుభవింపగోరినను, నవి పరిమితుల నన్నిటినిదాటించి నశించువరకు విడిచిపెట్టని దురంతశక్తిగలవి. కామ మగ్ని; ధనము వాయువు; రెండును విడని సంబంధముగలవి. అగ్ని వాయువులతోఁ జెలగాటమాడుట, మృత్యువు నాహ్వానించుటే. కాంతాకనకదాసుఁడు, ధర్మమును, నీతిని, మర్యాదను, ఔచిత్యమును, వివేకమును, ప్రజ్ఞనుసర్వము నాకామహోమగుండములో హోమమొనర్చును. కామినీకాంచనారాధకుఁడు సాధుసజ్జన సంతాపకారి; పరమేశ్వర నిరసనము నందగ్రగణ్యుఁడునై వర్తించుటకు సంశయింపఁడు. వేదములు

ధర్మశాస్త్రములు, గృహస్థధర్మముల వివరించి, మానవులను కట్టుబాటు నియమ రజ్జువులతో బంధించి, మితిమీరి నశింపకుండు సాధనములఁ జూపెను. ధర్మోపదేశమును మన్నింపని నేటి నాగరికతలో నేమి తటస్థించునో ఎవరు చెప్పఁగలరు ?

996. భగవానుఁడు జీవులకొఱకన్నియు సృజించెను. మానవుల జీవయాత్రావసరములనేగాక, మానవత్వమునందలి లోపదోషములను దొలగించికొని, నిర్దుష్టమానవత్వమునే గాక, దైవకృపాప్రాప్తిని, అంతేకాక, దైవత్వసిద్ధినిగాంచు సాధనముల నన్నిటినిగూడ విరివిగాఁగల్పించెను. జీవులకు దేహకల్పనమునందే రోగజరామృత్యుప్రమాదములను బెట్టి, అంతటితోఁ బోక సూక్ష్మదృష్టితోఁ బరిశీలించుచో, దర్శనమిచ్చి రక్షించుటకెల్లప్పుడు సంసిద్ధుఁడై, తానందు, హృదయగుహలోఁ బ్రవేశించి నిలిచియుండెను. జీవితావసరములగు నన్నవస్త్రగృహాదికమును, సృజించి, వానియందనిత్యతనుంచి నిత్యపదార్థము నెరుగుమని సూచించెను-చిత్తబుద్ధి వికాసముల కవసరములగు విద్యలు, శాస్త్రములుకల్పించి, కేవల పాండిత్యము రక్షించుశక్తి లేనిదని ప్రకటించెను; వేదములను, శాస్త్రములను, ధర్మసూత్రములను సృజించి, తపోధ్యానజపాధికనిష్ఠమూలమున, దుఃఖహేతువులగునన్నిటిని త్యజించి, శాశ్వతానందప్రదముక్తి లభించు మార్గములను వ్యాపింపజేసెను. దుఃఖమే కోరువారికి దుఃఖమును; దుఃఖవిముక్తి, అవ్యయానందముకోరువారి కనంత సౌఖ్యమునిచ్చు విధాన

ములను ప్రకటించెను. ఏది దుఃఖప్రదమో యేదిసుఖప్రదమో తెలిసి బ్రదుకుడని భగవానునాదేశము.

997. భక్తిజ్ఞానకర్మయోగము లు పరిపూర్ణతనందుట కనంతసోపానములు మానవునిక్రమముగా భగవత్పాద సన్నిధికిఁదోడ్కొనిపోఁగలవు పూర్వజన్మపుణ్యమధికముగాఁగల మానవుఁడు మాత్రమే దైవసన్నిధి కిన్నిఘట్టములు లేక మెట్లుగలవని తెలిసికొను నవకాశముగాంచును ఇట్టి విజ్ఞానవిలసితమగు పావనకుటుంబములోజన్మించు నవకాశము మహాభాగ్యము. ఏలన, నట్టివ్యక్తి బాల్యమునుండియుఁబరమేశ్వరసాక్షాత్కారసిద్ధిగాంచు మార్గములను సాధనములను దెలిసి, కృషిచేయుట కవకాశముగలుగును. శాశ్వతశాంత్యానంద నిలయమగు భగవత్సన్నిధికిఁగల యీసోపానముల నతివేగముగా నధిగమించి గమ్యస్థానము నీజన్మమునందే చేరఁగల మానవుఁడు ధన్యుఁడు. భక్తిజ్ఞానకర్మయోగ రహస్యముల నెరిగి, క్రమోన్నత సోపానగమనమేగలిగి క్రింది మెట్లకోనికి (బతనము పొందకుండు దీక్ష, తపస్సు, ధ్యానము, పుణ్యకర్మాచరణము, పావనశీలము నందరకవసరము. వీని నార్జించు వ్యక్తిగల కుటుంబము, జాతి, దేశము పూజ్యములగును.

998. భగవంతు నెరుగఁగోరువానికి జగమంతయు శత్రువై వర్తించును. రజస్తమోగుణములు పాశములై కరపాదబంధన మొనర్చి దేవునిజేరు సోపానములలోఁ బైమెట్టు కెక్కనీయకుండఁ జేయుటయేకాక, నిరంతరము క్రిందికీడ్చి

నేయుటకు యత్నించుచునే యుండును. భక్తుని జీవితము కామ మోహాదులతోడి ద్వంద్వయుద్ధమే. ఈశ్వరారాధకుని, లేక సత్యారాధకుని మనుగడ సకల విధ ప్రమాదముల నెల్ల వేళల నెదుర్కొన వలసియుండును. పూర్వపుణ్యము, సజ్జనసాంగత్యము, గురుకటాక్షము; పరమేశ్వరానుగ్రహము సకల దోషములనుండి భక్తుని రక్షించును. అందుచే దరింపఁగోరు జ్ఞానభక్తిసాధకులు గర్వ దర్పదంభాహంకారములను విడిచి, వినయ వివేకములను, శ్రద్ధాదీక్షలను, బాహ్యాభ్యంతర శౌచమును, సత్యధర్మానుష్ఠాన పరత్వమునభ్యసించి, తమ పురోగతి నెల్లవేళల గాపాడుకొని, ఉత్తమజ్ఞానులు, భక్తులునై తరింపవలెను.

999. పుండరీకాక్ష సేవానైపుణ్యమే పుణ్యము. పరమేశ్వరారాధన పరాఙ్ముఖత్వమే పాపము. అయినచో వ్యావహారికముగా బుణ్యపాపముల కర్థమేమి? ఏపనులు దేవుని సమీపింపఁజేయునో అవి పుణ్యకర్మలు; ఏపనులు దేవునికి దూర మొనర్చునో అవి పాపకర్మలు. జీవహింస పాపము; అహింస పుణ్యము; ఏలన సకల ప్రాణులీశ్వర సంబంధములై యున్నవని అహింస గుర్తించును; హింస దానిని గుర్తింపదు. అటులే పరోపకారము, పుణ్యము; పరపీడనము పాపము. కామకాంచనదాస్యము పాపము; ఏలనన ట్టి దాస్యమునకు బాలుపడిన వ్యక్తి భగవంతునర్చింపలేడు. కామకాంచనముల యెడ నిగ్రహము కలిగి వర్తించునాతఁడు పుణ్యాత్ముఁడేలన, నాతఁడు

నియతజీవియై భగవదారాధన కర్తవ్యుఁడగును. అదేరీతిగా మితిమీరిన భోగద్రవ్యసముపార్జనాభిలాషి పాపి; కారణమట్టివ్యక్తి దేవునర్చింపనగు కాలమును, బలమును, తెలివిని దుర్వినియోగమొనర్చును. మితభాషియు, మితకామియు, మితభోగియు, బూర్ణవిరాగికాకున్నను, పుణ్యపురుషుఁడే; ఏలన, నియతచిత్తునికీశ్వరపూజచేయు నవకాశముండును. ఇటులే అన్నిపనులకర్థము చెప్పికొనవలెను. అందుచే దేవునారాధించుట, దేవుని సమీపింపఁదోడ్పడు పనులుచేయుట; దేవుని మరపింపఁజేయు భోగకాంక్షలు తగ్గించుకొనుట లేక విసర్జించుట; వీలైనచో నన్నిటిని విసర్జించి దైవారాధనముచేసి తరించుట పుణ్యకార్యములు; పుండరీకాక్షుని జేర్చునదే పుణ్యము; మరపించునదెల్ల పాపము.

1000 క్షణక్షణమునకు దరిగిపోవుచున్న ఆయుర్దాయముగలిగి, అనగా శ్మశానభూమిని సమీపించుచున్న మానవుఁడు తానెన్నిపనులని చేయఁగలడు; కాలమా మిక్కిలి పరిమితము; సందిగ్ధము; శక్తియు నల్పము, నజ్ఞానకలుషితము; మానవుఁడేమి చేయఁగలఁడు? ఒకవైపున స్వోదరకుటుంబపోషణవృత్తి; ఒకవైపునభోగాభిలాష; ఒకవైపున దారుణచిత్తవిక్షేపహేతువులగు రోగము, అవమానము, లేమి, తత్కారణముగా నుపశమింపని అశాంతి, అసంతృప్తి; వీనిని దాత్కాలికముగా మరచుటకై వినోదవిలాసములకై తిరుగాడుట; గృహములోను బంధుమిత్రవర్గములోను తటస్థించు

సుఖాశుభకర్మకలాపముల (జ్ఞానవలయు క్లేశభారపరం పరలు మున్నగునవెన్ని వర్ణింపఁగలము. ఇట్టి సందడితో (గూడిన జీవితములలో, (బరమార్థ చింత, పరిశీలన, సాధన ముల కవకాశమెచట? ఒకవేళ నేలేశమైన నున్నచో దానికి బలమిచ్చుకృషి కవకాశ మెచటనుండి వచ్చును? కాని ధన్యులు కాఁగోరుకొలఁదిమంది కీశ్వరారాధనకృషి కేదియు నడ్డురాదు. అన్నిటి నటుంచియో, అన్నియుఁ జేయుచునే యున్నను, నంత రంగమునఁ దీశ్వరుని పాదపద్మముల సేవించుచు, దైవారాధన కన్నిటికంటె నగ్రస్థానమిచ్చి పుణ్యపురుషులు కొందరు తరిం చుట కవకాశములున్నవి.

1001. జీవితరహస్య మెరిగినవాని ప్రవర్తన మెట్లుం డును? ఎట్లుండవలెను? అట్టివ్యక్తి శీలము విశ్వకల్యాణ ప్రదమైయుండును. మనోవాక్కాయములచే నాతఁడెవ్వరిని బాధింపఁడు; తాను బాధపడఁడు. చెక్కుచెదరని మనఃప్రసా దము, నిర్మలినాంతరంగముగలిగి, సత్యసందర్శనసిద్ధిచే లభిం చిన ఆనందామృతాబ్ధినోల లాడుచుఁదన సంతుష్టిని, సంతృ ప్తి, ఆనందమును ప్రాణులందరకుఁ బంచియిచ్చు ధీరవితరణ శీలియై వర్తించును. అతఁడు తన్నాత్మస్వరూపిగా నెరిగి, తన్నే సకల చరాచరములలోఁ దిలకించి యెట్టి సంశయములు గాని, సమస్యలుగాని, వికారములుగాని, విఘాతములుగాని లేనివాఁడై, సదా పరోపకార పరతంత్రుఁడై వర్తించును. స్థిరాస్థిరవస్తువిభాగమునందఖండ వివేకియై, అస్థిరముల స్వభావ

మెరిగి స్థిరములైన సత్యధర్మద్దైవములనాశ్రయించి యెన్నఁడును పతనములేని దివ్యస్థితిగలిగి జీవించును. స్వచ్ఛంద మరణమాతని హస్తగతమై యమునాజ్ఞాపించు సామర్థ్యము గలిగి, పునర్జన్మరహితమైన మోక్షము చేతనుంచికొని జీవించును. ఆతని ఉనికియే లోకశాంతి హేతువు. పంచభూతములాతని స్వచ్ఛసంకల్పముల కనుగుణముగా వర్తించుటచే లోకమున క్షామదుర్భిక్షాదులు, అకాల మరణములు, జారచోరత్వాదులు నుండవు. జీవితరహస్యవేత్త లేక సత్యసాక్షాత్కారసిద్ధిగాంచినవ్యక్తి సాటిలేని పుణ్యమూర్తి.

1002. ప్రతివ్యక్తికి హృదయమున్నది. ఆ హృదయమందిరమును నిలయముగాఁజేసికొని, సర్వలోకైక నాథుఁడగు భగవానుఁడు నివసించుచున్నాఁడు. అట్లు నివసించుచు ప్రతివ్యక్తి దేహమనోబుద్ధీంద్రియాదులను ప్రచోదనముచేసి నడపుచున్నాఁడు. అనగా ప్రతిమానవునిలో దేవుఁడు పరిపూర్ణశక్తితో నిలిచియున్నాఁడు. ప్రతివ్యక్తియు నెచటికేగినను దేవుని దనతోఁగూడఁదీసికొనిపోవుచున్నాఁడు. తెలిసికొన్నచో ప్రతివ్యక్తియు నాదేవుఁడే. దేవునిఁజూచుటకని దేవాలయములకు, పుణ్యక్షేత్రములకు యాత్రలకుఁబోవుచున్నాఁడు; దేవుని తనతోఁదనలో గూడఁబెట్టుకొనియే! ఎంత వెఱ్ఱి!

1003. స్త్రీకి వైధవ్యమనఁగా భర్తమృతుఁడగుట: పురుషునికి భార్య మరణించుటయేవైధవ్యము; స్త్రీలకు బురు

షులకుఁగూడ భగవంతుని మఱచుటే వైధవ్యము; భక్తునికి భగవద్రక్షణమును శంకించుటే వైధవ్యము; జ్ఞానికే ప్రాణిని ద్వేషించినను వైధవ్యమే; భగవత్కృప నెన్నఁడు శంకింపక, భగవంతు ననన్యభక్తితో భజించుభక్తుఁడు, సర్వచరాచర ములందున యాత్మనేచూచి, ద్వేషమును జయించినజ్ఞానియు నీలోకయును బవిత్రమొనర్చి, రక్షింపఁగల మహాత్ములు. అట్టివారి స్మరణమే అఖండపుణ్యము.

1004. ఒకకుటుంబ మాదర్శకుటుంబము గావలె నన్నచో, నందలి ప్రతివ్యక్తియు నుత్తమ విజ్ఞానసంస్కార శిక్షణములందు గృతార్థుఁడై యుండవలెను. దేశమునంతే. భారతదేశమునకు సాటిలేని అమూల్యవిజ్ఞానధనమనంతముగా గలదు. అది విశ్వకల్యాణమును సాధించుశక్తిగలది. కాని భారతీయులింకను దాని లోతుపాతులను సమగ్రముగా గుర్తించి, సద్వినియోగము చేయలేకున్నారు. అఖండబల ముండి దేశము బలహీనముగానుండు దురవస్థకుఁబాల్పడినది. దీనికిఁగారణము లేకపోలేదు. అదియే పశ్చిమఖండ ప్రకృతి శాస్త్రవిజ్ఞానము. అదిలోకమునకు భోగాభిలాషను మితిమీరి పెంపొందఁజేయుటేగాక, లోకవినాశకర శక్తుల నభివృద్ధిచేసి, ప్రపంచవాసుల కందరకును దిగ్భ్రమ నుదయింపఁజేసినది; దానినుకరణమే సర్వసమస్యలకు బరిష్కారసాధనమని తలపఁ బడుచున్నవి. ఏనాఁడో భారతీయ మహర్షులు సత్యారాధ నములేనిదే లోకకల్యాణ మసంభవమని గుర్తించిరి. సత్య

ధర్మావిరుద్ధము కాని అర్థకామముల ననుభవించుట దోషమని చెప్పెను శ్రీకృష్ణభగవానుడే బోధించెను. అన్నియు విడిచి ప్రాణ్త వైరాగ్యము నాశ్రయింపుడని, యేశాస్త్రమును జెప్పలేదు. భోగమే ప్రధానముకారాదు; యోగమే ప్రధానము. యోగమనగా కర్మభక్తి జ్ఞానయోగముల కడ్డురాని భోగము అంగీకరింపబడెను. ధర్మాతిరిక్తమగు విజ్ఞానవివేకములు, జాతి నాగరికతలు వినాశమందుటలో నాశ్చర్యమేమున్నది?

1006. మానవజీవితము మానవాతీతస్థితియనగా దైవత్వసిద్ధి గాంచుటకీయబడిన అమూల్యావకాశము. మూడు నియమములు దృష్టిలోనుంచికొని వర్తించుచో మానవుడు దేవుడు గావచ్చును. (1) మానవజీవితము మృత్యువు కోరలలో జిక్కుకొని యున్నదను సత్యము నెల్లవేళల దృష్టిలోనుంచికొని, ఒకక్షణకాలమును దుర్వినియోగ మొనర్పని దీక్షతో వర్తించుట; భగవంతుని జాడలెరిగి, భగవద్పాదపద్మముల నాశ్రయించి, భగవత్కృపచే, నశించిపోవు దేహాదులు తాను గాదనియు, నిత్యానంద పరమశాంతి నిధానమగు పరమాత్మతత్త్వమే తన నిజస్వరూపమనియు గుర్తించి, మృత్యుంజయత్వమంది, దైవత్వమును సాధించు కఠోరదీక్షతోనుట. (3) సకలవిధ త్యాగములచే సర్వదా పరోపకార మొనర్చు సత్కార్యానుష్ఠాన నిష్ఠగలిగి, జీవితమును సేవామయముగా జేసి వర్తించుట. ఈమూడుమార్గములను స్వేచ్ఛా సంకల్పముతో నాచరించి మానవుడు ముక్తపురుషుడు,

ధర్మవిరుద్ధము కాని అర్థకామముల ననుభవించుట దోషము కేవిసిని శ్రీకృష్ణభగవానుఁడే బోధించెను. అన్నియు విడిచి, పూర్ణవైరాగ్యము నాశ్రయింపుఁడని, యేశాస్త్రమును జెప్ప లేదు. భోగమే ప్రధానముకారాదు; యోగమేప్రధానము; యోగిమనగా కర్మభక్తి జ్ఞానయోగముల కడ్డురాని భోగము లంగీకరింపఁబడెను. ధర్మాతిరిక్తమగు విజ్ఞానవివేకములు, జాతి నాగరికతలు వినాశమందుటలో నాశ్చర్యమేమున్నది?

1006. మానవజీవితము మానవాతీతస్థితియనగా దైవత్వసిద్ధిగాంచుట కీయఁబడిన అమూల్యావకాశము. మూఁడు నియమములు దృష్టిలోనుంచికొని వర్తించుచో మానవుఁడు దేవుఁడు గావచ్చును. (1) మానవజీవితము మృత్యువు కోరల లోఁ జిక్కుకొని యున్నదను సత్యము నెల్లవేళల దృష్టిలో నుంచికొని, ఒకక్షణకాలమును దుర్వినియోగ మొనర్పని శ్రద్ధతో వర్తించుట; భగవంతుని జాడలెరిగి, భగవదాప్తవ చనములనాశ్రయించి, భగవత్కృపచే, నశించిపోవు దేహాది కము తానుగాదనియు, నిత్యానంద పరమశాంతి నిధానమగు పరమాత్మతత్త్వమే తన నిజస్వరూపమనియు గుర్తించి, మృత్యుంజయుత్వమంది, దైవత్వమును సాధించు కఠోరదీక్ష బూనుట. (3) సకలవిధ త్యాగములచే సర్వదా పరోపకార మొనర్చు సత్కర్మానుష్ఠాన నిష్ఠగలిగి, జీవితమును సేవా యజ్ఞముగాఁ జేసి వర్తించుట. ఈమూఁడుమార్గములను స్వేచ్ఛ సంకల్పముతో నాచరించి మానవుఁడు ముక్తపురుషుఁడు,

శాశ్వతానందాధికారియు దైవత్వసిద్ధి గాంచిన మహనీయుఁడు గావచ్చును. దేవుని యొద్దకుఁగల సోపానముల నతివేగముతో నధిగమించి తరించును.

1007. మానవుఁడొక్క విషయములో అప్రమత్తుఁడై సంచరించుట నేర్చికొనవలెను. ఏయొక క్షణములోను మఱపుకులోను గాకుండ. దేవుని పాదముల సమీపించు పయనములో వీలైనంత వేగముతో, వివేకముతో, భక్తిశ్రద్ధా వినయములతో, అకుంఠిత దీక్షతో సోపానముల నధిగమించుచుండవలెను. ఏమాత్ర మశ్రద్ధచేసి, ముందుకు బోకుండ నొకే ఘట్టములో నిలుచుటగాని, వెనుకకు మరలుటగాని, ప్రక్కదారులు పట్టుటగాని జరిగినచో, బునర్జననమరణములు తప్పనిసరియై, గర్భనరకములోనికి ద్రోయబడి, దుఃఖాబ్ధిని మునుగుట తప్పదు. ఈపయనములో దేహేంద్రియ మానసిక విషయ వ్యామోహములడ్డుపడి, యెంత మహాత్ముడైనను వెనుకకీడ్చి వేయుటకు యత్నించును. కామక్రోధములు, తాత్కాలిక క్షుద్రవాంఛలు, మిర్మిట్లుగొలుపు వస్తువాహనాదికములు నెట్టయెదుటనిలిచి ముందునకు సాగనియ్యవు. సత్యారాధకునికి, ఈశ్వరసాక్షాత్కార కృపాసిద్ధులు గోరు ముముక్షువునకు, పునరావృత్తిలేని శాశ్వత బ్రహ్మానంద ప్రాప్తికై తహతహలాడు జ్ఞానభక్తిసాధకునకు కామమోహాది ప్రబలశత్రు శీర్షముల దునిమివేయు శౌర్యధైర్యములు, మహోగ్రనిష్ఠయు నుండవలెను అప్పుడే మానవుఁడు దేవుఁడగును.

1008 గట్టిగా దేవుని నమ్ము; నమ్ము; భయాందోళన ములను విడిచిపెట్టుము; దేవునాశ్రయమే పరమగమ్యమని నిశ్చయింపుము; దైవకృపయే చెడని ధనమని గుర్తింపుము; నిర్మలచిత్తముతో దేవుని ధ్యానింపుము, స్మరింపుము. పూజింపుము, నీకెట్టిఆపదకాని లోపముకాని సంభవింపదు; నీవు స్పష్ట సంకల్పముతో దేవునివైపు తిరుగుటనగానేమో యెరుగుదువా? నీవు దేవునికృపకు పాత్రత నార్జించితివన్నమాట; వలన నీవు దేవునికి రెండుచేతులు జోడించినమస్కరించుచో, దేవుడు నిన్ను వేయిచేతులుసాచి ఆహ్వానించును; ఆపైన నీకెన్నడును పతనముకాని, పాపముకాని, పరాభవముగాని, పరాజయముకాని, మరెట్టిబాధకాని తటస్థింపకుండ రక్షించును. నీకెన్నడు దుఃఖములేదా? మరెన్నడు పుట్టుకలేదా? యికెన్నడు మృత్యువులేదా? దేవునినమ్మి భజింపుము; నీకు చెక్కుచెదరని ప్రసన్న ప్రశాంతచిత్తము కావలెనా? శాశ్వతముగానుండు అవ్యయ బ్రహ్మానందము కావలెనా? అనంత జ్ఞానముకావలెనా? సంకల్పమాత్రసిద్ధి నిచ్చుశక్తి కావలెనా? భగవాను నర్చించిపొందుము. ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః ॥



శ్రీ గాయత్రీ పవర్ ప్రెస్, రామారావుపేట, కాకినాడ-1.